# డాక్టర్ సి ఆర్ రెడ్డి

గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

1961-62 లో ఆంధ్ర ప్రదేశ సాహిత్య
అకాడెమీవారి రెండు వేల రూపాయల
బహుమతి నందు కొన్న గ్రంథము

Biography is by nature the most universally profit e universally pleasant of all things Especially biography of distinguished individuals

— *Carlyle*

Biography is by nature the most universally profitable, universally pleasant of all things: especially biography of distinguished individuals.

— *Carlyle*

# అంకితము

మాన్యశ్రీ మన ముఖ్యమంత్రి
నీలం సంజీవరెడ్డిగారికి
వారి స్వర్ణోత్సవ సమయమున
సాదరపూర్వకముగ సమర్పణాగు



ప్రజాస్వామ్యములో ప్రధానసమస్య ఏమిటి? ప్రజలు తమకు సమాజమునకు రాజ్యమునకు ఉపయోగకరమైన పద్ధతిలో ప్రజాస్వామిక జీవన సమృద్ధికి ఏ విధముగ దోహదము చేయవలయునో ప్రజలకు తెలియచెప్పి అందు వారిని సుశిక్షితులను చేయగలుగుట అవసరమున్నది

ప్రజాస్వామ్య మన ప్రభుత్వ వ్యవస్థ మాత్రమేగాదు అది ప్రజా జీవనమందంతటను విస్తరించి ప్రజల దైనందిన ప్రవృత్తులను కాయిక వాచిక మానసిక వ్యాపారములను ప్రభావితము చేయగలిగిన ఒక మహాదాదర్శము

ప్రజాస్వామిక ప్రభుత్వము ప్రజాస్వామిక సమాజము అను పదములకు అప్పటికిగాని సార్థకము లేదు



ఈ విషయాన్ని గ్రహించి శ్రీ కట్టమంచివారు అర్థశాస్త్ర రచనచేసి ఆ రకం సాహిత్య విధానానికి మార్గం చూపారు అందుచేత సాహిత్య వేత్త వేరొక లౌకికశాస్త్రీయ గ్రంథాన్ని రచించడం సులభంకాదు అయినా అది సాధ్యమేనని నిరూపించిన ప్రత్యేకత శ్రీ కట్టమంచివారిది ఇది మన పండితులు కవులు గమనించవలసిన అంశమై వున్నది

శ్రీ కట్టమంచివారు యింతటి సమగ్రమూర్తి కావడానికి కారణ మేమిటని పర్యాలోకిస్తే మన సంస్కృతి మూలకందమైన రామాయణ మహాభారతములను చిన్ననాటినుండి శ్రద్ధగా చదవడం అందులోను భారతంవంటి ఉద్గ్రంథాన్ని ఆమూలాగ్రంగా ఎదే పదే పఠించి జీర్ణించు కొనడం ప్రధానకారణమనుకుంటాను

మానవస్వభావ ప్రక్రియలను విశదముగ చిత్రించి లోకజ్ఞాన మును సమగ్రముగ బోధించి నీతివిశారదముగ సద్వర్తనముగ రాజ నీతి పారంగతులుగ వ్యవహార దక్షులుగ మానవులను తీర్చిదిద్దగల పంచమవేదము భారతము మన ప్రాచీన నాగరికతకు చిహ్నము ఆ గ్రంథాన్ని ఆమూలాగ్రముగ చదివి జీర్ణించుకున్న వ్యక్తి ఉత్తమ భార తీయుడు కాగలడు భారత సంస్కృతిని ప్రతిబింబించగలడు అందుకు నిదర్శనం శ్రీ కట్టమంచివారు ఒక వ్యక్తికిగల సంస్కృతిని పూర్వ వాసనలను ఆయన తన పిల్లలకు నివాసగృహములకు పెట్టుకునే పేర్లను బట్టి గ్రహించవచ్చు ఈ పేర్లలో హృదయస్పందన మానసికప్రవృత్తి కానవస్తుంది శ్రీ కట్టమంచివారు తమ గృహానికి పద్మప్రభాస అని నామకరణం చేయడంవల్లను ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని వసతి భవనాలకు వినయ విహార్ వివేక విన్యాస సధర్మ సాధన వంటిపేర్లు పెట్టడంలోను ఆయన విశాల హృదయం ప్రాచీనసంస్కృ తులు పట్ల ఆయనకువున్న గౌరవం కానవస్తున్నది అట్టి వారిలో గమ నార్హమైన ప్రత్యేకతగా పేర్కొనవలసి వుంది

శ్రీ రామలింగారెడ్డిగారు యింకా యెన్నెన్ని విధాలుగా ప్రజ్ఞా వంతులో ప్రతిభావంతులో సోదరుడు వెంకటసుబ్బయ్యగారు యీ గ్రంథంలో చక్కగా సోదహరణంగా వివరించారు వాటనన్నింటిని యిక్కడ పునశ్చరణ చేయడం అప్రస్తుతమవుతుంది కాని ఒక్కసంగతి

మాత్రం చెప్పగలను అది శ్రీ కట్టమంచివారి రాజకీయాలకుసంబంధించినదై వుంది శ్రీ రామలింగారెడ్డిగారివంటి మేధావంతులను కాంగ్రెసు సంస్థ తనలో యిముడ్చుకొనలేకపోవడం దురదృష్టకరమని భావిస్తాను

రాజకీయవాదులుగా ప్రజాప్రతినిధులుగా ప్రజలముందు నిలబెట్టడంలోను సంస్థలోకి ప్రభుత్వంలోకి ఆహ్వానించడంలోను అర్థబలంగలవారికి అంగబలంగలవారికి యిస్తూన్న ప్రాధాన్యం గౌరవం మహామేధావి ఆంధ్ర విజ్ఞానమూర్తి అయిన శ్రీ రామలింగారెడ్డిగారికి యివ్వబడలేదని యిది ఆయనకేకాక ఆంధ్రదేశానికే నష్టదాయకమైనదని నా గట్టినమ్మకం

శ్రీ కట్టమంచివారి జీవితచరిత్రద్వారా ధృవపడిన అంశాలను గతానికిచెందిన గుణపాఠంగా స్వీకరించి భవిష్యత్తులో యిందుకు సంబంధించిన లోపాలను సవరించడం అవసరమని భావిస్తున్నాను

అసలు జీవితచరిత్రలు వ్రాయడం కష్టం అందులో శ్రీ కట్టమంచివారివంటి బహుముఖ ప్రజ్ఞాశాలుల చరిత్రలు వ్రాయడం మరీ కష్టం అయినా కష్టమైన పనులు చేయడంలో సిద్ధహస్తుడనిపించుకున్నారు సోదరులు వెంకటసుబ్బయ్యగారు చిన్ననాటనుండీ వారి స్వయంకృషి హెచ్చు ఆయన సాహిత్యరంగంలో యెంతగా స్వయంకృషి చేస్తాడో ఆయన గ్రంథాలలో యిచ్చే పత్రికల ఉటంకములు (Quotations) ఉదహరించిన గ్రంథాల జాబితానుబట్టి ఊహించవచ్చు అంతేకాదు ఆయన యింతవరకు రచించిన శ్రీ ప్రకాశం పంతులు రైతుపెద్ద దేశోద్ధారకుని జీవితచరిత్రలు చదివినవారికి అవి కేవలం ఆయా వ్యక్తుల జీవితచరిత్రలుగా కనిపించవు వారి సమకాలీన సాంఘిక ఆర్థిక దేశచరిత్రలుగా కూడా కనిపిస్తవి

ఆనాటి సామాజికజీవితంలోవుండే ఆనాటి కథానాయకులు యెలా రూపొందారో తెలియపరుస్తుంది నాయకులలో వారు వారి సహచరులు మిత్రులు వారి పరిచయమవుతారు ఇది శ్రీ వెంకటసుబ్బయ్యగారి రచనలోని ప్రత్యేకత అందువల్లనే ఆయన రచించిన ఆంధ్రనాయకుల జీవితచరిత్రలవల్ల ఆంధ్రదేశపు అర్ధశతాబ్దపు సమకాలీన చరిత్రలు తెలియవగును ఇది భవిష్యత్ చరిత్రకారులకు శ్రీ వెంకటసుబ్బయ్యగారు

# పీఠిక

ఎనలేని ప్రతిభావంతుడు ఎన్నదగు విజయాలను మాత్రమే సాధిస్తే ఎందువల్ల అనే ప్రశ్న ఉత్పన్న మౌతుంది

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఎనలేని ప్రతిభావంతుడు ఆయన మేధావి మాత్రమే కాదు వ్యుత్పన్నుడు కూడా పండితుడు మాత్రమే కాదు రసజ్ఞుడు కూడా వక్త మాత్రమే కాదు రచయిత కూడా ఆదర్శవాది మాత్రమే కాదు కార్యదక్షుడు కూడా విద్యావేత్త మాత్రమే కాదు రాజనీతిజ్ఞుడు కూడా ఇంతటి ప్రజ్ఞా ప్రాభవాలు ఒకే వ్యక్తిలో కానరావడం ఎక్కడైనా అరుదుగానే ఎన్నడైనా వెమురుగానే దేవతలనుంచి వరాలను పొంది శంకరుడు జన్మించాడనడం నిజమైతే అందరు దేవతలనుంచి అన్ని వరాలను ఆయన పొందినారనె చెప్పవచ్చు

అయినా తన తెలివితేటలకు తన శక్తిసామర్థ్యాలకు తన ప్రజ్ఞా ప్రాగల్భ్యాలకు తగిన విజయాలను డాక్టర్ రెడ్డి సాధించలేదేమి? కావ్య హృదయాన్ని అంతగా తెలుసుకొన్న భావుకుడు వ్రాయవలసింది ఒక్క ముసలమ్మ మరణము మాత్రమేనా? ప్రపంచ సాహిత్యాన్ని అంతగా మథించిన విమర్శకుడు ప్రకటించవలసింది ఒక్క కవిత్వతత్త్వ విచారము మాత్రమేనా? ప్రాచీనార్వాచీన శాస్త్రాలలో అంతగా ప్రవేశం సంపాదించిన పండితుడు లోకానికి సమర్పించవలసింది ఒక్క అర్థశాస్త్రము మాత్రమేనా? ఈ మూడు గ్రంథాలు ఆయా సాహిత్య విభాగాలలో కొత్త పుంతలను త్రొక్కియుండవచ్చు ఒక విప్లవాన్నే సాధించి వుండవచ్చు కాని కవిగా విమర్శకుడుగా శాస్త్రజ్ఞుడుగా జీవిత ప్రారంభంలోనే ఇంతటి ధీశక్తిని ఇంతటి ఉపజ్ఞను ప్రదర్శించిన డాక్టర్ రెడ్డి ఇంతటితోనే నిలిచిపోయినారేమి?

కేవలం సాహిత్య క్షేత్రంలోనే కాదు తాను కృషిచేసిన ప్రతి రంగంలో డాక్టర్ రామలింగారెడ్డి ఎవరెస్టు శిఖరాన్ని అందుకొనబోతున్నట్టే కనబడి దానికి అల్లంత దూరంలో ఆగిపోతూ వచ్చారు మరొక్క ఊపే చాలు గమ్యాన్ని చేరడానికి మరి కాస్త పట్టుదల సరిపోతుంది శిఖరాగ్రంపై విజయ పతాకను ప్రతిష్ఠించడానికి — ఆయన జీవితంలో ఈ విధంగా జరిగిన ఘట్టాలెన్నో సునాయాసంగా అంత ఎత్తుకు వెళ్ళి కూడా అంత దగ్గిరలో ఆయన ఎందుకు ఆగిపోతూ వచ్చినట్టు?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం సులభం కాదుగాని తన ప్రవృత్తిలోని కొన్ని వైరుధ్యాలవల్లనే శిఖరాగ్రానికి కొంచెం దిగువగా ఎప్పటికప్పుడు ఆయన నిలిచిపోవడం సంభవించినదేమో! శ్రీ గోరెపాటి వెంకట సుబ్బయ్యగారు ఈ గ్రంథంలో పేర్కొన్నట్టు డాక్టర్ రెడ్డి ఏదో సందర్భంలో నాకు యూరోపియన్ సదుపాయాలు కావాలి నా ఆత్మ స్వదేశీ ఉద్యమం మాత్రం విడిచిపోదు అన్నారు ఛలోక్తిగా ఉద్దేశించినా ఆయన ప్రవృత్తిలోని వైరుధ్యాలను ఇది సూచిస్తున్నది భావాలలో ఆయన అతివాది ఆచరణలో మితవాది విశ్వాసాలలో ఆయన డెమొక్రాట్ అభిరుచులలో యారిస్టోక్రాట్ అభిమానం విద్యకు విజ్ఞానానికి సంబంధించిన విషయాలపట్ల ఆకర్షణ రాజకీయాలపట్ల

ప్రవృత్తిలోని ఇట్టి వైరుధ్యాలకు ప్రజ్ఞా విభాగాలలోని వైవిధ్యం తోడైతే వ్యక్తిత్వానికి విధానా విలక్షణత్వం రాదా ఆ విలక్షణత్వమే డాక్టర్ రెడ్డిగారిని ఏ శిఖరాగ్రాన్నీ చేరనివ్వలేదు ఆధునిక రచయితలలో ఆయన శ్రీ కందుకూరి వీరేశలింగం శ్రీ గురజాడ అప్పారావు గార్లను మించిపోవలసింది కాని కొన్ని మెట్లు దిగువనే నిలిచిపోయారు వైస్ ఛాన్సలర్‌గా ఆయన శ్రీ అశుతోష ముఖర్జీతో సరితూగ వలసింది కాని త్రాసు ఎంతో కొంత ముఖర్జీ వైపునే మొగ్గింది రాజకీయ వేత్తగా ఆయన సర్ తేజ్ బహాదూర్ సప్రూ సరసను స్థానం సంపాదించవలసింది కాని సహపంక్తిలో కాక దాని వెనుక దానిలో స్థానాన్ని పొందడం జరిగింది

ఒక రంగంలో పూర్తి విజయాన్ని సాధించకముందే మరొకటి ఆయనను ఆకర్షించినట్టు శ్రీ వెంకట సుబ్బయ్యగారు వ్రాసిన ఆయన జీవిత చరిత్రను స్థూలంగా పరిశీలించినా తెలుస్తుంది సారస్వతంలో డాక్టర్ రెడ్డి ఒక విప్లవాన్ని ప్రవేశపెట్టినట్టే పెట్టి అంతలో దానినుంచి తప్పుకొన్నారు మొదటి మూడు రచనల తర్వాత ఆయన వ్రాసినవి ఇతరుల గ్రంథాలకు పీఠికలు మాత్రమే విద్యారంగంలో ఒక స్థాయికి వచ్చి దానిలో సాధించవలసిన విజయాలు మరికొన్ని వుండగానే ఒక్కసారిగా ఆయన రాజకీయ రంగంలో దూకారు దానిలో సయితం తన వాక్పటిమతో సమయస్ఫూర్తితో స్వతంత్ర చిత్తవృత్తితో కార్యదక్షతతో ఆయన సాధించిన విజయాలు సామాన్యమైనవి కావు ప్రభుత్వాన్ని సమర్థించిన రోజులలో ఆయన ప్రతిపక్షులకు పక్కలో బల్లెం ప్రతిపక్షంలో చేరినప్పుడు ప్రభుత్వానికి సింహస్వప్నం విద్యాశాఖ మంత్రిగా ఆయన నియామకం చేసో మానో అన్న కొన్ని సన్నివేశాలు

లప్పుడు కొన్ని వున్నాయి ప్రతిపక్షానికి ఉపనాయకుడుగానే మిగలక నాయకుడు కాగలరన్న సందర్భాలు సయితం వున్నాయి ఈ ఘట్టంలో ఆయన తిరిగి తనని తలంపుగానె విద్యారంగానికి వెళ్ళిపోయారు

కార్యరంగంలో మార్పుల మధ్యకూడా ఆయనలో వైరుధ్యాలు కనిపించేవి ఉదాహరణకు సాహిత్య క్షేత్రాన్నే తీసుకోండి సారస్వతంలో నూతన ప్రక్రియలను కొత్త పోకడలను ఆయన ఆహ్వానించేవారు భాష విషయంలో మాత్రం పచ్చి గ్రాంధికాన్నే అభిమానించేవారు ఆయన దృష్టిలో చిన్నయసూరి పరమశైలి ఉత్తమోత్తమమైంది పద్యంలో తిక్కన్నకిచ్చే స్థానాన్ని గద్యంలో ఆయన చిన్నయ్యకిచ్చే వారు భావాల విషయంలో నవీనాన్ని స్వాతంత్ర్యాన్ని మోదంతో పాటు భాష విషయంలో సంప్రదాయాన్ని ఛాందసాన్ని పరిరంపడం డాక్టర్ రెడ్డిని పోలిన విలక్షణ వ్యక్తికి చెల్లు

జీవితాన్ని స్థూలంగానైనా కొన్ని రంగాలలోకి విభజించవచ్చు ప్రవృత్తిమాత్రం అట్టి విభజనకు లొంగదు కార్యరంగాలు ఎన్నిసార్లు ఎంతగా మారినా ప్రవృత్తిమాత్రం అన్నిటిలో సమానంగా ప్రస్ఫుటమౌతుంది అందువల్లనే రాజకీయవేత్తగా డాక్టర్ రెడ్డి జస్టిస్ కాంగ్రెసు పార్టీలనా దేన్నీ పూర్తిగా వర్జించనూ లేదు అనుసరించనూ లేదు లాహోర్ కాంగ్రెసు చేసిన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆయన విమర్శించారు తన విమర్శలకు లోనైన ఆ తీర్మానాన్ని అనుసరించి కాంగ్రెసు ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహాన్ని అణచివేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం అమలుపరచిన దమననీతిని నిరసిస్తూ ఆయనే తన వైస్ ఛాన్సలర్ పదవికి రాజినామా పెట్టివేశారు కూడా!

ఇట్టి వైరుధ్యాలతో కూడిన ఆయన విలక్షణ వ్యక్తిత్వం చివరికి ఆయన ప్రసంగాలలో సయితం ద్యోతకమౌతూ వుండేది ఎంత గభీర విషయాన్ని గురించి ప్రసంగిస్తున్నా ఎక్కడో కచోట అప్రయత్నంగా ఏవో కొన్ని చతురోక్తులు హాస్యోక్తులు వచ్చిపడుతూ వుండేవి హాస్యధోరణిలో ప్రసంగం చేస్తుండగా గభీర విషయాలు ఇదే విధంగా దొర్లుతూ వుండేవి ఈ క్షణంలో ఆయన పేటో మరుక్షణంలో పక్

డాక్టర్ రెడ్డిగారిని గురించి ఈ సమ్మింగ్ అప్ లో శ్రీ వెంకట సుబ్బయ్యగారు ఏకీభవించరని నాకు తెలుసు నన్బోటివారిని దృష్టిలో పెట్టుకొనే ఆయన ప్రతిభకు తగినట్లు పనిచేయలేదని నిందించెడివా రున్నారు కోకొల్లలుగా కాని ఆయనకు ఏమి అవకాశ మిచ్చినది ఆంధ్ర లోకం? భరత ఖండము ఏమైనా ఆయనకు ప్రత్యేక స్థానము నిచ్చి

గదా? ఆయన నెందుకు మనం ముప్రయోగించుకొనగలిగినాము? యోగ్యతను గమనించి ప్రోత్సాహమిచ్చు గుణము మనలో కలదా లేదా అను సంగతి ఆలోచించుకోవాలి అని శ్రీ వెంకటసుబ్బయ్యగారు వ్రాశారు ఇది ఆలోచించవలసిన విషయమైనా తన ప్రజ్ఞా ప్రాభవాలకు తగు విజయాలను డాక్టర్ రెడ్డి సాధించలేదనడం ఆయనపట్ల కించభావంతో కాదు నిండుగా వుండాలనే గౌరవాన్నే కాదు ప్రేమను రేకెత్తించగల వ్యక్తిత్వ మాయనది అందరితో ఆయన చనువుగా మెలగేవారు అందరినీ హెచ్చరిస్తా పలకరించేవారు నవ్వేవారు నవ్వించేవారు దగ్గరికి తీసేవారు దయాదాక్షిణ్యాలు చూపేవారు ఎవరిలోనైనా ప్రతిభను కనుగొంటే ఒక వజ్రాన్ని తనకు దొరికినట్లు సంతోషించేవారు ఎన్నివిధాల ఆయన ఎందరిని పై తెచ్చారో లెక్కలేదు

డాక్టర్ రెడ్డి విలక్షణ వ్యక్తిత్వం సమగ్రరూపంలో శ్రీ వెంకటసుబ్బయ్యగారి రచనలో మనకు సాక్షాత్కరిస్తున్నది జీవితచరిత్రల రచనలో సిద్ధహస్తులుగా శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఇదివరలోనే ప్రఖ్యాతి నార్జించుకొన్నారు ప్రజలే కాక ప్రభుత్వం సయితం ఆయన రచనలను ఆదరించింది అభిమానించింది గౌరవించింది ఇదివరలో తెలుగు భాషా సమితిద్వారా ఆయన గ్రంథాలలో కొన్నింటికి బహుమతులు లభించగా డాక్టర్ రెడ్డి జీవిత చరిత్రకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి ద్వారా రెండు వేల రూపాయల పారితోషికం లభ్యమైంది ఇది ఆయన రచించిన జీవిత చరిత్రలలో ఎనిమిదవది ఈ సాహిత్య విభాగంలో ఇంతగా కృషి చేసినవారు ఇంతగా విజయాన్ని సాధించినవారు తెలుగువారిలో మరొకరు లేరు

దేశ చరిత్రల రచనకువలె జీవిత చరిత్రల రచనకు సయితం ఎంతగానో పరిశోధన చేయాలి దాని ఫలితాలను వున్నవి వున్నట్లుగా లోకంముందు పెట్టాలి ఒక వ్యక్తిపట్ల ప్రేమ గౌరవాలు లేకపోతే అతని జీవిత చరిత్ర రచనకు పూనుకోవడం సర్వసాధారణంగా జరగదు వాస్తవిక విషయాల చిత్రణకు ఈ ప్రేమ గౌరవాలను ప్రతిబంధకంగా నిలువనీయరాదు తన రూపచిత్రాన్ని చిత్రించగోరిన కళాకారునితో నా ముఖంమీది పులిపిరి కాయలతో సహా నన్ను చిత్రించు సుమీ అని క్రామ్వెల్ హెచ్చరించాడు ఇట్టి హెచ్చరికతో నిమిత్తం లేకుండానే జీవిత చరిత్రకారుడు ఈ పని చేయాలి వెలుగుతోపాటు నీడలను అతడు చూపించాలి ఎత్తులతోపాటు పల్లాలను కనబరచాలి గుణాలతోపాటు దోషాలను చిత్రించాలి విజయాలతోపాటు పరాజయాలను వివరించాలి

సాధు స్వభావులైన శ్రీ వెంకటసుబ్బయ్యగారికి ఇది సులభంకాదు అయినా తన పరిశోధనద్వారా వెల్లడైన విషయాలనేవున్నదివున్నట్టుగా తెలియ జెప్పడానికి ఆయన చిత్తశుద్ధితో కృషిచేస్తారు ఇతరులు కటువుగా చెప్పే మాటలే శ్రీ వెంకట సుబ్బయ్యగారు మెత్తగా చెబుతారు అన్యులు బాహాటంగా చెప్పేదాన్ని ఆయన సూచనప్రాయంగా చెబుతారు

రచయిత శైలి అతని స్వభావాన్ని అనుసరించే వుంటుంది మృదువైనది మధురమైనది శ్రీ వెంకట సుబ్బయ్యగారి స్వభావం కనుకనే ఆయన శైలికూడా మృదులం మధురం శ్రీ ముట్నూరి కృష్ణారావు గారి వ్యక్తులైనందున భక్తులైనందున ఆయన శైలిలోని ప్రాగల్భ్యం దానిలోని గాంభీర్యం శ్రీ వెంకట సుబ్బయ్యగారి లేఖినినుంచి తరచు జాలువారడం కద్దు

నాకు తెలుసు — శ్రీ వెంకట సుబ్బయ్యగారు వ్రాసే ప్రతి జీవిత చరిత్ర ఒక మహాయజ్ఞమని దానికి సంభారాలను కూర్చుకొనడానికి ఆయన ఎంతగా కృషిచేస్తారో కూర్చుకొన్న సంభారాలను సద్వినియోగ పరచడానికి అంతగా నిష్ఠవహిస్తారు ఇతర దేశాలలో జీవితచరిత్ర కారులకు ఎంతగానో సహాయ సహకారాలు లభిస్తాయి మనదేశంలో ముఖ్యంగా మనరాష్ట్రంలో పరిమితంగానేతప్ప ఇవి దొరకడంలేదు తమ ఆత్మబంధువును గురించే తమ ప్రియమిత్రుని గురించే తాము కృతజ్ఞత చూపవలసిన వారిని గురించే శ్రీ వెంకట సుబ్బయ్యగారు వ్రాయగోరినా ఆయన కృషిని హర్షించి దానికి సహాయపడవలసినంతగా సహాయం అందిస్తున్నవారు బహుతక్కువ ఈ పరిస్థితి శ్రీ వెంకట సుబ్బయ్యగారికి ఇటీవల కొంత నిరుత్సాహాన్ని కలిగిస్తున్నా దీనికి లొంగిపోక ముమ్మరంగా ఆయన మరికొన్ని జీవిత చరిత్రలను కూడా వ్రాయాలని కోరుతున్నాను ఈ సాహిత్య విభాగంలో జరగవలసిన కృషి మరెంతో వున్నది దాన్ని కొనసాగించడానికి ఆయనను మించిన అర్హులు లేరు అనుభవజ్ఞులూ లేరు

విజయవాడ
26 జూన్ 1963

నార్ల వెంకటేశ్వరరావు
ఎడిటర్ ఆంధ్రజ్యోతి

# అభిప్రాయములు

మిత్రుడు చిరంజీవి గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారిని నేను చిన్నతనమునుండి బాగా ఎరుగుదును

ఇతడు వ్రాసిన ఘంటసాల చరిత్ర ఆచార్య రంగా మన రైతుపెద్ద అనే గ్రంథములు నిటీవలనే చూచి చాల సంతోషించినాను

సన్నిహిత సమకాల వయస్కుల ఔన్నత్యమును కొనియాడుటయే గాక వారి గుణ పరిశీలనా ప్రావీణ్యముచే నితని ఉదారత రసజ్ఞత ప్రకటిత మగుచున్నది

ఇతడు వ్రాసినవి సామాన్య వ్యక్తుల జీవితచరిత్రలై యెప్పటికిని నిజాని కవి వారి నెదో ప్రయోజనాపేక్షతో ఉత్ప్రేక్షాతిశయోక్త్యలంకారములలో ప్రశంసించే వందిమాగధస్తోత్రములు కావు

వారి సమకాలస్థుల సందర్భ చరిత్ర లన్నీ అందు చక్కగా ప్రతిబింబిత మగుచున్నవి

ఇదియే చరిత్రలు వ్రాయవలసిన సరియైన పద్ధతి యని ఒకప్పుడు శ్రీ ముట్నూరి కృష్ణరాయ గురుపాదులు సెలవిచ్చినట్లు జ్ఞాపకము

ఇతని భాషాశైలి జిగురూ రుచి లేని పొడి మరబియ్యపు వంటి వచనశైలిగాక మనోహరమైన నవల కావ్యంగా నడిచింది

తణుకు
8 11 48

చెరుకువాడ వేంకటనరసింహము

"ముఖ్యంగా జీవిత చరిత్రలను వ్రాయడంలో శ్రీ వెంకటసుబ్బయ్యగారు ఒక అపూర్వ పంథాను అనుసరించారు ఒక వ్యక్తి జీవితాన్ని తేదీలతో వప్పజెప్పడం నిజానికి జీవిత కథ అవుతుంది కాని చరిత్రకాదు కాని శ్రీవారి జీవితం రచనలు నిజమైన చరిత్రలె అవుతున్నవి ఒకనాటి సాంఘిక రాజకీయ సమస్యలు అందు చర్చితాలై అవి చరిత్రలు గా రూపొందుతూ వుండడమే వీరి కలంలో విశిష్టత

మాతృభూమి 7 11 48

# విన్నపము

వీరులచరిత్రయే దేశచరిత్ర అని కార్లైలు మహాశయుడు ప్రవచించె

వీరులు కత్తిబట్టి కదనరంగమున కరుగువారే కాదు దేశకళ్యాణమునకు కృషి యొనర్చు వారందరును వీరులే

స్వార్థ ఘూయిష్టమగు లోకమును ఉన్నత పథమున ఉంచుటకు విరామములేక వీరులు కృషియొనర్తురు వారి కార్యకలాపములు శ్రేయోముఖములై యుండును అందుచేతనే వారు మనకు మార్గదర్శకులు

అందుచేత వారి చరిత్రల అవసరము అధికముగా కలదు

ఇంతియకాదు వీరపూజ దేశౌన్నత్యమునకు జాతి మహాత్మ్యమునకు ఆవశ్యమగు పవిత్రానుష్ఠానము అందుచేతనే జాతి తన వీరుల ఆరాధన వలననే జీవించ గలదని అందరును అంగీకరించినదే

అట్టి వీరారాధనకు వారి చరిత్ర రచనకంటె అధికమైన దేదికలదు?

మన భాషలో చెప్పదగిన జీవితచరిత్రలు అరుదు ప్రత్యేకించి కృషిచేయు కుతూహలముగల వారు లేకపోవుటే కారణము అందుచేతనే ఉత్తమ జీవిత చరిత్ర రచన ఉత్తమ జీవితమువలె అరుదు అనెను కార్లైలు

ఆంగ్లభాషలో జాన్సను మహాశయుని జీవితచరిత్ర రచించిన బాస్వెలు కడు ఖ్యాతిగాంచెను

అందువల్ల ఉత్తమ జీవితచరిత్రలు లేకపోవుటకు కారణము జాన్సనులు అరుదు అంతకంటె బాస్వెలులు అరుదు అనెను కార్లైలు

రామలింగారెడ్డిగారు మహాపురుషులు బహుముఖ ప్రతిభావంతులు నవ్యాంధ్ర నిర్మాతలు అంతర్జాతీయ ఖ్యాతి గాంచినవారు

వారి చరిత్ర ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమివారు వ్రాయించుట యెంతయు ప్రశంసార్హము

అకాడెమివారు రెడ్డిగారిని మహావక్తగా రాజకీయవేత్తగా విద్యావేత్తగా ప్రముఖ రచయితగా చిత్రించగోరిరి

రామలింగారెడ్డిగారి జీవితచరిత్ర కరపత్రముగాగాక దేశచరిత్రాత్మకముగా ఉండుట ఉత్తమమని భావించిరి

‘Biography should be written in the spirit of history and not of pamphlet And that is why, it is the best be written after a man is completely dead, as in much as he might

not like to hear at the severe things that have to be said about him —My Portrait gallery—74

Telling you what I have done, is not telling you what I am

రామలింగారెడ్డిగారు వచించిన రీతినే వారి చరిత్ర రచించితిని

ఒక వ్యక్తిని సంపూర్ణముగ ప్రతిబింబింపచేయుట యసాధ్యమైన యోగము

నా నేర్చిన పద్ధతిని రెడ్డిగారిచరిత్ర రచించితిని ఇది ఆంధ్రప్రదేశ్ అకాడెమీవారి బహుమతి గాంచుట మహాభాగ్యముగా భావించుచుంటిని

రామలింగారెడ్డిగారి చరిత్ర రచింపచేయుటలో పరమార్థము గ్రహించి పాఠకలోకము దీనిని సానుభూతితో పఠించి నన్ను కృతార్థుని చేయ వేడెదను

జీవిత చరిత్ర రచన ఒక వ్యక్తి ద్వారమున జరుగునదిగాని వ్యక్తి వల్ల అగు కార్యముకాదు దానికి ఇతరుల తోడ్పాటు చాలా అవసరము

శ్రీ రెడ్డిగారి చరిత్ర రచనలో నాకు తెలిసిన ఆంధ్రప్రముఖుల కన్న నన్నేమాత్రము ఎరుగని మైసూరు ప్రాంతీయులె అధికముగా తోడ్పడిరి

ఈ చరిత్ర రచనలో తోడ్పడినవారందరిని ఆ యా సందర్భములలో ముచ్చటించుట జరిగినది వారందరకూ కృతజ్ఞతా పూర్వక నమోవాకములు

రెడ్డిగారి మనుమరాలు సత్యభామా రెడ్డిగారు తాతగారి సంగతులను చెప్పుటయేగాక వారి రచన లొసంగినందులకు రామలింగారెడ్డిగారి శిష్యులగు ఎ హెచ్ సుబ్బారావు బి ఎ బిటి తమ కళాశాల స్మృతులను తదితరములు పంపినందులకు ఇంకను ఈ కృతిలో సహాయపడిన శ్రీ దర్శి చెంచయ్య శ్రీ నార్ల వెంకటేశ్వరరావు శ్రీ కాళోజీ నారాయణరావు శ్రీ దేవరకొండ చిన్నికృష్ణశర్మ తెలుగువిద్యార్థి సంపాదకుడు కొల్లూరి కోటేశ్వరరావు శ్రీ కట్టమంచి దైవకటాక్ష రెడ్డిగార్లకు ప్రత్యేకముగా వందనము లాచరించు చున్నాను

మిత్రులు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘఅధ్యక్షులు శ్రీగొట్టిపాటి బ్రహ్మయ్యగారు దీనికి పరిచయము ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు పీఠిక వ్రాసి శోభకలుగచేసినందుకు వందనముల సమర్పించుకొనుచుంటిని

ఇట్లు

ఘంటసాల
26—6—63

గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

# విషయసూచిక

# ఎన్నదగిన మానిసి

అనంత జీవరాసులలో ఒకడు మనుష్యుడు కాగా ఇతనికే ఎల్ల ప్రాణులలో ప్రాధాన్యము దేనికి? భగవంతుని అఖండ గుణ సంపద వీనియందు అతి సూక్ష్మముగా నైన కానవచ్చుచున్నది ఇతర ప్రాణులకు ఇట్టి భాగ్యము పట్టినది కాదు మధురముగా పలుకగలదు చిలుక అతి మనోహరముగా గానము చేయగలదు కోయిల అత్యంత సుందరముగా నడవగలదు రాయంచ అట్లే ఒయ్యారముగా నటింపగలదు మయూరము కాని ఇన్నియు మానవునిలో గనిపింపగలవు ఇంతేకాదు మదగజము గాంభీర్యము, మృగరాజు ప్రతాపము నాగరాజు రోషము మున్నగా ఆయా జంతువులలో గోచరించు వివిధ విశిష్టతలును నరునియందు గోచరింపగలవు ఇట్టి గొప్ప కలిమియే అతనికి సర్వప్రాణుల కంటె ప్రముఖ్యమును సమకూర్చినది

ప్రాణికోటిలో మానవునికి గల విశిష్టతను వివరించుటలో ఒకానొక మత గ్రంథము 'ఆత్మ అన్నది మనుష్యునికి దప్ప ఇతర ప్రాణికి లేదని చెప్పునంతదాక సాహసించినది ఈ సిద్ధాంతములోని సామంజస్యము ఎట్టిదయినను నరునికి వివిధ జంతువర్గాలకంటె ఆధిక్యము కలదని మాత్రము ఎల్లరును అంగీకరింపకతప్పదు అతడు తన బుద్ధిబలముచేత ప్రకృతిలో తనకు అననుకూలము లయిన వానిని తొలగించుకొని అనుకూలము లయిన వానిని పెంపొందించుకొని దినదినమునకు జీవితము సుఖవంతము చేసికొనగలుగుచున్నాడు తాను సుఖపడుటయేగాక, పరులకును సుఖము కలిగింపగలుగుచున్నాడు స్వజాతి ప్రాణికి హాని కలిగినచో, జాలిచే ద్రవించుట మానవేతర జీవులలో లేకపోలేదు అన్యోన్య సహకారమును కలుగకపోలేదు కాని అధిక శక్తిమంతుడగుట వలన మనుష్యుడు ఇతర జంతువులకంటె హెచ్చుగా పరోప

కారము చేయగలడు ఈ సామర్థ్యమే అతనిని ఈశ్వరునికి చేరువగా కొనిపోవుచున్నది ఇట్టి వానిని గూర్చియే చిన్నయసూరి తన నీతి చంద్రికలో 'ఏవాడు జీవింప ననేకులు జీవింతురు వానిమను గడయే మనుగడ' అని చెప్పియున్నాడు

అది పూర్వజన్మ సుకృతము చేతనే అనవలెను 'ఒక్కొక్క రిక ఆబాల్యముగా ఒక్కొక్క విద్యయందు పాండితి సౌశీల్యము భూతదయ మొదలయినవి అలవడును జన్మసిద్ధము లయిన ఈ గుణ విశేషములు పరిసర ప్రభావములను బట్టి కొందఱిలో అలతి నిప్పురవ్వ గొప్ప జ్యోతి యగునట్లు ప్రకాశించును అట్టి అదృష్టము పట్టినవారు తాము వెలుగు బాటలో నడచుట మాత్రమే కాక కనబడినవారి నెల్ల ఆ బాటవెంట గొనిపోదురు వశిష్ఠాది మహర్షులు, శంకర ప్రముఖు లయిన ఆచార్యస్వాములు కాళిదాసు మున్నగు కవులు చాణక్యుడు మొదలగు మేధావులు ఇట్టి వారే ఈ కోవకు చెందిన నరుని చరిత్రము తత్కాలపు దేశ చరిత్రమే అగును అతడు సమకాలికులలో ఎన్నదగినవాడగును అతని జీవిత చరిత్రము లోకమునకు అవశ్య పఠనీయ మగును తరతరాలకు అది ఒక దివ్యసందేశమును ఇచ్చునది అగుటయే ఇందులకు కారణము

ఆధునికాంధ్ర మహాపురుషులలో అట్లు ఎన్నదగిన ఒక మానిసి కట్టమంచి రామలింగారెడ్డి కనుకనే అతని జీవిత చరిత్రము అక్షర రూపముతో వెలువడుచున్నది ... వేజరిల్లుట

# కట్టమంచి

కట్టమంచి గ్రామము చిత్తూరునకు సుమారు ముక్కాలు
మైలు దూరాన ఉన్నది ఇప్పడది చిత్తూరు మునిసిపాలిటీలో
చేరినది చిత్తూరునకు దానికి నడుమ నొక చెరువున్నది 'భోగము
దాని చెరు వని దానికి పేరు దాని చుట్టు ప్రక్కల గల పొలము
లలో సేద్యమునకు ఆ నీరే ఆదారము

పూర్వకాలమున కట్టమంచి ప్రాంతాల వర్షము లధికముగా
కురిసెడివి ఆ వర్షపు నీరు తనలో ఇముడ్చుకొను ఇట్టి చెరువు
వలన ఆ కాలాన ఎంతో ప్రయోజన ముండెడిది దీని క్రింద
వందల యెకరాల నేల సాగయ్యేది ఈనాడు వానలు తక్కు
వగుటచేత రైతులు మోటార్లు పెట్టుకొని పల్లపు సాగు చేయుచు
చెరకు పండించుకొని జీవించుచున్నారు ఇటీవల కట్టమంచికిని
చిత్తూరునకును నడుమ ఒక చెరకు ఫ్యాక్టరీకూడ ఏర్పడినది ఇది
రైతులకు మిక్కిలి ఉపయోగకరముగా నున్నది పేదవారలు కూలి
నాలి చేసుకొనుటకును వసతి యేర్పడినది

ఈ ప్రాంతమున భోగమువారు త్రవ్వించిన చెరువు లనేక
ములు గలవు ఆ కాలమున విద్యావాసన కల అల్ప సంఖ్యాకు
లలో వీరును ఒక రగుటయు దేవదాసీత్వముచేత ఎంతో కొంత
భగవద్భక్తియు పరోపకారబుద్ధియు అలవడినవా రగుటయు ఈ
ధర్మకార్యములకు హేతువులు కాబోలు!

కట్టమంచి గ్రామము చిన్నదయినను నిర్మాణమున చక్క
నిది తూర్పున విశాలమైన రస్తా ఉత్తరమున ఏడాదికి మూన్నాళ్ళు
ముచ్చటగా పారు నది ఒకటి కొబ్బరితోటలు పచ్చని మళ్ళు,
విశాలమై తీర్చి దిద్దిన వీధులు, ఈ గ్రామమునకు కల సౌభాగ్య
ములు ఊరిలో ఎక్కడ చూచినను దర్శనమిచ్చు కొబ్బరితోటలు

మలబాకను జ్ఞప్తికి తెచ్చును ఇక దేవాలయములా! పెద్ద పట్టణ మైన చిత్తూరిలో సుప్రసిద్ధమైన దేవాలయము ఒక్కటే ఉండగా ఈ గ్రామములో పేరెన్నిక గన్నవి ఆరు కలవు వీనిలో శివాలయము గొప్పది ఇది చోళ ప్రతిష్ఠితము గంభీరమైన గాలిగోపురము గలది క్రీ శ 1895 వ సంవత్సరమున మన రామలింగారెడ్డి తండ్రిగారు దీనిని మరమ్మతు చేయించినారు ఈ శివుని పేరు తత్త్వకొండీశ్వరుడు ఈ స్వామిని 'బాల్యేశ్వరు డని కూడా అందురు 'కొళంది' అను అరవ పదమునకు 'శాల్యము' అని అర్థము ఇక్కడి అమ్మవారి పేరు కామాక్షి రెండవది విష్ణ్వాల యము ఈ రెండవతనము విస్తీర్ణతను బట్టి ఈ విష్ణువు పేరు వరదరాజస్వామి చిత్తూరునకు పోవు రోడ్డు ప్రక్క విఘ్నేశ్వరా లయ మున్నది గ్రామస్థుల కీ విఘ్నేశ్వరుని యందు భక్తి యెక్కువ ఆ రోడ్డు ప్రక్కనే ఆంజనేయస్వామి గుడి కూడ నున్నది ఇదియేగాక దుర్గమ్మ గుడి, ద్రౌపదమ్మ గుడి, కట్టమంచి వారు ప్రతిష్ఠించిన విఘ్నేశ్వరాలయము శ్రీరామ భజన మందిర మును గలవు ఈశ్వరాలయము వరదరాజ గుడి, ధర్మకర్తల పాలనలో నున్నవి

కట్టమంచి వారి యిండ్లు పెద్దవీధికి ఎదురుగా నున్నవి అవి మంచి మండువా లోగిళ్ళు ఆ విశాల భవనాలు ఆనాటి వారి సిరిసంపదలను సంస్కృతిని చాటును వారు నాడును నేడును విద్యావంతులే పైగా గొప్ప సంస్కారము గలవారు ఈనాడు గొప్ప ఉద్యోగాలలో ఉన్నారు ఈ కుటుంబములోని స్త్రీలుగూడ చదువు సంస్కారము గలవారు బ్రాహ్మణ స్త్రీలవలె కలిసికట్టుగ మాటాడువారు 'ఇల్లుచూచి ఇల్లాలని చూడవలె' ననుట వీరి విషయమున ఎంతయిన పొసగియుండును

కట్టమంచి మంచి కట్ల

# వంశవృత్తాంతము

కట్టమంచి గ్రామమునుబట్టి వీరి కీ యింటి పేరు వచ్చినది పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి యింటిపేరును పూతలపట్టు గ్రామమునుబట్టి యేర్పడినది ఈ విధముగా ఈ ప్రాంతాల రెడ్ల ఇంటి పేర్లు గ్రామాల పేర్లే కట్టమంచివారిది సదాశివగోత్రము వారి మూలపురుషుడు - రామలింగారెడ్డి చూపిన వంశవృక్షమును బట్టి - కొళందరెడ్డి అను మహానీయుడు ఆయనకు పెదరామలింగారెడ్డి చిన రామలింగారెడ్డి అని ఇద్దరు కొడుకులు వారిలో పెదరామలింగారెడ్డి మంచి పొడగరి, ఆజానుబాహువు నిమ్మపండువంటి దేహచ్ఛాయ గలవాడు

ఆయన చాల యేండ్లవరకు పెండ్లి వద్దని నిరాకరించెడి వాడట! కొళందరెడ్డిగారు 'నీవు పెండ్లి వద్దనుటకు కారణమేమని గట్టిగా అడుగగా రామలింగారెడ్డి 'విరక్తి పెరుగుచున్నది సంసార బంధము పెట్టుకొనజాలను గృహభారము సర్వము అసహాయ శూరురాలై నిర్వహించగల కన్య యున్న యెడల పెండ్లాడెద నని చెప్పెనట! ఈ నియమముల కంగీకరించిన చెంగమ్మ అను ఆబిడ లభింపగా వివాహమాడెనట!

పెదరామలింగారెడ్డి సంస్కృతము, జ్యోతిషము మంత్ర శాస్త్రము షట్ప్రయోగములు కవిత్వము మొదలయినవానిని ఆరగొండ కృష్ణమాచార్యుల యొద్ద నేర్చుకొన్నాడు ఆయన రాముల పూజ చౌడమాంబ అర్చన చేసెడివాడు

ఆంధ్ర భాషయందు అభిమానము కొంత ప్రవీణత కట్టమంచివారి వంశములో పారంపర్యముగా వచ్చుచున్నది ఈ సందర్భమున ప్రప్రథమముగా పేర్కొనతగినవాడు భాస్కరశతకాది కృతికర్త పెదరామలింగారెడ్డి ఈయన భాస్కరశతకమేకాక, కొన్ని అష్టకములు, కృతులు రచించినాడు ఇన్నిటితో భాస్కర

శతకము సరళమును సరసమును ప్రచారముకోనున్న భాస్కర శతకము నీతిబోధకముకాగా, ఇది భక్తిరస పూర్ణమయినది

చ॥ అనిశము నీ పదాంబుజము లర్చనచేయుదు నెట్టివేళలన్
గనికర మిుంచి నాయెడను గ్రక్కునఁ బ్రోవు మటంచు మ్రొక్కుచున్
వినయముతో నినున్ మఱియు వేడ్క నుతించెద నయ్య కావుమీా
పనివడి నీవు నాహృదయ పద్మమునందు వసించు భాస్కరా!

మన రామలింగారెడ్డిక గురువు లయిన కుప్పనయ్యంగార్లకు ఈ పెదరామలింగారెడ్డియే గురువు కుప్పనయ్యంగారు జ్యోతిషము, కవిత్వము ఈయనయొద్దనే నేర్చుకొన్నాడు

పెదరామలింగారెడ్డిగారు మహాకవి యని వారి బంధువులలో గొప్ప ప్రసిద్ధి ఉండెడిది వారి కృతులను ముద్రింపగోరి మన రామలింగారెడ్డి తండ్రిగారు పూర్వపు ప్రతులను తిరుగ వ్రాయింప బూనినారు కాని ఆ కార్యము ముగియకముందే ఆయన దేహయాత్ర చాలించుట తటస్థించెను పిమ్మట ముత్తాత కావ్యములను ముద్రింపజేయు భాగ్యము మన రామలింగారెడ్డికి దక్కినది వీనిని ఆయన క్రీ శ 1927లో అచ్చొత్తించినాడు తండ్రికోరిక చెల్లించుట గ్రంథములను బంధువుల కర్పించుట అను రెండే ఈ గ్రంథముద్రణోద్దేశములు

పెదరామలింగారెడ్డిగారి భార్య చెంగమ్మకూడ చాల మంచిదని ప్రసిద్ధి ఈ దంపతుల కారుగురు పుత్రులు పెదరామలింగారెడ్డిగారు క్రీ శ 1850 వ సంవత్సరమున తమ అఱువదవ యేటనేమో పరమపదించిరి

# వంశవృక్షము



కట్టమంచి కొళందరెడ్డి చిన్నమ్మ
పెదరామలింగారెడ్డి చెంగమ్మ
1790 1850 (సుమారు)
చినరామలింగారెడ్డి
వీరికి ఆరుగురు కొడుకులు పుట్టినను
వీరి వంశము ఇంచుమించు నిశ్శేషమైనది
వీరరాఘవరెడ్డి జ్ఞానమ్మ
కొళందరెడ్డి మొదలగు ఆరుగురు కొడుకులు
మనుమడు రావు సాహెబు కొళందరెడ్డి
సుబ్రహ్మణ్యరెడ్డి
1846 1895
నారాయణమ్మ
1907
రామస్వామిరెడ్డి
1850 1892
పాపమ్మ
బంగారమ్మ
రంగారెడ్డి లక్ష్మమ్మ
1863 - 1913
రామలింగారెడ్డి దత్తపుత్రుడు
వీరరాఘవరెడ్డి చిన్నమ్మ
నరసింహారెడ్డి
అక్కతమ్మ
1870 1910
రామలింగారెడ్డి
రామస్వామిరెడ్డికి
దత్తుడు
1880 1951
కృష్ణారెడ్డి
తిరుమలమ్మ
వీరరాఘవరెడ్డి
లక్ష్మమ్మ
సుబ్బారెడ్డి ప్రభృతులు ముగ్గురు
కొడుకులు సంజంతమ్మయను
కూతురు ఈమెను రామలింగా
రెడ్డి పెంచుకొన్నాడు
భాస్కరరెడ్డి - నాగరత్నమ్మ
జిల్లాజడ్జి అనంతరము మరొకభార్య
1890 1945

వీరరాఘవరెడ్డి కాలమున వీరి యిల్లు మిక్కిలి లేమికి గురి యైనది పేదరికము కారణముగా వీరరాఘవరెడ్డి గుమాస్తాగా జీవింపవలసి వచ్చినది సేద్యమువలన లభించునది లేదనుకొని ఆయన తన కుమారులకు ఇంగ్లీషుచదువుకూడ చెప్పించినాడు ఈ కుమారు లలో జ్యేష్ఠుడైన సుబ్రహ్మణ్యరెడ్డి విద్యాభ్యాసమునకు అతి శ్రమ పడవలసి వచ్చినది ఉదయముననే కట్టమంచిలో చలిది భుజించి చిత్తూరునకు బోవుట ఆ అయ్యను ఈ అయ్యను ఆశ్రయించి ఇంత తెలుగు ఇంత ఇంగ్లీషు మెదడున కెక్కించుకొనుట ఒక చోట కుదురుగా కూర్చుండి నేర్చుట కవకాశములేదు అక్కడ నొక ముక్క ఇక్కడ నొకముక్క అయిననేమి? అది జిజ్ఞాసతో గూడిన చదువు దానికి బలమిచ్చు స్వయంకృషి వీనిమూలమున ఆయన విద్యాభ్యాసము దినదినప్రవర్ధమానమై నిత్యవసంతోత్సవ ముగా నెగడినది ఆయన ఇంగ్లీషులో ప్యాసుచేసినది ప్రొఫిషెన్సీ యెట్టు ఖండవృష్టిగ విద్యాకృషి సల్పిన వారయ్యును వీరు యాంధ్రాంగ్లేయములయందు గొప్ప పాండిత్యమును బడయఁ జాలిరి

'పరమ క్లేశమునఁ జేసి వడసిన విద్యల్
స్ఫురియించుఁ గాక!''

వీరి యింగ్లీషు లైబ్రరీ (Law library)యంత పుస్తక భాండాగారమును చిత్తూరు బి ఎ బియల్ లు ఎవ్వరును సేక రింపలేదు తెనుగున వీరుచేసిన కృతులే వీరి రసికత్వమునకును వివేచనమునకును సాక్ష్యము

'తొలుత మా తండ్రిగారు వృత్తాచారమును బట్టి గుమాస్తా పనిలోదిగిరి కొన్ని యేండ్లకు జిల్లాకోర్టులో రికార్డు కీపరైరి త్వరలో నా పనికి రాజీనామా యిచ్చి కార్వేటినగర సంస్థానములో మేనే జరుగా జేరిరి అక్కడి రాజుల విపరీత రాజసము తమకు సరిపడ నందున, దానిని వదలి ఫస్టుగ్రేడు ప్లీడరు సన్నదును సంపాదించు

కొని వకీలు వృత్తి నాశ్రయించి దానికిని దమకును నసాధారణ మైన కీర్తిఁ దెచ్చిరి

'సుబ్రహ్మణ్యరెడ్డిగారి వకీలు వృత్తి యనన్య సదృశము ఆది నొక క్రిమినల్ కేసులో దను కక్షిదారునికి నురిశిక్ష ప్రాప్తమైనది ఆనాఁడు మొదలుగ క్రిమినల్ కేసులు గైకొనుట విడచి పెట్టిరి నాతో నొక్కనాఁ డీ విషయమై మాటాడుచు నా క్లయింటునకు మరణదండన యను మాట విన్నదే తడవుగ నా కంఠమునకే యురిత్రాడు బిగింపఁబడినట్లు స్తబ్ధుడ నైతిని నాఁడు మొదలు మనశ్శాంతి నేమాత్రమైనఁ గలిగింపఁజాలు కేసులను స్పృశింప నని వ్రతము దాల్చితి నని నుడివిరి ఇది నిజముగా భీష్మ వ్రతము వీరి సత్యసంధత యొక్క ప్రభావ మెట్టిదనినఁ దామే ప్రక్కన వకీలుగా నున్న నదియే సత్యమయిన పక్ష మని జడ్జిలు భావించువారు సత్య మే దిక్కో ఆ దిక్కే సుబ్బారెడ్డి కాఁబట్టి వారి పక్షమున కనుకూలించునట్లు తీర్పు

'జిల్లాలో గొప్ప గొప్ప యాస్తుల విభాగములకుఁ గోర్టు వారును కక్షిదార్లును గలసి నా తండ్రిగారినే పంచాయితీదారు (Arbitrator)గా కోరుకొనుచుండిరి వీరి మరణ పర్యంతము నింక నెవ్వరికి నీ గౌరవము లభించినది కాదు

"తాను చావు పడకలో నున్నపుడు సైతము వల్లైగారు చెంగమనాయఁడుగారి మైదు లక్షల యాస్తిని కొడుకులకు నిర్వివాదముగ పంచిబెట్టుటయేగాక వారి సమ్మతిపై మిడిల్ స్కూల్ నొకదానిని నగరములో స్థాపించి మాన్యముల నేర్పరచిరి

"తన కక్షిదారులపట్ల దాను చూపు వర్తన మనన్య సదృశము పైనజూపబడిన విశేషములనుబట్టి వీరియొద్దకు వచ్చు వారు చాల మంచివారుగా నుండువారేగాని యల్పులుగా దనుట స్పష్టము మా యింటిలో భోజనము చేయఁగలవా రెల్లరు మా

యతిథులుగానే ఎన్నినాళ్ళయినను సరే, యెన్ని పర్యాయము లైనను సరే యుండవలయును కాళహస్తి కార్వేటి నగరము రాజులు లాడ్ దాసుగారు బ్రాహ్మణులు మొదలగువారికి సిబ్బందితో ఊరిసత్రములున్ని సౌకర్యములు నడప మా తండ్రిగారే యతిథులనువలె సన్మానింతురు

'రెండవది క్రమమైన ఫీజు మాత్రము గ్రహించుట చిత్తూరులోఁ బూర్వ మగ్రగణ్యులుగ నున్నవారు కోటావారు వైశ్యులు ఆ యింటివారు మా తండ్రి యొక్క ధర్మ గుణములఁ గూర్చి నాతో బ్రసంగించెడివారు ఒకానొకప్పుడు నా తండ్రిగారు కష్టపడి వారికి నైదు వేల రూపాయలు చెల్లునట్లు చేసిరి వారు సంతోషపడి యధికమగు ఫీజు నీయరాగా – 'క్రమ వేతనముకంటె నెక్కువగా గైకొన్నచో నది భిక్షముతో సమానము నిజమైన వకీలు బిచ్చగాఁడు కాఁడు ఆర్జితముకన్న నెక్కువ పుచ్చుకొనననని నిరాకరించిరి

'మూఁడవది బలాఢ్యులచేత హింసింపఁబడు బీదలకు నుచితముగ సహాయము చేయుట ఈ తరగతికి చేరినవాఁడే పూర్వము పేర్కొనబడిన కృష్ణపాళ్యం జమీందారు పాలివా రన్యాయము చేసి యీ జమీందారు నిల్లు వెడలఁగొట్టఁగా నా తండ్రి యైదేండ్లన్ని కర్చులు భరించి కేసు జయించి వారి భాగము వారి కిప్పించుటయేగాక ఫీజు పుచ్చుకొనలేదు 1923 వ సంవత్సరపు టెలక్షనులో నన్నుఁ జూచునప్పటి కా జమీందారు చాల వయస్సు చెల్లిన ముసలాయన అట్లుండియు నూరేగింపుగా నన్నును, కోటి రంగయ సెట్టిని నింటికిఁ బిల్చుకొనిపోయి తానే స్వహస్తములతో వడ్డించి 'మీ తండ్రి పెట్టిన భిక్ష నాయనా ! నీ కుండెడు సొంత మీ యింటిలో నాకు లేదని చెప్ప 'నీ కెవరైన వోట్లీయకున్న దలపగుల కొట్టించెదను భయపడవద్దులే సుబ్బారెడ్డి కొడుకునకు లేని వోట్లిం కెవ్వరి' కని పరమానందభరితునిఁ జేసె నన్ను సాగనంపిరి

ఇంకఁ గక్షిదార్లుగ వచ్చినవా రెల్ల స్నేహితులుగ నిలిచి రని నేఱుగ చెప్పవలయునా ? మా తండ్రికి సంబంధించిన స్నేహ సంపద యెవ్వరికి నుండదు పండ్రెండు సంవత్సరముల వయస్సునకే భారత, భాగవత పఠనముల నెక్కువ గజిబిజి లేక చదువుఁగలట్లు నా తండ్రి నన్నుఁ దీర్చిరి

“కోర్టునకుఁ బోఁక మిగిల్చిన కాలము నంతను భారత భాగవతములకు, మామిడి తోఁటలకు వినియోగించి మాతండ్రిగారు, రెండింటను ప్రసిద్ధి చెందిరి

“కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డికి దైవభక్తి యెక్కువ దానితోఁబాటు ఛాందసములును

‘రామస్వామిరెడ్డి రాజసగుణుఁడు సుబ్రహ్మణ్యారెడ్డికి సత్త్వగుణమెట్లు ప్రధానమో తమ్మునికి రజోగుణమట్లు వారికి నాయందుఁబ్రాణసమానమైన ప్రీతిగావున నప్పుడప్పుడు నా చదువెట్లున్నదను విచారణలేకయే, వేలూరునకుఁ బిలుచుకొని మాసములకొలఁది నుంచుకొనును అక్కడ నాకు మిఠాయి పొట్లము లేమి భోగమువాండ్రువచ్చి స్నానముచేయించి నయముగా నొప్పి లేని విధమునఁ దలదువ్వుటలేమి- చాల బాగుగ నుండునది కాలము! విరించిపురము కోవెలకు మా చిన్ననాయన ముఖ్య ధర్మకర్త అక్కడకు వెళ్ళినపుడెల్ల బ్రాహ్మణ ఫలహారములు పసిబిడ్డగదా యని దేవదాసినులు చేయు పరిచర్యలు ఇవన్నియు దట్టముగాఁ బడుచుండెను మా తండ్రికి విపరీతములు తెలియుటతో వేలూరు నకుఁ బంపుట మానివేసిరి తొమ్మిదవ సంవత్సర ప్రాయానంతర మీ రాజభోగము లన్నియు నిలిచిపోయి సత్త్వ గుణముల నభ్య సింపవలసిన కర్మముఁ జెందినవాడనైతిని

‘కవిత్వము మహా సాహస కార్యమని నా తండ్రికి భయము ఒకవిధముగ జూచిన నిజమే ! కాని వారి కారణము వేఱు విష గణములు పడి యెవరికి చేటు వాటిల్లునో యను వెఱపు పెద్ద

తెనుఁగు రానాకుండు పాటవము జూచి వీ డెప్పుడు కవిత్వ రచనమునకు ప్రారంభించి నాశన మగునో యని దిగులుఁజెందుచుండును నాతో తెనయొక్క కంఠస్వరముతోనే తాను జదివెడు మాడ్కినే భారతమును నేను చదువు నప్పుడు పరమానందమును నీ తుంటరి కవిత్వము మొదలుపెట్టి యిల్లు గూల్చునో యను సంశయమును జనిపోవువఱకుఁ దాల్చియుండెను కవిత్వ మనఁగా మరణయోగములలో నొకటి దైవభక్తి సత్త్వగుణము వీరికి వెన్నతో వచ్చిన వరములు

"1892 వ సంవత్సరమునందే పేరూరు చిన్ననాయన రామస్వామిరెడ్డిగారు 42 సంవత్సరముల వయస్సునఁ జనిపోయిరి 1895 వ సంవత్సరములో నా తండ్రిగారు మరణించిరి అప్పుడు వారి వయస్సేఁబది కడగొట్టు చిన్ననాయన రంగారెడ్డి షష్టిపూర్తి ననుభవించి 1913 వ సంవత్సరమున దివంగతులైరి 1895 వ సంవత్సరము డిసెంబరు 6 వ తేదీన నా తండ్రి కాలధర్మముఁ జెందెను

"చిత్తూరు నందలి ప్రముఖులు వకీళ్ళు, వర్తకులు, బంధువులు, బీదసాదలు స్నేహితు లందఱా మహనీయుని యంత్య దర్శనార్థము తండోపతండములుగ బరివేష్టించి కన్నుల నీరుఁ గార్చు చూడిరి దహన సంస్కారానంతరము డిస్ట్రిక్టు జడ్జి యగు 'రాబర్టు సివెల్ వచ్చి విచారించెను ఒక నెలవరకు మా యిల్లు సత్రముగ నుండెను మా జిల్లావారి గొప్పతనమునకు సూచకమయిన యొక్క విషయ మిట నల్పమైనను జెప్పక తీరదు కష్టదారు లెల్లరను మే మడుగకయే తా మీయ వలసిన పైకమును దామే తెచ్చి మా తల్లికి దేవుని ముడుపు లట్లు చెల్లించిరి దాదాపు ముప్పదియేండ్లు దాఁటిన వెనుక నేను ఎలక్షన్ దండయాత్రకు వెడలఁగాఁ గట్టమంచి సుబ్బారెడ్డి కొడు కను ధ్వజమే యనాయాస విజయావహ మైనది 'తమ్ముఁ గవ ధ్వజ ప్రభలయంధీభూతులం జేయకే" అను మాడ్కి నాకుఁ దెనుఁగునందు విద్య

వారిడిన భిక్షయేకాని వేఱు కాదు భారత భాగవతములను మనసులలో నాఁటి కాలక్రమమున వికసనమునకు వచ్చునట్లు చేసిరి రామాయణము నందు వారికి రక్తి లేశమాత్రము ఏలనఁగా నదికథ కావ్యము వేదాంత విచారణలు ధర్మాధర్మ ప్రసంగము లంతగా లేనిది వారెంత జెప్పినను భాగవతము యొక్క శైలి నాకంత రుచింపలేదు వారి చావు పడకలో నారాయణ కవచమును బదింబదిగఁ జదివితిని కాని యందుఁ గవితాకళ న్యూనమని నాఁబోలు, ఆ చిన్న వయస్సునఁ గూడఁ మనసు తఱచు భారతము మీఁదనే ప్రసరించుచుండెడిది భారతమును పున పునః పారాయణము చేయించి నా యందు వారు సాహిత్య రసజ్ఞతను బుట్టించిరి ”

రామలింగారెడ్డి తమ తండ్రిగారు ఏర్చి కూర్చి ప్రకటించిన ‘భారతసార రత్నావళి’ ‘భాగవత సార ముక్తావళి’ పునర్ముద్రణ గావించి పితృభక్తిని ప్రకటించుకొన్నాడు

## బాల రామలింగారెడ్డి

మన రామలింగారెడ్డి క్రీ శ 1880 వ సంవత్సరము డిసెంబరు నెల పదియవ తేదీనాడు జన్మించినాడు ఈయనకు ముత్తాతకు వలెనే పుట్టుమచ్చ యుండుటను బట్టియు, నామ నక్షత్రమును బట్టియు కుల పురోహితులు సుబ్బనయ్యంగారు రామలింగారెడ్డి అని పేరు పెట్టినారు

ఈ బాలుడు తన ముత్తాత యగు పెదరామలింగారెడ్డివలె సమానులలో ఉత్తమ శ్లోకుడు కావలెననియు, కవీశ్వరుడు కావలెననియు నామకరణమునాడు తల్లిదండ్రులు బంధు మిత్రులు ఆశించియుందురు కాని ఆ ఆశ శతాధికముగా ఫలించునని మాత్రము తలచియుండరు నామ నక్షత్రమును బట్టి వీరి చంద్ర లగ్నము తుల కనుకనే యేమో, లక్ష్మీ సరస్వతులు వీరితో తుల

దూగుట వీరు కోరుకొన్నను కోరుకొనకున్నను రాజకీయ రంగములో పేర్వాసి అబ్బుటయు ప్రజాసందోహముచే కర్పూర నీరాజనము లందుకొనుటయు విధివిహితములయినవి వీరి కీర్తిచంద్రికలు ఏ యొక్క రాష్ట్రమునకో కాక, యావద్భారతమునకు మెఱుగు తెచ్చునంతటివి కాజాలినవి ఖండాంతరము లందును అఖండ గౌరవము చేకూరినది

ఇది యంతయు చూడగా మన రెడ్డికి రామలింగారెడ్డి యని పేరు పెట్టవలె నని కుప్పనయ్యంగారికి స్ఫురించుటలో ఈశ్వర సంకల్ప మేదో బలీయమై యుండు నని మన మూహించుట దుర్బలము గానేరదు

బాలరామలింగారెడ్డి లోకసాధారణముగానే అయిదవయేట అక్షరాభ్యాస విధి నంది కట్టమంచి వీధిబడికి పలక బలపములతో పదగిడినాడు ఆ వీధిబడిలో ఇరువది ముప్పది మంది పిల్ల లుండెడి వారు కృష్ణాజిల్లాలో సుప్రసిద్ధుడగు కౌళందరెడ్డియు ఆయన తమ్ముడు సుందరరెడ్డియు ఆ బడిలో చదివినవారే వీరిలో సుందర రెడ్డిగారు మన రామలింగారెడ్డికి సమవయస్కుడు ఆ బడిపంతులు గారి పేరు మునుస్వామి మందిరి ఆయన యాదవుడు చదువు బాగుగా చెప్పెడివాడు మన రెడ్డి ఆయన యొద్ద బాలరామాయణము అమరము చక్కగా చదువుకొన్నాడు తోడి పిల్లలతో కలసి మెలసి యుండి, ఆడుచు పాడుచునే చదువు నేర్చినాడు జగడాలు జట్టీలని యెరుగడు ఆటలలో గట్టివాడు పుష్టిగా నుండెడివాడు తాటికలకండ తాయిలముగా మురిసెడివాడు దానిపై మక్కువ యతనికి పెద్దయైన పిమ్మటను తక్కువైనదికాదు ఆ కలకండ రుచి యంతగా నోటి కందుటచేతనే యేమో అతని పలుకు లెంతో తియ్యనివై శ్రోతలకు మత్తును కలిగింపజాలిన వగుట

కొంతకాలమునకు మునుస్వామి మందిరిగారు కాలధర్మము చెందినారు అంతట బాల రామలింగారెడ్డి తండ్రిగారి యొద్దనే

భారత భాగవతములు చక్కగా చదువుటతో బాటు కొంచె మాంగ్లేయమును నేర్చుకొన్నాడు

'మా యింటిలో, బూర్వము మేనమామల ఇండ్లకు బాలురమైన మే మేటేట పోవుట పద్ధతిగా నుండెను ప్రతి సంవత్స రము అరగుండ, నావిక్ తోట దామల్ చెఱువు ఎల్లంపల్లె వల్లి కీడు గుండ్లపల్లె నొక చుట్టు చేసి వచ్చుచుంటిని పోయినప్పుడెల్లఁ బట్టంచు పంచెలు ఒక్క రూపాయి నాకు మామూలు సంభావన ఇంక విందుల సంగతిఁ జెప్పఁ బనిలేదు బొబ్బట్లు, పొట్టేళ్ళు గడ్డ పెరుఁగు ఇంట కాచిన నెయ్యి - ఇత్యాది నైవేద్యములు బాల రామలింగనికి యథేష్టముగా దొరకుచుండెను కాలము మారినది మేలుపడినదికాదు ఆ సుఖములు సాంగత్యములు స్మరణమాత్రము లైనవి ఇఁక ననుభవమునకు రాఁజాలవు

'గుండ్లపల్లెకుఁ బ్రయాణమనఁగా నది యొక పండుగ, తీర్థయాత్ర యనియుఁ జెప్పవచ్చును మా 'అమ్మాయమ్మ' - నరసమ్మగారి ముద్దు పేరు — మాకు భోజనము పెట్టుటతో దృప్తిఁ జెందువారు కారు ఆమె నడతలు, పలుకులు మనస్సును వికసింపజేయునవి మఱియు - ఇది యసామాన్యమైన విందు — ఊకుడు కథలు చెప్పుటలో నేర్పరి ప్రౌఢ ప్రస్తమానమును నామెను వంటయింటికిఁ బోనీయకుండ గథలు చెప్పుమని నిర్బంధించుచుండెడి వాఁడను రాత్రులలో గాపె వద్దనే పరుండి నిద్రవచ్చువఱకుఁ గథలు చెప్పుమని వినుచుంటిని ఆపె వద్ద నే నేర్చుకొన్నవి నా కా వయ స్సున- 10, 12 సంవత్సరము లపుడు- నూఱు కథలకంటె నెక్కు వగా వచ్చియుండెను నూఱు కథలవాఁడనని మావా రందరు నన్ను మెచ్చుకొనుచుండిరి నేనును ఈ విషయములో నహంభావము లేనివాఁడనుగా నుండి యుండలేదు బాల్య మహంకార ప్రధానమైన వయస్సుగదా !

'గుండ్లపల్లెకుఁ బోయినపు డెల్ల నన్ను భారతము చదువు మని 'అమ్మాయమ్మ' గారు వినుచుందురు పద్యముల కర్థము చెప్ప

మందును శంక లేక, తప్పో యొప్పో యేదో యొక వ్యాఖ్యానము చేసి నా వాంఛిత్యము నిలుపుకొనుచుంటిని పూర్వము నా కాపె ఊకుడు కతలు చెప్ప జ్ఞాపక శక్తిని భావనా శక్తిని వృద్ధిపఱచెను ఇపు డామెకు కలిగిన ఫలము బారతమ్యశ్రవణము"

# హైస్కూలులో

చిత్తూరు వెనుకబడ్డ జిల్లా అయినప్పటికి అక్కడ హైస్కూలు పురాతనమైన ఉన్నత పాఠశాలలో ఒకటి అది 854 ఎ సంవత్సరమున స్థాపింపబడినది చూడముచ్చనైన భవనము విశాలమైన గదులు ఆ ఉన్నతభవనమున (Look up- Aim high) ఊర్ధ్వ దృష్టి కలిగి ఉన్నతాశయముం కొరకు ప్రయత్నించుము అను నీతి వాక్యము పిల్లలకు ఉపాధ్యాయులకు ఎంతో ఉత్తేజమును కలిగించెడిది ఆ 'చిత్-ఊరు ఉన్నతపాఠశాల తన పేరును సార్థకము చేసుకొన్నది ఆ ఉన్నత పాఠశాల ప్రాచీన గురుకుల పద్ధతిని పరిఢవిల్లినది ఉపాధ్యాయులు ఎల్లల అభివృద్ధియే తమ అభివృద్ధిగా భావించిరి వారు జీతము, ప్రమోషను, పెన్షనులకై పెనగులాడలేదు బాల రామలింగారెడ్డి ఈ పాఠశాలలో 1890 వ సంవత్సరములో మొదటి ఫారములో ప్రవేశించెను ఆయన తన పాఠశాలానుభవములను ఈ విధముగా గ్రంథస్థము చేసెను

'ఒకానొకప్పుడు- నేను రెండవ ఫారములో జదువుచుండిన కాలమున- సహపాఠియైన బ్రాహ్మణ బాలకుఁ డొక్కఁడు రెడ్డివంశమును హేళనము చేయుచు మా జిల్లాలో వాడుకగా నుండు 'రెడ్డి-మడ్డి-నారాయి బుడ్డి యను నిందావాక్యమును బహిరంగముగ నుడివెను పాలసుండనగుట నేను పంతులువారితోఁ జెప్పితిని కుప్ప నప్పనయ్యంగా ర్లాగ్రహావరవశులై ఈ కాలపు టనాచారపూరితులైన బ్రాహ్మణులను జెడఁదిట్టి మా ఇంటియొక్క సంప్రదాయ

మును వెల్లడించుచు దమ గురువులైన మా ముత్తాతగారి స్తుతిని దీర్ఘముగఁ జేసి, తమయొక్క గురువు కులమును దూలనాడినందులకు శ్రీనివాసాచారిని అనరానిమాట లనిరి కుప్పనయ్యంగార్ల యుపాధ్యాయత్వమువలెఁ బ్రసిద్ధివహించిన గురుత్వమును మా జిల్లాలో నొక్క తిరువేంగడసామి నాయుడుగారు తప్ప నింకెవ్వరు గడించియుండలేదు 'చిత్తూరు పులి' యని బిరుదుగాంచిన తిరువేంగడసామి నాయఁడును, కుప్పనయ్యంగార్లును జనుల స్మరణలో నేఁటికిని బచ్చగఁ బదిలముగనున్నారు 'నీ వేమి కుప్పనయ్యంగారా?' యని ప్రశ్నరూపమైన తిరస్కారము 'ఏమయ్యా! కుప్పనయ్యంగార్లవలె మాటాడుచున్నావు!' అని చెప్పిన 'నతిశయోక్తులు ముఖస్తుతులు బాగుగఁ గలుపు చందనమునందు యున్నావని భావన వారివద్ద నేర్చుకొని సుప్రసిద్ధపండితులైనవారి సంఖ్య మిక్కిలియు బెద్దది నామట్టుకు నా సాక్ష్య మిచ్చుచున్నాను కుప్పనయ్యంగార్లును వారి యనంతరము పండితులుగా వచ్చిన వేంకటకృష్ణమాచార్యులును నేర్పినదానికంటె నెక్కువ నేను కాలేజీకి వెళ్ళిన తరువాత నేర్చుకోలేదు అనఁగా కాలేజీలోనివారు చెప్పలేదని కాదు నేను నేర్చుకోలేదు ఆ వచ్చినదానితోనే భాషాయాత్ర గడపుచున్నాను

కుప్పనయ్యంగార్లు వయసు రమారమి 80 ఏండ్లని వదంతి మిక్కిలి పొడుగైన మానిసి దాదా పాఱుడుగల పొడుగు నిమ్మపండువంటి మనోహరమైన ఛాయ శ్వేతవస్త్రములు పండ్లులేకున్నను ఉచ్చారణ స్పష్టముగ నుండును గంభీరమైన కంఠనాదము సాధారణముగ నేదైన నత్తరు పూసికొని క్లాసునకు వచ్చును 'ఏమండీ! మీ క్లాసు ఎంతమంచి సువాసనగా నున్నది!' అని యొకప్పుడు నేను బొగడఁగా 'బాలులారా! మాతృభాషయొక్క పరిమళము సుమండీ! మీ యింగ్లీషు పోలె దుర్గంధ పూరితముకాదు' అని సింహపునవ్వు నవ్వినారు వారి మాటలనేకము లసభ్యములు, అయ్యు నెవరికిఁ గోపమురాదు

వారి క్లాసులో నింగ్లీషు నేమాత్రము పలుకఁగూడదని యాజ్ఞ ఎవరైనఁ దెలియక పలికిరో వారి తల్లియొక్క పాతివ్రత్యమునకు వచ్చిన భంగముఁ జెప్పరాదు తానుమాత్ర మాగ్రహా పరవశత్వములో 'On the bench అని శిక్షించును అది తప్ప నేరు ఇంగ్లీషుముక్క విని వ్రాయుచ్చుట నే నెఱుంగను 'Home exercise అనఁగూడదు 'గైహిక' మనవలయును 'Dictation అని పొరపాటునఁ జెప్పిన మా కుస్త్రీలు కులట లగుట తప్పదు 'ఉక్తలేఖన మని దానిపేరు వారమునకు మూఁడుపర్యాయములు పర్యాయమునకుఁ బదినిమిషముల చొప్పునఁ గఠినపదములకు ఉక్తలేఖనము వ్రాయించుట వారిపద్ధతి అందుఁ బ్రాణకంటకములైన మాటలివ్వి 'త్ర్యంబకశాస్త్రి 'అవాఙ్మానసగోచరుఁడు 'పయః కాంతి యశ రాశి 'శత్రుఘ్నుఁడు 'కఱ (బండితా విధవ!) 'కంఠుఁడు (కడుపులో నున్న వుండే వత్తు గా రా గాడ్దెకొడకా!) ఇత్యాదులు వారమునకొకపర్యాయము 'గైహికము ఇంటిలో వ్యాసములువ్రాసి చూపించువారి సంఖ్య యల్పము పంతులవారి యాగ్రహ మనల్పము

'వీరు హైస్కూలులో బున ప్రవేశము చేయునపుడు (1890) నేను మొదటిఫారములో విద్యార్థిని వీరివద్ద నేఁ జదివిన మూఁడేండ్లు చదివినది యొక్క పుస్తకమే నలోపాఖ్యానము అయిన నెట్టిచదువు! వ్యుత్పత్త్యర్థములు నానార్థములు సంధులు, సమాసములు వ్యాకరణము ఛందస్సు అలంకారములు మొదలగు విషయము లన్నియుఁ గూలంకషముగా బోధించిరి సర్వలక్షణ సారములోని విషయము లన్నియు నలోపాఖ్యాన ప్రయుక్తముగను, సరసముగను మనసు నాటి వికసించునట్లుఁ జేసిరి

'కుప్పనయ్యఁగార్లకుఁ దమశిష్యులయందుఁ బ్రీతి యపరిమితము తాను మా కేమి మమ్ముఁజెడదిట్టవచ్చును ఇంకెవ్వరు మా జోలికి రాఁగూడదు ఇంకెవరివల్ల మా కే యిబ్బందియుఁ

గలుగఁగూడదు తుదకుఁ బరీక్షలక్రమము సైతము మాయందుఁ జెల్లరాదు

"ఆ కాలమున సాంవత్సరిక విచారణకు వచ్చువారు 'మిల్టన్ అను ఆంగ్ల కవీశ్వరునకు వ్యాఖ్యాన కర్తయైన 'బ్రాడ్షా యను దొర అతఁడును మిక్కిలి వృద్ధుఁడు ఆ యిరువురు ముసలి వారికిని నొకరిభాష యొకరికిఁ దెలియకపోయినను సఖ్యము సంపూర్ణము ఒకరి నొకరు చూచి చిఱునవ్వులు ప్రయోగించుకొందురు ఇంతకంటె నెక్కువ సంబంధము వారి కసాధ్యమైన యీప్సితము ఆ బ్రాడ్షా దొరగారితోఁ దెనుఁగు క్లాసు తనిఖీకి వచ్చువారు జానకి రామయ్య అను సబ్ అసిస్టెంటు ఇన్స్పెక్టరు బ్రాహ్మణుడు తెలుఁగు తెలిసినట్లు నటించువాడు జానకరామయ్య యనిన మా కుప్పనయ్యంగారికి సరిపడదు

'ఏమండీ! శుద్ధ వెధవ ఓ అంటే నా రాని కొడుకు నా తరగతి పరీక్షించటం! బాలులారా! ఆ వెధవను చూచి భయపడ వద్దు వాఁడు వ్యాకరణసూత్రాల నడుగును మీకు తెలిస్తే తెనుఁగు సూత్రాలు చెప్పండి తెలియకుంటే ఈ సంస్కృత సూత్రములలో మీకు అప్పుడు తట్టిన దేదైనా ధైర్యముగా చెప్పి గంభీరముగ కూర్చోండి-జ్ఞప్తియున్నదా? కొడుకులారా!

'అకస్సవర్ణేదీర్ఘః'' 'అదేఙ్గుణః'', 'వృద్ధిరాదైచ్'' వల్లించండి, ఇంకా బాగా వల్లించండి! బాగా జ్ఞప్తియున్నదా ఏదైనా చెప్పేసి కూర్చోండి నిలువబడి యుండకూడదు తెలిసిందా కొడుకులారా!'' ఈ రీతిని రంగము సిద్ధముచేయబడి యుండును జానకిరామయ్యగారి ప్రవేశము పొడుగు మానిసి, ఎఱ్ఱని రంగు జరీ తలపాగా, గర్వపు జూపులు అదలింపుమాటలు వచ్చినదే వైయాకరణత్వము ప్రకటింపఁబూనును 'విచ్చిం గలువలు'' సూత్రమేమి రాధాకృష్ణయ్యా! జల్దీ చెప్పు!'' రాధాకృష్ణయ్యకు దెనుఁగులో శక్తి రక్తిపూజ్యము 'అదేఙ్గుణః''అని కేక

వేసి గుఱ్ఱాలున ప్రక్కనుండు బాలునిపై గూర్చుండును “ఎంత బాగా చెప్పినాడండీ! జవాబంటే అట్లుగదా యుండవలయును ఆహా ఆహా! సొయైన సూత్రము సంస్కృత ఫక్కీని చెప్పినాడు

‘చూచితిరా! జానకి రామయ్యగారూ! నా బాలుని దోరణి” అని కుప్పయ్యంగారు జయధ్వానము చేసి బిగ్గరగా నవ్వునపుడు పాపము జానకి రామయ్య యేమి చేయఁగలడు? మహా విద్వాంసులు మెచ్చుకొనిరి తనకా ‘తల యిది ‘తోక యిది యని తెలియదు ‘అవునండి! మా బాలురు బాగుగా ఉత్తర మిచ్చుచున్నారు” అని కొంతసేపు ‘అదేఙ్గుణః” ‘వృద్ధిరాదైచ్”, ‘అకస్సవర్ణేదీర్ఘః’ల నాలించి యాందోళన చెంది వెళ్లుచుండెడివారు జానకిరామయ్యగారి క్లాసు విడిచిపెట్టినదే చాలును మా పంతులవారి దుర్భాషా ప్రయోగము మా పైన జడివాన కురిసినట్లు పడకపోవు

‘పరీక్షా సమయములో వీరిని సూపరింటెండెంటుగా, బెట్టిరేని ప్రతివాఁ డెట్లు వ్రాయుచున్నాఁడో యని చూచి సదుత్తరముల సలహాల నిడి వారి చెవిలో నూఁదుచుఁ దిరుగుచుండును చక్కఁగా నుత్తరములు వ్రాయు వాని కాగితములు తీసికొని మొద్దన్నల బల్లమీఁద రహస్యముగాఁ బెట్టి “నకలు త్వరలో తీయరా-కొడకా!” యని సహాయముచేయుటయుఁ గలదు ఈ విషయమై వీరితో నే హెడ్మాష్టరుఁ బోరాడి గెలువఁ జాలఁడాయెను

“ఏమండీ! ఈ వెధవ పరీక్షలు! నా బాలుడు ఫెయిల్ అవుతూంటే నే నూరక చూచుకొని యుంటానా యేమి? ప్యాసైన వెనక వారిని దిద్దుకొంటాము ‘ఉక్తలేఖనములో వచ్చు చిక్కులు ర, ఱ లు శ స లు చదివితినంటే బండి ‘ఱ’ ‘శ వర్ణము కొడుకులారా! మామూలు రెండుసార్లు చదివితినంటే మామూలు ‘ర’, ‘స కారమున్నూ వెధవల్లారా!” అని సూత్రధారిత్వము చేయును

"మా హెడ్‌మాస్టరులలో నగ్రగణ్యు లనదగినవారలు భాష్యం అయ్యంగార్లు! అరవాయన శిక్షా పద్ధతులలోఁ బొరంగ తుఁడు మంచివాఁడు నే నెపుడైన శ్రమ కోర్వఁజాలక యాట విడుపు దినముఁ గోరి కుప్పనయ్యంగారితో మొఱబెట్టుకొంటిమేని, 'అలాగే రేపు సెల విప్పిస్తాను అని చెప్పి తత్క్షణమే ఆ మఱు నాఁడు మహావ్రతదిన మనియు బాలురకు సెలవిచ్చుట సంప్ర దాయ మనియు హెడ్‌మాస్టరువారితోఁ జెప్ప 'రజా గోరు దురు కుప్పనయ్యంగారి యందలి గౌరవభావమున భాష్యమయ్యం గార్లు ముసి ముసి నవ్వులతో నంగీకరింతురు ఇట్టివి కుప్పనయ్యం గారి పక్షపాత లీలలు

'మా పాచి విఘ్నేశ్వరుఁడు చిత్తూరునకుఁ బోవు రోడ్డు ప్రక్కన నెలకొల్పఁబడి యున్నాఁడు మేము పరీక్షలకుఁ జిత్తూరునకు బోవునపు డెల్ల జయసిద్ధికై మ్రొక్కుకొనుట యా దేవునికే ప్యాసైనయెడల టెంకాయలు గొట్టి కర్పూరము వెలిఁగించుటయు, దప్పిన యెడల స్వామినిఁ దిరస్కరించుటయు మా పద్ధతులు

"నాకు చాల మంచి స్వామి, నే నెప్పుడు పరీక్షలలో నోటమి చెంద నందున"

ఆనాటి యుపాధ్యాయుల ప్రకృతి, విద్యా పద్ధతి తెలిసి కొనుట మంచిదికదా! మనరెడ్డి చెప్పగా మిగిలినది విచారిం తము రెడ్డి చదువుకొను కాలమున ఆ పాఠశాలకు ప్రధానోపాధ్యా యులు సి భాష్యమయ్యంగారు వారు గొప్ప ప్రధానోపాధ్యాయు లలో నొకరు చదువు చెప్పుటలోను విద్యార్థులను క్రమశిక్షలో నుంచుటలోను దక్షుఁడు 'నేను అయిదువందలమంది పిల్లల తండ్రిని!' అని ఆయన సగర్వముగా చెప్పుకొనుట కద్దు పరిశుభ్రత ఆయనకు ప్రాణము మలిన వస్త్రధారులగు విద్యార్థులను కన్నదే తడవుగా 'మంచి దుస్తులను ధరించి మరి బడికి రావలసిన దని యిండ్లకు పంపెడువా డాయన ఆయన యెంత దయార్ద్ర హృదయుఁడో

యంత కఠినుడుగాగూడ గనిపించెడువాడు తప్పు చేసినవిద్యార్థు లను శిక్షించుటలో నాయన బెత్తము నిర్విరామముగా విహరించె డిది 'దండం దశగుణం భవే' త్తన్నది నాటి మాట బెత్తముతో గొట్టుట చెవులు మెలిపెట్టుట నాటి శిక్షలు ప్రశ్నములకు తత్ క్షణము సదుత్తరము లీయగల విద్యార్థులు తోడివారిలో నగ్రేసరు లగుచుండుట ప్రోత్సాహకరముగా నుండెడిది ఒక విద్యార్థి యడి గిన ప్రశ్నమునకు సమాధాన మీయలేనివాడు దిగువకు పోవలె ఇట్లాగాలవు విద్యార్థులలో ప్రబలెడు విద్యామాత్సర్యము మహోత్సాహహేతువై దీపించెడిది

చిన్నతరగతులకు చదువుచెప్పు నుపాధ్యాయు లెవరైన బార శాలకు రానినాడు పెద్దతరగతులలోని విద్యార్థులా యుపాధ్యాయు లకు బదులుగా పాఠములు బోధింపవలసియుండెడిది ఇదియును విద్యార్థుల కుత్సాహకరముగా నుండెను

వివేకము, సత్ప్రవర్తనము గల విద్యార్థులలో నుత్తము డయిన వాడు తరగతిపెద్ద తక్కిన పిల్లల కాతని నడవడి యాదర్శ ప్రాయము

ఈ పాఠశాలలోని మెట్రిక్ విద్యార్థులు ప్రెసిడెన్సీలో తఱ చుగా ప్రథమశ్రేణిలో నుత్తీర్ణు లయ్యెడివారు

మన రామలింగారెడ్డి ఆకారముచేతను తెలివితేటల చేతను గూడ ఎల్లరను ఆకర్షించెడివాడు దృఢగాత్రుడై ఉంగరాలు తిరి గిన జుట్టుతో ముడిమీద టోపీతో చూపరకన్నుల నరికట్టి, ఇంగ్లీషులో మంచినీళ్ళప్రాయముగా మాటలాడుటతో, తెలుగులో పద్యాలు నల్లే చెప్పుటతో కర్ణపర్వము గావించెడివాడు

ఆరవఫారము చదువుచుండగా ఆనిబిసెంటు దివ్యజ్ఞాన సమాజ మాయన నాకర్షించినది ఆ బోధములలో పడి పాఠాలు సరిగా చదువకున్నను పరీక్షకు ముందొక నెలనాళ్ళు మాత్రమే నిగ్రహముతో జదివి, 1896 వ సంవత్సరములో ఆయన ఉన్నత

పాఠశాలా పరీక్షలలో ఉత్తీర్ణత నందినాడు. ఈ హైస్కూలుపై ఆయనకు మంచియభిమాన ముండెడిది 1924 వ సంవత్సరములో పూర్వవిద్యార్థి సంఘమున కధ్యక్షుడయినాడు తన గ్రంథాలయము లోని గ్రంథాలను కొన్నింటిని ఈ పాఠశాలకు ఇచ్చెడివాడు పాఠశాలోపాధ్యాయులును ఆయన నెంతో అభిమానించి ఆదరించెడివాడు అచట చదివిన యెల్లరిలో విశ్వవిఖ్యాతు డతడే కదా!

# కళాశాలలో

19 వ శతాబ్దములో ఆంధ్రదేశమున బందరు రాజమహేంద్రవరాలలోనే తప్ప మరి ఎక్కడను కళాశాలలు లేవు మద్రాసులో క్రైస్తవ కళాశాల ప్రెసిడెన్సీ కళాశాల పచ్చయప్ప కళాశాల ఆనాటి కళాశాలలు అందులో క్రైస్తవ కళాశాల చాల ప్రసిద్ధిగాంచినది మన ఆంధ్రనాయకులలో కొండా వెంకటప్పయ్య కాశీనాథుని నాగేశ్వరరావు, పట్టాభి సీతారామయ్య ప్రభృతులు అక్కడ చదివినవారే

రామలింగారెడ్డి 1897 వ సంవత్సరములో క్రైస్తవ కళాశాలలో ప్రవేశించినాడు ఆకాలములో చిత్తూరు వెనుకబడినది గాన అక్కడ విద్యాప్రోత్సాహమునకుగాను చిత్తూరు విద్యార్థులకు విద్యార్థి వేతనమునకై క్రైస్తవకళాశాలలోచేరుటకు అవకాశము కలిగినది అట్లుకాకపోయినట్లయిన ఆయన ప్రెసిడెన్సీ కళాశాలకు పోవలసి వచ్చెడిది ఆయనకు అది సుతరాము ఇష్టములేదు

క్రైస్తవ కళాశాలకు డాక్టరు మిల్లరు అధ్యక్షుడు (ప్రిన్సిపాల్) ఆయన స్కాట్లండ్ దేశీయుడు "మిల్లరు దొరగారు పొడవును పొట్టియును గాని నడితరము ఎత్తు గలిగి, లావును గాక, సన్నమును గాక తగినంత దృఢకాయము గలిగి, గుండ్రని ముఖమున,

ముచ్చటగొలుపు మీసములతో శోభిల్లుచుండెను ఆయన కను బొమ్మలపై వెండ్రుకలు ఇంచుక దట్టముగ పొడవుపెరిగి కోపము వచ్చినప్పుడు ముడిపడుచుండెను గంభీరవగు వారి ముఖార విందము చూచినంతనే గౌరవము కలుగు చుండెను కళాశాలలో షేక్స్పియరు పాఠము తప్ప మరియే పాఠము చెప్పెడివాడుక లేదు విద్యాశాలలో చదువు రెండు వేల మంది విద్యార్థులలో ప్రతివానిని పేరుపెట్టి ఎలువనేర్చెగి ”

(కొండా వెంకటప్పయ్యగారి స్వీయచరిత్ర 67 68 పుటలు)

డాక్టర్ మిల్లరు సుగుణవంతుడే గాక సునిశితమైన బుద్ధి వైశద్యము గలవాడు విద్యార్థుల గుణగణాలను గమనించుటలో ఆయనకు ఇయనే సాటి బుద్ధిమంతులే కాదు అల్లరిపిల్లలును ఆయన ప్రేమకు పాత్రులే రామలింగారెడ్డికూడ ఆయన దృష్టిలోనికి వచ్చుట ఈ క్రింది ఘటనవల్ల జరిగినది

అక్కడ విద్యార్థులలో బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు వేరువేరుగ వసతిగృహములు ఉండెడివి రామలింగారెడ్డి బ్రాహ్మ ణేతర వసతిగృహాలలో రెండవ రూములో ఉండెడివాడు 1897 వ సంవత్సరములో బాలగంగాధర తిలకుగారిని రాజద్రోహాపరాధము క్రింద శిక్షించినారు విద్యార్థి పెద్ద తిలకుగారి పటము తెచ్చి వసతి గృహాపుభవనములో ఉంచినాడు ఆ హాలులోనే డాక్టరు మిల్లరు అధ్యక్షతను ఒక సభ జరిగినది ఆయన తిలకు ఫోటో చూడగానే కోపోద్రిక్తుడై దీనిని ఇక్కడకు పెట్టిన దెవ రని ప్రశ్నించినాడు ఎవరును మాటాడలేదు అంతట రెడ్డి ఆత్మాభిమానముతో ‘మే మందరము కలిసియే ఇక్కడ ఉంచితిమి అన్నాడు అప్పు డాయన అసహ్యముతో ఇట్లు అన్నాడు ‘రామలింగారెడ్డిగారికి తిలకుగారియందు అంత అభిమాన మున్నచో ఇంతమంది కలసి పెట్టనేల? ఆయన ఒక్కడె కొని ఇయ్యగలడే!’’

మరుదినమున డాక్టరు మిల్లరు రెడ్డిని కళాశాలలో కౌగిలించుకొని బుజ్జగించినాడు "డాక్టరు మిల్లరు మాకు ప్రథమముగా స్వపరిపాలనవిద్య గరపినాడు మా సంస్థలను సంఘాలను మా అంతట మేమే పరిపాలించుకొనునట్లుచేసినాడు మమ్ములను ఆయన విద్యావంతులనుగానేకాదు, మనుష్యులనుగా తయారు చేసినాడు క్రైస్తవకళాశాలలో ఆయన పెంచిన సంప్రదాయము చాల గొప్పది" అని రెడ్డి తన కళాశాల స్మృతులలో డాక్టరు మిల్లరును ప్రశంసించినాడు

ఆ కళాశాలలో ద్వితీయుడు వృద్ధుడయిన కూపర్ కాని కళాశాలలో రెడ్డిని ఆకట్టిన మహనీయుడు డాక్టర్ స్కిన్నర్ ఆయన ఎంతో హృదయ నైర్మల్యము గల పవిత్రుడు ఆయన గొప్పతనము మాటలలో చెప్పుటకు వీలుపడదు మాటలలో చెప్పజాలనిది మౌనమే వచింపగల దన్నాడు రెడ్డి

"Silence is the only tribute that I can offer

ఆయన వంగదేశ విభజన సంబంధమైన జాతీయోద్యమమును ఆహ్వానించి ఆనందించినాడు ఆయన దానిని నైతికోద్యమముగా స్వీకరించుటేకాదు, భారతదేశమును భవ్యమైన రీతిని భావించి ప్రేమించినాడు

రెడ్డికి అటువంటి మహానుభావునివద్ద తత్త్వశాస్త్రము అభ్యసించెడి భాగ్యముకలిగినది ఆయన గొప్ప శిక్షకుడు, ఎల్లల ప్రేమను చూరగొన్న భయంకరుడు తనకు ప్రియమైన తత్త్వశాస్త్రమును చదువుమని రెడ్డిని ప్రోత్సహించినాడాయన పట్టపరీక్షయందు ఆ శాస్త్రములో గూడ ఉత్తీర్ణుడైన రెడ్డిని తర్వాత విద్యార్థి వేతనముతో ఇంగ్లాండునకు పంపించినాడు

ఆ శిష్యవత్సలుడు కేంబ్రిడ్జినుండి రెడ్డి తనకు వ్రాయు ఉత్తరాలను బి ఏ తరగతి విద్యార్థులకు వినిపించి ప్రోత్సాహము కలిగించెడివాడు

ఆయన అర్ధాంగి అంతకంటెను ఉత్తమురాలు స్త్రీ జాతి సహజము లయినఅన్ని లలిత గుణములను పుంఖానుపుంఖములుగ ఆమె లోవెలిసినవి ఆమె మృదు మధుర హృదయమును జీవితములో మరువజాలనని కళాశాల స్మృతులలో కమనీయముగా వ్రాసి కొన్నాడు రెడ్డి

ఇక రెడ్డికి చరిత్ర బోధించిన గురువు కెల్లెత్ మహాశయుడు ఒక సంవత్సరము కళాశాలవారు జనాభా లెక్క తీసికొన్నారు తరగతిలోని వారిని అందరిని 'మీ కుల మేమిటి? అని కెల్లెత్ ప్రశ్నించుచుండగా విద్యార్థులు తమ తమ కులములను చెప్పు చున్నారు తనవంతు వచ్చినప్పుడు 'నేను ఆదిమవాసిని' (Aborginee) అన్నాడు రెడ్డి విద్యార్థు లందరు విస్మితు లయినారు నీవు ఆదిమవాసినని చెప్పుకొనుటకు కారణమేమి?' అని కెల్లెత్ తిరిగి రెడ్డిని ప్రశ్నింపగా ఆయన ఇట్లు చెప్పినాడు 'తాము బ్రాహ్మణులమని బ్రాహ్మణేతరులమని ప్రజలు ఎట్లు చెప్పగలరో నాకు తెలియకున్నది వేలకొలది సంవత్సరాలనుండి సహస్రాధిక సంఘములు కలసి మెలసి జీవించుచున్నపుడు రక్తము ఈ కృత్రిమ కులాలలోనే జీవించుచున్నదా?"

రెడ్డి విద్యార్థి జీవితములో ఈ క్రింది సంఘటన ఆయన నిశిత బుద్ధికి నిదర్శనము

డాక్టర్ కెల్లెత్ ఇంగ్లీషు తరగతిలో ప్రతి విద్యార్థిని ఇంటి దగ్గర వ్రాసితెచ్చిన ఇంగ్లీషు వ్యాసమును చదువవలసినదని అడిగి నాడు రెడ్డి వ్యాసము వ్రాయనేలేదు కాని తన వంతు రాగానే చిత్తుపుస్తకముతీసి దానిలో నుండియే వ్యాసము చదువుచున్నట్లు గడగడ చదువసాగినాడు

కాని పేజీలుమాత్రము త్రిప్పలేదు అందరు నది గమనించు చునేయున్నారు అయినను వాస్తవము తెలియుటకా నోటుబుక్కు తన కీయవలసినదిగా కెల్లెత్ కోరినాడు ఆయన సత్యము గ్రహించి

రెడ్డి శక్తిసామర్థ్యాలను ప్రశంసించి నవ్వినాడు రెడ్డి తాను భంగపడట్లు భావించినాడు

మరొక సంగతి ఇంత ప్రతిభావంతుడైన రెడ్డికి లెక్కలలో మార్కులు వచ్చునవికావు ఆయనకు ఆల్జిబ్రా ట్రిగ్నామెటరీలనగా ఇష్ట ముండెడిది కాదు జామెట్రీ కొంతవరకు ఇష్టమైనదే గణిత శాస్త్రాధ్యాపకుడగు ప్రొఫెసర్ వెంకటసుబ్బయ్య యఫ్ ఏ తరగతిలో ఆయన నెలాగున నైన నెగ్గింపవలెనని ప్రత్యేకశ్రద్ధ తీసికొన్నాడు రెడ్డిని తనయింటికి పిలిపించి ఉచితముగా గణితము చెప్పటయేకాక కాఫీ వగైరా లిచ్చి మచ్చిక చేసికొనెడివాడు ఇట్లా యధ్యాపకుడు మూడు నెలలపాటు రెడ్డిపై ప్రత్యేక శ్రద్ధ తీసికొన్నాడు ఆయన అలాగు చేయకపోయెనా గణితము గుంట పెట్టి గంటవాయించెడిదే! అని రెడ్డి చెప్పుకొన్నాడు అలభ్యము అప్రీతము నయిన యా విషయములో గూడ రెడ్డికి ప్రథమశ్రేణిలో విజయము గలిగించినాడా అధ్యాపకుడు ఆ నాటి యుపాధ్యాయులు శిష్యులయెడల చూపెడి శ్రద్ధా, ప్రేమతత్పరతలకు ఇది యొక నిదర్శనము

'సమర్థ రంగయ్య సెట్టిగారు ఉపభాషా విద్యలకు విచారణ కర్తలు వారు మృదు వాత సరస వాక్ప్రగల్భులు విద్యార్థులను సంబోధించునపుడు 'న' కార ప్రయోగమెన్నడును చేసినవారు కారు

'మీరు 'దయచేయండి 'తమ విషయ మెఱుగుదును' ఇత్యాది రీతుల మమ్ము మన్నించువారు అట్టి తరుణముల మా మనస్సులయందు స్వచ్ఛందముగ జనించు వినయము, స్నిగ్ధపూజ్య భావము ఇట్టి వని చెప్పరాదు శ్రీ సెట్టిగారును శాస్త్రిలవారు (వేదం వేంకటరాయ శాస్త్రిలు గారు) విద్యార్థులను మంచి మార్గములకు ప్రేరేపించు సహజశక్తి గలవారు ఆచార్యుల కుండవలసిన ఉత్తమగుణములలో నిది యొకటి ఈ కళయందు వీ రిద్దరును అసామాన్యులు"

వేదం వేంకటరాయశాస్త్రులుగారు క్రైస్తవ కళాశాలలో సంస్కృతాధ్యాపకులు వారి యొద్ద జదువుకొన్నవాడు గాకున్నను 'నేను వారికి శిష్యుడనే' యని చెప్పుకొన్నాడు రామలింగారెడ్డి "నేను క్రైస్తవ కళాశాలలో 1897 వ సంవత్సరము మొదలుకొని 1902 వ సంవత్సరము వరకు విద్యార్థిగా నుండేడు వాడిని నేను తెనుగు తరగతిక చెందినవాడ నయినను చెన్నాటి నుండియు వారి దర్శన గౌరవమును సల్లాప భాగ్యమును నాకు లభించినవి ఆ కాలమున నా కాలేజీలో 'ఆంధ్ర భాషాభి రంజని' యను పేర తెనుగు సమాజ మొకటి యుండెడిది దాన నే నొక సభ్యుడను ఏటేట రెండు మూడు పర్యాయములు వచ్చి ఆ సమాజమును ఆదరించు గొప్పవారిలో (శ్రీ) శాస్త్రులవా రొకరు వీరి రచన మృదుమధురము హాస్యరస శోభితము"

చిన్నతంబూరి యను మరి యొక యధ్యాపకుడును మన రెడ్డి నభిమానించువాడు, ఆయన మన కథానాయకుని గూర్చి యీ నాడన్న మాట లివి 'A very attractive but uuruly young man' మిక్కిలి యాకర్షణీయు డయ్యును శాసింపరాని యువకుడు అని యీ మాటల భావము

రూప గుణాదికముచేత నిట్లు క్రైస్తవ కళాశాలలో నధ్యాపకుల హృదయములలో బీరము వెట్టుకొన్న రెడ్డి సహవిద్యార్థుల నాకర్షించుట యేమి వింత! సుప్రసిద్ధ దేశభక్తులు గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగా రా కాలమున నా కళాశాలలోనే చదివి నారు ఆయన యితని నెంతయో ప్రేమించియుండెను రెడ్డికిని ఆయన యందు గల ప్రీతి అపరిమితము కనుకనే యీనాడు తాను రచించిన 'ముసలమ్మ మరణము' అను కృతి నతడు ప్రచురణాధికారముతో హరిసర్వోత్తమరావుగారి కిచ్చినాడు

# ముసలమ్మ మరణము

ఇది యొక గద్య పద్యాత్మక లఘు కావ్యము దీనిని రెడ్డి 1899 వ సంవత్సరములో క్రైస్తవ కళాశాలలో చదువుచుండగనే రచించినాడు ఆ కళాశాలకు సంబంధించిన శ్రీ మదాంధ్ర భాషాభిరంజనీ సమాజపోషకు లగు సమర్థి రంగయ్య సెట్టిగారు నవ్య కావ్య రచయితలకు ప్రోత్సాహము నిచ్చుటకై పెట్టిన పోటీలో బహుమతి గెల్చుకొనుటకై రచింపబడిన దిది

అప్పుడు పోటీకి వచ్చిన కావ్యము లన్నిటిలో నిదే యుత్తమ మని బహుమతి నిర్ణేత లభిప్రాయపడిరి ఆ నిర్ణేతలలో విమర్శకాగ్రేసరులు వేదం వేంకటరాయశాస్త్రులవా రొకరు ఆ విద్యార్థి దశలోనే రెడ్డిలోని భావి ప్రతిభాస్ఫోరకము లయిన చిహ్నములను గమనించి ప్రోత్సహించిన పెద్దలలో వా రొకరు రెడ్డి 'కవిత్వతత్త్వ విచారము అను ఉద్గ్రంథమునకు బీజప్రాయముగా కళాశాలలో చదువు దినములలోనే అతడు రచించి వినిపించిన కళాపూర్ణోదయ విమర్శన వ్యాసమును సావధానముగా అధ్యక్షపీఠమునుండి విని, గుణదోషములను వివరించి 'అత్యుక్తిదోషమును సవరించుకొన్న నీవు మంచి విమర్శకుడ వగుదు వని ప్రోత్సహించినవారును వారే

పందొమ్మిదేండ్ల యీడున రెడ్డి కవితాధార యెట్లుండెడిదో తెలిసికొనుటకు 'ముసలమ్మ మరణము లోని యీ క్రింది పద్యము గమనింపదగును

చలదుత్తుంగ మహోగ్రభంగ పటలీ
సంఘట్టనారావ ము
జ్జ్వల కూలాగ్ర నటత్తరంగ రవ మం
చన్మధ్య భాగ్భూమి భృ

తక్కల సంపాతి మహోర్మికానికర ని
ర్ఘోషంబునుం గూడఁగా
నలరున్ ఘోర సరస్సు దిగ్విదళన
వ్యాపార పారీణమై

ఒక్క శైలిలోనే కాదు సర్వకావ్యగుణములలో నిది కవి నానాగు మీసాలవాడైనను ప్రౌఢుడని చాటునదిగా నున్నది కానిచో వేంకటరాయ శాస్త్రిలవారి యామోదమును బడయ గలదా మరి!

ఈ కావ్యము విషయమైన ప్రశంస యీతని రచన సామర్థ్యమును గూర్చిన ప్రత్యేకముగా ముచ్చటించుకోగలము ఇతివృత్త స్వీకర ణములో కథా కథనరీతిలో పాత్రపోషణాదికములో సర్వథా ఇది యొక నూత్నమార్గమున నడిచెనని చెప్పుట యిప్పటికి చాలును

పువ్వు పుట్టగనే పరిమళించు నన్నట్లు సాహిత్యాధ్యయ నములో నుండగనే రెడ్డి రచించిన యీ కావ్య మితని భవిష్య దున్న తిని సూచించునదిగా పొలుపుమీరినది

ఒక్క కవిత్వ శక్తిచేతనే కాదు విమర్శన ప్రాభవము చేతనే కాదు వక్తృత్వ విభముచేతనేకాదు స్నేహశీలము చేతనే కాదు జనాకర్షము లగు ఎల్ల శక్తులచేతను ఇత డా కాలముననే అనన్య సామాన్య ప్రజ్ఞా ధురీణుడుగా మెరసినాడు నాటియీయన ప్రాగల్భ్యమును గూర్చి 'ముసలమ్మ మరణము'లో హారి సర్వోత్తమరావుగా రిట్లు పేర్కొన్నారు

"శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి నాకు జ్యేష్ఠ సోదరుడు నా యందలి ప్రేమతో కొంతకాల మతడు నన్ను సీనియర్ జ్యేష్ఠుడని వ్యవహరించినను అతడు క్రైస్తవ కళాశాలలో బి ఏ పట్ట పరీక్షయందు చరిత్రలో చేరి డబుల్ డిగ్రీకొరకు- దుశ్శాలు



పట్టభద్రుడుగా

వలకొరకన్నమాట తత్త్వశాస్త్రము చదువుచు ఉపన్యాస వేదికల మీద ఇంగ్లీషు తెలుగు రెంటిని అనర్గళముగా వెలువరించుచు ప్రసంగించు దినములలో నేను ఆ కళాశాలయందు ప్రవేశించి ఇతని యంతటివాడను నే నెప్పు డగుదునో! యని నోరూర్చు కొనుచు నొసటిమీది ఆ పెద్ద మచ్చమీదను అతని ముఖము మీదను తదేక ధ్యానముగా దృష్టి నిలిపి అతనిని రమారమిగా ప్రేమించితిని ”

1902వ సంవత్సరములో బి ఏ పరీక్షయందు తీర్ణుడై తత్త్వశాస్త్రములోను అర్థశాస్త్రములోను ప్రెసిడెన్సీలో జయ మొంది బంగారు పతకములను ఇతర బహుమానములను పొంది నాడు రెడ్డి బైబిలులో గూడ బంగారు పతకము పొందుట ఆశ్చ ర్యములలో నెల్ల ఆశ్చర్యము

తన పురోభివృద్ధికి వలసిన బీజావాపన మంతయు ఈ చెన్న పుర క్రైస్తవ కళాశాలలోనే జరుగుట రామలింగారెడ్డి యెన్నడును మరువలేదు కళాశాలా శతవార్షికోత్సవ సంచికలో తన పూర్వ స్మృతుల నుల్లేఖించుచు మద్రాసు క్రైస్తవ కళాశాల విద్యార్థి వేతనములమీద బ్రతుక లేదనియు, మిషనరీ జీల్–మానవతమీద వర్ధిల్లుచున్నదనియు ప్రాచీనవిద్యా పీఠమువలె విరాజిల్లుచుండుట చేతనే అది మద్రాసు కళాశాలలో అంత ప్రశస్తి పొందినదనియు వ్రాసినా డాయన

## ముసలమ్మ మరణము

ఇది మరణము కథాప్రారంభం నుండి తుదివరకు ప్రాతక్రొత్తల మేలి కలియిక అల్పమైన కథను కవి తన శక్తి సామర్థ్యాలచే పెంచి చక్కగా పోషించినాడు ప్రాచీన కావ్యసద తీని అనుసరించి కావ్యాదిని ఈశ్వరస్తుతి శారదాస్తుతి భాస్కర స్తుతి చేసి ఈ నవకవి పూర్వకవి స్తుతి ప్రారంభించి అందు తిక్కనను సూరనను, వేమనను కీర్తించినాడు తర్వాత ఈ కావ్యరచనకు

ప్రోత్సాహ మిచ్చిన రంగయ్యసెట్టిని ప్రస్తావించి తన తండ్రిని స్మరించి కృతిస్వామిని ప్రశంసించినాడు ప్రాచీన కవులవలెనే ఆశ్వాద్యంత పద్యములు ప్రత్యేకముగా గూర్చినాడు

ఇందలి ఇతివృత్తము 'అనంతపుర చరిత్రము నుండి తీసికొనబడినది 'ముసలమ్మ' అను యువతి ప్రజల హితముకొరకై ఆత్మత్యాగముచేయుట ఈ యువకవికి ప్రశంసాపాత్రమైనది ఆమె త్యాగశీలమును అభివర్ణించుననదే ఇందలి కథాంశము కథాకథనముతో పాటు చక్కని వర్ణనలతో కూడిన ఈ చిన్ని కావ్యము- Poetry is painting-కవిత్వము వర్ణచిత్రము అను నిర్వచనమునకు సరితూగు శబ్దచిత్రమై పాఠకుల కన్నులగట్టును

కన్నెఱ్ఱ వాఱిన ఖరకరోదయ కాల
మల్లన క్రుంగు జాబిల్లి యనఁగ
జ్వాలదగ్ని శిఖలపై నెలనవ్వుతోఁ బోవు
ధాత్రీమహాదేవి తనయ యనఁగఁ
గెందామరల బారు సుందర మగు లీల
నల్లనల్లన ఁజొచ్చు నంచ యనఁగఁ
గాల మహాస్వర్ణ కారకుం డగ్నిలోఁ
గరఁగించు బంగారు కరణి యనఁగఁ
ప్రళయ కాలానల ప్రభా భాసురోగ్ర
రంగదుత్తుంగ భంగ సంఘాతములకుఁ
గలఁక నొందక, దరహాస మలర మంద
' మందగతిఁ బోయి, వొచ్చె నమ్మగువ నీట ॥

మన ఆంధ్రావనిలో స్త్రీల కచకుచములనే అధికముగా వర్ణింతురు గాని గ్రామీణ స్త్రీకి తగిన గౌరవము ఇవ్వనులేదు, స్త్రీలోని సహజ సౌకుమార్యమును సౌశీల్యమును గ్రహించను లేదు ఈ యువకవి ముసలమ్మను ఎంతముగ్ధమనోహరముగా చిత్రిం

చెనో కనుగొనుడు!

> లేఁగమై నాకుచు లీలమై మెడ మలం
> చిన గోవుఁ బిండెడు వనరుహాక్షి
> బొండు మల్లెల తోఁటఁ బువ్వులు గోయుచు
> వనలక్ష్మి యన నొప్పు వనజ గంధి
> బీద సాదల నెల్ల నాదరించుచుఁ గూడు
> గడుపారఁ బెట్టెడు కన్న తల్లి
> వ్యాధి బాధల నెవరైన నడల తెప్ప
> వేయక కాచెడు వినుత చరిత
>
> బిడ్డ లెల్లరుఁ దమవారి విడిచి చేరఁ
> జంక నిడికొని ముద్దాడు సదయ హృదయ"

పూర్వ కవులును వర్ణించినారు గాని చిత్రింపలేదు ఈ నవ కవి ఉన్నది ఉన్నట్లే గ్రామ జీవితమును కన్నుల గట్టునట్లు ఎంత మనోరముగా చిత్రించినాడో! ఇది మరొక నూతన గుణము

గ్రామ జీవితమును ప్రకృతి వర్ణనలతో మేళవించు కవిత్వము పాశ్చాత్య కావ్యములలో ప్రత్యేకత పొంది ప్రశస్తిని అందుకొన్నది అటువంటి వర్ణనచేసి కావ్యమునకు నవ్యత చేకూర్చినా డీ కవి కుమారుడు

> చెఱకుఁ దోఁటలఁజొచ్చి కొఱకి పాడొనరించి
> దొర లట్లు పోవు పందుల గణంబు
> నెండ్రకాయల కొఱ కేతెంచి గుంటి పై
> మెక్కి కూసెడు గుంటనక్క గములు
> బడుగు బక్కలు గాక కడుపారఁ దిని పంది
> గున్నలతో రాయు గొఱియ పిండుఁ
> బొలముల లేఁ బచ్చికల మేసి చియ్యాచే
> నిగనిగలాడు గో నికరములును

గలకలారావములు మీాఱఁ గలిసి జొన్న
చేలపై వ్రాలు గువ్వల చెలువుఁ గలిగి
పైరు పచ్చల నొప్పు నా పల్లె చెలువు
నిండి నీరంబు లొసఁగుచు నుండ నెపుడు

ఇంక ఈ కవి తెచ్చిన మార్పులను గనుగొందము మన సంప్రదాయానుసారముగ కావ్యము శుభాంతముగా నుండవలెను ఈయన మరణాంతముగా రచించినాడు కృత్రిమకల్పనలతో నైన కావ్యము సుఖాంతమగునట్లు సంస్కరింపవలసిన దని ప్రాచీన సంప్రదాయ ప్రియులు ఈ కవిని కోరినారట! తాను నమ్మినది మంచిదని తలచినప్పుడు వారెని వీరెనేకాదు ఘాలాతునే లక్ష్య పెట్టనివాఁడు రెడ్డి మొగమోటమికి లొంగి వారు చెప్పినట్లే మార్పుచేసి యున్నట్లయిన, కావ్యశోభ గంగలో గలిసెడిది ఇంతే కాదు మరణాంతములన్నియు అమంగళాంతములుగలు గానే ఎంచు కొనుట అవివేకము ఆ మరణము లోకశ్రేయస్సు నిమిత్తము జరిగినదైనచో అది మంగళమే. అట్టిదానితో అంతమయిన కావ్య మును మంగళాంతమే ముసలమ్మ గ్రామశ్రేయస్సునకై తనువును త్యజించిన వీరవనిత ఆమె ప్రాణత్యాగముచేతనే బుక్కసముద్ర మండలి గ్రామస్థులకిందరికి క్షేమము సంఘటించినది కనుక ఈ కావ్యము మంగళాంతమే ఈ ధర్మసూక్ష్మమును సంప్రదాయికులు గుర్తింపరైరి ఈ కళాధర్మమును ఎరిగి కథకు ఈ పరిణామమును కలిగించి ఆంధ్రకావ్య సరణిలో ఒక నికత్వమును తెచ్చినవా డైనాడు రెడ్డి

మనలో నాయికకావ్యములు వ్రాసినవారు లేకపోలేదు అయినను వానిని లోకకల్యాణప్రద ములుగా నిర్వహించినవారిలో రెడ్డియే ప్రథముడు కాబట్టి గుణసంపదనుబట్టికూడ ఈ కావ్యము గొప్పది

కావ్యప్రయోజనములలో అధికముగా పాటింపబడునది మనోరంజనమే అవాంతర ప్రయోజనము సదుపదేశకత 'ఉపదేశయుజే" అని మన ఆలంకారికు లన్నారు

విమర్శకాగ్రేసరు డగు మేథ్యూ ఆర్నాల్డుకూడ "కవిత్వపు సూక్ష్మవిశ్లేషణము భావాలను మిగుల నేర్పుతో జీవితమునకు ఉపయుక్తముగా చేయుటయే అదే గొప్ప కవిత్వము ఉత్తమభాషలో సత్యమును చెప్పాటే కవిత్వ" మన్నాడు

సాంఘికేతి వృత్తముఁ గల కావ్యము గనుకనే ఇది నూతన కవితా స్వాతంత్ర రీతులకు దృష్టాంతరముగా ఆనాడు పేర్కొనబడినది

అన్నిటికంటె అధికమైన మరొక గుణము కరుణ రసపోషణము ఈ రసములలో నిపుణు డనిపించుకొన్నా డీయన

స్త్రీలోకమునకు ఈ ఖండకావ్య ద్వారమున ఒక ఉన్నతాదర్శమును అందించినవాడు గూడ నయినాడు

ఇన్ని విశేషము లుండుటచేతనే ఈ కావ్య మానాటి పోటీలలో ప్రథమ బహుమతి నందినది రెడ్డికవి బాలుడైనను ప్రౌఢుడే అని తలలూపినారు రసజ్ఞులు

# కేంబ్రిడ్జిలో

ఆంగ్ల దేశములో ఆక్సుఫర్డు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలు అతి పురాతనమైన ప్రసిద్ధ విశ్వవిద్యాలయములు

పట్టభద్రుడైన మన రెడ్డియొక్క మేధాశక్తికి ఆశ్చర్య భరితమై భారత ప్రభుత్వము సంవత్సరమునకు రెండు వందలపౌనుల విద్యార్థి వేతనమును ఇచ్చినది దానితో మన రెడ్డి ఆంగ్ల దేశమున కరిగి కేంబ్రిడ్జిలోని సెయింట్ జోన్సు కళాశాలలో ప్రవేశించి నాడు అక్కడ గూడ ఆయన ప్రతిభ దేదీప్యమానముగా ప్రకాశింప సాగినది ఆ కళాశాలలో రెడ్డి ప్రదర్శకుడు (Exhibitioner) గా ఉన్నాడు 1903 వ సంవత్సరమున ఆయన తెలివితేటలకు, సామర్థ్యమునకు 'రైట్ బహుమానము లభించినది 1904 వ సంవత్సరములో ఆయన ఆ కళాశాలలో విద్వాంసుడు (Foundation Scholor of St John s college) గా ఎన్నిక గాంచినాడు 1905 వ సంవత్సరములో కేంబ్రిడ్జి యూనివర్సిటీ లిబరల్ క్లబ్ కార్యదర్శిగా ఎన్నికైనాడు

ఇంగ్లాండులో 1905 వ సంవత్సరములో పార్లమెంటు ఎన్నికలయినవి రెడ్డి కేంబ్రిడ్జి యూనియన్ క్లబ్ సెక్రటరీగా 100 సభలు ఏర్పాటుచేసె లిబరల్ పార్టీకి అనుకూలముగా బ్రహ్మాండమైన ఉపన్యాసా లిచ్చినాడు ఆయన ఉపన్యాసములకు శ్రోతలు వేలకొలదిగా వచ్చెడివారు ఆంగ్ల దేశములో ఆయన అనర్గళాంగ్ల భాషా ప్రవాహము వక్తృత్వనైపుణి ఆంగ్లేయుల ప్రశంసలను అందుకొన్నవి ఆ రాజకీయ పరిజ్ఞానము ఆ శక్తి సామర్థ్యాలు గమనించిన ఆంగ్లేయులు 'అయ్యో! రెడ్డి భారతీయుడై పోయినాడు లేనిచో బ్రిటనునకు ప్రధాని అయ్యెడివాడు కదా! అనుకొనెడివారు.

ఇట్లు రెడ్డి అక్కడి ఎన్నికలలో పాల్గొనుచేగాక మన రాజకీయాలలోగూడ ప్రవేశించినాడు 1905 వ సంవత్సరాన కాంగ్రెసు సందేశము విని ఎంచుటకు సుప్రసిద్ధ భారతీయనాయకులు, గోఖలే, లజపతిరాయ్ ఇంగ్లాండ్ చేరి భారతీయుల ఆశయములను ప్రచారము చేయసాగినారు

1905 వ సంవత్సరపు ఎన్నికలలో లిబరల్ పార్టీ గెల్చినది దానిని పురస్కరించుకొని ఒక చోట సభ జరుగుచుండగా అందు గోఖలేగాని, లజపతిరాయ్ గాని పాల్గొను అవకాశము లేకపోయినది వారు మరొకచోటుకు వెళ్ళినారు సర్ వెడరబన్ అను ఆయన రామలింగారెడ్డిని తంతిమూలమున ఆహ్వానించినాడు అప్పుడు ఒక ఆంగ్లేయ మిత్రుడు 'విద్యార్థి వేతనమును ప్రభుత్వమునుండి పొందుచున్న నీవు కాంగ్రెస్ పక్షమున మాటాడుట మంచిదికాదు' అని రెడ్డిని హెచ్చరించినాడు 'విద్యార్థి వేతనము జీతముకాదులే! అని రెడ్డి ఆ మిత్రునికి సమాధానమిచ్చి సభకు వెళ్ళినాడు అమృతవర్షమువంటి ఉపన్యాసముతో సభ్యులను ఆహ్లాదపరచినాడు తర్వాత గోఖలేగారును వచ్చి ఉపన్యసించుట జరిగినది వారిని పత్రికా ప్రతినిధులకు పరిచితులనుచేయు భారము రెడ్డియే వహించినాడు

తర్వాత ఆయనను కేంబ్రిడ్జి యూనియన్ సొసైటీకి ఉపాధ్యక్షునిగా ఎన్నుకొనుట జరిగినది ఇంతవరకు అట్టి గౌరవము ఏ భారతీయునికి లభింపలేదు

ఈ యూనియనుకు ఉపాధ్యక్షుడైన వెనుకనే ఈయన కోరికపై గోఖలేగారిని ఆహ్వానించుట జరిగినది భారతీయుని ప్రేక్షకునిగా ఆహ్వానించుటయు ఇంతవరకు జరిగినదికాదు గోఖలేగారి ఉపన్యాసము సభ్యులకెంతో ఉత్సాహము కలిగించినది గోఖలేగారి గౌరవార్థము ఒక విందు జరిగినది ఎన్నో సాంఘికసమావేశాలును జరిగినవి,

రెడ్డి బారిస్టరు పరీక్షకు చదువవలెననుకొన్నాడు గాని ఆయ నను గోఖలేగారు యం ఏ పరీక్షకు చదువుమని ప్రోత్సహించి నారు ఆయన గోఖలేగారి మాట వేదవాక్యముగా భావించి అట్లే చదివి 1905 వ సంవత్సరములో చారిత్రిక విషయమున (Historical tripos) ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు

నాటి ఆంగ్ల విద్యార్థి మిత్రులు రెడ్డిని ఇట్లు ప్రశంసించు చున్నారు

## సుప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు సర్ జాన్ స్క్వైర్

"నా పందొమ్మిదవ యేట నేను చదువుకొను చోట అలంకరించుకొన్న రెడ్డి ఛాయాచిత్రము నేటికిని అట్లే శోభిల్లు చున్నది ఆనాటికే రెడ్డి వక్తృత్వ మేధాసంపదలచేత బర్కు అంతటి వాడుగా వెలుగుచున్నాడు కేవల వక్తృత్వముచేతను బుద్ధి కుశ లత చేతను మాత్రమె మానవుడు ప్రేమపాత్రుడు గాడు అతడెంతో గౌరవాభిమానములకు పాత్రుడు గావచ్చును కాని ప్రేమకు పాత్రుడు కాలేడు హృదయమున సంబంధించిన సుగు ణాలు మాత్రమే హృదయమును ఆకర్షించును కేంబ్రిడ్జిలో మమ్ము లను ఎందరినో ఇంతగా ఆకర్షించినది రెడ్డియొక్క బుద్ధిమత్త కాదు అతని వ్యక్తిత్వమే మమ్ములను ఇంతగా తనవారిని చేసికొన్నది ఆయన వ్యక్తృత్వము ఔదార్యము ఆదర్శము (లక్ష్యము-అది యేలాటి సంకుచితతత్వమునకు చోటులేనిది) తన పరిచితులలోని యేమాత్రము రసికతలేని వారితోనైన సహజమైనఉత్సాహముతో మెలగుట, మందబుద్ధుల యెడ ఆయనచూపిన సహనము, ప్రేమ అపారమైనవి

## పార్లమెంటు సభ్యుడు ఫిలిప్పు ప్రైసు

"కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునందలి వాగ్వర్ధినీ సంఘ ములో అధ్యక్షపదవికి ఎన్నికలు జరిగినప్పుడు, సి రామలింగారెడ్డి

గారు అధ్యక్షుడుగా ఎన్నికకావలసియుండెను కాని జాతిద్వేషము వల్ల ఆయనకు వ్యతిరేకముగా కొంత ఉద్యమము బయలుదేరినది అధ్యక్షుడుగా ఎన్నికకావలసిన రెడ్డిగారు ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు ఆ ఎన్నికకూడ చెల్లనేరదని ఆందోళన బయలుదేరినది కాని ఫలితము లేకపోయెను మహామేధానిధి అగు రెడ్డిగారు మా వాగ్వర్ధినీ సంఘమునకు అధ్యక్షుడుగా ఎన్నికకాకుండ జాతిద్వేషము అడ్డుదగులుట నాకు చాల సిగ్గుచేటుగా నుండెను కాని అప్పటికి ఇప్పటికి కాలము మారినది ఆక్సుఫర్డులోను, కేంబ్రిడ్జిలోను కూడ తదాదిగా భారతీయ యువకులు చాలామంది ఈ అధ్యక్షపదవికి ఎన్నిక అగుచు వచ్చినారు ఆనాటి రామలింగారెడ్డిగారి ఎన్నికవల్ల కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో కొంచెము విశాలభావములు ఏర్పడినవి ”

కేంబ్రిడ్జిలో ఇట్లు ప్రఖ్యాతముగా గౌరవముగాంచి ఆంగ్ల భాషలో ప్రసంగించుచు నే ఆంగ్లేయులను చర్చలలో ఓడించుచు శ్రోతలను ఆనందసముద్రములలో ఈదించుచు ఆంగ్లవిద్వాంసుల చేతగూడ మన్ననలు గాంచినాడు రెడ్డి భారతీయులకు ఎనలేని గౌరవమును గూర్చి భారత రత్నమగు గోఖలేవంటి వారిచేతగూడ ప్రశంసలు పొందుచు జాతీయ భావోద్రేక పూరితుడై భారతీయులకు ఆశాజనకమైన చరిత్రతో దీపించినాడాయన కనుకనే అప్పుడు బరోడాధీశుని దృష్టి ఆయనపై బడినది

# బరోడాలో

బరోడాలో సంస్థానాధీశులు గైక్వారు శాయాజిరావుగారు గొప్ప దేశభక్తులుగా ప్రసిద్ధులు ఆయన ఆంగ్లభాష నేర్చుకొని విదేశాలలో పర్యటించుచు నూతనదృక్పథముతో దేశాభివృద్ధికి కృషి చేయు కాల మది

ఆ కాలాన అరవిందయోగిలోని విశిష్టతను గుర్తించి తమ ఆశయములకు అనుగుణముగా దానిని వినియోగించుకొన్న గౌరవమును బరోడామహారాజావారిదే అరవిందుడు చిన్ననాటి నుండియే ఇంగ్లాండులో నుండి చిరకాలము విద్యాభ్యాసము చేసి ప్రతిభావంతుడని పేరుగాంచినాడు 1890 వ సంవత్సరములో ఐ సి యస్ పరీక్షకు నిలిచి గ్రీకు, లాటిను భాషలలో అంతవరకు ఎవరును గడించని అత్యధిక గుణములను సంపాదించి మొదటి తరగతిలో ఉత్తీర్ణుడైనాడు తర్వాత శిక్షణాభ్యాస (ప్రొబేషనరీ) కాలమందు రెండేండ్లలో విద్యార్థి వేతనము గడించి కేంబ్రిడ్జియందలి 'కింగ్సు కళాశాలలో విద్య నభ్యసించి పాశ్చాత్య భాషలయందు ఉత్తముడుగా ఉత్తీర్ణుడై ట్రైపాస్ పట్టముపొందినాడు కాని గుఱ్ఱపు స్వారి పరీక్షకుపోకపోవుటచే ఐ సి యస్ పరీక్షయందు ఉత్తీర్ణత అందినట్లు కాలేదు

అట్టి స్థితిలో ధనాభావ మొకటి తీరని బాధ కలిగింపగా ఆయన 1893 వ సంవత్సరంలో లండను నగరమునకువచ్చిన మహారాజును దర్శించినాడు అరవిందుని ప్రతిభకు ముగ్ధుడైన మహారాజు తన సంస్థానములో ఆయనకు ఉద్యోగమిచ్చినాడు అరవిందుడు 1893 వ సంవత్సరమునుండి 1906 వ సంవత్సరమువరకు బరోడాలో రకరకముల ఉద్యోగములు చేసినాడు కొంతకాలము బరోడా కళాశాలలో ఆంగ్లభాషాచార్యుడు (Professor of English) గా

ఉన్నాడు పిదప నెలకు 900 రూపాయల వేతనముమీద ఆ కళా శాలకు ఉపాధ్యక్షుడు (Vice Principal గా ఉన్నాడు 1906 వ సంవత్సరములో కలకత్తాయందు క్రొత్తగా నెలకొల్పబడినజాతీయ కళాశాలకు అధ్యక్షుడు (Principal) గా ఆహ్వానింపబడుటచే ఆయన బరోడా విడిచి కలకత్తా వెళ్ళినాడు

సరిగా ఆ సమయముననే రామలింగారెడ్డికి ఇంగ్లాండులో విద్యాభ్యాసము ముగిసినది అప్పటికె ఆయన ప్రతిభ గుణ ములు బరోడాప్రభువులకు తెలియవచ్చినది దానితో ఆ మహారాజు అమెరికాలో ఇంక విద్యాభ్యాసము చేయుట మంచి దని రెడ్డిని ప్రోత్సహించి అమెరికాకు పంపుట జరిగినది రెడ్డి ఆ అవకాశమును చక్కగా వినియోగించుకొన్నాడు అమెరికాలో విద్యార్థిగా ఉన్నప్పుడు ప్రఖ్యాత విశ్వవిద్యాలయములను అన్ని టిని పరిశీలించినాడు అధికకీర్తినొందిన హేరేస్ మాంటుస్ప్రింగు స్కూలును కూడ సందర్శించినాడు 1907 వ సంవత్సరమునాటికి అక్కడి విద్య పూర్తిచేసికొన్నాడు

అంతట మహారాజు ఆయనను బరోడాలోని తన కళా శాలకు ఉపాధ్యక్షత వహింపవలసినదని కోరినాడు రెడ్డి పరమ సంతోషముతో అందుకు అంగీకరించి రెండేండ్లపాటు కళాశాలను నూతన పద్ధతులపై తీర్చిదిద్దినాడు కళాశాలాభ్యుదయమునకు ఎంతైన పాటుపడినాడు 'ఆయన బోధనాపద్ధతికి వాగ్మాధుర్యము నకు ముగ్ధుడనగుటచేత నేను ఆయనచెంత విద్యాభ్యాసముచేయు వాడను గాకున్నను ఆ వాగామృతమును గ్రోలుటకు అరిగెడివాడన ' అన్న కె యమ్ మున్షిగారి పలుకులు బరోడాలో రెడ్డి ఎంతగా రాణించినది తెలుపగలుగుచున్నవి

ఇమ్మటు అటనుండి 1909 వ సంవత్సరములో రెడ్డి మైసూరు నకు వెళవలసివచ్చినది ప్రతిభాసముద్రులతో లోకులకు అందరికి పనియే గదా!

# మైసూరులో

నాటి స్వదేశ సంస్థానాలలో బరోడా తరువాత చెప్పదగినది మైసూరు మైసూరు ప్రభువు కృష్ణరాజ ఒడయరు మహారాజులు ఎంతో సజ్జనులు 1912 వ సంవత్సరములోనే శాసనసభను ఏర్పాటు చేసి ఒక విధమైన ప్రజాప్రభుత్వమునకు దోహదము చేసిన వారు వారు అది ఒక ఆదర్శ సంస్థానముగా రూపొందుటచేతనే గాంధిమహాత్ముడు మైసూరు రాజ్యము రామరాజ్యమే అని మెచ్చుకొన్నారు

1909 వ సంవత్సరము వరకు బరోడాలో ఉన్న మన రెడ్డి 1910 వ సంవత్సరములో మైసూరు ప్రభుత్వమువారి ఆహ్వానము మీద ప్రత్యేకమయిన ఉపన్యాసాలలో పాల్గొనుటకు వచ్చినాడు విద్యావిధానములో కావలసిన మార్పులను గురించి ఆయన అక్కడ మూడు ఉపన్యాసాలిచ్చినాడు అప్పుడు మైసూరు సంస్థానమునకు దివానుగానున్న మాధవరావుగారు వయోవృద్ధులును అనుభవజ్ఞులును ఆయన రెడ్డి ఉపన్యాసములకు ఎంతో ఉత్సాహముపొంది అట్టి ప్రతిభాశాలి యగు విద్యావేత్త సేవలో మైసూరు విద్యారంగము తప్పక వృద్ధిగాంచ గలదని విశ్వసించినాడు అందుచేత వెంటనే ఆయన మైసూరు మహారాజువారి కళాశాలలో రెడ్డిని ఆచార్యునిగా నియమించినాడు

రెడ్డి 1921 వ సంవత్సరమువరకు మైసూరులో నుండి మైసూరు విద్యారంగములో మహత్తరమైన మార్పులు దెచ్చి విఖ్యాతుడైనాడు ఆచార్యుడుగా, అధ్యక్షుడుగా విద్యాశాఖాధికారిగా, విశ్వవిద్యాలయ ప్రణాళికాకర్తగా మైసూరు విద్యారంగమున ఆయన ధరించిన పాత్ర, చేసిన సేవ ప్రశంసనీయములు

రెడ్డి అడుగు పెట్టునంతవరకు మైసూరు కూడ మద్రాసు విశ్వవిద్యాలయమునకు చెందినదే అప్పటిలో పరీక్షలు డిసెంబరు నెలలో జరిగెడివి 1911 వ సంవత్సరము నుండి ఆ పద్ధతిమారినది యూనివర్సిటీ పరీక్షలు ఏప్రియల్ నెలలో జరుగ సాగినవి పిదప 1915 వ సంవత్సరములో మైసూరునకు ప్రత్యేక విశ్వవిద్యాలయం ఏర్పడినది

రెడ్డివద్ద చదివిన శ్రీయుత కందాళ రఘునాథాచార్యులు బి ఏ బి యల్ గారు నా కోరికపై తమ అనుభవములను ఇట్లు తెలిపినారు

"శ్రీ రెడ్డిగారు మైసూరు మహారాజాగారి కళాశాలలో ప్రవేశించి రనగానే విద్యార్థులకు అందరకు మంచి ప్రొఫెసరుగారు వచ్చి రని సంతోషము కలిగినది ఆయన మాకు ప్రొఫెసరుగా ఆంగ్లము చరిత్ర, తత్త్వశాస్త్రము బోధించెడివారు

'ఆంగ్ల హాస్య రచయితలలో అడిసన్, స్టీల్ సుప్రసిద్ధులు అడిసన్ హాస్య వ్యాససంపుటి మాకు పఠ్యగ్రంథము రెడ్డిగారికి ముందు ఒక ఆంగ్లేయుడా గ్రంథమును మాకు బోధించెడి వాడు మేము చదువుకొన్నచో మా కెంతవరకు బోధపడునో అంతకు మించి ఆయన మాకు చెప్పినది లేదు అడిసన్ రచనలలో హాస్యరసమే లేదని మే మప్పు డనుకొనెడి వారము

"రెడ్డిగారు మాకు అక్టోబరు నెలలో పాఠములు చెప్ప సాగిరి వారు ప్రథమమునుండియు మా పాఠ్య వ్యాసములను చదువ నారంభించిరి వారు చదువుటలోనే మా కందలి హాస్యము గోచరించెడిది తర్వాత వారు మాకు విశదముగా బోధించెడివారు అప్పుడు అందలి లోతుపాతులు మాకు అర్థమయ్యెడివి

"వారి చిరునవ్వులో దంతములు కనబడెడివికావు అదొక అద్భుతము వారి నవ్వులో ఒక ప్రత్యేకత ఉన్నట్లే ఉచ్చారణ లోను ఒక విశేషమున్నది వారు బోధించునపుడు వారి పెదవులు,

నాయిక ఒకవిధమైన చక్రాకారముగ ఏర్పడగా నోరు పూర్తిగా తెరవకయే శబ్దము ఉచ్చరించెడివారు ఆ ఉచ్చారణము బాగుగా స్పష్టముగా ఉండెడిది వారు అచ్చులను మాత్రము పూర్తిగా ఉచ్చరించెడివారు ఏ ఆంగ్లేయుడును ఈ విధముగా ఉచ్చరించుట నేను చూడలేదు ఆంగ్లేయులకే అలవడని ఉచ్చారణము ఆయనకు అలవడుట చూడగా మాకు ఆశ్చర్యము కలిగెడిది అచ్చులు, హల్లులు గలదే భాష ఇది హల్లు, అచ్చు కాదు అని తెలుపు స్వరమే ఉన్నదిగాని పూర్ణోచ్చారణకు అవకాశములేదు పదము కుదరదు అర్థము రాదు అటువంటి అచ్చుల హల్లుల కలయికలో ఒక తీరు గలదు ఆ తీరును తప్పి ఉచ్చరించినచో సారస్యము కానరాదు రెడ్డిగారి పద్ధతి బాగుగా గ్రహించినవారగుటచేత వారు చదువుచున్నప్పుడు వినువారికి స్పష్టముగా వినబడుచు సులభముగా బోధపడుచుండుటచేత ఆనందాంబుధిలో మునిగిపోయెడివారము ఇది వారి పఠనపద్ధతిలోని అద్భుతశక్తి

"రెడ్డిగారు బోధనశక్తి గూడ అసాధారణమైనది కొందరు పాఠాలు ఎక్కువగా చెప్పుచు ఒక భావమునే పలునాళ్లు అటు ఇటు మార్చి చెప్పుట కద్దు రెడ్డిగారు ఒక్కసారి చదివినదే మా స్మృతి పథములో నిలిచిపోయెడిది

చరిత్ర బోధనలో గూడ వారిది నవ్యమార్గము కొందరు ముఖ్యమైన విషయములు (నోట్సు) వ్రాసికొని వచ్చి వానిని అన్నిటిని వ్రాసికోవలసినదని మాకు చెప్పెడివారు రెడ్డిగారట్లు గాక ముఖ్యమైన విషయముపై మనోహరముగా ప్రసంగించెడివారు అందువల్ల మేము చరిత్ర చదువవలసినపనియే లేకపోయెడిది వారి ఉపన్యాసము విన్న తర్వాత మరపువచ్చుటన్నదే లేదు ఇటు వంటివా రెంతమంది లభింపగలరు ? ఆ నేర్పు వారి సొత్తు వారి దగ్గర శుశ్రూష మా అదృష్టము

"ఇక తక్కిన ప్రొఫెసర్ల సంగతి కూడ చెప్పిననేకాని రెడ్డిగారి విశిష్టత విదితము కాదు ఒక వృద్ధుడగు ఆంగ్లేయుడు అర్థ

శాస్త్రము చెప్పెడివాడు తా నెప్పుడో వ్రాసికొన్నదానిని చదువుచు మమ్ములను 'వ్రాసికొం డని హెచ్చరించెడివాడు అంతకంటె ఆయన మాకు బోధపరచినదిలేదు అదే ఆయన బోధనాపద్ధతి

'మా కాలేజి ప్రిన్సిపాలు కూడ ఆంగ్లేయుడే ఆయన నవల చెప్పెడివాడు ఆ చెప్పుట ఎట్లు? పుస్తకము చదువుట వ్యాకరణ విశేషములు చెప్పుట ఆ గ్రంథములోని సారము మాత్రము చెప్పుటలేదు

"మరి రెడ్డిగారో! సారము చెప్పునపుడుగాని ఉపన్యసించునపుడుగాని యిదివరకు చెప్పినట్లు పెదవులను నాలుకను గుండ్రముగా త్రిప్పుట తప్ప మరి యెట్టి అంగవిన్యాసములు (Gestures) చేసెడివారు కారు

రెడ్డిగారు 1912వ సంవత్సరమువరకు మైసూరు మహారాజాగారి కళాశాలలో ప్రొఫెసరుగా ఉన్నారు

నాటి యువరాజావారు అగు మహారాజ సోదరులు శ్రీ నరసింహరాజ ఒడయరువారు రామలింగారెడ్డిని ఎంతో అభిమానించినారు వా రిద్దరు ప్రాణమిత్రులైనారు యువరాజావారికి ఐరోపా సందర్శనమునందు కుతూహలము కలుగగా వారు మహారాజావారి అనుమతిమీద 1913వ సంవత్సరములో రెడ్డిని కూడ తమతో గొనిపోయినారు వారు జర్మనీ ఫ్రాన్సు కెనడా అమెరికా, చైనా, జపాను ఫిలిప్పైను దీవులకు వెళ్లినారు ఆయా దేశాలలోని పరిశ్రమలు స్థానిక పరిపాలనా పద్ధతులు ఎట్లు సాగుచున్నవో పరిశీలించి మైసూరును ఎట్లు అభివృద్ధికి తేవలెనో నిర్ణయించుకొనుట వారి సంచారోద్దేశము ఆ సంచార సందర్భమును పురస్కరించుకొని రెడ్డి ఒక గ్రంథమునే వ్రాసినాడు ఆ యా దేశాలలో యువరాజావారికి దర్శనీయ విశేషములను చూపించుచు తగిన సలహాల నిచ్చుచు మంత్రియై మిత్రుడై ఆ విదేశ యాత్ర జయప్రదముగ ముగియునట్లు చేయుటయేగాక, ఆయా

ప్రాంతాలలో తాను కాంచినవానిని గురించి ఎప్పటికప్పుడు దివానునకు రిపోర్టు పంపుచు మైసూరు సంస్థానము మరింత వృద్ధి పొందుటకు దోహదము కల్పించినాడు

మైసూరులో విశ్వవిద్యాలయము స్థాపింపగోరి వివిధ దేశాల లోని విద్యా విధానములను తెలిసికొనుటకుగాను ప్రభుత్వమువారు 1914 వ సంవత్సరమున రెడ్డిని విదేశాలకు పంపినారు ఆయన కెనడా, జపాను ఫిలిప్పైనుదీవులు హాంకాంగు మొదలగు దేశములెల్ల సందర్శించి విద్యావిధానములను పరిశీలించి ('Deputation studies in Education ) అను ఒక రిపోర్టు ఇచ్చినాడు

1915 వ సంవత్సరములో ప్రభుత్వమువారు విశ్వవిద్యాలయ నిర్మాణమునకై కావలసిన ఒక పథకమును రూపొందించి ఇయ్య వలసిన దని రెడ్డిని అడిగినారు రెడ్డి తన శక్తిసామర్థ్యాలను చక్కగా వినియోగించి ఒక ప్రణాళికను సృష్టించిపెట్టినాడు మైసూరు ప్రభుత్వము విశ్వవిద్యాలయ నిర్మాణపు చట్టము చేయుటకు ఈ ప్రణాళిక ఎంతో తోడ్పడినది దానితో హిందూదేశమందు ఒక స్వదేశ సంస్థానమున ప్రప్రథమముగా విశ్వవిద్యాలయము నెల కొల్పుటన్నది జరిగినది 1916 వ సంవత్సరము జూలై నెలలో మైసూరు విశ్వవిద్యాలయము ఉదయించినది

రెడ్డి 1915 వ సంవత్సరమునుండి 1917 వ సంవత్సరము వరకు మహారాజాకళాశాలకు ప్రిన్సిపాలుగా ఉన్నాడు కళాశాలను ఎంతో అభివృద్ధిలోనికి తెచ్చినాడు ఆయన ఆ కాలమున పాఠ ములను ఏవిధముగా బోధించెనో విద్యార్థులతో ఎట్లు కలసి మెలసి ప్రవర్తించెనో ఇత్యాది విశేషములన్నిటిని ఆయన శిష్యులలో ఒకరు విశదముగా పేర్కొన్నారు ఇవి కళాశాలా శతవార్షి కోత్సవ సందర్భములో స్మరింపబడినవి

రామలింగారెడ్డి శిష్యులలో ఒకరు శ్రీ హెచ్ సుబ్బారావు బి ఏ బి ఎల్ గారు వీరు మైసూరు నివాసులు రామలింగారెడ్డి మైసూరు మహారాజాకళాశాలలోనున్నపుడు ఆయనతో తనకుగల పరిచయమును అనుభవమును పురస్కరించుకొని ఇట్లు వ్రాసినారు

'నేను శ్రీ రెడ్డిగారి ప్రియశిష్యులలో ఒకడను 1915 - 17 సంవత్సరాల నడిమి కాలములో ఆయన గారు బి ఏ తరగతిలో పాఠాలు చెప్పినారు 1916 వ సంవత్సరమున నేను బి ఏ లో రెండవ సంవత్సరము చదువుచుండగా వారితో నాకు మరియు సాన్నిధ్య మేర్పడినది వ్యక్తిగతముగా గూడ వారికి కొంత దగ్గరి వాడ నయినాను ఒకసారి తరగతిలో కొన్ని కాగితాలు విద్యార్థుల చేతులలో విహారము చేయుట ఆచార్యుల కంటబడినది అది నేను వ్రాసిన వ్యక్తి శబ్దచిత్రము (Sketch) తరగతిలో కొంత క్రమ భంగమునకు కారణమైన ఆ కాగితా లేవో తాము చూడదలచి నారు రెడ్డిగారు ఆ కాగితాలు తీసుకొని తమ గదిలోనికి రావలసిన దన్నారు నాకు శిక్ష తప్పదని అనుకొన్నాను ఆందోళన పడి నాను కాని ఆశ్చర్యము! రెడ్డిగారు 'నీ రచన చాల బాగుగా ఉన్నది అన్నారు అటువంటి రచన ప్రతివారము చేసి అచ్చునకు కూడ పంపవలసినదన్నారు ఆ ప్రోత్సాహముతో నేను ఒక వార పత్రికకు సంపాదకుడ నయినాను అది విద్యార్థిచే నడపబడెడి ప్రథమ వారపత్రిక మా ప్రాంతములో దాని పేరు 'The Irresronsible (బాధ్యతారహితము) హాస్య ప్రధానమైనది ఆ పత్రికలలో నా రచనలు 'Nat (ముష్కుడు) అను ఉపనామ ముతో వెలువడెడివి ఆ పత్రిక వ్యవస్థాపకుడు నా మిత్రుడు Roben (రోబెన్) Ginger (అల్లము) అను ప్రచ్ఛన్న నామము దాల్చినవాడు ఈ విధముగా రెడ్డిగారు మాకు ఈ పత్రికా వ్యాసం గములోనే కాక, మరెన్నో ఉత్సాహకరమైన పాఠ్యేతర ప్రణాళిక లందు చేయూతగా ఉండెడివారు

వయోజన విద్య గ్రామ పునర్నిర్మాణము మొదలైనవి రెడ్డిగారి అండను మేము ప్రారంభించిన కొన్ని ప్రజోద్యమాలు

36 సంవత్సరముల క్రింద నేనాయనకు ప్రత్యక్షముగా విద్యార్థిని కాని నేటికిని ఆయనకు శిష్యుడనే ఆయన ప్రతిమాట నేటికిని నా చెవులలో పలుకుచున్నట్లే ఉన్నది ఆయన వక్తృత్వ మటువంటిది ఆయన వాక్చాతుర్య మటువంటిది ఆయన బోధనా పద్ధతి అంత ప్రభావము గలది విద్యార్థులను సమ్మోహితులను జేయునది నాటికి నేటకి ఆయన పలికిన ప్రతిపలుకు మాకు జ్ఞప్తియందున్నది ఆయన ధ్వనిలోని గారడి ఆయన పలుకులలో ఇంద్ర జాలము ఆయన వాక్యములలోని మహిమ అటువంటిది

మేము ఆచార్య కట్టమంచి రామలింగారెడ్డి పాదముల కడ కూర్చుండి ముప్పదియారు సంవత్సరములు దాటినవి ఆయన ప్రస్తుతము మైసూరు విశ్వవిద్యాలయమునకు ప్రోఛాన్సలరుగా నున్నారు కాని ఈనాటికిని ఆయన చెప్పిన పాఠాలు మా స్మృతిలో మెలగుచునే యున్నవి అసాధారణమైన ధారణాశక్తి గల విద్యార్థులకే యీ మాట వర్తించిన నది యేమంత చిత్రము కాదు కాని ఆనాటి ఇతరాధ్యాపకులు చెప్పిన యే మాటయు గుర్తున లేని విద్యార్థులకు గూడ రెడ్డిగారి మాటలు మరచిపోవకుండుటయే గొప్ప విశేషము ఆచార్యరెడ్డిగారి మాటలు మరచిపోవుటకు వీలులేనివి అనునది అద్భుతమైన రహస్యాలతో కూడుకొన్న సమస్య ఇయ్యది మాకు వారికి గల చిత్తవృత్తుల సామ్యమే కాదు ఇందులకు తోడు రెడ్డిగారి వక్తృత్వములో మౌలికమైన సత్యము విలసిల్లెడిది సునిశితమైన హాస్యము ఆ సత్యమునకు ముస్తాబుగా నుండెడిది అది మృదు మధుర స్వర సంగీతములతో మేళవించిన ధ్వనులతో ఎప్పుడును ప్రదర్శిత మగుచుండెడిది ఆయన వారము చెప్పిన గంటసేపును ఏ విద్యార్థియు జ్ఞాన నిర్ఝరిణి ఉబికిపడుచున్న ఆ బృహస్పతి ముఖము నుండి చూపు కదల్చి యెరుగడు సమయము ఎంతైనదో యని గడియారము చూచి యెరుగడు

1914 వ సంవత్సరములో ఆచార్యరెడ్డి మారు తర్కము (Logic) చెప్పుచు అన్నమాటలు "తర్కశాస్త్రమున తర్కమెంతటి లోపభూయిష్ఠమైనదో తెలుపునేగాని అది మనలను విశుద్ధముగా తర్కింపజేయలేదు పది సద్విధులు (Ten Commandments) మనలను మంచివారిని జేయగలవు గాని గొప్పవారిని జేయలేవు

ప్రకృతి న్యాయములను తర్క న్యాయములను చర్చించుచు ఆచార్యు లిట్లనిరి 'తర్క న్యాయమును పాటించకపోయిన ఇబ్బందిలేదుగాని, ప్రకృతి న్యాయమును మాత్రము పాటించక వీలులేదు మన మే స్థాయిక చెందినవారమైనను మన ఉద్దేశమె మైనను ప్రకృతి న్యాయమును వ్యతిరేకించి దాని ఫలితమునుండి తప్పించుకొనలేము. శంకర భగవత్పాదులకు కాలు జారినను వారు కూడ సామాన్యునివలె పడవలసినదే వారి ఏ ప్రార్థన కూడ ప్రకృతి న్యాయములను అమలులోనికి రాకుండ చేయలేదు"

1915 వ సంవత్సరములో మొదటి ప్రపంచ యుద్ధము జరిగెడి కాలములో రెడ్డిగారు బి ఏ విద్యార్థులకు ఇంగ్లీషు వాస్త్రరీ పారము చెప్పుచున్నారు డచ్చివారిపై క్రాంవెల్ చేసిన యుద్ధ ప్రకటన చదివి ఆయన అన్నమాట లివి నేను ఇప్పుడు చెప్పనున్న మాటలు ఈ గది నాలుగుగోడలు దాటి పోగూడదు ఇది ప్రభుత్వ కళాశాల నేను ప్రభుత్వోద్యోగిని ఇప్పుడే మీరు క్రాంవెల్ డచ్చివారిపై యుద్ధము ప్రకటించుచు చెప్పిన మాటలు విన్నారు గత సంవత్సరము బ్రిటిషువారు జర్మనులపై యుద్ధము ప్రకటించినప్పుడు అరల్ గ్రే మాటలు కూడ మీరు వినయున్నారు ఈ రెండు ప్రకటనలలో వాడబడిన వాక్యభాగములలోని సామ్యము అర్థమునకు సంబంధించినది ఉద్దేశమునకు సంబంధించినది గమనింపదగినది జాన్ బుల్ (ఆంగ్ల జాతికి ప్రత్యేకమైన పేరు) తన శత్రువును మానవతా శత్రువుగా పేర్కొనుచున్నాడు బ్రిటను శత్రువులు కేవలము బ్రిటిషువారి స్వాతంత్ర్యమునే కాదు

నాశనముచేయుట వారు సభ్యతను సంస్కృతినే నాశనము చేయు చున్నా రని కూడ అందులో వెల్లడి వేయబడినది జాన్ బుల్ ఈ మాటలు ఇంత కచ్చితముగా ఈ ప్రకటనలో వెల్లడిచేయుటకు కారణ మెయ్యది? ఆంగ్లేయుడు తా నొక్కడే శత్రువును ఎదిరింప లేకపోవుట సంపూర్ణముగా ఎరుగును అతనికి మిత్రరాజ్యముల సాహాయ్యము అత్యావశ్యకము తనకుమాత్రమే శత్రువైన వానితో యుద్ధము చేయుచుంటి ననిన మిత్రరాజ్యము లతనికి సాయపడవు అందువేతనే అతడు ప్రపంచములోని సభ్యతను నిరూపించుటకు మానవతా శత్రులైనవానితో యుద్ధమునకు సంసిద్ధుడనైతి నని యెలుగెత్తి చాటుచున్నాడు ఈ మంత్రము ఫలించుట యన్నది భూమి మీది అమాయకుల సంఖ్యను వెల్లడిచేయును

ఆచార్య రెడ్డి తన విద్యార్థులచే ఎన్నడును 'నోట్సు వ్రాయించి యెరుగడు విద్యార్థులు తామే తమ ఉచితజ్ఞతను బట్టి నోట్సువ్రాసుకొనవలె నని ఆయన అభిప్రాయము ఒకసారి విశ్వ విద్యాలయపు ఉపకులపతి శ్రీ నంజుండప్ప విద్యార్థి వ్రాసికొన్న నోట్సుచూచి అది ఆచార్యరెడ్డి చెప్పిన పాఠమునకు భిన్న ముగా నున్నవి గనుక నోట్సు ఆచార్యుడే వ్రాయించుట సబబని సూచించినాడు అందుకు ఆచార్య రెడ్డి తక్షణమే ఇట్లు జవా బిచ్చెను 'విద్యార్థి ఈరోజు కాకున్నను రేపైనను తన పొర పాటును తెలిసికొని సవరించుకొనును మనము 'నోట్సు వ్రాయిం చినచో వానికి ఏమియు బుర్రకెక్కదు మనము వ్రాయించిన దానినే అతడు వల్లెవేసి రేపు పరీక్షలో వెళ్ళగ్రక్కును అది విద్యాబోధనము కాజాలదు" తన విద్యార్థులకు ఆచార్య రెడ్డి పదేపదే తెలియజెప్పెడివాడు 'విద్య కేవలము జ్ఞానార్జనకొరకే పరీక్షలు విద్యార్జనలో కేవలము సాధనములే లక్ష్యము మాత్రము కావు విద్యార్థులు కేవలము పాఠ్యగ్రంథములవరకే తమ అధ్యయనము సీమితము చేయుట వారికేమాత్రము గిట్టకుండెడిది.

ఒకానొక ఆంగ్ల గ్రంథముపేరు * సూచించి 'దానిని చదివినవారు ఎందరో చేతులెత్తుడు! అనిఅడిగినారు మాలో చాలమంది చేతు లెత్తగా వారు నవ్వుచు 'అది ఎప్పుడైన మీకు పాఠ్యగ్రంథము కాలేదుకదా!' అన్నారు

ప్రతి శనివారము మధ్యాహ్నానంతరము వారు విద్యార్థు లకు తమ బసలో 'టీ' యేర్పాటు చేసెడివారు ఒకనాడు ఒక విద్యార్థి 'టేబుల్ పైకి వంగి కప్పులోని 'టీ' త్రాగుటచూచి శ్రీ రెడ్డిగారు 'మిస్టర్ భీమారావ్! సాధారణముగా మానవులు కప్పు చేతిలో పట్టుకుని నోటికడకుతీసుకుని పోదురు జంతువుల పద్ధతి వేరుగానుండును" అన్నారు భీమారావుకూడ గడుసువాడే 'ఆ విషయము నాకు తెలియును సార్! కాని ఆ పద్ధతులలో ఏది మంచిదో అని చూచుచున్నాను" అన్నాడు అందుకు రెడ్డిగారు వెంటనే "నేను నీ పరిశోధనబుద్ధిని మెచ్చుకొనుచున్నాను కాని ఈ పరిశోధన ఫలితాలు మాకు కూడ వెంటనే తెలియజేయ వలెను" అన్నారు

ఒకనాటి మధ్యాహ్నము రెడ్డిగారు అన్నట్లు గుర్తు 'భారత దేశములో మతము ధర్మము అందరి పెదవులపై ఆడును కాని ఆచరణలో అది ఎంతమాత్రము కనిపించదు ఒక కథ గుర్తునకు వచ్చుచున్నది ఒకసారి స్వర్గమునకు అర్హుడుకాని ఒక వ్యక్తి ఏదో విధముగా స్వర్గముచూచుటకు చీటి సంపాదించినాడు దేవదూత లతనిని స్వర్గములో త్రిప్పుచున్నారు ఒకచోట నాలుకలు మరొక చోట చేతులు పడి యుండుట చూచినాడతడు ఆ వ్యక్తి దేహాము నకు సంబంధించిన ఇతర భాగాలు ఎక్కడనులేవు 'అది యేమి' టని ప్రశ్నింపగా దేవదూత సమాధానమిది 'ఆ నాలుకలు దైవ ప్రార్థన చేసినవి ఆ చేతులు మ్రొక్కినవి అందువలన అవి స్వర్గము చేరినవి ఆ దేహాల ఇతరభాగాలు అవిచేసిన పనులనుబట్టి ఎక్కడ ఉండవలెనో అక్కడనే ఉన్నవి

---

* Hawthorne s 'The scarlet letter'

ఆచార్య రెడ్డి యెప్పుడును మా జిజ్ఞాసను రేపెడివారు ఉత్తమ సాహిత్య విషయమై మాలో ఎక్కడలేని తహతహను రూపొందించినారు వారు మా మనస్సులకు రూపురేఖలుదిద్దినారు మా దృక్పథాలను రూపొందించినారు స్వబుద్ధిని వినియోగించి స్వంతముగా ఆలోచించుట మాకు నేర్పినారు ముప్పది యేండ్లు సంవత్సరాల క్రింద వారి పాదసన్నిధిని చేరినను అటనుండి కదలుటకు మాకు మనసొప్పదు'

తుదకు 1917-20 సంవత్సరాల నడిమికాలములో రెడ్డి మైసూరు విద్యాశాఖాధికారిగా నున్నారు అప్పుడు విద్యావిధానమే క్రొత్తత్రెన్నులు త్రొక్కినది ప్రతి గ్రామములోను పాఠశాల పెట్టించి విద్యావ్యాపిగావించిన డాయన ప్రభుత్వాదాయములో అధికభాగము విద్యకై వినియోగపడునట్లు కృషి చేసినాడు అంటరానివారని అణగద్రొక్కబడిన హరిజనులకు తొలుదొల్త పాఠశాలాప్రవేశమునకు అవకాశము గలిగించిన హరిజన బంధువు రామలింగారెడ్డి హరిజనులు పాఠశాలలో ప్రవేశించరాదని పూర్వాచార పరాయణులు పెద్ద ఆందోళన గావించినారు ఆయన ఆ ఆందోళనను ఏమాత్రమును పాటించలేదు మూఢాచారాలకు ప్రబల విరోధి ఆయన కాబట్టి ఎట్టి కష్టనష్టాలకును జంకలేదు న్యాయమని తోచినదానిని ఆచరించుటకు జంకలేదు అప్పటి దివాను హరిజనుల పాఠశాలాప్రవేశమునకు సుముఖుడుకాడు ఈ ఇద్దరికి తీవ్రమైన సంఘర్షణ కలిగినది శాసనసభలోను ఇతర స్థలములందును తన ఉపన్యాసములచే ప్రజలను తన మార్గమునకు త్రిప్పుకొనుటకు పూనుకొన్నాడు రెడ్డి 'నేను సఫలత పొందనీ! విఫలత పొందనీ! నేను ఈదేశపు వాస్తేవుగా నున్నాను అని పలికినా డాయన

శృంగేరీ మఠము పక్షమున శ్రీకాంతశాస్త్రిగారు మహారాజావారిని సందర్శించి 'తమరైన జోక్యము కలిగించుకొని ఈ హరిజనపాఠశాలా ప్రవేశమును మాన్పించవలసినది, అని అర్థించి

నారు అంతట మహారాజావారు 'పంచములుమాత్రము నాప్రజలు గారా? అన్నారు ఇక చేయునది లేక శాస్త్రిగారు వచ్చినత్రోవ పట్టినారు

భారతదేశములో పంచములు ప్రప్రథమముగా అభివృద్ధి చెందినది మైసూరులోనే ఆ కాలములో రెడ్డిగారి నామము ఆబాలగోపాలముగా స్మరించుచు ఆయన చిత్రపటములను నేడు గాంధిగారి చిత్రపటములను వలె తమగృహములలో అలంకరించు కొన్నారు ప్రజలు

మైసూరురాష్ట్రములో రామలింగారెడ్డి భాస్కరుని వలె ప్రకాశించి అజ్ఞాన తిమిరమును పారద్రోలినాడు కనుకనే ఈనాటి కిని ఆంధ్రులకంటెను అధికముగా మైసూరుప్రజలు ఆయనను కొని కొనియాడుచుందురు

## అర్థశాస్త్రము

విజ్ఞానచంద్రికామండలివారు ఆంధ్రదేశములో విజ్ఞాన ప్రచారమునకు కంకణము కట్టుకొన్నార వీరి కోరికపై రామ లింగారెడ్డి 1911-12 సంవత్సరాలలో అర్థశాస్త్రమును రెండు సంపుటములుగా రచించినాడు

ఒక గ్రంథమును రచించుటకు గ్రంథరచనాభిలాషమేకాదు, అర్హతకూడ అవసరము రామలింగారెడ్డి అర్థశాస్త్ర పండితుడు ఆంధ్రభాషావిశారదుడు దేశాభిమాని అందువలన ఈ గ్రంథమును రచించుటకు ఆయన అన్నివిధముల అర్హుడు

సృష్టిలోని ప్రతి పరిణామమునకు కొన్ని నిబంధనలున్నట్లే అర్థోత్పత్తి ఆర్థికాభివృద్ధి అన్నవి కూడ కొన్ని నియమాల ననుస రించి యుండును ఆర్థిక న్యాయాలను నియమాలనుగురించి చెప్పు నదే అర్థశాస్త్రము నాగరికత చెందిన ప్రతి జాతియును అర్థ శాస్త్రమును జాతియజీవనమునకు ముఖ్యమైన శాస్త్రముగా పరిగ ణించును

మన దేశము భాగ్యవంతము కావలెనన్న మన దేశీయులు అర్థశాస్త్ర నియమములను బాగుగా తెలిసికొని ఆర్థికాభివృద్ధికకృషి చేయవలెను ఆయా దేశాల సాంఘికాచారాలు రాజకీయ స్థితిగతులు అనువానిని బట్టి ఆర్థికనియమా లేర్పడును కనుక మన దేశపు సాంఘిక రాజకీయ స్థితిగతుల ననుసరించి సామాన్య ప్రజలకు తెలియునట్లుగా అర్థశాస్త్ర ముండుట అవసరము రామలింగారెడ్డి ఇన్నిటిని మనసులో పెట్టుకొనియే ఈ గ్రంథమును రచించినాడు

అర్థశాస్త్రము సంఘాదిశాస్త్ర సంబంధముగా విమర్శించుటలో మార్గదర్శకులైన జాన్‌స్టూవర్టు మిల్లుగారి ననుసరించి యీ గ్రంథమును తాను రచించినట్లు రెడ్డి చెప్పినాడు ఈ విషయము గమనించని కొందరు దీనిని అర్థశాస్త్రమనక సాంఘికశాస్త్రమనుట కద్దు

సంఘము, మనస్సు, తత్త్వము మతము అర్థము చరిత్ర మొదలగువానిని విచారించు శాస్త్రములన్నియు పరస్పర సంబంధము గలవే గాని భిన్నములు కావు

అర్థశాస్త్రము అంగమువంటిది కనుక సంఘ మానసాది శాస్త్రాలతో గలిపి వివరింపబడిననే కాని అది సంపూర్ణముగా బోధపడదు

'అర్థశాస్త్రములో సాంఘిక విమర్శ ఎందుకు? అని కొందరి ప్రశ్నము సంఘ దృక్పథము మారనిదే పురోభివృద్ధి ఎట్లు?

మన దేశము కేవలము వ్యావసాయిక దేశము ఆర్థికముగా వెనుకబడ్డ దేశము ప్రాత దంతయును మంచిదనెడి కులమత తత్త్వబుద్ధి గల దేశము అందుచేత మనలో ఏమార్పును తొందరగా రాదు దీనివల్ల మనము అధికముగా కష్ట నష్టములకు గురి అగుచున్నాము దేశకాల పరిస్థితులను అనుసరించి మారక పోయి

నందు వలననే అధోగతిలో ఉన్నాము ఈ సంగతినే స్వామి రామతీర్థు లిట్లు నొక్కి చెప్పినారు

'కాబట్టి మన కర్మకాండమును ఈనాటి పరిస్థితులకు అన్వయించుకొందము మన కోరికలు ఆ నాటి వేదఋషుల కోరికల వంటివి కావు పశుసంపద కావలెనన్న ఇంద్రయజ్ఞం చేయ వలెనని, సంతానము కావలె నన్న ప్రజాపతి యజ్ఞము చెయ్యవలె నని మనము కోరుట లేదు ఈనాటి కోరికలు వేరు ఇప్పటి ప్రశ్న లవి కావు ఇప్పటి కర్మకాండము ఈ స్వరూపము దాల్చినది ముందు నకు పోవుచున్న ఈ పారిశ్రామిక యుగములో నీవు బ్రతుక తలచు కొన్నచో అడుగడుగునకు రాజకీయ క్షయవ్యాధి చేత చావ కుండ దలచుకొన్నచో విద్యుచ్ఛక్తి అను మాతరిశ్వుని వశుని చేసికొనుము ఆవిరి అను వరుని బానిసను చేసికొనుము వ్యవసాయ శాస్త్రమను కుబేరునితో సఖ్యము చేసికొనవలెను ఈ దేవతలతో నీకు పరిచయము చేసెడి పురోహితుడు విజ్ఞాన శాఖలలో ఉపదేశించెడి విజ్ఞాన శాస్త్రవేత్త లేక కళావేత్త"

ఆర్థిక వ్యవస్థ మారనిదే సాంఘిక వ్యవస్థ మారదని సామాజిక పరిణామాలు రావని మార్క్సిస్టుల అభిప్రాయము సాంఘిక చైతన్యము కలిగించనిదే ఆర్థిక వ్యవస్థ మార్చుటకు పోరాడు శక్తులు ఎక్కడినుండివచ్చును? అభివృద్ధికాముకులున్నప్పుడే సాంఘికార్థిక సంస్కరణముల కొరకు పోరాటము అందుచేత సంఘ సంస్కరణ అవసరము కనుక సంఘ సంస్కరణోద్యమము, రాజకీయార్థికోద్యమాలు పరస్పర సంబంధములు గలవి

మనము మతరీత్యా నాలుగు యుగాలున్న వని విను చున్నాము ధర్మబద్ధమైన కృతయుగమునుండి క్రమముగా పతనము చెందుచు ఘోరమైన పాపపు కలియుగములోనికి వచ్చినా మని మతరీత్యా చెప్పుట వినుచున్నాము అర్థశాస్త్రజ్ఞులు ఏమను చున్నారో గమనించుట అవసరము మృగయా యుగము, పశు

పాల్యయుగము వ్యవసాయయుగము పారిశ్రామికయుగము అని నాలుగుయుగములు చెప్ప మానవ క్రమాభివృద్ధి చెప్పెదరు

యూరపు అమెరికా మొదలగు ఖండాలు సైన్సును అభివృద్ధి చేసికొని యంత్రాలను నిర్మించుకొని పరిశ్రమలు పెంచుకొని అభివృద్ధి గాంచినవి మనము కేవలము వ్యవసాయముమీద ఆధారపడుట వారికంటె వెనుకబడి అధోగతిలో ఉన్నాము ఇది యంత్రయుగము యంత్రాలవల్ల చేతి పను లన్నియు నాశనమైనందున మనము బీద స్థితిలో ఉన్నాము ఈనాడు కూడ వ్యవసాయమును చేతిపనులను గ్రామస్వరాజ్యమును వస్తువ్రల మార్పిడిని స్వయం పోషకత్వమును గొప్పగా భావించి, నేడు అది అవసరముగా భావించెడివారు మనలో లేకపోలేదు వాస కాలజ్ఞాన తత్త్వము తెలియని అభివృద్ధినిరోధకులు మారెడి కాల పరిస్థితులను బట్టి మనము మారవలెనుగాని మారకుండ ఉన్నచో దారిద్ర్యమే అనుభవించ వలసి వచ్చును

మనకు ఆర్థిక సౌష్ఠవము ఏర్పడ వలెనన్న పరిశ్రమలను అభివృద్ధి గావించుకోవలెను పాశ్చాత్యులది భౌతిక దృక్పథము మనది ఆధ్యాత్మిక దృక్పథము అని ఆత్మవంచనము చేసికోరాదు వివేకానందస్వామి ఈ సందర్భములో అన్న మాటలు గ్రహించవలెను

'నా దేశములో ఆకలితో అలమటించెడి ఒక్క కుక్క ఉన్నను దాని కడుపు మంట చల్లార్చుటయే నా మతము

సంఘమునకు ఆర్థిక సౌష్ఠవము ఏర్పడకముందే ప్రజలందరికిని ఆహారము అందెడి అవకాశము కలుగక ముందే ఆధ్యాత్మిక చింతలో పడుటవల్ల మన దేశమునకీ దుర్గతి గలిగినది

సాంఘిక దృష్టి లోపించుటవల్లనే మనము పతనము చెందినాము

సాంఘికార్థిక దృష్టిగలిగి నేటి కాలానుగుణ్యముగా మనము పరిశ్రమలను పెంపొందించుకొని సుఖశాంతులను గాంచవలెను భుక్తికుదిరినగాని ముక్తి కుదురదని గ్రహించుట అవసరము

ఏయే దేశాలు ఏవిధముగా అభివృద్ధి చెందుచున్నవో ఈ అర్థశాస్త్రములో చెప్పినాడు రెడ్డి వ్యవసాయాభివృద్ధికి వ్యాపారాభివృద్ధికి పరదేశాలు ఏలాగు పాటుపడు చున్నవో గమనించుట అవసరముగద

వ్యక్తివాదమును సమష్టివాదమును గురించి కార్మికులు ఏలాగు మెలగవలెనో వివరించినాడు ఈనాడు కుటుంబ నియంత్రణమును గురించి ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధను తీసికొను చున్నది అర్థశతాబ్దము క్రిందనే ఈ అర్థశాస్త్రజ్ఞుడు సంతాన నిరోధ నావశ్యకతను గురించి నొక్కిచెప్పుట జరిగినది 'నాకు పోసెడి దేవుడు నీకు పోయడా ? అనుకొన్నచో లాభములేదు మనమాటలకు క్రియకు బొత్తిగా సంబంధములేదు పురుష ప్రయత్నము అవసరము అని ఆయన ఇట్లు అన్నారు 'సర్వఫలసిద్ధులకును మూలాధారములైన వానిలో పౌరుషం రెండు పౌరుషమున్నదే పురుషకారము"

రామలింగారెడ్డి మద్రాసు విశ్వవిద్యాలయపు సెనేటులో విజ్ఞానచంద్రికా గ్రంథమండలి గ్రంథములను కొన్నిటిని పాఠశాలలలో పెట్టవలసినదిగా కోరినప్పుడు 'ఒక్క రామలింగారెడ్డిగారి అర్థశాస్త్రము వినా, మిగిలిన గ్రంథాలన్నియు యోగ్యమైనవి కావని గురజాడ అప్పారావుగారు అన్నారు

రెడ్డి అర్థశాస్త్రము మద్రాసు విశ్వవిద్యాలయమువారి వల్ల బహుమతిగాంచుట గమనించదగినది

రామలింగారెడ్డి రచనలో అధిక ప్రయోజనకరమైనది అర్థశాస్త్రమే

రచయిత ప్రజల మనస్తత్వము గ్రహించవలెను లౌకిక సమస్యలనుండి తప్పించుకొని పోయెడిస్వభావమును కార్యోన్ముఖముగా చేయుట ఈనాటి రచయితల కర్తవ్యము ఈ కర్తవ్యమును రెడ్డి అమోఘముగా నిర్వహించినాడు, సంయుక్తాధికారసంపాదిత

పోయిననేగాని ప్రజాస్వామ్యము నిలవదు ఆర్థికముగా అభివృద్ధి పొందిననేగాని సమానము ఏర్పడదు

"మనము రాజకీయ ప్రజాస్వామ్యమును గురించిమాట్లాడు నప్పుడు ఒక విషయము గుర్తుంచుకోవలెను 19 వ శతాబ్దములో రాజకీయ ప్రజాస్వామ్యమున కున్న ప్రత్యేకమైన ప్రాధాన్యము ఈనాడు లేదు ఈనాడు రాజకీయ ప్రజాస్వామ్యమునకు అర్థ మేదైన ఉండవలెనన్న అది త్వరితగతిని ఆర్థిక ప్రజాస్వామ్యమునకు దారి తీసెడిదిగా నుండవలెను దేశములో ఆర్థికాసమానత్వ మున్నంతకాలము రాజకీయ ప్రజాస్వామ్యముగాని వయోజనుల వోటింగు హక్కు, నిజమైన ప్రజాస్వామ్యమును నెలకొల్పజాలము" అని పార్లమెంటులో 1952 డిసెంబరు 15 వ తారీఖున మనప్రధాని నెహ్రూగారన్న మాటలు గమనించదగినవి

పరిణామ శీలమైన కాలముతోబాటే మన అభిప్రాయములు మారుచుండును మన ఆర్థిక విధానము మారుచుండును మనము దీనిని త్వరితగతిని మార్చుటకు ప్రయత్నించవలెను

మనము పరిశ్రమలను పెంచుకొని అభివృద్ధిగాంచుట అవస రము కౌటిల్యుని అర్థశాస్త్రము ఆనాటి రాజ్యాలకే పరిమితము రమేశచంద్రదత్తు మొదలగువారి అర్థశాస్త్రములు ఆంగ్ల పరిపాలన వల్ల మన కెలాగు దారిద్ర్యము కలిగెనో వివరించునవి

మన కొక నూతన దృష్టిని కలిగించి మన పురోగమన మును ప్రోత్సహించెడిది రామలింగారెడ్డి అర్థశాస్త్ర మొక్కటే

నూతన దృక్పథము లనిదే మహాతలమును మానవ సంఘమును ఆధునికదృష్టితో చూడలేము రామలింగారెడ్డి ఆధుని కులలో ఆధునికుడు అందుచేత ఆధునికదృష్టితో ఆయన రచనలు అన్నియు సాగినవి

# కవిత్వతత్త్వ విచారము

మన ప్రాచీన సాహిత్యము సంస్కృతచ్ఛాయల ననుస రించి నడచినది సంస్కృత భాషలో అలంకార శాస్త్రము బహుముఖముగా విస్తరిల్లినది దానిలో కావ్యహేతువులు, కావ్య భేదాలు, రసమీమాంస, కావ్య రచనాధికారము అలంకార ములు శబ్దార్థదోషములు చక్కగా నిరూపించబడినవి ఇవి కావ్య రచన కుపకరించునవే యైనను కావ్య విమర్శనకు కొంత తోడ్పడ్డవే

సంస్కృత భాషలో వ్యాఖ్యాతలు అనేకు లుద్భవించినారు అందులో మల్లినాథసూరి అన్నివిధాల ప్రసిద్ధుడు వ్యాఖ్యాన ములు కావ్య భావమును సుబోధ మొనర్చుటకు ఏర్పడ్డవి వ్యాఖ్యాత కవిని పోషించునుగాని విమర్శించడు విమర్శకుడు కవిని పోషించడు ప్రోత్సహించును కావ్యములోని గుణదోష ములు నిరూపణ చేయును ఇది ఆంగ్ల సాహిత్యముద్వారా మనకు కలిగిన ఒక మేలు

మనఆంధ్రసాహిత్యములో అధికముగా కవులకు, అలంకారికు లకు అనురాగ మున్నట్లు కనబడదు ఒకఆలంకారికుడు తనగ్రంథము నకు'కవిసర్పగారుడము' అని పేరుపెట్టినాడు 'కవితాభ్రష్టో విమర్శక శ్రేష్టః' అని కవి విమర్శకుని నిరాకరించినాడు ఒకరు 'కవి కంఠా భరణము' అను పేర అలంకారశాస్త్ర గ్రంథము నొకదానిని వ్రాయగా 'నిరంకుశాఃకవయః' అన్నారు కవులు ఇట్లు ఎప్పుడును కవులకును ఆలంకారికులకును పొత్తే కుదిరెడిది కాదు ఈ ఉభయ వర్గాలలోను 'వారికంటె మేమే అధికులము' అను భావము పుష్క లముగా ఉండెడిది

కొంతమంది కవులు కూడ ఈ అలంకారశాస్త్రమునే బ్రహ్మాస్త్రముగా చేపట్టి తోడికవుల మీద మాత్సర్యముచే

వాగ్యుద్ధాలు సాగించినారు కొక్కొండ వేంకటరత్నముగారును కందుకూరి వీరేశలింగముగారును ఈ దోరణిలోనే కొంతకాలము పోరాడుకొన్నారు ఒకరినొకరు నిందించుకొన్నారు అలాగే తిరుపతి వేంకట కవులు కొప్పరపు కవులు సాహిత్య సంగ్రామము జరిపినారు ఇంతేకాదు ప్రతి కవియును మరియొక కవి రచనలోని దోషాలనే ఎత్తిచూపి ఎగతాళి చేయుటకు యత్నించినారే కాని గుణములను గ్రహించుటకు పూనుకొలేదు ఏ కొద్దిమంది కవులో ఇందుకు అపవాదముగా ఉండవచ్చును కాని వారి సంఖ్య వ్రేళ్ళమీద లెక్కించదగినదిగానే ఉండును వేయేల ? కావ్య సుందరి శరీరమును శతధా ఖండించి శవపరీక్ష చేసినట్టి విమర్శలు సాగినవిగాని కావ్యాత్మను గమనించు ప్రయత్నము నేటికిని ఇట్టి విమర్శలు వెలువడుచుండుట శోచనీయము ఇవి సాహిత్య లతకు జలసేచనాదికమైన దోహద క్రియలు నిర్వహించునవి కాక గొడ్డలి పెట్టు పెట్టునవి మాత్రమే విమర్శకులు ఈ రహస్యమును గుర్తించినవాడు గాని యదార్థమైన విమర్శకులు కాలేరు అట్లు కాలేనంతవరకు వారివలన లోకమునకు అపకారమేకాని ఉపకారము లేదు మరియొక చిత్ర మేమనగా ఒకరు సాధువన్నదానిచే మరియొకరు అసాధువనుట తమ వాదములో బలములేదని తెలిసికూడ 'తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నట్లు వాదమును సాగదియుట ఇందుచేతనే మనసాహిత్యములో విమర్శనమనగా రంధ్రాన్వేషణ మన్నది రూఢియై పోయినది

అలంకారశాస్త్రనియమముల ప్రకారము వ్రాసినదే కావ్యమని ప్రాచీన విమర్శకుల నిర్ణయము ఆంగ్ల సాహిత్య ప్రభావము వల్ల మనలో కొందరు యువకులు ప్రాచీనాలంకారిక నియమాలను ఉల్లంఘించి రచనలు చేసినారు మన రామలింగారెడ్డి ఈ సాహిత్య విప్లవకారులకు పెట్టని కోటగా నిలిచినాడు నిలుచుటే కాదు ! అలంకారశాస్త్రమును ఆవలకు నెట్టి ఆంగ్ల సాహిత్య సంప్రదా

యాను గుణ్యముగా సాహిత్య విమర్శ ప్రారంభించి కావ్యాత్మకు గౌరవము ఇచ్చిన గౌరవము ఆయనకే దక్కినది

* 'యథార్థమైన ఆంధ్ర కావ్య విమర్శ ప్రారంభము కవుల చరిత్ర పుట్టుకకు తర్వాత జరిగినది ఆ మహారంభమునకు ప్రథమాచార్యులుగా పేర్కొనబడగినవాడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు 'శబ్ద సాధుత్వ నిర్ణయమే గ్రంథ విమర్శన మనెడి భ్రమతో పండితులొకరితో నొకరు వాగ్యుద్ధములు చేయు దినములలో భావుకుల దృష్టిని శాబ్ద చర్చనుండి తాత్త్విక మీమాంసకు మరల్చిన రసికుడు శ్రీ రెడ్డిగారు కావ్యమునకు శబ్దము అధిభౌతికాంశముమాత్రమే అది బాహిరము దాని ఆధ్యాత్మికాంశము ఉద్గత కళాసౌందర్యము విమర్శమార్గమును శాబ్ద జగత్తునుండి ఆంతర జగత్తునకు కొనిపోయిన ప్రథమాంధ్రవిమర్శ గ్రంథము శ్రీ రెడ్డిగారి కవిత్వతత్త్వవిచారము ఈ గ్రంథరాజమునకు ప్రతిబింబములు ఇటీవల అనేక తత్త్వవిచారములు పుట్టినవి అవన్నియును ఈ మాతృ సస్యమును గ్రోలిన శిశువులే!"

భాషావిషయములో గిడుగు రామమూర్తిగారు కవిత్వములో గురజాడ అప్పారావుగారు విప్లవము తెచ్చినట్లే రామలింగారెడ్డి విమర్శనలో విప్లవము తెచ్చినాడు

కవిత్వతత్త్వవిచారము ఆవిర్భవించుటకు గల కారణములు అవతారికలో ఇట్లు వివరించినాడు రెడ్డి

'తొలుత 1899 న సంవత్సరములో నేను విద్యార్థిగా నున్నపుడు కళాపూర్ణోదయ పఠనోత్సాహంబునం జేసి సూరనార్యుని యెడఁ గృతజ్ఞతయు ఋణమునుండి విముక్తియు సాధ్యమైనంతవఱకుఁ బఱయంగోరి యాత్మతృప్తికై యొక యుపన్యాసము వ్రాసితి విదేశములయందును కళాపూర్ణోదయము మఱి మఱిం జూచుచుంటినిగాని వదలలేదు"

---

* ఎంగళి లక్ష్మీకాంతముగారు వ్యాససంగ్రహము పుట I' III

వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు దానిని ప్రకటించెద మని అడిగిరి కాని అది లభించలేదు తర్వాత పున పరనము చేసి ఈ విపుల గ్రంధమును రచించి క్రొత్తపేరు పెట్టిరి

ఇది 1914 వ సంవత్సరమున ప్రథమముగా ప్రచురింపబడి అనంతరము పెక్కు ముద్రణలను గాంచినది

కళాపూర్ణోదయమును విమర్శించుటకు సంకల్పించి ప్రభావతీ ప్రద్యుమ్నమును గూడ పరామర్శించుట జరిగిన దిందులో అయినను ఇది కేవలము ఆ రెండు గ్రంధముల విమర్శనమే అన రాదు వానిని పురస్కరించుకొని భారత భాగవత రామాయణము లను ప్రబంధములను పరామర్శించుటయు జరిగినది ఇంతేకాదు ఈ గ్రంథమున రెడ్డి అనేక సూత్రములను ప్రకటించినాడు కవిత్వ తత్త్వవిచారము ప్రథమ ప్రకరణము అయివుపట్టనవచ్చును ఉత్తమ నాహాత్యా నియమములను తొలుత చెప్పి వానిని బట్టి సాగించినా డాయన

మొదటి ప్రకరణములో ఆయన పేర్కొన్న కవితా లక్షణములను కొన్నింటిని గమనింతము

"భావనాశక్తి యనఁగా విషయములను మనసులోఁ బ్రతిబింబింపునట్లు చేయు సామర్థ్యము కృత్రిమములను సయితము మూర్తీభవింపఁజేయువారే మహాకవులు అట్టివారు వ్యాకరణమునకు భంగము కలిగించిననేమి ? వచనమున వ్రాసిన నేమి ? కేవల కల్పితములైన వానిం గూడ సాక్షాత్కారముం దాల్చిన చేతనములం జేయం జూచునది కావున భావనాశక్తి నాటక కౌశలంబుతో నను సంధించి యుండును అనఁగా నాటక రచనాశక్తి యున్నంగాని కావ్యములు సైతము యథార్థములుగఁ గన్పింపవు భావనాశక్తి నుద్దీపింపఁజేయు ప్రకృతి భావవైచిత్ర్యము మనుష్యుల మనంబులలో నిరంతర సంయోగముం దాల్చిన ప్రకృతులు మూఁడు గలవు ఆలోచనములు 1 కార్య కారణములఁ గూర్చి విచారణ చేయుట వస్తు స్వరూపము నిర్ణయించుట

యిత్యాదులు 2 భావములు అనఁగా మనోవికారములు 3 సంకల్ప ములు ఈ మూఁడు శక్తులలో భావనాశక్తి నధికంబుగ విజృం భింపఁజేయునవి భావములు ఏ వృత్తాంతము నైనఁ జూచునట్లు వర్ణింపవలయు నన్న దాని యొక్క స్థితిగతులను నందలి పాత్రల సుఖ దుఃఖములను రోమరోమమునకును దానే మనఃపూర్వక ముగ ననుభవించినం దప్ప తద్రూపముగ నభినయింప నెవరికిని దరము గాదు భావనాశక్తి సంఘటనోత్సాహము ఇవి పరస్పర మిత్రములనుట విమర్శన శాస్త్రమునందలి యాదిమ తత్త్వము భాషాచరిత్రమును దేశచరిత్రమును నిత్య సంయోగములు చేయుం బవలును వ్యాకరణములను ప్రాచీన కావ్యములను వర్జించు చుండుటచేత నూనెకు నష్టియే కాని కవితకుఁ బుష్టిలేదు అలం కారములు ప్రయత్నము లేకయ వచ్చినంత సహజముగ నుండుట వానింగూర్చిన ముఖ్యపద్ధతి విపరీతాలంకార రచనకుఁ బ్రేరేప కము భావశూన్యత విషయము శైలి రెండు ముఖ్యము విష యముచే రసము తప్పక కలుగుననుట తప్పు కథ బాగనుండిన జాలునా? తగినరీతిని వ్రాయబడియున్నంగాని కాదు ఈ దేశ ములో నొక్క యాంధ్రులుఁదప్ప దక్కిన యందఱకును రామా యణమందు గల యభిరుచి భారతమునలేదు మనకన్నో భారతము ప్రాణము ఆంధ్రంబున భారతరామాయణాదులకు గల శైలితారత తమ్యమే ఉత్కృష్టమైన భావము లేని నీరస మానసులు కవిత్వము జేయఁబూనుట వారి యొక్కయే కాదు మన యొక్కయు దురదృ ష్టము పాత్రలు అనితరతుల్యములుగ నుండవలయును సుప్రసిద్ధ పాత్రములన్నియు ననితర తుల్యములు మఱియు ననితర తుల్యములే సుప్రసిద్ధములు పాత్రముల సహజ వికృతుల నుద్ధరించుటయందు భారతమును మించిన గ్రంథ మీ ప్రపంచమునం దెక్కడను లేదు ప్రాచీనులు వ్రాసినట్లును అలంకార శాస్త్రము లాదేశించినట్లును విరచింపఁ బ్రయత్నించుట తెలివి తక్కువ పని భావపుష్టిలేని పద పుష్టికి 'బడాయి శైలి యని పేరు ఒకరు సృజించిన శైలి విష

యము రీతి ఇత్యాది విభాగములను ప్రతిబింబము రచింపఁజూచుట మంచిదికాదు. కళలో నుపజ్ఞ లేనిది స్వాస్థ్యముండదు. శిల్పులచే నారాధింపఁబడు సిద్ధి వేదన నున్నది యున్నట్లు ప్రదర్శించుట గాదు. మఱి కన్నది కన్నట్లు ప్రదర్శించుట. ఎట్టి సమయములందును వస్తువుల సర్వ సులక్షణములను వర్ణించుట గొప్ప యనలక్షణము. కళలయందు సర్వ పదార్థములను బాహ్య గ్రహణము నిత్యము. కథ వేగముగ నడవవలసిన చోట నలంకారములు గుప్తము జేయవలెను. కళ రచనలో గమనింపవలసిన విషయమేమన 'రసాభాస మేమాత్రము గలుగనంత పాండిత్య మున్నదా! లేదా!' యనుట. విషయమునకున్న రీతి శిల్పములం బ్రధానము. శైలి భావ ప్రకాశకము. శైలి భావము ఇవి యోగములేని ద్వంద్వంబులు. కన్నులఁ గట్టి కలగాంచిన రూపము ముందున్నట్లు చేయుట కవితా లక్షణము. ఈ మహేంద్రజాల కౌశల్యమున కాధారమైన గుణము భావనాశక్తి. విషయము మనసులోఁ బ్రతిబింబించునట్లు చేయు సామర్థ్యము భావనాశక్తి. ఒక్క ప్రతిబింబించుటయే యన నేల? ప్రత్యక్షముగ నవతారమెత్తునట్లు చేయుట. ఇందులో తిక్కన అధికుడు.

ఇట్లు ఎన్నో కవితాగుణములు మొదటి ప్రకరణములో కానఁగును.

ఇక విమర్శకుడు ఇందులో విరియఁబూసిన కవితాసూత్రాదులను కొన్నింటిని గమనింతము.

"సామ్యశక్తి భావనాశక్తి వలెఁ గవితకుఁ బ్రాణము గాక పోయినను, సమ్మాన్యార్హములైన శక్తులలో నొక్కండు. కళల యందు రెండు గుణములఁ జూపించవచ్చును: సుఖము, చమత్కారము. శిల్పముయొక్క యభిమతము సుఖముగాని చమత్కారము గాదని వేఱ చెప్పనేల? కేవలము చిత్రకవిత్వము భాషతో జేయు కుస్తీవంటిది. కవిత్వము ధన్యం బగుటకు భావము భాష రెండును

గలసి మెఱయవలయు ననుట నిత్యసమయము రసభాగమా ? కాదా ? యనుటయే శిల్పవిమర్శనము యొక్క ఒక్క పరీక్ష శిల్పము యొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట కవి బహు చమత్కారముగ మాట మీద మాట వచ్చి విషయము విశదమగు నట్లు సంభాషణము లేర్పఱచును నాటక కౌశలమని పేర్కొన బడిన ప్రతిభలలో నిది యొకటి కావ్యముల యందుఁ దత్త్వము గాదు ప్రధానము మఱి రసము మనల నేకాగ్రావధానులం బరవశచిత్తులం జేయుటకంటె శిల్పసౌభాగ్య మెయ్యది ? కథలో నాయకుం డొనర్చు కృత్యములచే నతని శీలము తెలియును మనకు బోధ యగు నట్లొనర్పనగునుగాని ప్రత్యేకముగ ధర్మముల జాబితా నొకటి వ్రాసి యతని మెడకుఁ గట్టినఁ గవియొక్క బుద్ధి లేమి దక్క నింకేద్దియుఁ దెల్లంబు గదు

ఐక్యమను కథాలక్షణమును బరికించు పద్ధతి యేదనఁగా ఉన్న భావములఁ దీసివేయవచ్చునా ? క్రొత్తవి యేవైనఁ జేర్చ వచ్చునా యని విమర్శించుట శృంగారము నాయికా నాయకుల చిత్తప్రకృతుల ననుసరించి యనేకరీతుల నుండును తన మనసులో నేదే నొక యాకృతిని చక్కఁగ నేర్పఱచి పదముల మూలమున దాని రసికులకు వ్యక్తపఱచిన నదియ కవిత్వము ”

రెడ్డి ప్రతిభ అంతయు మొదటిభాగ మందే కలదు ఇందు ఈ విధముగా కళాసూత్రములను ఉదాహరించిన ఎమ్మట ఈ సూత్రములను అనుసరించి ఎంగళి సూరనను విమర్శింపనాగినా డీయన

కవిత్వ తత్త్వవిచారములో సాహిత్య చర్చతోపాటు నారిమకు విమర్శనము కూడ గలదు అసలు రెడ్డిగారి రచన లన్నియు స్వీయ చరిత్రాత్మకములు (Autobiographical) ఈ పద్ధతి మంచిదనెడివారును ఉన్నారు చెడ్డదనెడివారును ఉన్నారు మంచిదనెడివారిలో ఆస్కార్ వైల్డు – The highest criticism

is in the record of one's own scul .Fairness is not one of the qual ties of the true critic

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారీ గ్రంథమును గురించి యిట్లు పలికినారు

కావ్య నాటకాదులను శాస్త్రీయముగా పారిభాషిక దృష్టితో చూచి తూచుట మొదటిదారి వానియందు తెలిసియో తెలియకయో ప్రతిబింబించిన ఆ యా కాలపు సాంఘిక రాజకీయాది విషయముల నెఱుగు కంటితో మూలముట్టుగ పరిశోధించుట రెండవదారి ఇదిగాక గ్రంథకర్త యొక్క ఆశలు అభిమానములు రాగద్వేషములు మొదలగు జీవన సూత్రములను గమనించి వాని యావిష్కరణ పద్ధతులు అందుచే మన హృదయమందుఁ గలుగు సంవాద వివాదములును తెలుపుట మూఁడవది మొదటి రెండు మార్గములను ఎంత యుపయోగకరము లైనను గుమాస్తా పనికి చేరినవి విషయ సంగ్రహము మాత్రమే మూఁడవది అనుభవ సంగ్రహము ఒక్క కావ్యమును విషయీకరించుకొని వ్రాసిన మఱొక కావ్య మనవచ్చును ఇట్టి రచనలకు తెలుఁగులో దారి తీసినవారిలో అగ్రేసరులు నే నెఱిఁగినంతవఱకు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారే ఇట్టి విమర్శనములను గూర్చియే ప్రతి విమర్శనమును ఒక ఆత్మకథ (Every criticism is an autobiogrophy) – అను మాట పుట్టినది ఇది శాస్త్రము కాదు చర్వణము బంధము గాదు బ్రతుకు

ప్రబంధ వాయికలు పుటలు 1 .

రామలింగారెడ్డి సర్వ స్వతంత్రుడు గొప్ప భావనాబలము గలవాడు రాజసము వాలు హెచ్చు కనుక ఆయన భావములు తీవ్రములైనవి అణకువ యెఱుగనివి తోచిన పొగడికగాని తెగడికగాని, వెనుదీయక ఖండితముగ చెప్పుట ఈయనకు ఉగ్గుబాలతో అబ్బినవిద్య 'నేను ఖండితవాదిని' అని ఆయనే చెప్పుకొన్నాడు

ఆయనరచన లన్నిటిలో ఈ తీవ్ర వాక్కే కలదు మరి వేమనలోని గుణమును ఇదేగద! ముందొక మాట చెప్పి వెనుక మరొకటి చెప్పెడివాడుకాడీయన అందుచేత మాట కొంచెము కటువే తన సంగతి తనకు తెలిసినవాడు కనుక, ఆ మాట అర్థశాస్త్రములో చెప్పగొన్నాడు రెడ్డి ఎవరి స్వభావము వారిది!

తనకు అభిమానకవి యైన సూరనార్యునియొక్క కవితలోని గుణములను చూపుటే కాక ఎక్కడెక్కడ అతడు తప్పటడుగులు వేసినదియు సోదాహరణముగ చూపుట రెడ్డి నిశిత దృష్టికి, నిష్పాక్షికతకు నిదర్శనము విమర్శన మన్న గుణదోష నిరూపణము గద!

కళాపూర్ణోదయముకన్న ప్రభావతీ ప్రద్యుమ్నము అల్పమని కూడా నిరూపించినాడు రామలింగారెడ్డి

ఆయన అభిప్రాయములను అన్నింటిని మనము శిరసా వహించ వలసిన పనిలేదు ఆయన రచనలో గూడ దోషములు లేకపోలేదు ఎవరును దోషరహితులు కారు గద! అందరి రచనలలోను దోషములుండుట సహజము

'శమదమాది సత్త్వగుణములు పట్టువడిన యెడల కైవల్యప్రాప్తి యెట్లోగాని కవిత్వప్రాప్తి నిండుయున్న రాజసతామస గుణములు కవితయను మందాకినీ మనోహర ప్రసాదమునకు జన్మస్థానములైన మహోన్నత స్థానములు"

పుట ౩౦

కవికి కావలసిన గుణములను పైవిధముగా పేర్కొన్నాడు రెడ్డి అయినచో ఆదికవి వాల్మీకి రాజసతామస గుణోపేతుడేనా ? కాళిదాస భవభూతులగతి ఇంతేనా ?

ఉన్నత భావములు తామసులకు కలుగనే కలుగవు రాజస సాత్త్విక ప్రకృతులు గలవారికే కలుగును కవిత్వము సత్త్వాదిగుణముల కందుకక్రీడ సత్త్వగుణ ప్రధానమైనదే ఉత్తమ కవిత

మహాకవిః విశ్వజనతకో ఘ్రావైక్యము ఉండవలెను ప్రతి పాఠకునికి అతనితో ఆత్మీయత కలుగవలెను

'Sympathy is the best of all the poetical graces

'సానుభూతి కురుతే కావ్యమ్మున్న దానిలో పరమార్థమిదే

రామలింగారెడ్డి కూడా ఈ అభిప్రాయమునే ఇంకొక విధముగా ప్రకటించినాడు

"బ్రాహ్మణులందరు కవులుకారు గాని కవులందరు బ్రాహ్మణులే కావలయును" ఇది చాల సత్యమైన సంగతి

మొత్తముమీద ఈ కవిత్వతత్త్వ విచారము అధిక ఖండన మండనలకు గురియైనది ఇదే దీని గొప్పదనమునకు నిదర్శనము

'ఏ కళాకృతి విషయములోనైన అభిప్రాయ భేదము లుత్పన్నములైనచో ఆ కళాకృతి నవ్యము సజీవము అన్నమాట"

—ఆస్కార్ వైల్డు

విమర్శనములో యుగపురుషుడుగా భావించదగినవాడు రామలింగారెడ్డి కవిత్వతత్త్వ విచారముపై అనేక విమర్శన గ్రంథములు అవతరించినవి వానిలో కొన్ని దీనిని ఖండించినవి కొన్ని మెచ్చుకొన్నవి అవి అన్నియు దీని స్తన్యమును గ్రోలినవే రెడ్డి సందేశము గమనించదగ్గది

'మనకున్న సంస్కృతి యేమో యున్నది కవితా సంప్రదాయము లున్నవి కాని మనస్సును ఉద్దీపింపజేసెడు క్రొత్త భావములు మాత్రము లేవు ఇప్పుడవి పాశ్చాత్య సభ్యతపేర వచ్చుచున్నవి వానిని మన సంస్కృతితో జతచేసి జాతీయ ముద్ర చావకుండ జూచుకొనుచు ముందుకు పోవుదముగాక!"

'రెడ్డి! నీ కవితా విమర్శన కథా శ్రీలే కథాకల్పి వే
రొండెన్ మార్గము పూర్వలాక్షణికు లుద్యోగంబు సద్యోగమై
యొడారించిన నీ వచో లతికం దుయ్యాల జంపాలలై
యుడ్డీనాకృతులైరె సూరన కవీంద్రోక్తి ప్రబంధాంగనల్"

—శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

# ప్రోత్సాహకుడుగా

"కాంతులు వెలిగ్రక్కు విలువగల మణులెన్నో చీకటులు చిమ్ము సముద్రగర్భమున దాగియున్నవి సౌందర్యమున కాలవాల మగు కుసుమము లెన్నో నట్టడవి యందు నిరర్థముగ నేల రాలు చున్నవి" అని ఆంగ్లకవి థామస్ గ్రే అనినట్లు ప్రతిభావంతు లెందరో ఉత్సాహ ప్రోత్సాహములు లేక మరుగున పడిపోవు చున్నారు అందుచేతనే ఎంతో ఆక్రోశముతో అన్నాడు ఆంధ్ర రత్నము– 'ఈ లోకములో గుజ్జుపుబండి వాడొక్కడే పైకి రమ్మనే వాడు" అని

'గుండె గొంతుకలోన కొట్లాడుతాది' అని బాధ పడెడి నూతన రచయితలకు చేయూతనిచ్చి రామలింగారెడ్డి ప్రోత్సహించి నాడు ప్రాతసంధాన పోయెడి వారిని నవ్యమార్గాన నడిపించి నాడు ఆయన ఉత్సాహ ప్రోత్సాహములచేత ఎందరో యువ రచయితల కంఠధ్వని వినెడి అవకాశము ఆంధ్రావనికి లభించినది

ఆంధ్రమున ఆయన పఠించని కావ్యము లేదు పల్లె పదాలు మొదలు భారతము వరకుగల రసవద్య రచన లన్నియు ఆయనకు సుపరిచితములు

కవితా విషయముననేగాక పాత్రపోషణ ఔచితి భావనా బలము మొదలగు వానియందు ఆంధ్ర కవుల ప్రతిభా ప్రాభవము లను ఆయన తరచి చూచినాడు అందువల్ల ఆయన పీఠికా రచన మున కావ్య విమర్శనమునకు కంకణము కట్టుకొన్న దిట్ట

తాను విమర్శింప బూను వాని మూలతత్త్వము చెప్పుచు దాని ప్రాశస్త్యమును చెప్పుటలో రెడ్డి గొప్పవాడు పీఠికా రూప మగు ఆయన ప్రోత్సాహమే ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసమునకు దోహదము కలుగ జేసినది

ఉదారాశయులగు విమర్శకుల వలననే గ్రంథకర్తల కౌశలము ప్రకటితమగును రాళ్ళపల్లి అబ్బూరి పింగళి, దువ్వూరి కాటూరి నండూరి మొదలగు వారి కెందరికో ప్రోత్సాహమిచ్చినా డాయన

చలం 'పద్మరాణి' చదివి 'ఈ పాత కథలతో కాదు నీవు కాలక్షేపము చేయవలసినది నీవు గొప్ప ప్రతిభావంతుడవు విప్లవ సాహిత్యము రచించవలె'నని సూచించి ప్రోత్సాహ మిచ్చినాడు

వానా సుబ్బారావును రామలింగారెడ్డి ఎరుగనే ఎరుగడు అయినను ఆయన రచనను చదివి ముగ్ధుడై ఇట్లు వ్రాసెను_

'You write literature, the real thing Rarely have I come accross such subtle and clear thinking, such beautiful and lucid style

తాపీ ధర్మారావు మొదలగు వారిని ప్రోత్సహించుచు ఇలాగే ఉత్తరములు వ్రాసెడివాడు ఇతరులలో ఏ మాత్రము ప్రతిభ యున్నను వారిని పైకి తీసికొని వచ్చెడి స్వభావము గలవాడు రామలింగారెడ్డి

మైసూరులో రామలింగారెడ్డి కిద్దరాంధ్రులతో పరిచయము కలిగిన పిమ్మట వారి అభివృద్ధికి ఆయన దోహదము కలుగజేసినాడు వారిలో ప్రథమముగా పేర్కొనదగినవారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ఆయన తనకు రెడ్డికి గల సంబంధము నిట్లు పేర్కొన్నారు

'కన్నడదేశ మకుటచేత తెలుగు సాహితిలో పరిచయము పెరుగుట కక్కడ సందర్భావకాశము శూన్యమైనా తండ్రిగా నుపదేశించిన ఆయింత తెలుగు కూడ మలినమై మాసిపోయి యుండును

ఆ సమయమున దాని కుత్తేజము కల్గించి ఉద్ధరించిన పుణ్యము కట్టమంచి రామలింగారెడ్డిదే నా సాహిత్య సంస్కారమున నాకు కడపటి గురువాయన

వారితో పరిచయము నాకు కల్గినది ప్రాయశః 1910 లో అప్పటికే ఆయన పాండిత్యము వ్యుత్పత్తి ప్రఖ్యాతి సర్వతో భద్రముగా నెలకొన్నవి మైసూరు మహారాజ కళాశాలలో ఆయన చరిత్ర తత్త్వశాస్త్రము ఆంగ్ల సాహిత్యము తర్కము వీనిని బోధించు ప్రధానోపాధ్యాయుడుగా నుండు కాల మది కాలేజీ చదువులతో సంబంధము లేనివాడనుగనుక వారివద్ద పుస్తకము పట్టి చదువు యోగము నాకు లభించలేదు అది లభించిన శిష్య పరంపరకు వారి యెడల కల్గిన భక్తి గౌరవాభిమానములు మరి యే ఉపాధ్యాయుడను సాధింపలేనంత గొప్ప విశాలమైన దృష్టి వికాసశీలమైన వాగ్మిత్వము ఆర్ద్రమైన పరిహాస కుశలత నిశితమైన విమర్శ నిర్భయమైన అభిప్రాయములు – ఇవి వారి సొత్తులు కన్నడదేశము : తెలుగు గ్రంథములు లేక వేసారుచున్న రెడ్డిగారు నా పరిచయమునకు సర్వాంగీణస్వాగతము నిచ్చిరి ప్రాత ప్రపంచముననే ప్రాకులాడుచున్న నాకు వారితోడి సహవాసము ఆధునిక ప్రపంచపు తలుపులు తెరచి ఆహ్వానించినవి దాని విలువ ఆయనగారి యితర శిష్యులకన్న నాకే ఎక్కువగా తెలిసిన దనవచ్చును అది మొదలు మా సంబంధము దినదినము పెరుగుచు వచ్చినది వారిని చూడలేని దినము దుర్దినముగా తోచినది సాయంకాలము ఏ రెండు, మూడు గంటల కాలమైనను మే మిద్దరము కూర్చొని కాలక్షేపము చేయని దినములు వారములో చాల తక్కువ తెలుగు కావ్యములు, ముఖ్యముగ కవిత్రయ రచనలు చదువుకొనుట – దానిపై లోకాభిరామాయణముగ ఎన్నో విషయములు వారు చెప్పుట నాతో చెప్పించుట – ఇది మా గోష్ఠికి పరాయణము వారి వినోదముకొరకే నేను తెలుగు కవిత్వమునకు శ్రీకారము చుట్టితిని నేను రచించిన తారాదేవి, మీరాబాయి అను ఖండకావ్యములను వారు విన్నంత శ్రద్ధతో విని అభినందింపగల్గినవారు ఇతరులు లేరు కాళిదాసుని రఘువంశమును నేను తెనిగించు పూనిక వారికొరకే అందు రెండు సర్గలు ప్రత్యక్షరమును

విని ముందరి సాగుకు ప్రోత్సహించినారు తెనుగింపు ఎంత ఎగుడు దిగుడుగా నున్నను మూలము నూహించి భావించు ప్రతిభా శక్తులు వారివి కనుకనే నా రచన ఆయనవద్ద చెల్లుబడియైనది కాని అటువంటి వ్యుత్పత్తిగలవారు తెలుగువారిలో ఎందరు లభింతురు? కనుకనే 1912 వ సంవత్సరమున నే నా రఘువంశము తెలిగింపు పదహారు సర్గలు పూర్తిగా ముగించితినిగాని దాని ప్రకటింపుమని ద్రవ్యముకూడ వారు ముందుగ సేకరించి చెప్పినను నేనా పని చేయలేక నా రచనను చెదలపాలు చేసితిని 'నాకు నావలె ఎందరికో తెలుగు మహాభారతమునందు అందను తిక్కనగారి రచనయందు — అభిరుచిని అభిమానమును కల్గించిన పుణ్యము మన రెడ్డిదే! నేటికిని శిశుపాలుడు భీముడు ద్రౌపది కర్ణుడు దుర్యోధనుడు అశ్వత్థామ మొదలగు పాత్రల చిత్రణమును తెలుగు భారతమున చదివినపుడెల్ల రెడ్డిగా రనుభవించిన బొమ్మలో మాంచములు నా భావనలో ప్రతిఫలింప యుండవు నా మిత్రులు శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు మా గోష్ఠిలో కొన్నాళ్ళు కలసియుండినదాని ఫలమే—

> 'పూజాతి సాంద్ర కర్పూరమ్ము పరిమ
> ప్రాజ్ఞదీపాధోల వంబుల యందు
> మడచు సన్నని పాట, పొడుచు వెన్నెల తేట
> కలవు తిక్కన పల్కు తెలుగు పల్కులకు"

ఇత్యాదిగా నానాగింపిన మధురగీతిక అర్థశాస్త్రము, కవిత్వ తత్త్వ విచారమును రెడ్డిగారు రచించు సందర్భమున వారి చిత్తు ప్రతిని అచ్చు ప్రతిగా తయారుచేయు పనిని నా కిచ్చిరి ఆ సందర్భమున సామాన్య సాహిత్యమునకు సంబంధించిన తెలివి కనువిప్పు నా కెంతో కలిగినవి ఎన్నో భావములు విప్లవములుగా మారినవి వాని విస్తరమున కింత చోటు చాలదు నాకు తెలుగు జీవితమునకు ముఖ్య దోహదము రెడ్డిదేయని మాత్రము ఇచట

సూచింపనెంచితిని నా యభిప్రాయములో ఏమైనను స్వతంత్రత
ఆగమ కలదేని అదివారి సహవాస ప్రసాదము ఉపదేశ ఫలము,
(శ్రీ అనంత కృష్ణశర్మ సన్మానసంచిక పుటలు 14 17)

శ్రీ శర్మను మహారాజావారి కళాశాలలో తెలుగు పండితు
లుగా నియమించుటేకాక ఆయనచేత ఆంధ్ర విశ్వవిద్యాలయ
ములో వేమన మీద ఉపన్యాసాలిప్పించి ఆయన గాథాసప్తశతి
అనువాద కావ్యమునకు పీఠిక వ్రాసి పలువిధములుగా ప్రోత్సా
హించినాడు రామలింగారెడ్డి

అర్థశాస్త్రమునకు కవిత్వతత్త్వ విచారమునకు కష్టపడి
ప్రూఫులు దిద్దిపెట్టుటకు కొంతవరకు సహాయపడినందుకు మైత్రి
చిహ్నముగా కృతజ్ఞతాపూర్వకవందనముతో రెడ్డి ఈ విధముగా
పలికెను

"శ్రీ మదనంత కృష్ణుడు విశేషగుణాఢ్యులు సంస్కృతాంధ్ర భా
షా మహనీయ విద్యల విశారద భావులు నాకుఁ దోడుగాఁ
బ్రేమయు గౌరవంబు మెయి పెక్కు విధముల నిల్చి సేయనే
నోమితిఁగాక లేనియెడ నోర్వఁగ నేర్తునె కార్యభారమున్"

శర్మగారు రాయప్రోలు సుబ్బారావుగారి రచనలు చదివి
విస్మితులై మద్రాసునుండి తెచ్చి రెడ్డికివ్వగా, రెడ్డి అబ్బూరి
రామకృష్ణారావుగారి మల్లికాంబ కావ్యమునిచ్చి ఎంత మధుర
ముగా నున్నదో చూడు మనిరి ఈ విధముగా వారు ఆనాడు
ఆంధ్ర లము కావ్యములను ఆస్వాదించి అభినందించెడివారు

రామకృష్ణారావుగారు మైసూరులో సంస్కృత పాఠశాలలో
చదువుటకు వచ్చినపుడు ఆయనను ఆహ్వానించి ఆయన రచనలకు
ముగ్ధుడై ఆయనకు విద్యార్థి వేతన మిప్పించినాడు రెడ్డి

అనంతరము ఆంగ్ల విద్యాభ్యాసమునకు కలకత్తా వెళ్ళి
నపుడు ఆయనకు నెల నెలకు ముప్పది రూపాయలు పంపుచుండెడి

వాడు రామకృష్ణారావుగారు తిరిగి ఆ ధనము నిచ్చెను గాని, రెడ్డి ఎన్నడు ఆ ధనమును ఆయననుండి ఆశించియుండలేదు

ఇట్లు ఆయన గోష్ఠి చేయుచు ఆ యిరువురిలో ఆంధ్ర భారతముపై అభిమానము కల్గించెను

ఎవరిలో ఏ మాత్రము సుగుణమున్నను ప్రోత్సహించి అభివృద్ధికి తెచ్చుట రామలింగారెడ్డి గొప్ప గుణములలో ఒకటి

"ప్రపంచము బాగుపడకపోయినను మానవుడు చేయవలసినదెల్ల ఒక ఘనకార్యమును సాధించి మరణించుటయే" అని స్పెన్సర్ తన మిత్రుడగు హక్సలేతో అనగా 'కాదు, అది కూడ అవసరములేదు మానవుడు చేయవలసినదెల్ల మరొకరికి ప్రోత్సాహమిచ్చి మరణించుటయే!" అన్నాడు హక్సలే

హక్సలే చెప్పిన చొప్పున ఒకరికే కాదు అనేకులకు ప్రోత్సాహ మిచ్చిన అమరజీవి రామలింగారెడ్డి

పైకి రమ్మనుటయే కాదు ఎందరినో పైకి తెచ్చి స్వీయ జన్మము సార్థకము చేసికొన్న చంతాత్ముడాయన

స్పెన్సర్ అన్నట్లు 'జీవితములో ఒక ఘనకార్యమును కూడ ఆయన సాధించినాడు ఆంధ్ర విశ్వవిద్యాలయ పిత రెడ్డి

'రెడ్డి అనగా వెనుకటి విజ్ఞానముమీద కలిగిన తిరుగుబాటునకు మూర్తి కాబట్టి తిరుగుబాటు ఎందులోనైన నుండనీ—అనగా సాంఘికముగా వుండనీ, సారస్వతముగా వుండనీ—అక్కడ ఆయన వాక్కో, కలమో మనిషో ప్రత్యక్షమౌతాడు తిరుగుబాటు రచయితలందరు ప్రోత్సాహమునకుగాని, సహాయమునకుగాని ఆయన దగ్గరికి మూగుతూ వుంటారు"

— నవ్యాంధ్ర సాహిత్యవీధులు

ఇందులో ఒక పొరపాటున్నది ఆయన ప్రాచీన విజ్ఞానము మీద తిరుగుబాటు చేయలేదు అంధాచారాలకు అభివృద్ధి నిరోధకమైన సంప్రదాయములను ఖండించినాడు

ఆయన తిరుగుబాటు రచయితలందరిని ప్రోత్సహించలేదు మేలి రచనకే ప్రోత్సాహ మిచ్చినాడు అనంతకృష్ణ శర్మగారు తిరుగుబాటు రచయితయా? సాహిత్యములోగాని సంఘములోని సూత్రాలు ఉరిత్రాళ్ళుగాక పట్టుత్రాళ్ళు కావలెనని ఆయన ఆశయము ఆయన వ్యావహారిక భాషను అంగీకరించలేదు ప్రాచీన ఫక్కీనే సంప్రదాయ సిద్ధముగా వచన రచన చేసినాడు పద్య రచనను అలాగే చేసెను సాంఘికముగా గాని తదితరత్రకాని ఉరి త్రాళ్ళుండరా దన్నాడు

ఈ సంగతినే పింగళి లక్ష్మీకాంతముగారు వ్యాససంగ్రహ పీఠికలో ఇట్లు అన్నారు– 'ఆధునిక కవిత్వములో నైనను సరసతతో పాటు నియమబద్ధత కలదానినే వీరు కొనియాడుదురు గాని విశృంఖల విహారమొనర్చు దానిని మెచ్చరు సముచిత నియమ పాలనము నిరర్థకతా విచ్ఛేదము అస్వాతంత్రతా తిరస్కారము– ఇవియే వీరు పదింబదిగా సాంఘికాచార విషయమునను కావ్య మర్యాద విషయమునను బోధించు ధర్మములు వీరి ఉపన్యాసములలో, వ్యాసములలో ఇతర రచనలలో కూడ ఈ ధర్మత్రయమే ఆత్మగా భాసించు చుండును"

వాస్తవము పలికినారు పింగళివారు సంఘములో గాని, సాహిత్యములో గాని సహృదయత్వ మవసరము

పశ్చిమ ఖండమునందు నవనాగరికులలో అభినవ నాగరకుడై మెలగినను ఆయన వాక్కునుండి తెనుగు నుడికారము జాలువారినది షేక్స్పియరు సాహిత్యము నుత్కంఠముగా అధ్యయనము చేసినను సూరనార్యుని కవితా మాధుర్యముపై వెగటు పుట్టినది కాదు ఇంతేకాదు, సంస్కార వికసితమైన ప్రజ్ఞారోచిస్సుతో ఆంధ్ర వాఙ్మయము నవలోకింప గలిగెను మరుగుపడిన మధుర కుంజములను చూచి చూపించెను పొడకట్టని సౌందర్య రేఖలను పోల్చుకొనెను ఇందే రెడ్డిమొక్క ప్రతిభావనమై యున్న సృజనాశక్తి ఉపలక్షింప దగును

“నవ్యోపన్యాసకులకు ప్రోత్సాహమియ్యటమే కాకుండా రెడ్డి చేసినపని సరియైన విమర్శను పైలుదేరటానికి మార్గము చూపించనే చూపించినది

సారస్వతములో చిరస్థాయిగా వేయ గల విషయం ”

(నవ్యాంధ్ర సాహిత్య వీధులు)

# వేమన - రామలింగారెడ్డి

వేమనయందు రామలింగారెడ్డికి అభిమానము అధికము ఆయన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిచేత వేమన మీద ఉపన్యాసము లిప్పించి గ్రంథస్థము చేయించినాడు ఆ గ్రంథము ఆంధ్ర శారదకు చక్కని అలంకారము

రెడ్డి కూడ తన తుది దినములలో వేమనను గురించి ఆకాశవాణిలో ఉపన్యసించినాడు వేమనయు రామలింగారెడ్డియు స్వతంత్రాలోచనాపరులు (Free thinkers) రెడ్లలోనేగాదు ఆంధ్రులలోనే గొప్పవారు ఈ యిద్దరు

‘కుటిల మతాచారములు మూఢభక్తి వేషధారిత్వము మొదలగు వానిని దూలనాడుట యందీత డద్వితీయుడు గొప్ప రహస్యములు బోధించినవాడైనను తనకుం గల నైజమగు బుద్ధినే గాని పలుపలు దెఱంగుల విపరీత వ్యాఖ్యానములం కెడమిచ్చు శాస్త్రముల నాశ్రయింపలేదు అనేకులు సిద్ధాంతముల కాధారములు ప్రాచీన సూత్రము లని నమ్మి వానిని వల్లించుటకై జ్ఞాపకశక్తిని వృద్ధిచేయుదు మనశ్శక్తిని గోల్పోయెదరు ఇక వేమన యన్ననో కారణవిమర్శన శక్తికిం బట్టాభిషేకముం జేసిన మహాత్ముడు ఇతని పద్యములలోం బరిహాసము దట్టము మఱుగు మర్యాదలు లేని మోటు విధములగాం దిట్టుడు నొప్పింజెందువారు

సైతము ఇతరులతోఁ గలిసి నవ్వునట్లు సేయ సమర్థుఁడు వేమన సుమతీశతక కర్తలు ఆంధ్రుల గురువులు”

తానుగాని నరుని ఒరులు ప్రేమించలేరు రామలింగారెడ్డి వేమనను ప్రేమించుటకు మూలము పై కారణముచే ఈ గుణములు ఆయనయందు గలవు, ఇక వీ ఇద్దరను గురించి తారతమ్య చర్చ చేయుదము

సహజముగా స్వాతంత్ర్య ప్రియ స్వభావము గలది ఆంధ్ర జాతి అటువంటి జాతిలో ఉద్భవించినవారిలో వేమన రెడ్డి గొప్పవారు

ప్రాతదంతయు పరమ సత్యమనియు క్రొత్తవానిని గ్రహింపరాదనియు భావించు అంధ విశ్వాసమును నాశనము చేయుటలో వీరు అసమానులు

పురాణములలోను, ఇతర గ్రంథములలోను కల్పించిన కట్టు కథలను స్వార్థకల్పితాచార సంప్రదాయములను మోమాటము లేక నిర్భయముగా ఖండించిరి

బాహ్యాచారములను ఆక్షేపించి, చిత్తశుద్ధి ఆవశ్యకతను ప్రకటించిన ప్రబోధకులు వీరు

ప్రతి తాత్వికాంశమును స్వానుభవముచేత తర్కించి మంచి చెడ్డలను గుర్తించిరి తమ సునిశితబుద్ధికి మంచిదని యెంచిన దానిని పొగడుటకు చెడ్డదని తోచిన తెగడుటకు జంకు గొంకులు లేని ధీరులు వీరు

తమకు ఇష్టముకాని పనులు చేయువారిని తమ మాట విననివారిని గాంచినప్పుడు వారి అజ్ఞానమునకు ‘అయ్యో పాప మనుటకు మారు పరిహాస్యము జనించి ఆ అపహాస్యము వీరి మనస్సులో నుండక కలమునుండి అనివార్యముగనే వెలువడును అటువంటి సందర్భములలో తా మాడు మాటలలో వారు అన్యత్ర యేమియు ఆలోచించలేదు

వీరు ఉద్రేకపూరితులు ఏ విషయమునందు ప్రవర్తించినను, వాడి-వేడి వీడకుండెడివారు

వీరి మనస్సులలో చాల ఆర్ద్రభావ మున్నను తీవ్రమైన వివేచనాశక్తి దానిని స్వాధీనపరచుకొని గట్టిచేసినది గాన వీరి పల్కులు గాఢముగాను, సూటిగాను నుండును

తిట్టు కవిత్వములో వెలుగువారు గడుసరులేగాని ఎక్కువ మంది ఆ తిట్లలో స్వార్థమున్నదిగాని పరార్థము లేదు 'నా కీయలే దని తిట్టినవారేగాని నీవు చెడిపోవుచున్నా వని తిట్టినవారు అరుదు ఈ అరుదైనవారి శ్రేణికి చెందినవారే వేమనయు, రామలింగారెడ్డియును

ఆ॥ చాకి కోక లుదికి చీకాకు పడఁజేసి
మైలఁదీసి లెస్స మడచినట్లు
బుద్ధిఁ జెప్పువాఁడు గ్రుద్దితే నేమయా ?
విశ్వదాభిరామ ! వినర వేమ ॥

ఈ మాదిరిగా తన తిట్టులను సమర్థించు కొన్నాడు వేమన

క॥ పలికితిని చేదు మాటలఁ
బలికితి నే హితముకానిపలుకుల నొకచోఁ
బలికితిని పో నసుం గృపఁ
దెలియుమి యని మనుపరయ్య ధీరప్రవరుల్

క॥ నరులార ! మీకు మీతర
తరముల వారికిని భువికిఁ దథ్యముగ శుభం
బరసియు దెగించి వ్రాసితిఁ
బరుషము లైనను గణింప వలయు విషయముల్

ఈ విధముగా రామలింగారెడ్డి విన్నవించు కొన్నాడు

వీరిద్దరు గొప్ప కవులు తమ భావాలను ఇతరుల మనస్సున కెక్కునట్లు చేయుటలో దిట్టలు అసలు కవిత్వమనగా అదే

వేమన పద్యకవి రామలింగారెడ్డి రచన పద్యమైనను గద్యమైనను కవితజాలు వారినది

సంగ్రహ నైపుణ్యము వీరి సొమ్ము

వీరి రచనలలో అసాధారణ మైన గుణములలో ముఖ్యమైనది భావ తీవ్రత అవి అంత తీవ్రముగ నుండుటకు కారణము అవి వారి సొంతము లగుటయె

సాధారణముగా అనేకులు భావదాసులు

ఎప్పుడు భావములు సహజముగ సొంతములగునో, అప్పుడే భాషకొక విధమైన బిగువు బలము కలుగును తీవ్రమయిన భావములు గలవారికె తొణుకులేని భాష వెడలును సహజ కవులకే ఇది చెల్లును

ఇటువంటి తీవ్రములైన భావములు గలవారు గనుకనే వీరి రచనలలో భాషా భావములు సరిసమానముగా సంచరించెను

వేమన తెనుగు ఛందస్సులలో నెల్ల చిన్నదగు ఆటవెలదిని తన భావమున కనుకూలించునట్లు గ్రహించెను

రామలింగారెడ్డి రచన అధికముగా గద్యమయమైనను అది అధిక సంగ్రహమైనది సూక్తి నిధి ఆయన గద్యరచనలో గడుసరి ప్రాచీన కవులు సంస్కృత భాషా ప్రభావమునకు లోనై, స్వభాషా స్వరూపమును చెరచిరి వేమన తెనుగు మీరిన కవి ఆధునికులు అనేకులు ఆంగ్లభాషా ప్రభావమునకు వశులై గద్య రచనలో తెనుగు నుడికారమును పోగొట్టినారు రామలింగారెడ్డి రచనలో ఎక్కడను ఆంగ్లభాషా ప్రభావము కనుపించదు ఆయనలో తెనుగు తనము తేజరిల్లినది

వీరు ఇతరుల హితముకొరకు వ్రాసినారుగాని వారు తృప్తి పడవలెనని వ్రాయలేదు వారు తమ్ము స్తుతింతురని అంతకంటె వ్రాయలేదు తిరస్కరింతురని తమ మార్గమును వీడనులేదు

మనలో అనేకులు కావ్యరచనకు కారణము 'కావ్యం యశసే అర్థకృతే" అను సిద్ధాంతమునకు లోబడి వ్రాసినవారు కవిత్వ

మొక వృత్తిగా పెట్టుకొన్నవారు గాని వారు తమ అభిప్రాయము లను చెప్పుటకు ధీరులై వెలసినవారు గారు వీరు కేవలము తమ అభిప్రాయ ప్రకటనకే కావ్యరచన చేసినవారు

అన్నిటికి మించిన ఒక ఉత్తమమైన సుగుణమగు శ్రద్ధ వీరి యందు ఘనీభవించినది తాము గొప్ప తత్త్వమును కనుగొంటి మను విశ్వాసమునకు తోడు జీవించి యుండగానే దానిని అందరకు తెలుపవలెను పట్టుదలగలవారు గావున ఎవరు విన్నను వినకపోయి నను తమపనులను నిర్వర్తించినారు అయినను అందుచేతనే వీరు తమ నాటి సాంఘిక మతపద్ధతులతో తృప్తి చెందలేదు

వేమన కవిత్వమునకు అధిక బలము తెచ్చినది ఆయన హాస్యప్రకృతి ఆయన హాస్యములో కొంత కటుత్వమున్నను నొప్పించకుండ నవ్వించెడిది కావలసినంత యున్నది

రామలింగారెడ్డి రచనలలో హేళనయున్నను కొంత మృదువైన హాస్య ప్రకృతిగల రచయిత ఆయన ఉభయులు హాస్యప్రియులు వేమన రచనల అధికవ్యాప్తికి ఆయన కవితాధార హాస్యమేగాక, ఆయన నీతులును కారణమే !

రామలింగారెడ్డి అక్షర లక్షలు చేసెడి అనేక సూక్తులు చెప్పెను అవి గద్యములో అక్కడక్కడ ఉండుటవల్ల అందరును గ్రహించలేరు ఆయన రచనలనుండి వానిని ఎత్తి కూర్చినచో అదొక గ్రంథమగును

స్త్రీల సందర్భములో వీరి అభిప్రాయములు పరస్పర భిన్నములు

'సతులు జపతపములు సేయ సాగితే పురుషులేల నింక పుడమిలోన బాపమెంచవద్దు పట్టి శిక్షింపుడు''

'గతులు సతుల వలన గానగా లేరయా ఆడుదనగ రోత''

ఈ మాదిరిగా స్త్రీని తన కాలములో అందరును నిందించినట్లే నిందించినాడు వేమన

రామలింగారెడ్డి స్త్రీ స్వాతంత్ర్యవాది

సంఘ సంస్కారమును గురించి వీరి భావములు ఇదివరకున్న సాంఘిక నియమము లన్నిటిని అతిక్రమించినవి

ఉర్వి వారికెల్ల నొక్క కంచముఁ బెట్టి
పొత్తు గుడిపి కులము పొలియఁ జేసి
తలను జేయి పెట్టి తగనమ్మ చెప్పరా
విశ్వదాభిరామ ! వినురవేమ !

ఇది వేమన పలుకయినను రామలింగారెడ్డి అభిప్రాయము ఇంతే ఇది ఆచరణ యోగ్యమా కాదా అనిగాదు భేదభావము లన్నియు పోగొట్టి సమతను స్థాపించుటే వారి భావము

ఆర్థికముగా అధోగతిలో పడి మనము ఉన్నామనియు పారిశ్రామికముగ పెంపొందిననే గాని, మనము అభివృద్ధి చెందలేమని రామలింగారెడ్డి భావన వేదాంత బోధవల్ల ప్రయోజనము లేదు ఆర్థిక దృక్పథము కలుగవలెనని ఆయన ధోరణి వేమనకూడ ధనావశ్యకతను గురించి అధికముగా చెప్పెను ఇహలోక సౌఖ్యము లన్న వీరి కుభయులకు ఎక్కువ ప్రీతి ఇదియే పరలోక సాధనకు మెట్టని వీరిభావము భావించుటయే గాదు అనుభవించినారు

మాటలను ఈ తెలుగా వాడినారు శాంత మూర్తులై చప్పుడులేక చప్పిడి బ్రతుకులు బ్రతికినవారు గారు

ప్రపంచము వలన, ప్రపంచమునకై పడిన కష్టములకు శాశ్వతత్త్వము పొందినాడు వేమన రామలింగారెడ్డి ప్రపంచము వలన కొన్ని నిందలు పడినాడు ప్రపంచమునకై కొంత శ్రమించినాడు సాహిత్య రంగములోను విద్యాక్షేత్రములోను ఆయన నామము అజరామరమై అలరార గలదు

# ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్మాణములో

హైదరాబాదు (నిజాము) రాజ్యములో తెలుగు, మహారాష్ట్రము కన్నడము మాటాడువారు ఉండిరి అందులో తెలుగు వారు అధిక సంఖ్యాకులు మహమ్మదీయులు నూటికి పదిమంది మాత్రమే ఆ ప్రాంతము అధికముగా వెనుకపడ్డ ప్రాంతము అక్కడ ధనికులు బీదలుతప్ప నడిమి తరగతి ప్రజలు లేరు అందుచేత అది ఆనాడు విద్యావిషయమున వెనుకపడి యుండెను

హైదరాబాదులో ఉన్నత విద్య నిజాము కళాశాలలో తప్ప మరెక్కడను లేదు అది అప్పుడు మదరాసు విశ్వవిద్యాలయమునకు అనుబంధముగా ఉండెడిది నవాబుగారి పిల్లలకు, జాగీరుదార్ల పిల్లలకు మాత్రమే అందు ప్రవేశము సాధారణ ప్రజల బిడ్డలకు మాధ్యమిక పాఠశాలలు మాత్రమే

నేటి నవాబు మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ 1911 వ సంవత్సరములో రాజ్యమునకు వచ్చెను హైద్రాబాదు ఇస్లాము రాజ్యమని, రాజ్యభాష ఉర్దూ అని నాటి ప్రచారము నాటి ప్రభుత్వపు విద్యాశాఖా కార్యదర్శి హైదర్ నవాబు జంగు విద్యాప్రియుడు 1913వ సంవత్సరములో ఉస్మానియా విద్యాలయము స్థాపింపబడినది

నవాబు ఉస్మానియా విశ్వవిద్యాలయముకొరకు మహా భవనమును కట్టించెను దీనిలో ఉర్దూద్వారముగనే సమస్త విద్యలను బోధించుటకు ఏర్పాటు జరిగినది నాడు భారతదేశములో ఏ విశ్వవిద్యాలయము కూడ దేశభాషలలో ఉన్నత విద్యాబోధనము చేయుటకు ఇట్లు పూనుకొనలేదు నాడు ఉర్దూ రాజభాష అయినందున హైద్రాబాదులో ఇట్టి అవకాశము కలిగినది

ఈ విశ్వ విశ్వవిద్యాలయ స్థాపకులలో ఒకరగు అక్బరు హైదర్ 1908 వ సంవత్సరమునుండి రామలింగారెడ్డికి మిత్రుడు రెడ్డికి దేశ భాషలలో విద్య బోధించుట అవసరమను భావము 1907వ సంవత్సరములోనే కలిగినది సర్ అక్బరు హైదర్ రెడ్డిసలహా సంప్రతింపులమీదన ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్మాణమునకు కృషి చేయుట జరిగినది ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సమయమున ఈ విషయము పేర్కొనబడినది విద్యావేత్తగా విఖ్యాతిగాంచిన రామలింగారెడ్డికి దక్షిణదేశస్థ సర్వ విశ్వవిద్యాలయములతో సంబంధముండుట ఆంధ్రులమైన మనకు ఆనంద కారణము గదా!

# రాజకీయ రంగము

మన సాంఘికదోషములును, జాతీయాపచారములును మన కంఠమునకు పారతంత్ర్య పాశమును బిగించునవి వానివలననే భారతదేశము మహమ్మదీయుల యేల్బడిలో కొన్ని వందల యేండ్లును, అటుపిమ్మట నాంగ్లేయుల పాలనలో మఱికొన్ని వందల యేండ్లును పరదాస్యవ్యథ పుష్కలముగా ననుభవించినది పదునారవ శతాబ్దమున పాశ్చాత్యులగు బుడతకీచులు డచ్చివారు, పరాసువారు, ఇంగ్లీషువారు వర్తక వ్యాజమున మన దేశములో కాలూని క్రమ క్రమముగా తిన్నయింటి వాసా లెన్ను దిట్టలయినారు దొంగలు దొంగలు గలసి యూళ్ళు పంచుకొను విధాన మన దేశమును వా రాక్రమింపఁగోరి యత్నించినారు ఇందు బంపకములు కుదరకయు సర్వము తమకే కావలెనని యెవరికి వారే యభిలషించియు నన్యోన్య విజిగీషతో రణములు సాగించిరి అందు పైచేయి యైన యాంగ్లేయులు అమాయికులగు భారతీయులతో మైత్రి పాటించుచున్నట్లే యుండి నమ్మికొన్న వారిని నేర్పుమీఱ వంచించిరి మఱి

నన్నని వారిని వంచించుట సాధ్యమా ! ఎట్టపోను ఎట్టపోను ఎల్లితీర్చ నన్నట్టు రాజ్యము కొరకై ఇటు హిందువులును మహమ్మదీయులును సాగించునట్టి పోరాటమును అంగ్లేయులు తీర్చివైచిరి ఎదుటివాని వ్రేలితో ఎదుటివాని కన్నే పొడుచునట్లు భారతీయులచేత భారతీయులనే తనుమూరించిరి 'నేను పొట్టు తెచ్చెదను నీవు పప్పులు తెమ్ము ! ఇర్వురము గలపి యూదుకొని తిందమన్నట్టు భారతీయులతో పొత్తు వాటించి తమ పెట్టుబడి విల్లిగవ్వ లేకుండ నడిపిన రణ వ్యాపారాలలో రాజ్యలాభము విపరీతముగా గడించిరి

ఈస్టు ఇండియా కంపెనీ అనుపేర భారత దేశముతో వర్తకమునకై వచ్చిన బ్రిటిషు దళారులు ఇట్లు కాలక్రమమున స్వదేశ సంస్థానాలను ఎన్నిటినో దిగమ్రింగి ఏకమేకగునల్లు బలియునప్పటికి 1857 వ సంవత్సరము వచ్చినది అప్పటికి భారత ప్రజ కన్ను తెరచినది కాని చేతులు కాలినవెనుక ఆకులు పట్టి యేమి ప్రయోజనము ? భారత స్వాతంత్ర్యమునకై మతభేదములు మరచి హిందువులు మహమ్మదీయులు ఒక్క త్రాటిపై నిలచి పోరినను జయము సిద్ధించినది కాదు

ఇట్లు ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధములో మనకు గెలుపు కలుగక పోయినను అది పూర్తిగా నిరర్థకము కాలేదు 'పారతంత్ర్యము దుర్భరము దానిని ఎట్లయినను తొలగించుకొనవలెను మనలో మనము తగవులాడుకొనుచుండుట చేతనే విదేశీయులు మన నెత్తిపై ఎక్కి ఎండి కొట్టగలుగుచున్నారు " అని భారతీయులెల్లరు గుర్తించినారు 'కత్తిని కత్తితో ఎదుర్కొనుట గాక మఱొక సాధనముతో ఎదుర్కొనుటయే ఉచితమేమో ! అను ఆలోచనయును కలిగినది

ఇక బ్రిటిషువారి తత్త్వములో గూడ ఎంతో మార్పు వచ్చినది పాతశేషములయిన స్వదేశ సంస్థానముల జోలికి పోకుండుట, భారతీయుల మతాచారములను అపహసింప కుండుట వారితో సాధ్యమయినంతవరకు సాన్నిహిత్యము పెంపొందించుకొనుట

ఆవశ్యక కృత్యములని వారు గ్రహించినారు కంపెనీ వారి చేతిలో నుండి దేశ పాలనము విక్టోరి మహారాజ్ఞి చేతిలోనికి వెళ్ళినది ఆరునేల మైళ్ళ దూరమున నున్న రాణి యీ దేశము నేలుట కష్ట మనియు ఆమెకు ప్రతినిధులుగా నిచ్చట పరిపాలనము నిర్వహించు వారును ఈ దేశ ప్రజల భాష లెరుగకుండ అభిప్రాయ ప్రకటనము నడుపుట అసాధ్యమనియు విశదమయినది కాబట్టి పరిపాలనలో భారతీయుల కోడ్పాటును ఆవశ్యక మనియు అందులకై వారికి ఆంగ్లభాష బోధింప వలెననియు ఆంగ్లము నేర్చిన భారతీయు లుద్యోగములతో దృప్తిపడి స్వరాజ్యము మాట దలపెట్ట కుందు రనియు నాంగ్లేయాధికారవర్గ మభిప్రాయ పడినది ఇంగ్లీషు చదు వుల కలవాటు పడిన యీ దేశప్రజలు కాలమున నింగ్లీషువారి సర్వ నాగరకతకు దాసను దాసులు కాగలరను భావమును ప్రభుత్వమున కున్నది దానితో విద్యా ప్రణాళిక లేర్పాటు చేసి భారతీయ పాఠశాలలో నాంగ్ల భాషకు ప్రాముఖ్య మిచ్చుట సంభవించినది

ఆంగ్లేయు లింత యాలోచించి యీ దేశమున నింగ్లీషు చదువు ప్రవేశపెట్టినను వా రనుకొనని ఫలిత మొకటి కలిగినది నరుడు తా నొకటి తలచిన దైవము వేరొకటి తలచును గదా! ఇంగ్లీషు చదివినకొలదియు భారతీయుల మూఢ విశ్వాసములు నశించుటయు నాంయుకార్థిక రాజకీయ స్వాతంత్ర్యాభిలాష మనివార్యమై రేకెత్తుటయు తటస్థించెను

1885 వ సంవత్సరములో భారతీయుల సాధక బాధకము లను ప్రభుత్వము వారికి తెలుపుకొనుటకై ప్రజా పక్షమున కాంగ్రెసు ఉదయించినది నాటినుండి ప్రతి సంవత్సరమును కాంగ్రెసు సమావేశములు జరుగనాగినవి ప్రజలలో రాజకీయ ప్రబోధము జరుగ సాగినది కాంగ్రెసు ముఖతః ప్రజాభీష్టములను ప్రభుత్వమున కెరుకపరచుట ప్రారంభమయినది

1913 వ సంవత్సరములో జరిగిన కరాచీ కాంగ్రెసులో కాంగ్రెసువారు ముస్లిములిగువారు కూడ దేశమునకు క్రొత్త రాజ్యాంగ ప్రణాళికను తయారుచేయవలెనని తీర్మానించి ఒక కమిటి నేర్పాటు చేసినారు 1916 వ సంవత్సరములో సమావేశ మయిన కాంగ్రెసు ముస్లింలీగు కమిటీవారు ఒక సంస్కరణముల ప్రణాళికను సిద్ధపరచినది

అనిబిసెంటమ్మ లోకమాన్య తిలక్ స్వరాజ్యము కావలెనని ఆందోళన చేయసాగినారు దేశమంతయు ఆందోళనపూరిత మయినది

1917 వ సంవత్సరములో ఇండియా దేశమునకు మాంటేగు సెక్రటరీ అయినాడు ఈయన క్రొత్త రాజ్యాంగమును ప్రవేశ పెట్టెద నని ప్రకటించి మన దేశమునకు వచ్చినాడు అప్పుడు మన గ్రామాలలో స్వరాజ్యము కావలెనని కాంగ్రెసు ముస్లింలీగు సంస్కరణముల పుస్తకముల మీద సంతకములు చేసి పంపుట జరిగెను ఇట్లు సంతకములు చేసి గ్రామాలకు స్వరాజ్య సందేశము వ్యాపింప జేయవలెననెడి భావము గాంధిమహాత్మునిది

మాంటేగు 1918 వ సంవత్సరములో మన దేశమునకు వచ్చి కొంతమంది పెద్దలతో సంప్రతించి ఒక రాజ్యాంగ ప్రణాళి కను ఏర్పాటు చేసినాడు ప్రభుత్వమును రెండు శాఖలుగా విభ జింపవలెనని అందొక శాఖ ప్రభుత్వాయత్తము కాగా రెండవది ప్రజాయత్తమై యుండవలె నని యీ ప్రణాళిక యుద్దేశము దీనికి ద్వంద్వ ప్రభుత్వమని నామకరణము జరిగినది ప్రజలకు సంబంధిం చిన విద్య స్థానిక స్వపరిపాలన పరిశ్రమలు మొదలయినవి ప్రజా పరమైనవి రెవిన్యూ ఆబ్కారి మొదలగు కాసులు రాలు శాఖలు ప్రభుత్వ వశములోనే యున్నవి ఇండియా మంత్రి మాంటేగు దొరవారును ఇండియా రాజ ప్రతినిధి చెమ్సుఫర్డుగారును ఈ రాజ్యాంగ సంస్కరణములను రూపొందించుటచే వీనికి మాంటే ఫర్డు సంస్కరణము లని పేరు వచ్చెను

కాని యీ సంస్కరణములకు కాంగ్రెసు ఆమోదించలేదు రాష్ట్రీయ స్వాతంత్ర్యమే కావలెనన్నది

అయినను ఈ సంస్కరణములు అమలులోనికి రానున్న వేళ 1920 వ సంవత్సరములో జరిగిన రెడ్డి మహాజన సభలో వీనిని ఆమోదించి జయప్రదముగా నిర్వహించుకొనుట మేలని చెప్పుచు మన రెడ్డి యిట్లు హెచ్చిరించినాడు

'శ్రీ మాంటేగు గారి రాజ్యతంత్ర సంస్కరణ శాసనము నూతన యుగమును ప్రవేశింప జేసినది దానిచే పురస్కృతములై వచ్చిన స్థితిగతులకును తత్పూర్వ స్థితిగతులకును సామ్యము సున్న ఇది క్రొత్త లోకము ప్రాత పంచాంగములు పనికిరావు ఈ నవజీవనముతో సమన్వయము కాదగు విద్యలను నడవడిని ప్రారంభములను ఉద్యోగములను సాంఘిక నీతులను మనము అతివేగముగా అలవరచుకొంటిమా సరే ప్రబోధితిమి లేకున్న కార్యము మించిపోవును పిమ్మట దిద్దుకొనుటకు రాదు పూర్వకాలములో అనగా మాంటేగు గారి ధర్మశాస్త్రమునకు ముందట ప్రజలకు రాజ్య తంత్రములో భాగము లేదు జవాబుదారీ లేదు హక్కులు లేవు ఉత్తరవాదిత్వము లేదు ఒప్పులున్న మనవి కావు తప్పులున్న గవర్నమెంటువారివా నింద ? కష్టములున్న సర్కారువారి యెదుట మొఱబెట్టుచుంటిమి నష్టములున్న వారి సాహాయ్యము ఆశ్రయింతము వినుభారము కను భారము, తీర్మానించు భారము వారిదిగా నుండెను ప్రకృత మట్లుగాదు రాజ్యతంత్రమున కొన్ని ప్రకృతులు విద్యాశాఖ మొదలగునవి ప్రజల యధీనము చేయఁబడియున్నవి

ఇవి ప్రజా పరిపాలనమునకు లోనై యున్నవి అనఁగా ప్రతినిధులద్వారా ప్రజలు చెల్లించెడు పరిపాలన మని యర్థము ఇట్లు మన పరముగా చేయబడిన ప్రకృతులలో తప్పొప్పులు సంభవించిన నా భారము మనది దోషములున్న మనమే సవరించుకొన

వలయును పరాశ్రయము వినష్టమైనది స్వాశ్రయము వచ్చినది స్వరాజ్యాధీనములగు ప్రకృతులు ప్రజల యోగక్షేమములతోను దైనందిన జీవితములతోను ఎక్కువ సంబంధము గలయవి అవి చక్కగా వర్తింపకున్న మనస్థితి యింకను చెడినదగును కావున వాని పరిపాలనము నందు మనము నిగా యుంచుట ప్రాణసమాన మైన పని అట్టి యధికారములో యుక్తమైనంత వాలును బడపెన వారము గాకపోయితిమేని గౌరవమును క్షేమమును శూన్యము లగును

కొన్ని రాజ్యాంగములు ప్రజాధీనములు చేసినారన్న నర్థమేమి ? ప్రజ లందఱు సంపూర్ణైకమత్యమును బడసినవారు కారు ప్రతి దేశములోను కక్షు లున్నవి అందు మన దేశములో జెప్ప వలయునా జాతి భేదము మత భేదము వర్ణ భేదము ఈ భేదములో మఱి చిల్లర భేదములు ఇట్లు విచ్ఛిద్రకము లన్నియుఁ బ్రబలి చిందరవందరయై యున్నది గంగానది ముఖమే చీలి యున్నదట ! దానికన్న నెక్కువగా దేశము చీలియున్నది పై కక్షులుగాక యితరములు నున్నవి వ్యావసాయికులయు కళా వాణిజ్య జీవులకు ఆర్థిక నీతివిషయమైన భేదము లున్నవి గ్రామ వాసులకు పట్టణవాసులకు రాజనీతి విషయమైన భేదము లనేకములు పన్నులు కట్టువారు గ్రామ వాసులు మంచి పాఠశాలలు, వైద్య శాలలు స్థాపితములు నగరములలో ఆరోగ్యాభివృద్ధికై చేయఁ బడు వెచ్చములో హెచ్చు భాగములు పట్టణములు మ్రింగు చున్నవి వీధులను విశాలములు చేయుటకు, రామణీయకము దెచ్చుటకు ఇత్యాది నగరాభివృద్ధి కార్యక్రమములకు లక్షలకొలది సెలవుచేయున్నారు గ్రామములులోని పిస్థితిని బాగుచేయుటకు కాసైన నియ్యరు ఇట్లగుట గ్రామస్థులకు, పట్టణస్థులకు వైర మున్నది గ్రామస్థులు హెచ్చరికతో వర్తింపరేని ఉండునది కొల్లబోవునని యనేకుల యభిప్రాయము

రాజనీతియందు ప్రవేశించి ప్రబలౌన్నత్యము వహించుట కర్తవ్యమని అందఱు ఒప్పుకొన్నను మన కాశక్తి యున్నదా ఆ కార్యభారమును వహించు దార్ఢ్యము మనకు గలదా యని మనవారు కొందరు శంకించెదరు ఈ యధైర్యము నిర్హేతుకము అనర్థకమును నీళ్ళలో దిగనిది యీత కొట్టుటెట్లు? ఇక నీత కొట్టుట తెలుత నేర్చుకొననిది నీళ్ళలోనికి దిగగూడదని బాయిడా చేసిన నది సమంజసమా? అనుభవముమీద కార్యక్రమము లలవడును రాజతంత్రము పరమ రహస్యమైన వేదాంతము కాదు తత్త్వశాస్త్రము కాదు ప్రజాజీవిత సంబంధమైనది మన కష్టములు మనకు తెలియవా? మనకు దెలిసినట్లు ఇతరులకు దెలియునా? కష్టములు నివేదించుట ప్రతినిధుల ధర్మములలో నొక్కటి గదా? ఈ ధర్మమును ప్రత్యక్షానుభవము గలవారు చెల్లించినట్లు ఇతరులు చెల్లింపగలరా? బిడ్డయేగను సరే ఏడువనిది వాలుదొరకదు ఎరోదనము నితరుల రోదనము చేయుటకన్న మనమే స్వయముగ జేసిన స్వారస్యమును ప్రభావము హెచ్చుగా నుండదా? మనవారు మంచి శైలిని వ్రాయజాలరేమో? ప్రసంగములు ప్రకటింపజాలరేమో? ఉండనిండు-శైలికన్న తెలివి విశేషము గ్రామస్థుల చింతలను గూర్చిన తెలివి మనయందు లేదా యేమి? లేదని యెట్టిమూఢుడును చెప్పడు సరి కష్టము నివారించు పద్ధతుల కనిపెట్ట ప్రచారమునకు దెచ్చు మార్గముల వ్యక్తీకరించు శక్తి శూన్యముగ నున్నను గ్రామస్థుల విచారములు సంపూర్ణముగ వివరించి బహిరంగపరచి సర్కారువారి దృష్టి వానిమీద బడునట్లు జేసితిమని యంతే చాలును ప్రజా ప్రతినిధి ప్రభుత్వమనగా ప్రతినిధి ప్రభుత్వమే! ఒక్క కళాశాలా విద్యాంకితుల ప్రభుత్వము కాదు మనము ప్రజలము కామా? మన ప్రతినిధులు ప్రజాప్రతినిధులగు నర్హులు కారా? ప్రజా పరిపాలనమనగా ప్రజలయొక్క సరాసరి శక్తి యుక్తుల ప్రకారము వర్తిల్లు పాలనమని పేరు ఈ సరాసరి శక్తి ప్రజాబాహుళ్యమందు

తక్కువపడినదిగా నున్న నెవరి తప్పు? మనదికాదు మఱి యెవ్వరు పట్టణవాసులకు ప్రౌఢవిద్యాభ్యాసానుకూలము లైన స్కూళ్ళను ప్రజా బాహుళ్యమునకు నిష్ప్రయోజకము లైన స్కూళ్ళను గలిగించి విషమత్వము ప్రతిపాదించి పుణ్యము గట్టికొనిరో వారి తప్పు ప్రజా పరిపాలన మనగా బి ఎ బి ఎల్‌ల పరిపాలనము గాదు సామాన్యప్రజల యొక్క నిజ ప్రతినిధుల ప్రభుత్వము ఒక వేళ మనవారి రాజ్యతంత్రము దేశవృద్ధియొక్క వేగమును తక్కువ పరచి రాజ్యచక్రము కొంత మెల్లగ నాగు నదిగా చేసినను ఈ కొఱతను పూరించి ఈ నష్టమును కట్టి యిచ్చుటతోఁ బోక విశేషించి లాభమును గలిగించెడి సిద్ధి యొకటి నిత్యమగును"

రెడ్డి ప్రబోధము ప్రశంసనీయము 1920 వ సంవత్సరము నాటికె ఆయనకు ప్రజా దృష్టి యేర్పడుట గమనించ దగిన విషయము ఇంతవరకు ఈ దృక్పథముతో మాటలాడినవారు లేరు

'పరిపాలనలో బుద్ధిమంతులు పాల్గొనుటకు నిరాకరించిన యెడల దుష్పరిపాలనక్రింద జీవితము గడపు శిక్ష వారనుభవించ వలసి యుండును" అని ప్లేటో ఏనాడో ప్రవచించినాడు

తన్ను గుఱించి ఒక ప్రముఖుడు 'రాజకీయాలలో చేరి పతన మైన మహర్షి గాంధి అనగా 'అట్లుకాదు నేను రాజకీయ వేత్తను మహర్షి నగుటకు కృషి చేయుచున్నాను అంతే' అనినాడు గాంధిజీ ఇంతే కాదు 'రాజకీయాలతో సంబంధము లేని మతము మతమె కా దన్నాడు జీవితములో ప్రధానమైనవి రాజకీయాలే మన యునికియు నభ్యుదయమును నవనతియు వాని మీదనే పూర్వము మన సంపదకు దారిద్ర్యమునకు భగవంతుడే కారణమనిరి దీని కంతకు కారణము ప్రభుత్వమను భావన యీనాడు కలిగినది

ఏ వర్గము పరిపాలన చేయుచుండునో ఆ వర్గముయొక్క ప్రయోజనము సాధింపబడుచుండును లోకములో అధిక సంఖ్యా

కాలముననే మరణించుటచే వారి స్థానమున ఎ పి పాత్రోగారు మంత్రి అయినారు మంత్రివర్గము 1921 వ సంవత్సరము జనవరి నెల పదియవ తేదికి ఏర్పాటయినది

1921 వ సంవత్సరము చివరకు రామలింగారెడ్డి మైసూరులో తన విద్యాశాఖాధికారి పదవికి రాజీనామానిచ్చి మదరాసునకు వచ్చినారు చిత్తూరు జిల్లాలోని వారును ఆయనకు మిత్రులునగు గొల్లపల్లి మునిస్వామినాయుడుగారు రాజకీయములలోనికి రావలసినదని ఆయనను కోరినారు యూనివర్సిటీ నియోజకవర్గమునకు ఎన్నిక నొందిన శ్రీనివాసయ్యంగారి స్థానమునకు మరొక ప్రతినిధిని ఎన్నుకొనవలసి వచ్చెను ఆ ఉపవరణములో రామలింగారెడ్డి నిలబడి జయముగాంచినారు 1922 వ సంవత్సరము ఫిబ్రవరి 14 వ తేదీన ప్రమాణస్వీకారము చేసి రాజకీయాలలో పాల్గొనసాగినాడు

రామలింగారెడ్డి విద్యార్థిదశనుండియే రాజకీయములలో ప్రవేశమున్న అనుభవజ్ఞుడు అర్థశాస్త్రములో ఆరితేరినవాడు రాజకీయ శాస్త్రములో పండితుడు శాసనసభలో రాణించుటకు వలసిన శక్తిసామర్థ్యా లన్నియు గలవాడు ప్రశ్నలు వేయు పాటవము ధారాళముగా మాటాడగల నేర్పు న్యాయశాసనములను స్వతంత్ర్య పరీక్ష గావించెడి విమర్శన శక్తి కమిటీలలో పనిచేయగల సత్తా చర్చలలో నిలువబడి ప్రత్యర్థులను చిత్తుచేయగల ప్రజ్ఞ యిత్యాదు లన్నియు నాయనలో నున్నవి

సమయస్ఫూర్తితో గూడిన హాస్యకుశలత దెబ్బకు దెబ్బ దీయగల నేర్పు వాద చాతుర్యము, వక్తృత్వము ఆయనను గొప్ప పార్లమెంటేరియనును గావించినవి

మద్రాసు శాసనసభలో రెడ్డి తన ప్రత్యేక వ్యక్తిత్వమును ప్రకటించినాడు ఏ విషయమునైనను నూతన దృక్పథముతో బరిశీలించి మనోహరముగా వ్యక్తీకరించు నేర్పు ఆయన శాసనసభా ప్రసంగాలలో, చర్చలలో వెల్లడి యగుచుండెడిది

మన దేశమునకు రాజకీయ సంస్కరణలు తెచ్చిన మాంటేగు దొర యీ దేశము నెడల నభిమానమున్నవాడు కాని, పార్లమెంటులో నొత్తిడివచ్చుటచేత నీయన తన పదవికి రాజీనామా నీయవలసి వచ్చెను శాసన సభలో ఆయన హిందూ దేశమునకు చేసిన సేవను ప్రస్తుతించుచు చేసిన తీర్మానమునకు మద్దతు తెలుపుచు ఆయన 'నేను హిందూదేశ ప్రజలను విశ్వసించెదను అన్నాడు రెడ్డి ఆయన హిందూ దేశాభ్యుదయము నకై పాటుపడిన మన మిత్రుడని చెప్పుచు నొక మహోపన్యాసము జేసినాడు ఇది 1922 వ సంవత్సరము మార్చి నెల 22 వ తేదీన జరిగినది

1922 వ సంవత్సరమున మార్చి నెల 7 వ తేదీన బడ్జెటు (ఆదాయ వ్యయములు) చర్చ సందర్భమున ఆయన ప్రసంగము ప్రశంసింపదగినది బడ్జెటు సందర్భములో ప్రతిపక్షమువారు ప్రభుత్వమును విమర్శించుట సంప్రదాయము ఆ సమయమున రెడ్డి యిట్లు ప్రసంగించినాడు

"సంస్కరణములవలన ప్రజలకు అభివృద్ధి నొందెడి అవకాశము కలుగు నని గంపెడాశతో నుంటిని ఆర్థిక సభ్యుని మాటల గారడీ తప్ప బడ్జెటులో ప్రజలకు ఏమియు ప్రయోజనము లేదు ఇంపీరియల్ గవర్నమెంటు ఏ విధముగా తప్పుకొనవలెనో ఆ విధముగా తప్పుకొనుటకు ప్రయత్నించినది బడ్జెటు లోటంతయు సహాయ నిరాకరణము మీద త్రోసివేసినారు అది నిజము కాదు ఈ లోటు ఈనాటిదే కాదు ఇంతేగాక యీ లోటు అసహాయోద్యమమువలన వచ్చినదే యన్నచో నది ప్రభుత్వ పరాజయమునే తెల్పును వాణిజ్యమునకు ఆర్థిక మాంద్యమునకు, అసహాయోద్యమమునకు సంబంధమే మున్నది ? అవి రెండును ప్రపంచ సమస్యలు ఇట్లంటగట్టుట అసందర్భము అసహాయోద్యమ మాగి వచ్చో నాదాయము పెరగవచ్చుననుట విశ్వసనీయము గాదు

దయార్ద్రహృదయమైన యీ నిరంకుశ ప్రభుత్వ మెప్పుడును వ్యయమును పెంచుచునే యుండును కర్చు అన్నది ప్రజలకు ఉపయోగపనులకే ఉండవలెనుగాని ప్రజలకు గిలిగింతలు పెట్టు పనికి గాదు ప్రస్తుత పరిస్థితులలో నిది సరియైన పద్ధతి గాదు దేశ పురోగమన దృష్టిలో అసలే పనికిరాదు లోటు 23½ లక్షలు ఎట్లు సరిపుచ్చవలెనో తెల్పలేదు ప్రధాన విషయాలను విడిచి అల్ప విషయాలకు ఆధిక్యము ఇచ్చుట మంచిది కాదు

పబ్లికు వర్క్సు డిపార్టుమెంటు పెరిగిపోవుచున్నది ప్రపంచములో అన్ని దేశాలకంటె హిందూదేశము బీదదేశము దీనికి విపరీతముగా ప్రభుత్వోద్యోగుల జీతాలు ప్రపంచములో ఎక్కడను లేనంత హెచ్చుగా నున్నవి ఇది మిక్కిలి విపరీత పద్ధతి ఆలాగే విపరీతపు ప్రయాణపుకర్చులు ప్రభుత్వము ప్రజలమీద మోయలేని పన్నుల భారము వేయుచున్నది ప్రభుత్వోద్యోగుల జీతాలను తగ్గించుట అవసరము

మన దేశములో వాణిజ్యములు పరిశ్రమలు లేవుగనుక రెవిన్యూ ఆబ్కారీలే ఆదాయమార్గాలు ఇందువలన పేదవారి మీద పన్నుల భారము పడుచున్నది కాకులను కొట్టి గద్దలకు వేయుట మంచిపద్ధతి కాదు పేదప్రజల స్థితి గమనించి పన్నుల భారము తగ్గించవలెను

ప్రజలకు ప్రయోజనకరమైన విద్య ఆరోగ్యము వ్యవసాయము మొదలయినవానికి ఖర్చులను తగ్గించి పోలీసులు కోర్టులు మున్నగు శాఖలకు అధికముగా కర్చుపెట్టుట అన్యాయము, అక్రమము

ప్రాథమిక విద్య ఉన్నత విద్య అను రెండును రెండు కండ్లే నేను పల్లెటూరివాడను యూనివర్సిటీకి చెందినవాడను కూడ ఉన్నత విద్యకు రు 85000/- లు చాలునందురు కర్చుపెట్టెడువారు మారుచుందురుగాని ఆ సంఖ్యమాత్రము మారదు

ఇన్నింటికిని ధనము చాలదని ప్రభుత్వ మనును తా మిచ్చెడి పన్నులవలన దమ కేమియు ప్రయోజనము కలుగుటలేదని ప్రజల గోల ప్రభుత్వమునకు ప్రజల అక్కరలలో నిమిత్తము లేదా ? నేటి ప్రభుత్వము ఒకవిధమైన ప్రజాస్వామ్య ప్రభుత్వము జాడ్యము చీమనడకగల ప్రజాస్వామ్యముగలసి నేటిప్రభుత్వమైనది ఎక్కడనైన కొంచెము అల్లరి జరిగినచో రక్షకభట శాఖ అక్కడకు రెక్కలు గట్టుకొని వ్రాలును ప్రజల విషయము మాత్రము చెవిని బెట్టను దేని కయినను అసహాయోద్యమమును సాకుగా జెప్పుట ప్రభుత్వమునకు బరిపాటి యైనది సహాయ నిరాకరణ వాదులు తమకు ధర్మమని తోచిన పద్ధతిని రణరంగములో నిలబడి యుద్ధము చేయుచున్నారు వారిని ప్రభుత్వమువారు వ్యతిరేక ధోరణిలో మార్గానుమన్నారు మనము అసహాయోద్యమ వీరులను అభివృద్ధినిరోధకు లనుచున్నాము వారిని ఎదుర్కొనవలెనన్నచో మన మిక్కడ చట్టాల ద్వారముగ సాంఘికమైన అభ్యున్నతిని స్థాపింపవలెను ఈ విధముగా చేయుట సుకరము స్త్రీలకు వోటింగు హక్కు నియ్యవచ్చును అణగద్రొక్కబడ్డ జాతులకు సాహాయ్యము చేయవచ్చును ఈ విధమైన సాంఘిక శాసనములకు పైస కర్చుకాదు ఇవి యేమియు చేయకుండ విభజించి పాలించు పద్ధతిని అనుసరించి అసహాయోద్యమ నాయకులలో చీలికలు తీసికొని రా బ్రయత్నించుట తగదు వారి చిత్తవృత్తులలో మార్పు రావలెనని చేసిన దేమియు లేదు దేవాదాయ ధర్మాదాయపు బిల్లుకొరకు ఒక కమిటీని వేసినాము ఆ కమిటీ కూర్చున్నది కాని గ్రుడ్డు మాత్రము పెట్టలేదు (సభలో గొల్లున నవ్వు)

కనుక నేడు మనకు నిర్మాణ కార్యక్రమ మవసరము ఏ పరిస్థితి అనుసరించినను దేశాభిమాన మవసరము ఈనాడు నూతనాలోచనలు నూతన పద్ధతులు అవసరము ఈ సంగతి గమనించిమనము పనులు సాగించవలెను !

రామలింగారెడ్డి వీరిని వారిని దుయ్యబట్టినాడేకాని మరే మియు చేయలేదని కొందరందురు ఈ ప్రసంగము గమనించినచో ఆయన దేశాభిమానము నిర్మాణాత్మక విమర్శ మనకు విదితము లగును మాన ముద్రాంకాలు లెందరున్న నేమి ప్రయోజనము? దేశకాల పరిస్థితులు గమనించి శాసనసభలో నిర్భయముగా నిష్పాక్షికముగా సక్రమముగా మాటాడువారితోనే అక్కర

సంస్కృత విద్యాలయములకు గ్రాంటు విషయములో ఆయన పలికిన పలుకులు పరిగణింపదగినవి

'ఈ పాఠశాలలు ప్రాతపద్ధతుల మీదనే నడుపబడుచున్నవా? కొన్ని కులములవారికే పరిమిత మైనవా? అను సంశయములు గ్రాంటు నిచ్చుటకు ముందు గమనింపదగినవి సంస్కృత భాషావ్యాప్తికి నే నెదురు పలుకువాడను కాను మన ప్రాచీన నాగరకతయు సంస్కృతియు సంస్కృతము పెట్టిన భిక్షయే ఈ విషయము నే నెరుగనిది కాదు ఆ విద్య కులమతాలకు సంబంధించినదిగా నుండరాదని మాత్రమే నా ఆశయము"

మన దేశ పరిపాలనమునకు సంబంధించిన భాషగా నుండుటకు హిందీ తగదని అందు సాహిత్యమే లేదని సంస్కృతమె పరిపాలక భాష కాదగినదని ఆయన అభిప్రాయము ఆయన తన అభిప్రాయమును నిర్భయముగా చెప్పినాడు కాని సంస్కృత మెప్పుడును ప్రజాసామాన్య భాష కాజాలదు అది కేవలము పండిత భాష సంస్కృత విద్యాలయములలో బ్రాహ్మణ పండితులు కొందరు బ్రాహ్మణేతరులకు వ్యాకరణము మొదలగునవి చెప్ప నిరాకరించుట నిన్న మొన్నటివరకు జరుగుచు వచ్చినది చిట్టి గూడూరు నారసింహ సంస్కృత విద్యాలయములో బ్రాహ్మణేతరులకు ఎవరును చెప్పుటకు నిరాకరించిన విషయములను బోధింపబూనిన వారును, సంస్కృత విద్యావ్యాప్తమే తమ జీవితాశయముగా పెట్టుకొన్నవారును నగు ప్రిన్సిపాలు వరదాచార్యులవారు ప్రాతస్స్మరణీయులు

మదరాసు హిందూ దేవాదాయ ధర్మాదాయపు బిల్లుపై 1922వ సంవత్సరము డిసెంబరు నెల పదునెనిమిదవ తేదీనాడు మన రెడ్డి యిట్లు ప్రసంగించినాడు

“ఈ బిల్లు విప్లవాత్మకమైన దని నేను భావించినాను, కాని శాసనసభలో అందరి ఆమోదము పొందవలెనన అభిప్రాయముతో ఇది మితవాద పద్ధతిలోనికి దింపడినది

వంశ పారంపర్యముగా ధర్మకర్త లుండుట మంచిది కాదు చాలమంది జమీందారుల చేతులలో అధికాదాయము వచ్చేడి దేవాలయము లున్నవి అది అంత మంచిపద్ధతి కాదు ప్రభుత్వము వారు కమీషనర్లను నియమించుట మంచిది ఏ దేవాలయపు ఆదాయమును ఆ ప్రాంతములోనే కర్చుపెట్టవలె ననుట దూర దృష్టిరహిత మైనది తిరుపతి రామేశ్వరాలయాలు యావద్భారత దేశమునకు పుణ్యక్షేత్రాలు ఆ సొమ్మును ఆ ప్రాంతాలలోనే కర్చుపెట్టవలెనని కోరుట యుచితముగాదు ఈ యాదాయము కేవలము హిందువులకే కర్చుపెట్టవలె ననుటయు నంతే ఈ సవరణ లతో నే నీ బిల్లు నామోదించుచున్నాను ”

పరిశ్రమలకు ప్రభుత్వము సాహాయ్యము చేయుట కగు బిల్లు సందర్భములో రెడ్డి యిట్లు హెచ్చరించినాడు

1 ఈ విరాళములు ఎంతవరకు పరిశ్రమల అభివృద్ధికి తోడ్ప డునో గమనించి మరి యియ్యవలెను

2 లాభప్రదములైన పరిశ్రమలకే యియ్య వలెను

3 మదరాసు రాజధానిలో నాలుగు భాషలు మాటలాడు వారున్నారు ఈ విరాళా లందరికి అందవలెను

4 ఈ పరిశ్రమల కచ్చేడి విరాళములు హిందూ దేశీయులకే ఉపయోగపడు నని పూచీ ఇయ్యవలెను

పాశ్చాత్య దేశాలలో వారు తమ తమ పరిశ్రమశాలలలోకి మన దేశపు విద్యార్థులకు ప్రవేశము కలుగనీయరని గ్రహించవలెను

కనుక వీని నన్నిటిని గమనించి ప్రభుత్వధనము సదుపయోగ మగు నట్లు చూచుట యవసరము ”

ఈ హెచ్చరిక రామలింగారెడ్డి దేశాభిమానమునకు లోకజ్ఞతకు నిదర్శనము గదా!

మద్రాసు విశ్వవిద్యాలయ పునర్నిర్మాణపుబిల్లు 1922 వ సంవత్సరము నవంబరు నెల ఇరువది రెండవ తేదీనాడు ప్రవేశపెట్టబడినది ఈ విశ్వవిద్యాలయ సంస్కరణములను గురించి 1915 వ సంవత్సరములోనె ఆయన ఆందోళన ప్రారంభించెనుగదా! ‘మీరే యీ మార్పున కంతకు కారణము’ అని రివరెండు మార్షెయిల్ (Marchail) రెడ్డిపై విసుగుకున్నాడు విద్యావేత్తలలో ఒకరైన బ్రహ్మర్షి వెంకటరత్నముగారు కూడ ఈ సంస్కరణములకు విముఖులే మార్పనగానే కొందరకు భయము ఈ పెద్దలవాదనల నన్నిటిని ఖండించుచు పునర్నిర్మాణమునకు పూర్తిగా ప్రోత్సాహమిచ్చుచు రెడ్డి యిట్లు పోరాడినాడు

“గవర్నమెంటుకు సెనేటునకు అన్నిచోట్లను అభిప్రాయభేదములున్నవి కలకత్తా సంగతి జగద్విదితమే ఆశుతోషముఖర్జి ప్రభుత్వముతో పోరాడి దానిని జాతీయముగా చేసినారు చేయగలిగినంత వఱకు మొదటి బిల్లుకు నేటిదానికి ఆశయాలలో భేదము ఏమియును లేదు అధికారములలోమాత్రమే కొందరు మార్పేమియు అక్కరలే దనువా రున్నారు దేశకాల పరిస్థితుల ననుసరించి మార్పు అవసరము కలకత్తాకమిటీ (సాడ్లర్ కమిటీ) మన కందరకు తెలిసినదే మార్పులు ఆవశ్యకములని అందు వివరింపబడినది

ఆంధ్ర విశ్వవిద్యాలయము స్థాపించవలెనని తిరునల్వేలిలో మరొకటి నెలకొల్పవలెనని ఎంతోకాలమునుండి ఆలోచనలు మదరాసు విశ్వవిద్యాలయములో మార్పునుసరికి ధనలోపమందురు మన చేతిలో ధనములేనప్పుడు ‘స్కీము’ లెందుకు? ధనము ఆనుష

వించనివారికి ధననాశమన్నాడు భర్తృహరి మద్రాసు ధనము సిమ్లాకు పోవుచుండగా, ధనలోపముగాక ఏమిటి? పూర్వమువలె గాక నేడు నిరంతరకృషి చేసెడి విశ్వవిద్యాలయోపాధ్యాయులవసరము మైసూరులో అలాగేయున్నారు సాడ్లర్ కమిటీ కూడ దానినే చెప్పినది ఆక్సుఫర్డు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయముల పరిస్థితులు వేరు లీడ్సు, మాంచెస్టరు మొదలగు విశ్వవిద్యాలయములలో రోజు పనిచేసెడి (full time) ఉపాధ్యాయులున్నారు అమెరికాలోను అంతే 'ఈ బిల్లువల్ల మద్రాసులోని కాళాశాలకు ప్రయోజనము, ఇతరత్ర వానికి ప్రమాదము అని తలచుట వట్టి భ్రమ

క్రొత్త మెంబర్లను నియమింతురని భయపడుట దేనికి? అందువల్ల యూనివర్సిటీకి ఆర్థికలాభము కలుగును స్వాతంత్ర్యము వచ్చునని వెంకటరత్నము నాయుడుగారు భయపడనవసరము లేదు 25000 రూపాయలు ఇచ్చెడివారు సెనేటు మెంబర్లవుదు రన్నది అమెరికానుండి స్వీకరించినది అది బ్రిస్టలు లీడ్సు మాంచెస్టరులకుకూడ నున్నది మన మెవరిని ధనమడుగుచున్నామో ఆ దాతలను మావిశ్వవిద్యాలయములో పాదము పెట్టరాదనుట ఏమి మర్యాద? పెద్ద మొత్తాలిచ్చెడివారు విద్యాభివృద్ధికి తోడ్పడుదురే కాని నిరోధకులు కారే! ఇది చాల ఉత్తమము సిండికేటు దీనిని సిఫార్సు చేసినది ఇంతకాలము ఆందోళనచేసిన తర్వాత మార్పు అవసరము లేదనుట అనుచితము ఈ రాజధానిలో విద్యావిధానములో మార్పు లేకపోయిన అభివృద్ధిలేదు విద్యామంత్రి ఉచితజ్ఞతను నేను ప్రశంసించుచున్నాను"

1923-24 సంవత్సరపు బడ్జెటులో 1923 వ సంవత్సరము మార్చి నెల 24 వ తేదీనాడు చేసిన ప్రసంగపు సారాంశం

"మద్రాసు విశ్వవిద్యాలయ పునర్నిర్మాణమునకు ముందు ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్మాణమునకు మన విద్యామంత్రి హామీ యిచ్చిన బాగుండెడిది ఆ సంగతి అడుగున పడినది ఈ బడ్జెటులో కూడ దాని ప్రస్తావనలేకుండుట మంచిదికాదు

ప్రభుత్వము ఎంతవరకును సైన్యమునకు రైళ్ళకు కర్చు పెట్టుచున్నది కాని ప్రజావసర మైన విద్య నీటివనరులకు కర్చు పెట్టుటలేదు ప్రజలవద్ద ఋణాలను తీసికొని, బళ్ళారి అనంత పురము జిల్లాలలో నీటివనరులకు ప్రయత్నించుట అవసరము ప్రజలకు సంబంధించిన ఈ పనులకు ఋణాలు అడిగిన ప్రజలు తప్పకుండ ఇవ్వగలరు "

పోలీసు జులుమునుగురించి, మలబారులోజరిగిన అన్యాయా లను గురించికూడ రెడ్డి నిశితముగా విమర్శించినాడు

ఈ నాడు అభివృద్ధి కార్యములకు ప్రభుత్వము అప్పులను అడుగుచున్నది రెడ్డి 40 సంవత్సరాల క్రిందనే ఈ సూచనచేయుట గమనించదగ్గది

ఆయన ఎంత విద్యావేత్త అయినప్పటికిని తాను కర్షక కుటుంబపు వాడ ననుటను బట్టియే ఈ సూచన చేసినాడు ఇట్లు సూచనలను చేయుటయేకాక రాయలసీమ ప్రాంతాలలోని చెరువుల మరమ్మతులు శీఘ్రముగా జరుగుటకు ప్రభుత్వమువారిని కలెక్టరులను త్వరపెట్టి చేయించెడివాడు తమిళులకును మనకును ఉన్న తేడా ఏమనగా మనము మంత్రులవెంబడి తిరుగుదుము వారు కార్యగతులు తెలిసికొని పనులు చేయించు కొందురు జస్టిసు పార్టి కాలములోను, అనంతరమును మంత్రులు మనవారే పనులు వారివే ఇప్పుడును కేంద్రమునుండి ఎంతో ధనసహాయము వారు పొందుచున్నారు మనము మంత్రులచుట్టు ప్రదక్షిణములు చేయుట, మంత్రులను దింపవలెనని ప్రయత్నించుచుండుట తప్ప దేశప్రయోజనముగమనించము

1922 వ సంవత్సరములో గాంధిమహాత్ముని పట్టుకొని రాజద్రోహాపరాధము క్రింద ఆరు సంవత్సరముల శిక్ష ప్రభుత్వము వారు విధించినారు కాంగ్రెసులో రెండు పక్షా లేర్పడినవి ఒక పక్షమున చిత్తరంజనదాసు, మోతీలాలునెహ్రూ, విఠల్ భాయి పటేలు ప్రభృతులు వీ రందరు స్వరాజ్యవాదులు, శాసనసభలో

చేరి తద్ద్వారమున ప్రభుత్వము ను స్తంభింప జేయవలెనని వీరి వాదన రాజగోపాలాచారి పట్టాభి సీతారామయ్య రాజేంద్రప్రసాదు మొదలగువారు శాసనసభలకు వెళ్ళకుండ గాంధీజీ మార్గాన అసహాయోద్యమము సాగించి స్వరాజ్యము సంపాదించవలెనను వారు ఈ విధముగా దాసు నెహ్రూగార్ల తత్త్వమునకు గాంధీ తత్త్వమునకు వైరుధ్య మేర్పడినది ఢిల్లీలో 1923వ సంవత్సరము సెప్టెంబరు నెలలో జరిగిన ప్రత్యేకపు కాంగ్రెసులో ఎన్నికలలో పాల్గొనవచ్చునని తీర్మానింపబడినది

ఆ కాలములో శాసనసభకు ఎన్నికలు మూడేసి సంవత్సరాలకు అందుచేత 1923వ సంవత్సరము అక్టోబరులో ఎన్నికలు జరిగినవి ఇష్టమున్నవారు ఎన్నికలలో పాల్గొనవచ్చునని తీర్మానమున్నందున కొందరు కాంగ్రెసువారు కూడ ఎన్నికలలో పాల్గొనిరి స్వరాజ్యపార్టీవారు ఈ ఎన్నికలలో అధికోత్సాహము చూపినారు వారు గూడ కొందరు శాసనసభలో ప్రవేశించినందున జస్టిసు పార్టీ బలము సన్నగిల్లినది రామలింగారెడ్డి చిత్తూరు నియోజకవర్గమునుండి శాసనసభకు వచ్చినాడు ఇందులో తన తండ్రి సుబ్రహ్మణ్య రెడ్డి ప్రతిష్ఠయే తనకు తోడ్పడ్డదని ఆయన చెప్పుకొన్నాడు అంతటి కీర్తి సంపన్నులు సుబ్రహ్మణ్యరెడ్డిగారు

ఈసారికూడ జస్టిసు పార్టియే మంత్రివర్గమును ఏర్పాటు చేసినది పూర్వమువలెనే పానుగంటి రామరాయణంగారు ప్రధాన మంత్రి పాత్రోగారు పాతవారు ఒక్క వెంకటరెడ్డినాయుడిగారి స్థానాన, దివాన్ బహదూర్ టి ఎన్ శివజ్ఞానం పిళ్ళెగారు అను తమిళ నాయకుడు వచ్చినాడు

ఈమారు ప్రబలమైన ప్రతిపక్షము ఏర్పడినది స్వరాజ్య పార్టివారు జాతీయపక్షమువారు కలిసి సంయుక్త జాతీయ పక్షమను పేర ప్రతిపక్షమును ఏర్పాటుచేసినారు ఈ ప్రతిపక్షములో ప్రముఖులు కేశవపిళ్ళ, సుబ్బరాయన్, సత్యమూర్తి రామలింగారెడ్డి

చింతలపాటి వెంకటనరసింహరాజు మొదలయినవారు ఈపక్షనిర్మాణమునకు మూలపురుషుడు రెడ్డియే ప్రతిపక్షనాయకుడు మాత్రం నరసింహరాజుగారు, ఉపనాయకుడు రెడ్డి

జస్టిసుపార్టీ ప్రథమ సమావేశమునకు రెడ్డిని పిలువలేదు ఈ సారి వీరి ద్వారమున విద్యాశాఖామంత్రిపదవి అయిన వచ్చునేమో అని ఊహించినాడు రెడ్డి ఈయనకు మంత్రిత్వము ఇచ్చినచో పట్టపగ్గాలు ఉండవని తమకే అస్తిత్వము ఉండదని వారి భయము ఏమైనను మంత్రిపదవి యోగ్యతవల్లనే వచ్చునదికాదు వెనుక జనబలము ఉండవలెను కొంతమందిని కూడగట్టుకున్నప్పుడే మంత్రిత్వము అబ్బుట

రామలింగారెడ్డి రోషము బుసకొట్టినది విశ్వాసరాహిత్యపు తీర్మానము ప్రతిపాదింపజేయుట దానితో మంత్రివర్గమును పదభ్రష్టము చేయుట ప్రథమ కర్తవ్యమని తలచినాడు అనుకూలురైన సభ్యులను అందరిని కలసికొని మంతనాలు జరిపినాడు సరే అనగా సరే! అనిపించుకొన్నాడు రణరంగమునకు మోహరించినాడు

ఆనాడు పానుగల్లు మంత్రివర్గమునకు సింహస్వప్నమైనది రెడ్డి లీల సమగ్రమము సర్వతోముఖము అగు రెడ్డి పాండిత్యము నిర్భీకత, నిరుపమాన సమయస్ఫూర్తి సునిశిత విమర్శలు, ఖండనలు జస్టిసు మంత్రుల గుండెలు అల్లాడజేసినవి

ప్రశ్నోత్తర సమయాలలో తనతో తలపడినవారిని ఒక్కరిని కూడ చిత్తుచేయక వదలలేదాయన ఎంత గాఢముగా ఎంత తీవ్రముగా విమర్శించుచున్నను ఆయన వాక్చమత్కృతికి లలిత నర్మోక్తికి మంత్రుల పెదవులనుండి కూడ చిరునవ్వు తొలకరింపక తప్పెడిది కాదు ఆయన లేనినాడు శాసన సభ చిన్నపోయెడిది శాసనసభలో ఆ నవచాకచక్యము రమణీయము స్మరణీయము

1928 వ సంవత్సరము నవంబరు 26వ తేదీనాడు శాసనసభ ప్రథమ సమావేశము జరిగినది ఆరంభములోనే మంత్రివర్గము మీద బ్రహ్మాస్త్రము ప్రయోగించినాడు రెడ్డి దీని కోసము ఆయన ఎన్ని దినములు మథనపడినాడో! గతించిన మూడు సంవత్సరాలలో మంత్రులు దేశహితైక కార్యములు చేయలేదని, వారు తమపార్టీ ప్రాబల్యమునకే పాటుపడినారని జస్టిసు మంత్రివర్గముపై విశ్వాసరాహిత్యపు తీర్మానము ప్రతిపాదించుచునాడు ఆయన చేసిన అనర్గళమైన ఉపన్యాసము చరిత్రాత్మక మయినది మహావక్తగా రాజకీయవేత్తగా ఆయనకు పేరు తెచ్చినదనుటలో ఆవంతయు అతిశయోక్తి లేదు

నాడు మన భరతఖండములో సురేంద్రనాథ బెనర్జి బిపన్ బాబు బాలగంగాధరతిలకు, గోఖలే శ్రీనివాసశాస్త్రి రాధాకృష్ణన్, రాఘవేంద్రరావులు మహావక్తలుగా పేరుపడినారు మన రెడ్డి కూడ వక్తృత్వములో వీరికి ఏమాత్రము తీసిపోనివాడు

సురేంద్రనాథ బెనర్జి భాష మృదుమధురము కంఠము గంభీరమైనది కనుకనేఆయనకు'The trwmpet voice of India' అని విఖ్యాతి కలిగినది వంగదేశ విభజనాందోళనలో ఆయనే నాయకుడు గాంధీజీకి మహాత్ముడు అని ఖ్యాతి కలిగినట్లే అయనకు గురు బెనర్జి అని ఖ్యాతి కలిగినది

బిపన్‌బాబు ఉపన్యాసాలు మన ఆంధ్రావనిని గూడ ఉఱ్ఱూతలూగించినవి కాని, ఆయనలోని లోపమేమనగా పదిమందిలో ఉన్నను పదివేలమందిలో ఉన్నను ఒకే తీవ్రస్థాయిలో మాటలాడుట సురేంద్రుని శైలితో పోల్చినచో ఆయన శైలి ఒకంత తీసికట్టే అని పెద్దల అభిప్రాయము కాని భావగంభీరముగాను శ్రోతలను ఉద్రేకపూరితులను చేయునట్లును ఉపన్యసించుటలో ఆయన ఉద్దండుడు

ఇక తిలకు మహాశయునిది రణగర్జనమే

మితవాదు లందరిలో మేటి సుగుణ సంపన్నుడు అగు గోఖలే మృదుపద చాతుర్యముచే ప్రభుత్వమును ఒప్పించవలెనని తన శక్తి నంతటిని దారపోసిన మహావక్త

శ్రీనివాసశాస్త్రి ఉచ్చారణ సౌష్ఠవమునకు ఆంగ్లేయులే అబ్బురపడినారు కాని ఆయన ఉపన్యాసములోని పదగుంభన, అలంకారాలు ఆహ్లాదకరాలే కాని ఆవేశకరాలు కావు

రాధాకృష్ణుని వాణి విజ్ఞాన సామ్రాజ్యపు రాణి
రాఘవేంద్రరావు భాష పరమ లలితము
చింతామణి పలుకులు చేవగలవి
రఘుపతి నుడువులు పాండితీస్ఫోరకములు

ఇక సత్యమూర్తి రామస్వామిగార్ల వాక్కులు అతి తీవ్రములు పైబడి కొట్టవచ్చినట్లే ఉండెడివి

మన రామలింగారెడ్డియో! క్రైస్తవ కళాశాలలో విద్యార్థిగా ఉన్ననాడే అండర్సన్ హాలులో మహోపన్యాసా లిచ్చినవాడు ఈయన ఉపన్యాలు వినుటకు ఎందరో చెవిగోసికొనెడివారు ఆ రోజులలో ఈయన ఉపన్యాసమనగానే హాలుః శ్రోతలతో క్రిక్కిరిసి పోయెడిదని అల్లాడి రామస్వామి అన్నాడు

ఆంగ్ల దేశములో అధ్యయనపరుడైననాళ్ళలో ఆంగ్ల రాజకీయాలను గమనించుచు 1905 వ సంవత్సరములో ఎన్నికలయందు విశేషాభిలాషము చూపుచు లిబరల్ పార్టి విజయమునకు సహస్రాధికోపన్యాసము లిచ్చినవాడు

కలకత్తాలో ఆల్బర్టు హాలులో వంగ విద్యార్థులకు ఇచ్చిన ఉపన్యాసము, తాన్వే స్థాపించిన మహిళా సంస్థలోని ప్రసంగము, అధునాత నాంగ్ల సాహిత్యములో అగ్రస్థానము వహించగలవు

మఱి శాసనసభలో జస్టిసు మంత్రులపై విశ్వాసరాహిత్యపు తీర్మానము తెచ్చి వేసిన ప్రసంగము చరిత్రాత్మకమయినది

శబ్దాడంబరము గాని ఆవేశము గాని లేకుండ సరళమై రసవంతమైన ఆయన ఉపన్యాసము శ్రోతలను ముగ్ధులను గావింప వలననదే కేంబ్రిడ్జిలో ఆయన సహపాఠియై తర్వాత గొప్ప సాహిత్య విమర్శకుడుగా ఖ్యాతివహించిన సర్ జాన్ స్ప్రైర్ రెడ్డిలో సుప్రసిద్ధ వక్త అయిన బహు గుణగణాలు గుమిగూడినవని అన్నాడు

ఇక వాద చతురతలో రెడ్డి పట్టాభికి జోడే పట్టాభి ప్రతిభ కాంగ్రెసు కదనరంగములో జాజ్వల్యమానముకదా! మన రెడ్డి శాసనసభారంగములో అతిరథ మహారథులను ఎందరినో వాదనలో పల్టీలు కొట్టించుట జగద్విదితమే జ్ఞాపకశక్తి సద్యస్ఫురణము ఆయనను అంతటి వానిని చేసినవి ఆయన పరులను రాళ్ళతో గాదు, పువ్వులతోనే కొట్టెడివాడు 'పోట్లాడినా బుద్ధిమంతుడి తోనే పోట్లాడాలి' అని తెలుగులో ఒక సామెత ఉన్నది అటు వంటి వాయన వాగ్వివాదాలు రణరంగము ప్రణయరంగముగా మార్చు రసికుడాయన

మంత్రులపై ఆయన విశ్వాసరాహిత్యపు తీర్మానమును గవర్నరు సమక్షమున ఇట్లు ప్రవేశపెట్టినాడు

ఎన్నికలఫలితమును పురస్కరించుకొని చూచినట్లయిన గతించిన యెన్నికలలో జస్టిసు పార్టీ ప్రజల విశ్వాసమును కోల్పోయినది అటువంటి పార్టీవారిని తమరు మంత్రులుగా నియమించుటవే ఈ శాసనసభకు వారియందు విశ్వాసము లేదని ఘనత వహించిన గవర్నరుగారికి ధర్మబద్ధులమై సవినయముగా విన్నవించు చున్నాము"

ఈ తీర్మానమును ఉపపాదించుచు ఆయన విశాఖపట్నపు జిల్లాలో జస్టిసుపార్టీ సభ్యులు ఓడిపోయి స్వరాజ్యపార్టీవారు మితవాదులు స్వతంత్రులు ఏల విజయము పొందినారో కూడ నిరూపించినాడు గంజాంజిల్లానుండి వచ్చినది విద్యామంత్రిగారు పాత్రోగారు ఒక్కరే

ప్రధానమంత్రి జిల్లాబోర్డులకు ఎన్నికలు పెట్టక తమ పార్టీ వారిని ఎక్కడెక్కడ ఎట్లు నిలబెట్టినది కూడ రెడ్డి వివరించినాడు కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులగు మోచర్ల రామచంద్రరావుగారు విద్యాసంబంధమైన విషయములపై సాక్ష్యమిచ్చుటకు ఇంగ్లాండునకు వెళ్ళగా ఆయన సభ్యత్వము రద్దుకాగా, ఆ స్థానమునకు ఎన్నిక పెట్టక ప్రధానమంత్రి తమ పార్టీసభ్యుడు శాసనసభ్యుడు అగు బాలాజీరావునాయుడుగారిని నియమించుట ఇందులకు ఒక ఉదాహరణ మైనది ఆ బాలాజీరావునాయుడుగారు చేసెడి అవకతవక పనులతో కృష్ణాజిల్లా పూర్తిగా అసంతృప్తి చెందినదని కేవలము తెలుగే తెలిసిన రైతుప్రతినిధి మాగంటి సీతారామయ్యగారు సోదాహరణముగా నిరూపించినారు ఆ నామినేటెడ్ ప్రెసిడెంటు చేసినపనులను గురించి రైతుబంధువు కానూరి వెంకటచలపతయ్యగారుచేసిన ఆందోళన, కృష్ణాజిల్లాప్రజలకు నేటికిని మరుపునకురాదు

ఈ విధముగా పార్టీప్రాబల్యముకొరకు స్థానికపరిపాలన కలుషితముగా చేసినారని పానగల్లురాజాగారిపై ధ్వజమెత్తినాడు రామలింగారెడ్డి

'కెన్యా మొదలగు విదేశాలలోని భారతీయుల కష్టనష్టాలను గమనించలేదు రాజకీయబాధితులను సరిగా చూడలేదు నిమ్నజాతుల అభివృద్ధికి ఏమియును చేయలేదు ఈ సందర్భాలలోను దేశక్షేమకరమైన యే సందర్భాలలోను కించిత్తును కలసి పని చేయలేదు జస్టిసుపార్టీ ఎంతవరకును పార్టీప్రయోజనాలకే ప్రాకులాడినది ఈవిధముగా జస్టిసుపార్టీని, మంత్రివర్గమును విమర్శించుచు తీర్మానము ప్రతిపాదించాడాయన

అంతట 'గవర్నరుగారే మంత్రులను నియమించినారు' అని పానుగల్లురాజాగారనగా "అయ్యా! తమరు పేర్లు చెప్పకుండగనే నియమించినారా?" అని యెదురు ప్రశ్న వేసినాడాయన రాజాగారు మఱల నోరు విప్పలేదు

కాని యెవరో ఇట్లు అన్నారు

'ఇది మంత్రులమీద కాదు, గవర్నరుగారిమీదనే ఈ విశ్వాసరాహిత్యతీర్మానము"

రెడ్డి తక్షణమే ఈ విధముగా జవాబు చెప్పినాడు

'ఇది మంత్రులపై విశ్వాసములేదని గవర్నరుగారికి తెలియచేయుట"

అప్పుడు మంత్రివర్గమువారు 'ఈ మంత్రివర్గము పోయిన కాంగ్రెసు మంత్రివర్గము వచ్చును దేశము అరాజకమైపోవునని ఏమేమో ఆకాశపురాణాలు చెప్పినారు

చివరకు తీర్మానము 'వోటు' నకు పెట్టబడినది 128 మంది సభ్యులలో 118 మంది 'హాజరయినారు తీర్మానమునకు అనుకూలముగా నలుబదిముగ్గురు ప్రతికూలముగ అరువదియైదుగురు తటస్థులు పదిమంది ఈతటస్థులలో జస్టిసుపార్టీలో ముఖ్యులు మాజీమంత్రి యగు కూర్మా వెంకటరెడ్డినాయుడుగారొకరు తనతో చెప్పకుండ తన్ను తగ్గించినందుంకు ఆయన తటస్థుడైనాడు వ్యతిరిక్తులలో ఎన్నికసభ్యులు నలుబదినలుగురే న్యాయముగా చూచినచో తీర్మానము ఒక వోటు తేడాతో మాత్రమే ఓడిపోయినట్లు మంత్రులు ముగ్గురు వోటుచేయుట తమమీద తమకు విశ్వాసమున్నట్లు ప్రకటించుట కనుక నైతికముగా చూచినచో తీర్మానము జయముగాంచినట్లే ఇంగ్లాండు మొదలగుదేశాలలో అయినచో మంత్రివర్గము తప్పక రాజీనామా ఇచ్చేడిది

ఈ తీర్మానమును గురించి వ్రాయనిపత్రి లేదా నాడు విచారింపని పెద్దలు లేరు ఆ నాడది అంతప్రాముఖ్యము గల విశేష మైనది

విశ్వాసరాహిత్య తీర్మానముపై రెడ్డి ప్రసంగించుచుండగా పానుగల్లు రాజాగారు తమ యిద్దరి నడుమ జరిగిన ఒకనాటి ఉత్తర ప్రత్యుత్తరాలలో రెడ్డి వ్రాసినవి బయటబెట్టబోయినారు రెడ్డి వెంటనే యిట్లన్నాడు 'ప్రేయసీ ప్రియులు వ్రాసికొన్న ప్రేమ లేఖలు విడిపోవునాడు బయటపెట్టు కోరు' (When lovers depart their love letters will not be revealed) ఆ సమయ స్ఫూర్తికి చకితులై ఉత్తరాల కట్టను తిరిగి జేబులో పెట్టు కొన్నారు రాజాగారు ఈ సంఘటన రెడ్డి ప్రతిభకు, పానుగల్లు రాజాగారి ఉదాత్తతకు ప్రబల నిదర్శనము

తడవుకోకుండ ఎదుటివారికి జవాబు చెప్పుచు నవ్వించగల నేర్పు, అధిక ప్రతిభావంతులకే ఉండును అట్టి శక్తి కట్టమంచి రెడ్డిక వెన్నతో బెట్టిన విద్య

ద్వంద్వ ప్రభుత్వము మద్రాసులో చేయుచున్న అవకతవక పనులను అలహాబాదులోని పయినీరు పత్రిక ఏకరువు పెట్టగా, ఒక ప్రభుత్వ సభ్యుడు 'ఇక్కడి విషయములు అక్కడి పత్రిక ఏలాగు వ్రాయగలిగినదో' అన్నాడు దానికి రెడ్డి యిట్లు సమాధాన మిచ్చి నాడు 'మన ద్వంద్వ ప్రభుత్వ మను వ్యాధి మద్రాసుకే పరిమి తము కాదు (నవ్వు) అది హిందూదేశమున అంతటను ప్రబలి యున్నదే ప్రభుత్వసభ్యుడైన సి పి రామస్వామిఅయ్యర్ - గౌరవ నీయులైన విశ్వవిద్యాలయ సభ్యుడు (సత్యమూర్తిగారు) చూపిన విషయము సరియైన దైనచో చిత్తూరు సభ్యుడు (రెడ్డి) మాటాడు అవకాశము లేదు రెడ్డి - కాని, గౌరవనీయుడైన అధ్యక్షుడు నన్ను ప్రసంగింపుమన్నాడు (సభలో గొల్లున నవ్వు) (1924)

ఈ విధముగా సమయస్ఫూర్తితో హాస్యరసభరితముగా ఆయన చెప్పిన జవాబులు ఎన్నో వున్నవి అవి అన్నియు వేయ్యా-నుట కొక గ్రంథము వ్రాయవలెను

1924_25 సంవత్సరపు బడ్జెట్టు ప్రసంగపు సారాంశము 1924 వ సంవత్సరము మార్చి నెల

"నూతన సంస్కరణలవల్ల అధికారము ప్రజల హస్తగతమగునని అన్నారు కాని యదాతథముగానే ఉన్నది మార్గ మధ్యమున పట్టుకొని కొందరిని కారాగారమున ఉంచుట ఏమి సబబు? 1819 వ రెగ్యులేషను క్రింద వారిని విచారించకుండ నుంచియే వారికి ఎలవెన్సులు ఇయ్యవలెనని ఉన్నది అట్లు ఇచ్చుట లేదే! మర్యాదగా చూడవలెనని ఉన్నది మర్యాద ఏమియు చూపుటలేదు

పండిత వాజపాయ్ గొప్ప దేశభక్తుడు ఆయనను అరెస్టు చేసి చెరలో నుంచినది ప్రభుత్వము ఆయనను నేరము చేసినందుకు కాదు నేరము చేయునేమో అని చెరలో పారవేసినారు ఆరోగ్యభంగము కలిగి ఆయన మరణించినాడు నేరము చేయునేమో అని ఆయనను చెరలో నుంచినవారు ఆయన ఆరోగ్యమును గురించి ఏమి 'సెక్యూరిటీ' ఇచ్చినారు? ఈమాదిరిగా దేశభక్తులను తెచ్చి నరకకూపమున పడవేసి వధించుటయేనా రాజనీతి?

మధురలో కొందరిని పికటింగు చేసెదరని చెరలా నుంచినారు పికెటింగు చేసెద మన్నందుకే! అది నేరము కాదే!

శాంతికి భంగము కలుగునని తోచినచో ప్రజలలో సద్భావము కలిగించు పద్ధతిని చేయవలెనుగాని, ప్రజలను రెచ్చగొట్టెడి పద్ధతి పనికిరాదు ఎవరినయినను అనుచితముగా ఎక్కువ రోజులు చెరలో నుంచుట నాగరక ప్రభుత్వము జేసెడి పని కాదు దేశభక్తిగల సజ్జనులను కష్టపెట్టుట మంచిదికాదు వారికి ఉచితమని తోచెడి పద్ధతిని సేవచేసెడివారిని శారీరకముగా మానసికముగా

కష్టపెట్టుట ఉచితమైన పని కాదు అమానుషముగా వారిని చూచి నట్లు నమ్మకముగలవారివల్ల తెలియుచున్నది

రామచంద్రరావుగారిని (రాజమండ్రి) నిమిషాలమీాద విచారించి శిక్షించినారు దీని కంతకు న్యాయనిర్వహణశాఖ కార్యనిర్వాహణశాఖయు కలిసియుండుటయే కారణము అవి విభజింపబడినప్పుడు ఇటువంటి దురన్యాయాలు జరుగవు మలబారులో జరిగెడి అన్యాయాలకు అంతేమైన ఉన్నదా ? పంజాబు వధలను గురించి వర్ణించునప్పుడు ఇకముందు సైన్యమును ప్రజలపై బడుటకు పిలువనని మాంటేగు హామీా యిచ్చినాడు కనుక న్యాయము జరుగునట్లు చూడవలెను

ధనములేనిది ఏమియుచేయలేము అనుట పొరబాటు ధనములేకుండ ప్రజోపయోగమైన పనులు ఎన్నో చేయవచ్చును ఇంతకు చిత్తశుద్ధి ఉండవలెను మాపలాలను పెట్టెడి అమానుష కృత్యాలను ఆపలేదు. అనవరతముగా పోలీసులు చేసెడి పనులను తెలుపుచున్నను పెడచెవినిపెట్టినది ప్రభుత్వము న్యాయము జరుగుపద్ధతి చూడవలెను ”

ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ఆంధ్రవిశ్వవిద్యాలయపు బిల్లు 1925 వ సంవత్సరమున శాసనసభలో చర్చకువచ్చినప్పుడు రెడ్డి చాల ప్రసంగాలు చేసినాడు దీనికి తలకొక సవరణచేసి అతుకుల బొంత చేసినారు మనశాసన సభ్యులు స్థలాభిమానముతో చేసిన పనులు ఆయనకు చాల చీకాకుపెట్టినవి మనవారికి వ్యక్తి దృష్టి తప్ప నాయికదృష్టి లేదని ఆయనబాధ

ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపన ప్రధానోద్దేశము ఆంధ్రభాషలో విద్య గరపబడవలెనని అది కేవలము భాషాప్రయుక్తమైన విశ్వవిద్యాలయము కాన ఆంధ్రము మాతృభాష కాని తాలూకాలను ఇందులో చేర్చుట అక్రమమని హెచ్చరించినాడాయన

ఇంకను కొందరు తమ తమ ప్రాంతములలో విశ్వవిద్యాలయము ఉండవలెనని ఆలోచనలేకుండ స్థలాభిమానముతో ప్రసంగాలు చేసినప్పుడు ఆయన ఇట్లన్నాడు

'స్నేహితులారా! అనంతపురసభ్యమహాశయా! విశ్వవిద్యాలయము మీ గ్రామమున, మీ ఇంటికి దగ్గరగా ఉండవలెనని కాదు అసలు సమస్య గమనింపుడు! విశ్వవిద్యాలయములో ఎటువంటి విద్య నేర్పవలెను? ఎట్లు బోధించవలెను? అన్నవి ఆలోచించవలెను విశ్వవిద్యాలయ విద్య అనగా ఉన్నతవిద్య అది నవీనవిద్య మనలను మహనీయులనుగా చేసెడి మార్గము ఆంధ్ర దేశములో విద్యావ్యాప్తి సరిగా జరుగుటలేదనెడి ఉద్దేశముతో ఈ విశ్వవిద్యాలయమునకై కృషి కాని సెలక్టుకమిటీలో చేసిన కృషి ఒకటి ఈబిల్లు మరొకటి ఇది వట్టి అతుకులబొంత అందరిని తృప్తిపరచవలెనని చేసినప్రయత్నము దీనినిగురించి నే నేమియు చర్చించదలచలేదు ఆత్మలేని వట్టి కట్టె ఇది

ఇట్లు రామలింగారెడ్డి ఏల అన్నాడు ! ఈ చట్టప్రకారము విశాఖపట్టణము, రాజమహేంద్రవరము అనంతపురములలో విశ్వవిద్యాలయ కేంద్రములు ఉండవలెను ఈ మూడు కేంద్రాలలో ఆనర్సు ఎమ్ ఎస్‌సి, రిసెర్చి డాక్టరేటు మొదలగునవి నేర్పబడును మామూలు బి ఏ బి ఎస్‌సి బి కాం తరగతులు కూడ అక్కడనే ఉండవలెను ఇక ఎక్కడను ఉండరాదు ఈ మూడు చోట్ల కళాశాలా విద్యార్థులుండి చదువుకొనవలెను మిగిలినచోట్ల రెండవ తరగతి కళాశాలలు మాత్రము ఉండవచ్చును బెజవాడలో కేంద్రము లేనప్పటికి వైసుఛాన్సలరు రిజస్ట్రారు కార్యస్థానము ఇతర కార్యాలయములు ఉండును రెడ్డి నాయుడుగారు 'ఆంధ్రవిశ్వవిద్యాలయము అని ఉండరాదు ఆంధ్ర శబ్దము ఆర్యసంబంధము తెలుపును తెలుగు విశ్వ ద్యాలయము అని ఉండవలె" నని సవరణతేగా 'ఆంధ్రశబ్దము అనార్యమైనది' అన్నాడు రెడ్డి సవరణ వీగిపోయినది

తుదకు ఆంధ్రుల ఆశయము తానుచేసినకృషి వ్యర్థమైపోగా చాలవ్యథ పడినాడాయన విసిగి వేసారి ఇట్లన్నాడు

"ఈ బిల్లును గురించి నే నేమియు చెప్పను ఏదోవిధముగా ఆంధ్రుల చిరకాలవాంఛితమయిన విశ్వవిద్యాలయము ఏర్పడు చున్నందుకు సంతోషము ఆంధ్రోద్యమాశయాలు మూడు ఆంధ్రరాష్ట్రము ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆంధ్ర పటాలము ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆంధ్రరాష్ట్రమునకు నాంది కాగలదని ఆశించుచున్నాను ఆంధ్రవిశ్వవిద్యాలయము అరుదెంచినందుకు ఆనందించుచున్నాను ఈ రూపము మనము కోరినదికాదు

కళాశాల లేనిచోట విశ్వవిద్యాలయ కార్యస్థానము నెల కొల్పుట మంచిదికాదు విద్యావిధానమును అనుసరించిచూచిన వో ఇటువంటి పద్ధతి ఎక్కడనులేదు దీనిలోని లోపమిదే

ఆంధ్రులమైన మనము వాస్తవవిషయములను ఎరుగ్గొనుట అంగీకరించుట కూడ తెలిసినవారము ఈబిల్లులోని అంశములకు మనము ఎంత అసంతృప్తి చెందినప్పటికి దీనిని మనహృదయములకు హత్తుకొనదగినట్లుగాను, మన ఆశయములను వ్యక్తీకరించునట్లుగాను చిరకాలమునుండి ప్రత్యేకమైన ఆంధ్రవిశ్వవిద్యాలయమునకై మనము సాగించిన ఆందోళనకు మూలమైన ఉన్నత విద్యాభిలాషములతో మనరాష్ట్రముయొక్క యథార్థ విద్యావశ్యక విషయములతో సమన్వయింప జేయుటకు మనము పెనుగులాడ వలెను"

రామలింగారెడ్డి పలికినట్లుగానే ఆంధ్రవిశ్వవిద్యాలయపు చట్టము సవరణ జరిగి వాల్తేరునకు విశ్వవిద్యాలయము మార్చుట జరిగినది రెడ్డిలోకజ్ఞత గమనించదగినది

ఆంధ్ర విశ్వవిద్యాలయము 1926 వ సంవత్సరములో ఏర్పడినది రెడ్డి దానికి ఉపాధ్యక్షుడుగా వెళ్ళినందున రాజకీయ రంగములో ఆయన లేని వెలితి లేకపోలేదు రెడ్డిగారిని తమ

పార్టీలో చేర్చుకొనుటకుగాని ఆయనతో పోరాడుటకుగాని ధైర్యము లేక పానుగల్లు రాజాగారు ఆంధ్ర విశ్వవిద్యాలయము అను ఒక మాయాగృహమును సృష్టించి దానికి వైస్ ఛాన్సలరుగా ఆయనను పంపినారని ప్రతీతి పుట్టినది ఎవరు ఏలా గనుకొన్నను అది ఆంధ్రుల అదృష్టమే ఆనాడు మనకు లభించినది ఉపాధ్యాయుడే ఆయనే ఆంధ్ర విశ్వవిద్యాలయము అను మట్టి గింజను నాటి మహావృక్షముగా పెంపొందించినాడు కనుక ఆయన విద్యాక్షేత్ర ములో ప్రవేశించుటచేత ఆంధ్రులకు ఆయనకు, భారతదేశమునకు కూడ మేలే కలిగిన దనవలెను అందువలన పానుగల్లు రాజాగారిని మనము ప్రశంసించవలసినదే ప్రశంసించుటేకాదు స్మరించవలసినదే ఆయన చేసిన సుకృతము ఇదేకాదు చిరస్మరణీయము లయిన పనులు ఇంకెన్నో ఉన్నవి మృత్యుముఖములో ఉన్న ఆయుర్వేదమునకు తిరిగి ప్రాణము పోసినాడాయన దేశ భాష లకు చేయూత నిచ్చినాడు ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్మాణ ములో పట్టుదల చూపినాడు

ముఖ్యముగా దేవాదాయ ధర్మాదాయ శాసనము చేసి ఎంతో ప్రయోజనము కలిగించినాడు ఆయన గొప్ప రాజకీయ వేత్త దేశాభిమాని ఆరేండ్లు ముఖ్యమంత్రిగా నుండి చెన్న రాష్ట్రపు రాజ్యాంగము హస్తగతము చేసికొన్న మనిషి మంత్రి పదవి లేకపోయినప్పుడు కూడ మంత్రులను నిరంకుశవర్గమును రాజ్యాంగమును వశపరచుకొన గలిగిన ప్రతిభావంతుడు

రామలింగారెడ్డి ప్రజల నడుమను ఉండదగిన స్వభావము గలవాడు కాడు అయినప్పటికి ప్రజల మేలుకోరము పాటుపడ్డ వాడే ఆయన ఈనాటి రాజకీయాలకు తగని మనిషి

పార్లమెంటరీ ప్రజాస్వామ్యమునగా రాజీ, ఇచ్చి పుచ్చు కొనుట, ఇతరులతో కలసి మెలసి పనిచేయుట, పార్టీ కార్యక్రమా లను అనుసరించి ప్రజలతో సన్నిహితత్వము కలిగించుకొనుట

సర్వ స్వతంత్రుడు, ప్రతిభావంతుడు తానే లోకము అనుకొను వాడు (Individualist) రాజకీయాలలో చెల్లలేదు అట్టి వ్యక్తి ప్రతిపక్షములో మాత్రము కొంతవరకు రాణించగలడు

మనుష్యులను కదిలించెడిది ఐక్యభావన (Feeling) కాని మేధ (Intellect) కాదు తర్కకౌశలము చర్చలలో ప్రత్యర్థులను పరాజితులను చేయగలదేకాని మానవ హృదయాలను తాకలేదు కనకనే ఎమ్ ఎన్ రాయ్ ఏమియు చేయలేక పోయినాడు ఆయన ప్రతిభ ఎంతటిదైన ఏమి ? సుభాసచంద్రబోసు నెహ్రూ ప్రజాహృదయము చూరగొన్న నాయకులు ఆలాగే ఆచార్య రంగా ప్రకాశము నాయకులు కాగలిగినారు పట్టాభిగారు ఎందులో తక్కువ వారు ? అయినను వారు ప్రజానాయకులు కాలేకపోయినారు వారికి హృదయబలము తక్కువ మేధాబలము ఎక్కువ మన రామలింగారెడ్డి కూడ అంతే ఇట్లు అన్నంత మాత్రముచేత ఆయనకు హృదయము లేదనియా ? కాదు - కాని ఆయన మేధతో పోల్చి చూచినప్పుడు అది అల్ప మగునేమో ! ఆయనలో మేధకు హృదయమునకు నిరంతరము సంగ్రామమే ఒకొక్కప్పుడు హృదయము జయింపగా మరొకప్పుడు మేధ జయించెడిది ఆ శక్తులకు సమన్వయము కుదరలేదు కాబట్టి ఆయనకు రెండు గుర్రాల స్వారి తప్పలేదు

రాజకీయాలలో రాణించుటకు నిలకడ, నిగ్రహము ఉండవలెను 'రాజకీయాలలో నిరంతరము నికరమైన నిలుకడ ప్రదర్శించుట గొప్పగుణమని చెప్పక తప్పదు అయినప్పటికి ఎప్పటికప్పుడు కొద్దిగా సమాధాన పడుటవలన అది మరింత రాణించును' అని రాజకీయ నేత్తగా పేరొందిన లార్డు మార్లే అన్న మాటలను బట్టి చూడగా రెడ్డి రాజకీయాలకు తగని వాడు

"ఎవరైనను రాజకీయాలలో నెగ్గవలెనన్న తన ఉన్నతాశయాలను ప్రజలకు అందజేయుటయే గాక, ప్రజల ఆశయాలను

గూడ కొంతవరకు స్వీకరించ వలసినదే అంతే కాదు తనచుట్టును ఉన్న జనము యొక్క మనః స్థితిని త్వరితముగా మారిపోవునట్టి మనః స్థితిని ఈప్సితాలను సరిగా వ్యాఖ్యానించుట కూడ కావలెను ” అని లాయడ్ జార్జికి ఆయన మేనమామ సలహా ఇచ్చినాడు ఆ ప్రకారమే ప్రవర్తించి రాణించినాడు ఆయన

మన రామలింగారెడ్డి అభిరుచులలో అలవాటులలో ఇండివిడ్యులిస్టు అంటున్నందువల్ల సాధారణ ప్రజలకు, ఆయనకు నడుమ అఘాత మేర్పడినది కనుక ఆయన ప్రజానాయకుడు గాక, వేరు ప్రపంచమునకు చెందినవాడైనాడు.

ఈ ప్రజాస్వామ్య యుగములో తన ప్రజ్ఞా పాటవాలను వినియోగించి, వాదనై పుణ్యమును ప్రదర్శించి గొప్ప పార్లమెంటేరియన్ కాగలిగినాడు

## ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షత

భారత దేశములో ఉన్నత విద్య 1858 వ సంవత్సరము ప్రాంతాల ప్రారంభమయినది దీనిని గురించి విభిన్న దృక్పథాలతో వేర్వేరు కాలాలలో విమర్శలు ప్రారంభమైనవి ఇందుకు ముఖ్యమైన కారణము ఏమనగా భారత దేశములోని విశ్వ విద్యాలయాలలో పరిశోధనలు పరమపూజ్యమగుట ఈ విశ్వవిద్యాలయాల వల్ల అఖండ ప్రతిభావంతులు అవతరించిన మాట వాస్తవమే కాని ప్రకృతి శాస్త్ర విషయమై వారికి తెలిసినది ఆకాశం గగనం శూన్యం! అన్నట్లున్నది సిద్ధాంత ప్రకారము సిండికేటు ఉన్నది వాస్తవమే పేరునకు మాత్రము విశ్వవిద్యాలయోపాధ్యక్షు లున్నాడు కాని పాలన చేసేవది రిజిస్ట్రారు ఆయన పరిపాలనము ఏమా? ప్రశ్న పత్రాలను పంపుట, జవాబులు తెప్పించుట,

డిగ్రీలు ఇచ్చుట ఈ విధముగా విశ్వవిద్యాలయము గుమాస్తాల ద్వారమున పనిచేసి బి ఏ లను సృష్టించినది స్నాతకోత్సవముతో ఆ సంవత్సరము పరిసమాప్తి ఇది యేటేట పెట్టెడి తద్దినమువంటి దనవచ్చును స్నాతకోత్సవములో వాగాడంబరము కావలసినంత క్రియ శూన్యము

విశ్వవిద్యాలయముల ఈ తంతు చూచిన విద్యాధికులు సహింపలేకపోయినారు మన్ను మిన్ను మారుమ్రోగునంత ఆందోళనము ప్రారంభమైనది మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కరణల మీద రామలింగారెడ్డి ఉపన్యాసాలు సాగించినాడు సర్ ఆశుతోషు ముఖర్జి కలకత్తా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షు డైనాడు సర్ మైకేలు శాడరు కలకత్తాలో అడుగు పెట్టినాడు ఇవి ముఖ్యమైన ఘట్టాలు పిమ్మట ఉదయించినవి నూతన విశ్వవిద్యాలయాలు విద్య ద్వంద్వ ప్రభుత్వాధీనము అగుటకూడ ఇందుకు కొంత దోహదము ఇచ్చినది అప్పటినుండి ఆరంభమైనది విశ్వవిద్యాలయ యుగము

వంగదేశ విభజన ఫలితముగా భాషాప్రయుక్త రాష్ట్రములు కావలెనని అందోళన ప్రారంభమైనది అందులో ఆంధ్రులు అగ్రగాము లయినారు ఆంధ్రోద్యమము ఆరంభమైనది దీనికి మూడు ప్రధానాశయాలు ఆంధ్ర దేశమునకు ఒక రాష్ట్రము ఒక విశ్వవిద్యాలయము ఏర్పాటు కావలెనని, ఆంధ్రులను పటాలములో చేర్చుకొనవలెనని ఆంధ్రజాతి వికాసముకొరకు ఈ ఉద్యమము దిన దినాభివృద్ధి పొందసాగినది

ఇది ఇట్లుండగా 1919 వ సంవత్సరములో కలకత్తా యూనివర్సిటీ కమీషను ప్రెసిడెంటు సర్ మైకేలు శాడరు రిపోర్టు మూలమున విశ్వవిద్యాలయ విధానములో నూతన యుగోదయమైనది దాని ఫలితముగా ఆలీఘుర్ లక్నో ఢక్కా ఢిల్లీ విశ్వవిద్యాలయములు ఏర్పడినవి

1907 వ సంవత్సరములోనే ఆంధ్ర విశ్వవిద్యాలయపు ఏర్పాటు అవసరమని రెడ్డికి తోచినది 1915 వ సంవత్సరములో భాషాప్రయుక్తముగా మద్రాసు రాజధానిలో విశ్వవిద్యాలయాల ఏర్పాటు అవసరమని ఆందోళన ప్రారంభమైనది ఆయన విశ్వవిద్యాలయ సంస్కరణోపన్యాసాలలో ఈ విషయము నొక్కి వక్కాణించినాడు అధిక సంఖ్యాకులయిన ఆంధ్రులకైన ముందు విశ్వవిద్యాలయము ఏర్పాటు చేయవలెనన్నాడు 1917 వ సంవత్సరపు ఉగాది సంచికలో ఆంధ్ర విశ్వవిద్యాలయమును గురించి ఒక వ్యాసము ప్రకటితమైనది

ఆంధ్రులు పదేండ్లపాటు చేసిన కృషి ఫలితముగాను రామలింగారెడ్డిగారి కృషి సహకారముతోను, మద్రాసు విశ్వవిద్యాలయపు సెనేటు సభలో 1920 వ సంవత్సరములో ఆంధ్రులకు ఒక ప్రత్యేక విశ్వవిద్యాలయము అవసరమని తీర్మానము జరిగినది

ఈ విషయమును గురించి పర్యాలోచన చేసి సలహా నిచ్చుటకు 1920 వ సంవత్సరములోనే దొరతనమువారు ఒక సంఘమును ఏర్పాటు చేసినారు దానికి దివాన్ బహదూర్ గోవిందరాఘవయ్య గారు అధ్యక్షులు ఇతర సభ్యులు పదునెనిమిదిమంది వీరిలో సుబ్బరెడ్డి కూడ ఉన్నాడు వీరు ఒక నివేదికను ప్రభుత్వమువారికి పంపినారు ఆ నివేదికయే విశ్వవిద్యాలయమునకు పునాది, ముఖ్యాధారము అనవచ్చును అప్పటికే విశ్వవిద్యాలయ విధానములో విఖ్యాతిగాంచిన రామలింగారెడ్డి వ్రాసినది అంతయు చూచి కమిటీవారు దాదాపుగా మొత్తము అంగీకరించినారు ఈ విధముగా ఇందు రెడ్డి ప్రధాన పాత్ర వహించినాడు

అయినను 1923 వ సంవత్సరమువరకు ఏ పనియును జరుగలేదు ఆ సంవత్సరములో స్ట్రాథాంగారు లోగడ నివేదికను అనుసరించి ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపన అవసరమని మరొక రిపోర్టు మదరాసు విశ్వవిద్యాలయ ద్వారమున ప్రభుత్వమునకు పంపించినారు.

మద్రాసు శాసనసభలో విద్యామంత్రి అన్నెం పరశురామ పాత్రోగారు ఆంధ్ర యూనివర్సిటీ బిల్లును 1925 వ సంవత్సరములో లోగడ గోవిందరామయ్యర్ కమిటీ ప్రతిపాదనలను అనుసరించి ప్రతిపాదించినారు ఆంధ్ర విశ్వవిద్యాలయపు చట్టము అను పేర ఈ బిల్లు 1926 వ సంవత్సరములో శాసనబద్ధ మయినది రామలింగారెడ్డి శాసనసభలో నుండి దీనికై చేసిన కృషి పాఠకులకు విదితమే

విద్యా శాఖామాత్యులు పాత్రోగారు ఈ బిల్లు చివర చర్చలో ఇట్లు అనిరి

"ఈ బిల్లు ఆంధ్రదేశములో నూతన చైతన్యము తీసికొని రాగలదు ఇదంతయు ఉపాధ్యక్షుని మీద ఆధారపడి యున్నది ఆయన గొప్ప ఉత్సాహవంతుడు అనుభవజ్ఞుడు మనస్ఫూర్తిగా పనిచేయువాడు అయి ఉండవలెను అప్పుడే ఈ బిల్లులో ప్రతిపాదింపపడిన అంశములు కార్యరూపము దాల్పగలవు ఇది సాధారణ వ్యక్తి ఆచరించెడి కార్యము కాదని మాత్రము నేను చెప్పగలను"

స్టాథాంగారు కూడ తమ నివేదికలో 'దన జీవితమును ఇందుకు అంకితము చేయ గల వ్యక్తినే ఉపాధ్యక్షునిగా నియమింపవలెను" అని చెప్పినారు

ప్రభుత్వమువారుకూడ అటువంటి వ్యక్తి ఎవరా అని దీర్ఘాలోచన చేసి అన్నివిధముల తగినవాడు రామలింగారెడ్డియే అని నిశ్చయించి ఆయనను ఉపాధ్యక్షునిగా నియమించినారు

ఇట్లు 1926 వ సంవత్సరము ఏప్రిల్ నెల 26వ తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయ కార్యాలయము బెజవాడ మ్యూజియములో ప్రారంభమైనది అప్పటిలో రామలింగారెడ్డి స్వయం రాజా స్వయం మంత్రి ఆయన విశ్వవిద్యాలయ నిబంధనలను ఏర్పాటు చేయసాగినాడు ఇందులో ప్రభుత్వమువారిచే నియమింప



ఎ ఆర్ రెడ్డి 1976 లో

ఒడిన కొందరు విద్యావేత్తలును రిజిస్ట్రారగు సెట్టిగారును ఆయనకు తోడ్పడినారు విశ్వవిద్యాలయ నిర్వహణమునకు సంబంధించిన సలహా సంఘపు నియమాలను అన్నింటిని ఈ విధముగా ఆయన ఏర్పాటుచేసిన ఎదప ఎన్నికలు జరిగినవి 1926 వ సంవత్సరము ఆగష్టు నెల 30 తేదీనాడు తొలి సెనేటుసభ సమావేశమైనది

విశ్వవిద్యాలయ మనగా భవనాలు కావు దాని ఆదర్శమును తెలుపు ముద్ర ఉండవలెను రాజ్యమునకు పతాక ఎటువంటిదో విశ్వవిద్యాలయమునకు మొహరు అటువంటిది ఈ సంగతిని గుర్తించినవాడు కాబట్టి 1927 వ సంవత్సరములో ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయ ముద్రకోసము ప్రకటన చేయగా 200మంది చిత్రములు పంపినారు వానిలో కౌతా శ్రీరామశాస్త్రిగారి కుమారుడగు రామమోహనశాస్త్రిగారిది రామలింగా రెడ్డికి నచ్చినది ఆ చిత్రకారునితో సంప్రతించి తుదిఏర్పాటు(Final design) చేయించినాడు రెడ్డి ఇతర విశ్వవిద్యాలయములు అన్నియు పట్టణ నామములతో వెలసినవి జాతిపేరుతో వెలసినది ఆంధ్ర విశ్వవిద్యాలయము మాత్రమే ఆ మాదిరిగానే విశ్వవిద్యాలయపు మొహరు కూడ అన్ని విశ్వవిద్యాలయముల మొహర్లకంటె మెరుగైనది ఇది రెడ్డి ప్రతిభకు చిహ్నము దీనిని తయారుచేసిన రామమోహన శాస్త్రిగారి వయస్సునాటికి 16 సంవత్సరాలు మాత్రమే అది అంతయు వారి తండ్రిగారి చలువ

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ముద్ర ఆంధ్రజాతి ఔన్నత్యమును ఆశయములను ప్రస్ఫుట మొనరించుచున్నది 64 కోణములు గల చక్రము మధ్యమందు కొలనులో పద్మము దానిపైని అరుణ భానుడు, ఆపైన స్వస్తిక క్రిందిభాగమున "తేజస్వినావధీత మస్తు" అను దీక్షావాక్యము (Motto) చక్రమునకు క్రిందిభాగమున బాలచంద్రుడు– ఈ చక్రమును రెండువైపుల సర్పరాజములు పట్టుకొన్నవి నాగుబాములతోకల పైభాగమున ఆంధ్రమున 'ఆంధ్ర

విశ్వకళాపరిషత్ అని లిఖింపబడినది ఈ ముద్ర అత్యంత సుంద రముగా ప్రతిభా సమన్వితముగా కనబడును

64 కోణములుగల చక్రము చతుష్షష్టి కళలకు చిహ్నము రెండువైపులనున్న నాగములు ఆంధ్రులను నాగజాతివారినిగా నిరూపించును నాగయ్య నాగేశ్వరరావు మొదలగుపేర్లు ఆంధ్రు లకు మాత్రమే కలవు పురాతన గ్రీకుదేశపు మతానుసారమేకాక నాగములు బుద్ధివికాసమునకు చిహ్నమని ప్రపంచమంతటిలో భావింపబడుచున్నది వికసించుచున్న పద్మము పవిత్రహృదయము నకు మానవునిలో భగవత్సంబంధమైన ఉత్తమాలోచనములకు చిహ్నము అరుణభానుడు విజ్ఞాన శుభోదయ చిహ్నము స్వస్తిక వేదముల ననుసరించి మంత్రశాస్త్రమున ప్రచురితమైన సర్వసుఖ ములకు అర్థమిచ్చు చిహ్నము దేవతలను దివినుండి భువికి ఆహ్వా నించుచున్నాము తుది మొదలులేని అనంత కాలవాహానికి గుర్తు శక్తి నిరూపక యంత్రముకూడ

'తేజస్వినావధీతమస్తు అనునది మనవైదిక విద్యావిధా నపు మహాశయము దీని అర్థము 'విద్యార్థులమగు మనము తేజస్సం పన్నుల మగుదుము గాక !' అని ఇది ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆశయము

నెలవంక, శివుని జటాజూటమునందలి విదియనాటి చంద్ర రేఖ 'విశ్వకళాపరిషత్' అనుటలోగూడ గొప్పభావము గలదు విశ్వవిద్యాలయమునకు బదులు 'కళాపరిషత్' అని నామమిడుటలో 'పరిషత్' అనుమాట భావవైశాల్యమున అనర్ఘమైనదని రెడ్డి భావించినాడు ఈ సందర్భమున 'కళాపరిషత్' అను సమాసము ఆయనకు అధికముగా అనురాగపాత్రమైనది ఇది ఎంత సమంజ సమో వివరింపనక్కరలేదు తెలుగు లిపితో 'విశ్వకళాపరిషత్' అని యుండుట ఆంధ్రమునసే విద్య గరపవలెనను ఆశయమును తెలుపుచున్నది 'ఆంధ్ర విశ్వకళాపరిషత్', ముద్ర ఆంధ్ర విజ్ఞాన మునకు ప్రతీక

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ప్రభుత్వముయొక్క ఆమోదము లభించినపిదప రెండు సంవత్సరముల కాలము స్వతంత్రముగా కార్యములను నిర్వహించుకొనుట ప్రభుత్వాధీనమైన కళాశాలను విశ్వవిద్యాలయాధీనముగా చేసికొనుట మొదలగువానిని గురించిన చర్చలతో గడచినది

ఆంధ్రవిశ్వవిద్యాలయ కేంద్రము లేని వట్టి కార్యస్థానమైన బెజవాడలో పనిచేయుట రెడ్డికి సుతరాము ఇష్టములేదు ఇక్కడ విశ్వవిద్యాలయమునకు సంబంధించిన కట్టడములు కట్టవలసి యుండెను 1926 వ సంవత్సరములో ఎన్నికలు జరగగా జస్టసు పార్టీ ఓడిపోయినది నూతన మంత్రివర్గము ఏర్పడినది డాక్టర్ సుబ్బరాయన్‌గారు ప్రధానమంత్రి ఆయనచే విశ్వవిద్యాలయపు చట్టమును సవరింపజేయ దలచి అందుకు ప్రయత్నము మొదలు పెట్టినాడు రెడ్డి

ఇదేసమయములో బెజవాడవారు కేంద్రముకోసము ప్రయత్నములు ప్రారంభించినారు కేంద్రమునకు ఎన్ని హంగులుండవలెను? అన్నది ఒక సమస్య అయినది ఈ విషయమై సిండికేట్ అభిప్రాయము కోరగా బెజవాడలో నాలుగవ కేంద్రము ఉండవలెనని తీర్మానింపబడినది కాని విద్యాశాఖాధికారులు వ్యతిరేకించినారు నాలుగవ కేంద్రమును వారు భరింపజాలమన్నారు రాజమహేంద్రవరములోని కేంద్రమును బెజవాడకు మార్చినను బెజవాడలోని కార్యస్థానమును రాజమహేంద్రవరమునకు మార్చినను తమకు అభ్యంతరము లేదని ప్రభుత్వమువారు తెలిపినారు దీనిపై 1928 సంవత్సరములో మరల రాజకీయములు రేగినవి అందుచేత బెజవాడకు, రాజమండ్రికి పోటి ఏర్పడినది ఇది రామలింగా

రెడ్డికి ఇష్టములేదు అయినను గవర్నమెంటు తాఖీదును సెనేటు ముందు చర్చకు పెట్టవలసి వచ్చినది వేర్వేరు ప్రాంతాలవారు తమ తమ పట్టణములలోనే కేంద్రస్థానము ఉండవలెనని స్థానికాభిమానముతో రాష్ట్రహితము లక్ష్యంపక వివాదపడినారు

అంతట ప్రభుత్వమువారు ఈ విధముగా ప్రకటించినారు

"మీరు ఏమియు చేయలేక తగాదా పడుచున్నారు కార్యాలోచనమున్నట్లు లేదు కనుక కాలేజీలను మద్రాసు విశ్వవిద్యాలయమునకు ఇచ్చివేయుడు! విశాఖపట్టణములోని కేంద్రమును వృద్ధిచేసికొనుడు!"

1929 వ సంవత్సరములో విశాఖపట్టణము విశ్వవిద్యాలయ కేంద్రముగా నుండునట్లు సవరణ జరిగినది విశాఖపట్టణము తమకు దూరము కాబట్టి మద్రాసువిశ్వవిద్యాలయాధికారములోనే తమ ప్రాంతము ఉండిపోవలెనని రాయలసీమవారు సవరణ తెచ్చినారు సుబ్బరాయన్‌గారందు కంగీకరించినారు ఈ విధముగా ఆంధ్రవిశ్వవిద్యాలయము ఉత్తరసర్కారులకు నెల్లూరునకు పరిమితమై పోయినది

విశ్వవిద్యాలయకేంద్రము బెజవాడనుండి విశాఖపట్టణమునకు మారుటకు రామలింగారెడ్డియే కారణము బెజవాడ ఉష్ణప్రదేశము దీనిని బ్లేజ్‌వాడ (మంటల పట్టణము) అన్నారు అంతేగాకఇది (Hot, Hotter, Hottest) ఇది పరిశోధనకు అనువైన స్థలముకాదు రద్దీప్రాంతము విశాఖపట్టణమన్ననో సమశీతల ప్రదేశము పరిశోధనకనువైనప్రదేశము

విశాఖపట్టణము సముద్రతీరము, పర్వతశ్రేణిగల రమ్యమైన ప్రాంతము, ప్రకృతి సౌందర్యమునకు ఆటపట్టు ఒక సందర్భములో సర్ సి వి రామన్‌గారు ఈ నగరములోని విశ్వవిద్యాలయమును సందర్శించి 'ఇంత చక్కని ప్రదేశములో నిర్మింపబడిన విశ్వవిద్యాలయము భారతదేశములో ఎక్కడను లేదు 'అని ప్రశంసించినారు,

రాయలసీమవాడై కూడ రామలింగారెడ్డి ఆంధ్రవిశ్వవిద్యాలయమును అనంతపురములో నెలకొల్పక వాల్తేరులోనే స్థిరపరచినాడు ఆరోజులలో కొందరికి ఇది చాల కోపకారణమైనది కాని యీనాడు అదే మంచిపనిగా మనము అందరము ఆమోదించగలుగుచున్నారము రెడ్డికి కావలసినది దేశహితమే కాని ప్రాంతీయాభిమానముతో సంకుచితముగా వ్యవహరించుటకాదు 1928 వ సంవత్సరములో సెనేటు రామలింగారెడ్డిని ఏకగ్రీవముగా ఎన్నుకొన్నది

రెడ్డికృషి ఫలితముగా ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ఆర్థిక సాహాయ్యపుచట్టము1930 వ సంవత్సరములో జరిగినది కాని 1930 వసంవత్సరములో గాంధిమహాత్ముడు సత్యాగ్రహము ప్రారంభించినాడు దేశమునందు ఎల్లయెడలను సత్యాగ్రహసమరము సాగినది ప్రభుత్వము వారుదీనిని అణచుటకు దారుణదమననీతిని ప్రారంభించినారు ఆ ఘోరచర్యకు దేశభక్తుడైన రామలింగారెడ్డి హృదయము సంక్షుభితమైనది 'మీరు ఈ లాటీచార్జిపద్ధతిని మానుకొననిచో ఈ విశ్వవిద్యాలయోపాధ్యక్షపదవికి నేను రాజీనామానిచ్చుచున్నాను," అని ప్రభుత్వమువారిని హెచ్చరించినాడాయన హెచ్చరించుటే కాదు అంతపని చేసినాడుకూడ అంత పెద్ద ఉద్యోగమును తృణప్రాయముగా వదలి కాంగ్రెసునకు బాసటగా నిలిచి ఉద్యమాభివృద్ధికి తోడ్పడినాడు

రెడ్డి యిట్లు ఉపాధ్యక్షపదవిని వదలుకొనగానే దానికయి క్రొత్తవ్యక్తి కావలసివచ్చెను సర్ ఆర్ వేంకటరత్నము నాయుడుగారికిని (శ్రీ) రాధాకృష్ణన్‌గారికిని ఆ పదవి నిమిత్తము పోటీ జరిగినది వృద్ధులయిన నాయుడుగారు విశ్రాంతి గైకొనుటే మేలని భావించిన రెడ్డి రాధాకృష్ణన్‌గారి విజయమునకై పాటు పడినాడు ఒక్క వోటు తేడాతో నాయుడుగారిని ఓడించి రాధాకృష్ణన్‌గారు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్ష పీఠమును అలంకరించినారు

# గాంధీజీ యెడల

ఆధునిక భారతీయ రాజకీయ ప్రపంచములో గాంధీజీ శకము ఒక మహోజ్జ్వలోదంతము సనాతన అధునాతన ధర్మములకు ఒక చక్కని మేళవింపు కలిగిన గాంధీయిజం భారతరాజకీయములలోనే కాదు ప్రపంచ రాజకీయ భారతములోనే ఒక మహత్తర రీతగా ఒప్పారుచున్నది

'గాంధీయిజం భారతదేశములో హిమాలయము అజరామరమై నిలిచి అది నేటికి రేపటికి, మరెప్పటికి గూడ ఒక మహోజ్జ్వల జ్యోతివలె మానవసంఘమును ధర్మపద బద్ధమును చేయగల సజీవశక్తి కాగలదు గాంధీమహాత్ముడు ఈ యుగములోనే కాదు, సర్వకాలములకు కూడ ఒక శాంతియుత విప్లవవీరుడు

ఈ యిరువదవ శతాబ్దపు మొదటిపాదములో గాంధీజీ నిర్వహించిన పాత్ర ఎట్టిది ?

నిద్రాణమైయున్న భారతజాతిలో గాంధీజీ ఒక నవ్యశక్తిని పూరించినాడు నిస్తేజమై యున్న భారతరాజకీయ ప్రపంచములో గాంధీజీ ఒక దివ్యకాంతిని ఉద్దీపింపచేసినాడు

అన్యాయమునకు, అవినీతికి ఆకరములగు రాజకీయములను సత్య ధర్మ శౌచములచే మథించి వానికి పవిత్రతను ఆపాదింపజేసినాడు గాంధీజీ రాజకీయములనే ఒక క్రొత్తమతమును చేసినాడు సత్యాహింసల ప్రబోధములతో రాజకీయములను పవిత్రము చేయుటయేగాక రాజకీయ జీవితమునకు ఒక స్థాయిని రాజకీయ నాయకులకు అఖండ వ్యక్తిత్వమును ఆయన కొని తెచ్చినాడు 'సత్యాగ్రహ'మనెడి ఒక అపూర్వాస్త్రమును ప్రయోగించి ఇరువదవ శతాబ్దములో గాంధీ నడిపిన రాజకీయోద్యమములు భారత భూమిని నలుమూలల కదల్చివేసినవి గాంధీకృతమైన జాతీయవిప్లవ

తరంగము ఆసేతుశీతనగము భారత భూమిలోపల వెల్లివిరిసినది 'విప్లవము' అనెడి వెల్లువ ఫలితముగా త్యాగమే జీవితాదర్శముగా గల పురుషులు, దేశసేవయే పరమ లక్ష్యముగా గల ప్రముఖులు బయలుదేరి గాంధీయోద్యమములో లీనమై వివిధ స్వాతంత్ర్య రణరథికులకు సారథులైనారు

త్యాగధైర్యములను విస్మరించిన జాతి త్యాగధైర్యోపేతమై స్వాతంత్ర్య సమరములో తులలేని త్యాగమును చేసినది అరివీర భయంకరమైన ధైర్యమును ప్రకటించినది ప్రభుభక్తి పరాయణు లెందరో అహింసావలంబులైనారు ఒక్కమాటలో ప్రతి భార తీయుడు దేశభక్తి ప్రబోధితుడైనాడు, స్వాతంత్ర్య భావపులకితు డైనాడు

ఒక్కొక్క మహాపురుషుని చరిత్ర ఒక్కొక్క కాలములో దేశచరిత్రగా భావింపబడును

ఫ్రెంచివిప్లవమునుండి వాటర్లూ యుద్ధమువరకును నెపోలి యను చరిత్రయే ఐరోపాఖండ చరిత్రగా భావింపబడును

ఆలాగుననే 1920–47 వరకుగల భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామచరిత్ర గాంధీమహాత్ముని చరిత్రగా భావింపబడును

గాంధీమహాత్ముడనగా కాంగ్రెసు, కాంగ్రెసనగా దేశము

అట్టిచో మన మేధావిరెడ్డి గాంధీజీని తన జీవితములో ఎప్పుడెప్పుడెట్లు భావించినాడో అందులకు కారణములు కను గొనుట అవసరము కదా 1919 లో ద్వంద్వప్రభుత్వము దాని అనంతరము (Dyarchyand After) అనెడి కరపత్రములో గాంధీజీని ఎదుర్కొనుచు చెమ్స్ఫర్డు సంస్కరణముల మూలమున మనకు గొప్పప్రయోజనము రానున్నదని వాటిని జయప్రదముగా అమలుజరిపినచో ఇంకను మనకు గొప్ప సంస్కరణములు రాగల వని గాంధీజీ దీనికి వ్యతిరిక్తుడుగా నున్నాడు గనుక, వివేకవంతు లందరు ఆయనమాట, కాదని శాసనసభలోచేరి ద్వంద్వప్రభుత్వ

మును చేపట్టవలెనని కోరుచు గాంధీజీని విమర్శించినాడు గాంధీజీ అడుగుజాడలలో నడచుటనగా హిందూదేశము తిరిగి అనాగరకదశ లోనికి పోవుటయే అన్నాడు ప్రథమములో కొందరు ఈలాగే భావించినారు కనుక దీనిని అట్టే గమనించనక్కరలేదు

"నేను 1924 వ సంవత్సరమున గాంధీగారిచే నొకానొక రాజకార్యార్థమై పంజాబునకుఁ బంపబడినప్పుడు" అని వ్రాసినారు అది అంతే, వివరము తెలియదు

అహింసాపూర్వకముగా ప్రజలు సత్యాగ్రహము చేయు చుండగా ప్రభుత్వము అనవసరముగ అతిదారుణముగ వారియెడల ప్రవర్తించుచున్నదని దానిని అరికట్టి గాంధీమహాత్మునితో రాజీకి రాకపోయినచో తాను ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవి వదలు పెట్టుచున్నానని 1930 జూన్‌లో గవర్నరుకు ఉత్తరము వ్రాసి నాడు రెడ్డి ఈ ఉత్తరము గొప్పదిగ భావింపబడినది గవర్నరు ఆయనమాట లక్ష్యపెట్టనందువల్ల రాజీనామా ఇచ్చినాడాయన

1930 సంవత్సరము మొదలుకొని రామలింగారెడ్డి నేషనల్ వార్ ఫ్రంట్ లీడర్ అగునంతవరకు ఉపన్యాసములలోను, కరపత్ర ములలోను శాసనసభలలోను గాంధీ తత్త్వమును అద్భుతముగా ప్రచారము చేసినాడు

1931 లో ఆయన వ్యాసములను, ఉపన్యాసములను ప్రక టించినాడు ఇవన్నియు కాంగ్రెసునకు అనుకూలమైనవే ఆ పుస్త కమునకు (Articles on R T C and other addresses) పేరుపెట్టి గాంధీమహాత్మునకు అంకితమిచ్చినాడు దానికి చక్కని పీఠికకూడ వ్రాసినాడు

"Mahatma Gandhi appears to be more concerned with nation building from within than constitution building from London or Delhi while others feast, he feasts, while others pray, he does so with an 'a He is a man of sorrows, because our s

is a land of sorrows and humilities And this volume I offer at his feet as my little flower of worship'

ఆ పుస్తకములోని మరికొన్ని వాక్యములకు తెలుగు

'1920 వ సంవత్సరమునుండి మనలో గొప్పమార్పు వచ్చినది గాంధీమహాత్ముడు ప్రపంచపురుషు డయినాడు He is a world figure గాంధీజీ ఉద్యమము బాహ్యమైనదికాదు ఆంతరంగికమైనది నైతికమైనది విశ్వవిద్యాలయము చేయలేని కార్యము మహాత్ముడు చేసినాడు ప్రజలలో విజ్ఞానమును, ధైర్యసాహసములను నెలకొల్పినాడు మట్టిముద్దలను మహాపురుషులనుగా చేసిన మహాత్ము డాయన

'వోటర్లకు ఒక విన్నపము అనుచు ఒక వ్యాసము 1934వ సంవత్సరము అక్టోబరు నెల 15 వ తేదీ హిందూపత్రికలో ప్రకటించినాడు దానిని మన తెలుగుపత్రికలు అనువాదముచేసి ప్రకటించినవి కాంగ్రెసువారు ఎన్నో వేల ప్రతులను వేసి దేశమంతటను పంచినారు అది చాల ఉద్బోధకరముగా ఉండి పాఠకులను పరవశులను చేసినది అది ఆయన వ్యాసములలో గొప్పది ఆ మాదిరిగా ఇంతవరకు కాంగ్రెసు తత్త్వమును, గొప్పతనమును చిత్రించినవారు అరుదు

ఒకనాడు నెల్లూరు వచ్చినప్పుడు ఆయనను భారతమును గురించి ఉపన్యసించవలసినదిగా ప్రజలు కోరినారు "ఏనాటి భారతమో ఎందుకు ? ఈనాటి భారతమే కావలె" నని స్వాతంత్ర్య సంగ్రామమును గురించి బ్రహ్మాండముగ ఉపన్యాసము గావించినా డాయన

దాని సారాంశము "కురుక్షేత్ర సంగ్రామము అయిదూళ్ళకొరకు జరిగినది నేడు మనఎదుట నున్నది భారతయుద్ధము భారతదేశముకొరకు ప్రపంచము కని విని ఎరుగని విధముగా

మహాత్ముని నాయకత్వమున శాంతియుతముగా జరుగుచున్నది ఈ శాంతి సమరములో స్త్రీ పురుషులేగాక పసిపిల్లలు కూడ పాల్గొనుచు ప్రపంచమును దిగ్భ్రమ చెందించుచున్నారు కడచిన యుద్ధము ఎందుకు? జన్మమెత్తినందుకు ఈ యుద్ధములో పాల్గొని జన్మసార్థకము చేసికొనవలె

కాంగ్రెసు మన శిథిల నాగరికతలో ప్రాణమును నెల కొల్పినది ప్రాణముగాయెను ఉత్సాహము కార్యాచరణోత్సాహము ధైర్యము సాహసము అను వానిని ప్రతిష్ఠించినది

అభిమన్యునివలె అది అపజయము పొందవచ్చును కాని అగౌరవము పొందదు ఆ ఉత్సాహము సర్వదా విశిష్టముగనే యుండును

ఇతరపక్షాలు పాలుక భావాలను ఆశయాలను కలగలుపు చేసికొనుగాక! అయినప్పటికిని ఈదేశములో కాంగ్రెసు సర్వపక్ష పక్షము

ఆయన సందేశము ప్రపంచ సంస్కృతికి భారతదేశము సమర్పించు విరాళము, పాట్నా స్నాతకోత్సవ సభలో ఆయన ఉపన్యాసములో ఈ అంశము నుగలదు

'గాంధీజీ దివిని భువిని ఒకే దివ్య సౌధముగా సమన్వయ మొనర్చుటకు యత్నించి యున్నాడు –ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవసభలో

'రాజకీయముగా గాని సాంఘికముగాగాని, కడకుఆర్థికముగా గాని సంభావ్యములగు కేవల ఫలములన్నిటికి అతీతుడైన విశిష్ట పురుషుడుగ గాంధిమహాత్ముడు ఆయన ఆధ్యాత్మికమైన ఒక నూతన శక్తినిప్రదర్శించుచున్నాడు నా అభిప్రాయములో ఇది సర్వప్రజలు సంపాదింప వలసినది '

9–9–37 వ తేదీన మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలులో రెడ్డి ఉపన్యాసభాగము

గాంధిజీ హైందవమూర్తిని మరికొన్ని అంగుళములు పెంచి నాడు

తిలక్ కారాగృహ భయమును నాశనము చేసినాడు గాంధీ జైలునకు వెళ్ళుట ఫాషను చేసినాడు

గాంధి భారతీయుల ఆత్మగౌరవమును పెంచినాడు

"Gandhiji made a few inches of stature of Indians పై విధముగా గాంధీజీని ప్రసంగించినవాడే National Warfront leader గా గాంధీజీని, కాంగ్రెసును ఖండించుచు అనేక ప్రసంగములు చేసినాడు నాకు లభించినవాటిలో An examination of the Present Satyagraha movement-war and the Congress, Morality, Malaria and Gandhiji s release

పై వానిలో మొదటిది మద్రాసు మొదలగు ప్రాంతము లలో ఇచ్చిన ఉపన్యాసము రెండవది నెల్లూరు ఉపన్యాసము మూడ వది "Liberator అను పత్రికలో 1944 మే 18 వ తేదీన ప్రకటించిన వ్యాసము

మొదటిది హేతుబద్ధముగా చేసిన విమర్శ రెండవది ఉదాత్తముగా చేసిన పరిశీలన మూడవది ఉద్రేకములో చేసిన రచన ఇందులో గాంధీమహాత్ముని 'గాంధీగా' అనుటయేగాక పరస్పర విరుద్ధభావములు వెల్లడించుచు గాంధీ మహాత్ముని కాంగ్రెసు చరిత్రలో కంటె అధికముగ దూషించుట, శాపనార్థములు పెట్టుట బ్రిటిషు జాతిని పొగడుట జరిగినది

శాసనసభలో రెడ్డినాయుడుగా రొకసారి గాంధిజీని దూషించినాడు ఆయనను పట్టుకొని 'నీవు భారతీయుడవేనా ? అనుట జరిగి, ది అటువంటి ఆయన ఎవరును అనజాలని మాటలు గాంధి మహాత్ముని అన్నాడు

# చిత్తూరు జిల్లాబోర్డు అధ్యక్షత

రామలింగారెడ్డి కాంగ్రెసు అభ్యర్థిగా శాసనసభకు ఎన్నికైన తర్వాత చిత్తూరు జిల్లాబోర్డు మెంబరుగా నిలిచి 1935 డిసెంబరులో విజయము గాంచినాడు ఆయనను ప్రెసిడెంటుగా కాంగ్రెసు నిలిపినది తన్ను అధ్యక్షునిగ ఎన్నుకోవలసినదని ఆయన ఎవరిని అర్థించలేదు నిర్లిప్తతతో నున్నాడు

వారణాసి రఘునాథరెడ్డి అధ్యక్షస్థానమునకు పోటీకి నిలిచినాడు సమానముగా వోట్లు వచ్చినవి

రామలింగారెడ్డి లాటరీలో వచ్చినాడు కాబట్టి ఆయనకు లాటరీ ప్రెసిడెంటని వాడుక వచ్చినది

ఆయన సర్వసాధారణముగ జిల్లాబోర్డు సభ్యుల మాటవిని ప్రెసిడెంట్లుచేసెడి అనకతవక పనులేమియు చేయలేదు గవర్నమెంటు స్పెషలాఫీసరువలె విధి నిర్వహణచేసి ప్రఖ్యాతి గాంచినాడు

చిత్తూరు జిల్లాబోర్డు అధ్యక్షులలో చెప్పదగినవారు రామలింగారెడ్డి బొల్లిని మునిస్వామినాయుడు మునిస్వామినాయుడు రైతు బిడ్డ కర్షకదృక్పథము కలవాడై సెటిల్‌మెంటుపనులు నిలిపి, టోలుగేట్లు పన్ను తీసివేసి కర్షకులకు గొప్ప ఉపకారముచేసినాడు కర్షకమంత్రిగా విఖ్యాతి గాంచినాడు

జిల్లాబోర్డు అధ్యక్షుడుగా ఉండి ఎన్నో రోడ్లు వేయించి తక్కిన జిల్లాలవారికి మార్గదర్శి అయినాడు విద్యకు, ఆరోగ్యాభివృద్ధికి కూడ ప్రోత్సాహకుడుగా తోడ్పడినాడు

రామలింగారెడ్డి జిల్లాబోర్డు అధ్యక్షత వహించినది స్వల్పకాలమయినను ఆదర్శప్రదమయినది 1936 లో దానికి రాజీనామా ఇచ్చి ఆయన వైస్‌చాన్సలర్ అయినాడు

ఎక్కడ రామలింగారెడ్డి? ఎక్కడ జిల్లాబోర్డు? 'కుంజర యూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్' అనునట్లు ఆయన దీనిలో దూరుట ఏమిటి?

## శాసనసభలో చాకచక్యము

**1930** సంవత్సరములో ప్రభుత్వదమననీతికి సహించలేక దేశభక్తుడైన రామలింగారెడ్డి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షపదవికి రాజీనామా యిచ్చి కాంగ్రెసునకు సుముఖుడుగా నుండెను

గాంధిమహాత్ముడు సమష్టి శాసనోల్లంఘనము ఆపుటకును, వ్యక్తి శాసనోల్లంఘనము జరుపుటకును దేశనాయకులతో సంప్రతించి ఏర్పాటుచేసెను కాని సభలో వాగ్దానముచేసిన నాయకులు ఆప్రకారము నడచుకొనలేదు అధికముగా అందువల్ల కొంతవరకు ఆశాభంగము కలిగినది గాంధీమహాత్మునకు, ఆయన హరిజనోద్యమమునకు ప్రాధాన్యమిచ్చి దానిపని చేయుచు 1934 లో పరిస్థితులు విచారించి శాసనోల్లంఘమును విరమించుకొనుటకు నిశ్చయించుకొనిరి

ఈలోపుగా తిరిగి కౌన్సిళ్ళ ప్రవేశమునుగూర్చి ఉద్యమము బయలుదేరినది 1934 వ సంవత్సరము మే నెలలో శాసనోల్లంఘనోద్యమము విరమింపబడినది వెంటనే గవర్నమెంటు కాంగ్రెసుపై నిషేధము చాలవరకు తొలగించెను

ప్రకాశముగారు ఆంధ్రరాష్ట్రపు కాంగ్రెసుకు ప్రెసిడెంటుగా ఆ కాలములో నుండిరి ప్రతిభావంతుడైన రామలింగారెడ్డి

గారిని కాంగ్రెసులో చేర్చినచో కాంగ్రెసునకు రాయలసీమ ప్రాంతములో అధికబలము చేకూరగలదని తలంచి రామలింగారెడ్డికి ఇష్టుడైన బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్య గారిని ప్రయోగించి వాతావరణము సిద్ధముచేయించి చివరకు ఆయనను కాంగ్రెసులో ప్రవేశపెట్టినారు ప్రకాశంగారు

జస్టిస్ పార్టీలో ప్రముఖులు మాజీ ప్రధానమంత్రి అయిన బొల్లిని మునిస్వామి నాయుడుగారు కాలధర్మము చెందినారు ఆ ఉపవరణములో ప్రకాశముగారు రామలింగారెడ్డిని అభ్యర్థిగా నియమించినారు

రామలింగారెడ్డి ఎన్నికలలో అందరివలె ప్రవర్తించరేదు ఆయన ఇట్లర్థించుచు ఉత్తరాలు వ్రాసినాడు

'చిత్తూరుజిల్లా మహాశయులారా !

నేను ఇప్పుడు అకస్మాత్తుగ బొల్లిని మునిస్వామి నాయుడు గారి పరితాపకరమైన మరణముచే ఏర్పడిన ఈ ఉపకరణములో కాంగ్రెను అభ్యర్థిగా నిలుచుచున్నాను —11 2 1935

రామలింగారెడ్డి విజయము గాంచినాడు

1932 లో శాసనసభకు ఎన్నికలు జరిగినవి కాంగ్రెసువారు శాసనోల్లంఘనము చేసి కారాగృహములో ఉండిరి తిరిగి జస్టిస్‌పార్టీ వారే తిరిగి మంత్రులయిరి అప్పుడు అపరచాణక్యుడని పేరుగాంచిన బొబ్బిలి రాజాగారు ప్రధానమంత్రి ఎ టి రాజన్ యస్ కుమారస్వామి రెడ్డిగారునుమంత్రులు బెజవాడ రామచంద్రా రెడ్డిగారు శాసనసభాధ్యక్షులు అప్పటిలో శాసనసభ్యుల సంఖ్య 136 డాక్టర్ సుబ్బరాయన్‌గారు ప్రతిపక్షనాయకుడు ఈయన ఒక విచిత్ర వ్యక్తి ప్రథమములో పానుగల్లు రాజాగారి కౌన్సిల్ సెక్రటరీ 1926 లో ప్రధానమంత్రి అప్పుడు జస్టిస్‌పార్టీ ఓడిపోయినది కాంగ్రెసువారు ఆయనను బలపరచినారు పానుగల్లుకు కూడ ప్రేమాస్పదుడు ఈయన తన జీవితాంతమువరకు ఏ పార్టీ ప్రభు

త్వములోనికి వచ్చినను మంత్రిగానే వ్యవహరించుచు వచ్చినాడు అది ఆయన యోగము

రెడ్డి ప్రథమముగా ఈ శాసనసభలో డిలిమిటేషన్ కమిటీ జనాభానుబట్టి శాసనసభ్యులను పెంచు విషయము ఆలోచించు నది ఇంగ్లీషువారన్న నాకు ఇష్టముగాని, వారి పరిపాలనమన్న పడను వారి నడవడి విజ్ఞత ఇంట బయట వారి ప్రవర్తన వారి రాజకీయ చతురత్వము ఇతరులతో కలసి హృదయపూర్వకముగా పనిచేయుట మొదలగు సుగుణములు గలవారి యెడల ప్రీతి

"నా ఆశయము ప్రజాహితైక జీవితములో సత్సంప్రదాయములను నెలకొల్పుటే

మన అధోగతికి కారణము మనమందరికంటె నధికులమని విర్రవీగుటయే మనము ఇతరులనుండి నేర్చుకోవలసినవి ఎన్నో యున్నవని వివేకానందుడు చెప్పినట్లే రామలింగారెడ్డియును చెప్పినాడు

ఆంగ్లేయులనుండి, మహమ్మదీయులనుండి మన మెన్నో నేర్చుకోవలసినవి కలవు వారిది సాంఘిక దృక్పథము మనది వ్యక్తిగత దృక్పథము

ఆంగ్లేయులు కలసినపుడు కలిసి ఆడుకొందురు పాడుకొందురు కలిసి భుజింతురు వారిది సాంఘిక దృక్పథము మనము కలిసినను ఎవరికి వారే యమునాతీరే నూటికి 99 విషయాలలో కలిసినను ఒక విషయములో భేదాభిప్రాయము కలిగినప్పుడు ఒకరినొకరము నిందించుకొందుము మన మితరుల అభిప్రాయములకు విలువ ఇవ్వము అసలు ఆ విద్య మనము ఎన్నడునూ ఎరుగము మన శరీరాలు ఎంత దగ్గరగా నున్నను మనస్సులు, అభిప్రాయములు అంత దూరముగా నుండును పాశ్చాత్యులతోను, మహమ్మదీయులతోను పోల్చి చూచుకొన్నచో సామాన్య మర్యాదలతో మన మెంతో వెనుకబడియున్నా మనిపించును

"మనము పాశ్చాత్యులకంటె తెలివైనవారము కాని వ్యక్తిగతముగాను సామాజికముగాను వారికంటె అసమర్థులము కారణమేమందురా ? 'మనలో తార్కిక బుద్ధి ఎక్కువ లోకజ్ఞానము తక్కువ అన్నాడు రెడ్డి

We are clever individuals than the Europeans and yet less effective both as individuals and as people

That is because we have too much logic, and too little commonsense

మన లోపములను గ్రహించి సరిదిద్దుకొన్నప్పుడు మనము అభివృద్ధి గాంచగలము

హోమండ్ కమిటీ చర్చ సందర్భములో కూడ రెడ్డి చక్కగా పలికినాడు 'కౌన్సిలులో చాల పార్టీ లున్నవి కాంగ్రెస్‌వారు జాతీయవాదులు, మితవాదులు హోమండ్ కమిటీని సమర్థించుచున్నారు దీనికి భిన్నముగా నున్న దీ గవర్నమెంటు, జస్టిసుపార్టీ

'ఈ శాసనసభలో రెండు ప్రతిపక్షా లున్నవి ఒకటి సుబ్బరాయన్‌గారి నాయకత్వాన కాంగ్రెస్ పక్షము రెండవది దేశము తరఫున నాయకత్వము వహించిఉన్న జస్టిస్ పార్టీకి వ్యతిరేకము

'కాంగ్రెస్ శాసనసభలో ప్రవేశించగానే జస్టిస్ పార్టీ బలము క్రమముగా సన్నగిలుచున్నది దేశమున అధిక సంఖ్యాకులు కాంగ్రెసు పక్షాన ఉన్నారు

'కులమతాల సంగతి నాకు పట్టదు నియోజకవర్గాలు ఎంత పెద్దవైన అంత మంచి దని భావించెదను చిన్నవైనచో వ్యక్తి ప్రాబల్యమువల్ల వత్తురు పెద్దవైనచో పార్టీ బలమువల్ల వత్తురు అందుచేత ధనస్వామ్యములు కులస్వామ్యములు ప్రబలకుండవలెనన్న పెద్ద నియోజకవర్గాలు అవసరము

'మనము ఇక్కడ ప్రతి ఇల్లు, పల్లెసంగతి విచారించుటలేదు దేశము సంగతి విచారించుచున్నాము కనుక వ్యక్తులను దృష్టిలో

నుంచుకొనక పార్టీల నుంచుకోవలెను రెండుమూడు జిల్లాలను కలిపి ఒక నియోజకవర్గముగా నిర్ణయించినచో అప్పుడు వ్యక్తి ప్రాబల్యము పోయి, పార్టీ ప్రాబల్యమునకు అవకాశముండును క్యూములేటివ్ పద్ధతి పనికిరాదు రెండు వోట్లు ఒకరికే పడవచ్చును లేక సింగిల్ వోటు వేయవచ్చును ఇందువల్ల కాంగ్రెసుకు గెలుపు కలుగునో జస్టిస్‌కు గెలుపుకలుగునో అని ఆలోచించవలసిన సంగతి అనవసరము దీనివల్ల ఏ పార్టీ స్థిరముగా నుండలేదు ఈ స్థితివల్ల ఎప్పుడును ఒకరే వుండలేరు అందుచేత ఇది మంచిదని ఎంచు చున్నాను హామండ్ కమిటీవారు సాధ్యమైనంతవరకు కులతత్వాలకు స్వస్తి చెప్పినందుకు సంతోషించుచు వారిని అభినందించు చున్నాను'

మద్రాసు కార్మిక రక్షణచట్టము సంగతి వచ్చినప్పుడు ఆయన కార్మికుల కనుగుణముగా పలికిన మాటలు పరిశ్రమాధి కారులచే గుర్తింపబడెను

"పనివారిని తృప్తిపరచినచో పని బాగుగా జరుగునన్నది నిత్యసత్యము మానవస్వభావము గమనించక పోయినచో ఏలాగు? అమెరికాలో ఫోర్డు కాడ్బ్రి మొదలగు పరిశ్రమల యజమానులు తమ కంపెనీలలో పనిచేయుచున్నవారి అవసరములను గుర్తించి అధికముగా ధనమును వారికై ఖర్చుపెట్టుచున్నారు ఇందువల్ల వారు నష్టపడుటలేదు పొదుగు కోసికొని పాలుత్రాగువారు దూర దృష్టి కలిగి ప్రవర్తించవలెను" 1936 ఆగస్టు 28

ఈ ద్వంద్వప్రభుత్వ మక్కరలేదని కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యమునకే సంకులసమరము సాగించినది ప్రభుత్వము కొంతవరకు లొంగివచ్చి, 'గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టు' పార్లమెంటు అంగీకరించినది ఇప్పుడు రాష్ట్రీయ స్వాతంత్ర్యము ఇచ్చుచున్నారు ఇది నిరుపయోగమైనదని దీనినికూడ తిరస్కరించ వలెనని కొందరు, మంత్రిపదవులను చేపట్టవలెనని మరికొందరు కాంగ్రెసువాదులు అన్నారు

ఈ సంస్కరణలను పురస్కరించుకొని 1937 లో భారత దేశమంతటను కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొనినది

ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘమునకు ప్రకాశముగారు అధ్యక్షులు సాంబమూర్తిగారు కార్యదర్శి వీరిద్దరు దేశమంతట సంచారముచేసి ఆంధ్రదేశములో అన్ని నియోజకవర్గములలోను కాంగ్రెసు అభ్యర్థులను నిలబెట్టినారు

కాంగ్రెసు మూడు పార్టీలతో పోరాడినది జస్టిస్‌పార్టీ ఒకటి దీనికి ఆనాటి నాయకుడు మాజీ ముఖ్యమంత్రి బొబ్బిలి రాజాగారు బొబ్బిలి రాజాగారితో కలియక ఎగాపురము రాజా గారు ప్రజాపక్షమని ఒకటి పెట్టినారు నేటి జనసంఘుపార్టీలో జనము లేనట్లే ఆనాటి ప్రజాపక్షములో ప్రజలులేరు చల్లపల్లి రాజాగారు ప్రజామిత్ర పక్షము పెట్టినారు జస్టిస్‌పార్టీలో జస్టిస్ లేనట్లే ఈ ప్రజామిత్ర పక్షములో ప్రజామిత్రులు లేరు అందు చేత వీరందరు పీటీ అయినారు ఒక్క చల్లపల్లి రాజాగారు గాక ప్రకాశముగారు అహర్నిశము కృషిచేసి అఖండవిజయము కాంగ్రెసునకు సంపాదించినారు 'నా కారు ఆ రోడ్డుమీదనుంచి పోనివ్వండిరా, కాంగ్రెసుకు వోట్లెందుకు రావో చూస్తా'నని ధీమాగా అనెడివారు అనుటయేగాక చివరికలాగే అయినది

భారతదేశములో 7 రాష్ట్రములలో కాంగ్రెసు జయము గాంచినది ప్రథమ తాంబూలము మద్రాసుదే ఇక్కడ 215 స్థానములలో 116 సాధారణ నియోజకవర్గము లయినప్పటికి కాంగ్రెసు సంపాదించిన స్థానములు 159 ఈ పూర్ణవిజయము మావి ఇది కాంగ్రెసునకు పతనహేతువు అన్నాడు రాజాజీ ప్రతి పక్షములేనిచో ప్రజాస్వామ్య మేముండును ? 'కాంగ్రెసు తన సంఖ్యాబలము చూచుకొని విర్రవిగి ఇష్టము వచ్చినట్లు సంచరించి ప్రజామోదమును గోల్పోవు'నని రాజగోపాలాచార్యులుగారు అన్నమాటకు అర్థము అయినను ఆయన నిరంకుశుడుగానే సంచ రించినాడు ప్రధానమంత్రి అయిన పిదప

అస్వాభావికమైన వర్ణవ్యవస్థమీద జస్టిసుపార్టీ కొట్టినంత దెబ్బ మరేదియు కొట్టలేదు అది బ్రాహ్మణేతరుల కన్నులు విప్పినది యుగయుగాలుగ జీర్ణించిపోయిన పాతఘోరణిని మార్చినది బ్రాహ్మణేతరులలో గౌరవమును పెంచినది అయినను అది పెద్ద కులాలవరకే అణగద్రొక్కబడిన వారిసంగతి ఆలోచించలేదు వారు అధిక ప్రాబల్యముకొరకే ప్రాకులాడ జొచ్చినారు కాంగ్రెసులో గాంధిమహాత్ముడు ప్రవేశించిన తర్వాత అది ప్రజలపక్షమైనది ఆయన భీరులను ధీరులను చేసినాడు కాంగ్రెసు సమరములో పురుషులేగాక, శిశుబాలాదిగ అందరు పోరాడినారు కాంగ్రెసువారు కష్టనష్టములకు తలయొగ్గి దేశసేవ వ్రతమునకు పూనిరి గనుక జస్టిస్‌పార్టీ మొదలగు అధికారానికై అఱ్ఱులుచాచెడి పార్టీలు అంతరించినవి కారాగృహము దేశభక్తికి గీటురాయి అయినది కనివిని ఎరుగని మహత్తర కార్యములు గాంధీమహాత్ముడు సాధించినాడు జస్టిస్‌పార్టీ కేవలము అధికారము హస్తగతము చేసికొనవలెననెడి ఆదర్శమేగాని ప్రజలలో త్యాగము కలిగించవలెనని లేదు కాంగ్రెసుది త్యాగమార్గము తనపని అది చేసికొని ఒరిగిపోయినది జస్టిస్‌పార్టీ కాంగ్రెసులో ప్రజాసేవతత్పరత నైతికప్రతిష్ఠ యున్నంతవరకు అవి వుండును పార్టీలకు కొంత పూర్వచరిత్ర యుండవలెను ఎన్నికలే ప్రధానముగా పెట్టుకొన్న ఏ పార్టీ అయినను ప్రజాహృదయమును చూరగొనలేదు

937 ఫిబ్రవరిలో ఎన్నికలు జరిగినవి కాంగ్రెసువారికి గవర్నమెంటుకు కొన్ని అభిప్రాయ భేదములు వచ్చినవి గవర్నరునకు శాసనసభ తీర్మానమును 'వీటో' చేయు అధికారము వున్నది కొన్ని రక్షణలున్నవి (Safe guards) అవి అన్ని వదులుకొన్నగాని మంత్రిత్వమును స్వీకరించమని శరించినారు కాంగ్రెసువారు అన్ని రాష్ట్రాలలోను ఏలాగో మంత్రివర్గాలు

ఏర్పడ్డవి మద్రాసులో మాత్రము ఏర్పడలేదు జస్టిస్ పార్టీలోని కొద్దిమందిగా పెద్దలను పిలిచి ఏర్పాటు చేయవలసినదని గవర్నరు గారు కోరినారు. మావల్ల కాదనగా మావల్ల కాదన్నారు వారు చివరకు కూర్మా వెంకటరెడ్డినాయుడుగారిని ఆహ్వానించి 'కొందరు కాదన్నను మిమ్ములను ఆక్టింగ్ గవర్నరును చేసినాను నాకు తల కొట్టినట్లున్నది మీరైనా ప్రతిష్ఠను కాపాడవలెనని గవర్నరుగారు ప్రాధేయపడినారు రెడ్డినాయుడుగారు 'ఎవరునూ స్థాపించలేరు అయినను మీ మాట కాదనక స్థాపింతును ఇది మూన్నాళ్ళ ముచ్చటే అన్నారు 'ఎలాగో ఒకరాగు కానివ్వండి అన్నారు ఆ గవర్నరుగారు అప్పుడు రెడ్డినాయుడుగారు నడమంత్రపు మంత్రివర్గమును (Interim ministry) స్థాపించినారు తరువాత కాంగ్రెసునకు గవర్నమెంటునకు రాజీ కుదిరినది 1937 జూలై 14 వ తేదీన రాజాజీ నాయకుడుగ ప్రకాశముగారు ఉపనాయకుడుగ ఎన్నికయినారు రాజగోపాలాచార్యులుగారు ముఖ్యమంత్రి ప్రకాశముగారు రెవెన్యూమంత్రి ఎనమండుగురు ఇతరమంత్రులు స్పీకరు సాంబమూర్తిగారు

ఈ క్రొత్త సంస్కరణలను బట్టి మనకు రెండు శాసన సభలు ఏర్పడ్డవి లెజిస్లేటివ్ ఎసెంబ్లి మరొకటి కౌన్సిలు (House of commons, Huse of lords) ను దృష్టిలో పెట్టుకొని ఇవి ఏర్పడ్డవి ఎగువసభకు శాసనసభనుండి పరోక్షముగా ఎన్నుకొనబడిన సభ్యులు కొందరు నామినేటెడ్ - ప్రభుత్వము వారిచే నియమింపబడినవారు దీనిని శిష్టసభ అనవచ్చును ఈ రెండుసభలు ఆమోదము నొందిన చట్టము కాగలదు

ఈ శిష్టసభకు రామలింగారెడ్డి ప్రభుత్వముచే నియమింపబడినాడు

ఈసారి ఈయన పతితుడైన రైతుపక్షమున ఈనాము బిల్లు విషయములోను, ఋణపరిష్కారపు చట్టములోను పోరాడినాడు మద్యపాననిషేధము ఆర్థికదృష్ట్యా మంచిదికాదని చెప్పాచు, ఆంధ్ర

రాష్ట్రమునకై అధికముగా పోరాడినాడు తన తార్కికశక్తి నుప యోగించి ప్రతిపక్షులు కూడ అచ్చెరువొందునట్లు పోరాడినాడు ఈసారి తనతోటాటు సర్వవిధముల సముడైన ప్రధానమంత్రి రాజాజీతో వాగ్యుద్ధము చేసినాడు రెడ్డి

1937 సెప్టెంబరులో కాంగ్రెసు పరిపాలనా పద్ధతులలోని లోటుపాట్లను గురించి ఆయన నిర్మాణయుతమైన సలహాలు ఇచ్చినాడు

'కాంగ్రెసుప్రభుత్వము కలకాలము ఉండవలెనని కాంక్షించు వాడను నేను కాని ఏదియు అతిగా కూడదు గ్రీకు తత్త్వవేత్తలు, బుద్ధుడు, మధ్యేమార్గము మంచిదని బోధించినారు అలాగే మద్యపాన నిషేధమువల్ల కార్మికులను ఉద్ధరింతుమని అనుచున్నారు మద్యపాన నిషేధమును (At any cost) ఏమైననుసరే ప్రవేశ పెట్టెదమనుట రాజకీయవేత్త చెప్పవలసిన మాట కాదు పరిస్థితు లను గమనించకుండ యుద్ధరంగములో దూకి రాజపుత్రులు మరణించుట జరిగినది వారికి ధైర్యసాహసము లున్నవి కాని రణతంత్ర కౌశల్యము లేకపోవుటవల్ల హతులైనారు అలాగే రాజకీయములును మనదేశ ఆదాయమున కాధారాలు రెండు అవి రెవిన్యూ, ఆబ్కారి కనుక అర్థికబలము తగ్గును ఇండియా గవర్నమెంటు దాక్షిణ్యమువల్ల బ్రతుకవలెనవార మగుదుము స్వార్జితముమీాద జీవించవలెనను వాడనునేను మద్యపాన నిషే ధమువల్ల నిరుద్యోగము పెరుగును ఇది గమనించవలెను ఇంకొక సంగతి మనము చైనావారికి నల్లమందు చైనా ప్రభుత్వమునకు వ్యతిరేకముగ పంపుచున్నాము సోషలిస్టులను అరెస్టుచేసి బాధ పెట్టుట మంచిదికాదు వారి జీవితములతో చెలగాటములాడుట ధర్మమా ? యువకులు చర్చలలో పాల్గొనవలెనని నేను అధికముగా కోరుచున్నాను యువకులు ప్రతిభను ప్రదర్శించుచున్నచో చూచి ఆనందించవలెననుతత్త్వముగలప్రాణిసరుడను నేను ఈక్లిష్టపరిస్థితులలో

పచ్చిమోత్తర రాష్ట్రములోవలె మిశ్రమ మంత్రివర్గము అవసరము అది మన ఐక్యమునకు అనుకూలించును

ఇట్లనుసరికి మంత్రివర్గము ఏర్పడి అప్పుడే నాలుగు నెలలైనది అప్పుడే మార్పా? అన్నాడు రాజాజీ అంతట చటుక్కున రెడ్డి యిట్లు వచించినాడు Well! I am not talking arithmetic, I am talking politics నేను గణితమును గురించి మాట్లాడుటలేదు, రాజకీయములను గురించి

కాంగ్రెసు ఇదివరకు బ్రిటిష్‌వారిని ఎదిరించి విమర్శించినది నీతులను ధర్మములను చెప్పినది రాజ్యము వహించలేదు నేడు పరిపాలనలో ప్రవేశించగలిగినది చెప్పినప్రకారము చెయ్యవలెనని తలపెట్టినది కొన్ని మహత్తర కార్యములను సాధించినది కాని అనుభవము ఏది? రాజకీయాలంటె ఆదర్శాలు నీతులు గావు వాస్తవిక పరిస్థితులను గ్రహించి తదనుగుణముగా వర్తించవలెను రాజగోపాలాచార్యులు గాంధిగారి మెప్పుకోసము సేలము జిల్లాలో మద్యపాననిషేధము సాగించినారు అది ఆర్థికముగా నష్టమైనపని అని రెడ్డిగారిసలహా ప్రకాశముగారు ప్రధానమంత్రి అయినప్పుడు నాలుగు జిల్లాలవరకు పోషించినారు తరువాత ఆంధ్రరాష్ట్రమంతట పెట్టినారు తర్వాతమంత్రి త్వరపడవద్దని నెహ్రూగారు చెప్పినను వినలేదు అది ఆర్థికముగానే కాక నైతికముగా కూడ భ్రష్టత కలిగించుచున్నది శాసనములు చేసి ఏమి లాభము? అవి ఎట్లు అమలు జరుగుచున్నవో చూడనక్కరలేదా?

బ్రిటిష్ గవర్నమెంటు సైన్యమునకు సగమాదాయము కర్చుపెట్టుచున్నదని విమర్శించినాము ఇప్పుడు అంతకంటె అధికమగుచున్నది ఆ సంగతి ఇప్పుడుమనకు అర్థమైనదని అన్నాడు సర్దార్ పటేల్ రణవిద్యలోను సైనికసంఖ్యాబలములోను మన మెంత వెనుకబడియున్నది తెలిసివచ్చుచున్నది నేడు.

ప్రజానురాగము, ఆర్థికపుష్టి, సైన్యము రాజ్యమున కవసరము

రాజ్య నిర్వహణమున ఊహాగానము నీతి బోధ కాదు 'తింటేగాని రుచి తెలియదు దిగితేగాని లోతు తెలియదు రాజకీయ రంగము చదరంగము వంటిది ఎత్తుకు పైఎత్తు వేసినప్పుడే గెలుపు

టోలుగేట్లు మోటారుకార్లు మొదలగు వానిని గురించిన సవరణ చట్టము వచ్చినప్పుడు రైతులకు అనుకూలముగ రెడ్డి మాట్లాడినాడు మునిస్వామి నాయుడుగారు 'రైతాంగపు మంత్రి రైతులవద్ద ఎన్నో పన్నులను తీసికొనుట చూచి టోలుగేట్ల పన్నులు తీసి వేసినారు

కాంగ్రెసు ప్రజలనుద్ధరించవలెనని వచ్చి మరల దానిని తిరగదోలుట న్యాయమా? మేముటోలుగేట్లు వినోదపన్నులు వేయమన్నాముగాని వంతెనలుమీద పన్నులు వేయమన్నామా? అనుట ఏమిమంచిది? ఏలాగునసైన పన్నులువేయుటేగదా? మనము చిరకాలమునుండి భాషాప్రయుక్తరాష్ట్ర సిద్ధాంతమును ప్రచారము చేయుచు ఆంధ్రరాష్ట్రావతరణకయి ఆందోళన చేయుచు వచ్చినారము దానిని పురస్కరించుకొని భాషాప్రయుక్త రాష్ట్రముగ విడిపోవలెనని తీర్మానము పెట్టినారుఆంధ్రకాంగ్రెసుసభ్యులు దానిపైన రెడ్డి యిట్లు ప్రసంగించినాడు "ఆంధ్రులు చిరకాలవాంఛితమైన ఆంధ్రరాష్ట్రము కావలెనని కోరుచున్నాను' అని ఆయన అనుసరికి ప్రధానమంత్రి యిట్లు ప్రశ్నించినాడు "May I know from whom and on whose be half he speaks? what Constitution!" ఎవరికి ప్రతినిధుఁయిగా ఎవరికొరకు తమరు మాట్లాడుచున్నారో సెలవిత్తురా?" అనుసరికి యావదాంధ్ర దేశము తరఫున అని రెడ్డి సమాధానమిచ్చినాడు అట్లనుసరికి సభయంతయు గొల్లున నవ్వు దత్తమండలములతో కూడానా? అని మరల రాజాజీ

ప్రశ్న 'ఆంధ్రరాష్ట్రమనగా దత్తమండలములతో సహా అనియే అర్థమని ఆచార్యులవారికి అవగతము కాలేదా ? ఆంగ్లేయులు విర్లం డును రెండుచేసినట్లు చేయవలెనని తమ ఆలోచనయా? అట్లు విభ జించి దత్తమండలములను మద్రాసులో కలుపుకోవలెనని తమ ఆరాటమా ? బ్రిటిషువారు విర్లండును విభజించినట్లు కాంగ్రెవారు ఆంధ్రదేశమును ముక్కచెక్కలు చేయవలెనని వాంఛించు చున్నారా ?" అని రెడ్డి ఎదురుప్రశ్నించెను

'సమష్టి కుటుంబమును చీల్చుకొని కొడుకులు పంచుకొని పోవుచున్నచో తండ్రికి యిష్టంలేనట్లు నాకు ఇష్టములేదనుచున్నారు ఈ మద్రాసు రాష్ట్రము సమష్టికుటుంబ మెట్లగునో నాకు బోధపడ కున్నది తండ్రిమాట తల్లిమాట పిల్లలమాట వేరువేరు ఇదేమి సమష్టికుటుంబము ? బ్రిటిష్‌వారు తమ పరిపాలనా సౌకర్యమునకు ఏర్పరచుకొన్న రాష్ట్రమిది ఎవరికవారు విడిపోయినచో వారి సంస్కృతి పెరుగును ఆంధ్రులు కేవలము తమరాష్ట్రముకొరకే కోరినారా ? అట్లయిన ఏనాడో వచ్చెడిది రాష్ట్రము మద్రాసు సైమన్‌కమీషను వచ్చినపుడు వీరోచితముగా పోరాడినది ఆంధ్రులు, ఆంధ్రుల దేశభక్తి అపూర్వమైనది కొందరుకాంగ్రెస్ వాదులు సైమను సప్తకముతో చాటుమాటుగా మంతనము నకు దిగిన సంగతి లోకవిదితము అరవలన్న నాకు ఇష్టములేక కాదు ద్రావిడ సంస్కృతి చరిత్ర అను గ్రంథమును ప్రశంసించుచు నేను పీఠిక వ్రాసినాను ఆంధ్రులు సంకుచిత హృదయులుకారు భారతదేశాభివృద్ధియే తమ అభివృద్ధిగ భావించెడివారు అయినను మద్రాసురాష్ట్రమునుండి విడిపోవుట తమకు జరిగెడి అన్యాయము జరుగకుండ చూచుకొనుటకు నా అనుభవములోని సంగతియే ఇందులకు నిదర్శనముగా చెప్పుచున్నాను మద్రాసు, అన్నామలై విశ్వవిద్యాలయములకు చేసెడి సహాయము ఆంధ్ర యూనివర్సిటీకి లభించుటలేదు "

'అయిన, మీరు మీ ఆంధ్రమంత్రులమీదనేనా దోష మారోపించుట అని రాజాజీ అనగా అందులకు రెడ్డి, 'మాఆంధ్ర మంత్రులమీదకాదు అరవవారి చెప్పుచేతలలో ఉన్న ఆంధ్ర మంత్రులమీద" అన్నాడు. ఈమాదిరిగా రాజాజీ అడ్డు సవాళ్ళకు తిరుగులేని సమాధానములిచ్చి ముగించినాడు

'ఆంధ్రరాష్ట్ర మవతరించుటకు అదనువచ్చినది ఆ భాగ్యము మీరు దక్కించుకొనవలెను మాకు ఆర్థికబలము లేకపోయినను కలియో గంజియో త్రాగి మా సంస్కృతిని మేము అభివృద్ధి చేసి కొందుము ఆ విధముగా తృప్తి చెందుదుము

1938 మార్చి 8

ప్రకాశముగారు తమ ప్రసంగములో ఇట్లన్నారు 'మాకు ప్రజలు ఓట్లు ఇచ్చినారు ప్రజాప్రతినిధులము మేము అరవలు, ఆంధ్రులు మళయాళీలు, కర్నాటకులు మమ్ములను ఎన్నుకొన్నారు ఏమిచెసినను మేము చేయవలెను ఈ రెడ్డి రెడ్డినాయుడునా ఆంధ్రరాష్ట్రము తెచ్చెడిది?" అని ఈ ధోరణిగా ప్రకాశముగారు మాటలు విసరినారు కాని ఈ తీర్మానము ఉభయ సభల లోను ఏకగ్రీవముగ ఆమోదము పొందినది

మర్యాదగా మాటాడుట మనకు అలవడలేదు సంఖ్యాబలము చూచుకొని సంతోషించుట తప్ప, సంగతి సందర్భాలు సమాలోచన చేసెడి సమయమెప్పుడు వచ్చునో !

1939 లో ప్రపంచ సంగ్రామము వచ్చినది కాంగ్రెసుతో ఆలోచించకుండ యుద్ధములో ఇండియా గవర్నమెంటు దిగినందుకు కాంగ్రెసువారు శాసనసభను వీడి స్వాతంత్ర్య సంగ్రామము సాగించుట జరిగినది

'మన రాజకీయవాదులలో కృతజ్ఞత లేదని వాపోవుచుందురు రాజగోపాలాచారిగారు 1939 లో ప్రధానమంత్రిగానున్నప్పుడు ఖద్దరు వాడకమును అమలులో పెట్టవలసినదిగా అని

నే ననగా నన్ను పరిహసించినారు కాని అనంతరము వారే దానిని అమలులో పెట్టినారు నా పేరైనా ఎత్తరేదు అయినప్పటికి అదె మంచి పద్ధతి! అభ్యుదయకరమైన దనవచ్చును!

"మూల పురుషులను మూలనే ఉంచవలెను కృతజ్ఞత చూపుట మూర్ఖపద్ధతి ప్రభుత్వములు పార్టీలు స్వతంత్రాభిప్రాయములు గలవారితో వేగలేక చీడ పురుగులుగా భావించి త్రోసి వేయుదురు ఆలోచన లేకుండ వారు అవునన్న అవుననుచు కాదన్న కాదనుట వారికి కావలసినది వారు మన దగ్గరకు నూతన భావాలకై వత్తురు అవి గ్రహింతురు ఇక వారికి కావలసినదెల్ల వారి పార్టీలో నోరెత్తకుండ ఉండెడివారే" అని ఈశ్వరదత్తు గారికి రామలింగారెడ్డి ఒక లేఖ వ్రాసినారు

రెడ్డి ఆందోళనాకారుడు కాడు భావుకుడు (Leader of ideas) ఆయన పద్ధతి ఆయన పద్ధతియే

మితవాదులు తమ ధీశక్తిని ప్రకటించెడివారు కాంగ్రెసు వారు ఉద్రేకోత్సాహాలు ప్రకటించెడివారు ఈ రెంటికి భిన్నముగ తన అభిరుచులకు ఆశయాలకు అనుగుణముగా ఆయన మరొక మార్గము అవలంబించి రాజకీయ రంగములో సంచరించి నాడు సాధారణ ప్రజల మెప్పునకై ఎన్నడు ఏదియు చేయలేదు ఆయన పార్టీలకు అతీతుడుగా ఉండి స్వీయాభిప్రాయములను వెల్లడించెడివాడు రాజకీయములలో ఆయన దేశహితైక దృష్టితో సలహాలు ఇచ్చినాడు ఆయన సాధారణ రాజకీయవాదులవలె నలుగురితోపాటు నారాయణ అనెడివాడు కాడు ఆయనకు నాయకుడుగా ఉండెడి గుణముగాని అనుచరుడుగా ఉండెడి గుణముగాని లేదు ప్రతి విషయములోను తన వ్యక్తిత్వము ప్రకటించిన ప్రతిభావంతుడు శాసనసభలో ఆయన చర్చించిన విషయములను బట్టి ఆయన ఎంత పురోగామియో తెలియును

రాజకీయ సందర్భములలో ఆయన హాస్యోక్తుల సద్య స్స్ఫూర్తి గల చతుర సంభాషణలు సూక్తులు ఆయన బుద్ధికుశలతను, సాహితీ పాటవమును ప్రకటించును

ఒక సందర్భములో తనను రాజాజీ జవహర్లాలుల తో పోల్చుకొనుచు ఇట్లన్నాడు మేధాసంపదలో రాజాజీతో పాటు నేనును మితవాదిని సోషలిస్టులకు వ్యతిరేకిని, హృదయ వైశాల్యములో జవహరులాలువంటివాడను

రెడ్డి రాజకీయములలో ఆయన మితవాద దృక్పథముతో ఉత్తమ జాతీయ తత్పరతతో వ్యక్తిగతముగ సంచరించినారు

రాజకీయములలో ఆయన పాత్ర ఏమిటనగా తన్నుమార్కొన్నవారిని మాట్లాడకుండ చేయుట రణరంగమును ప్రణయరంగముగ చేయుట, మంత్రులకు మంత్రిగా మసలుట

రాజకీయములలో మనము రాణించుటకు రెడ్డి రెండు గ్రంథములు మనకు ఇచ్చిపోయినాడు 1938 నాగపూరు విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ ప్రసంగము రాజకీయములలో ఉదారముగ మెలగవలసినదని (Principles of political judgement) మనము సాంఘిక అస్పృశ్యతను విడనాడుచు రాజకీయ అస్పృశ్యతను పాటించుట ఉచితము కాదని ఆయన బోధ, బాధ

రెండవది నేటి మనప్రజాస్వామ్యము (Democracy in the contemparary India) ఆయన రాజకీయ రంగమును విడనాడినను రాజకీయములను విడనాడలేదని జాతీయ అంతర్జాతీయ రంగములలో ఆయన భావములను తెలుపును ఈగ్రంథము

'సంఘము రాజ్యమునకు మూలకందము సంఘమె అంలు ప్రధానమైనది రాజ్యము దానినుండి ఉద్భవించి దానిని కాపాడి అంగము మాత్రమే" సంఘ తత్వమును గురించి రామలింగారెడ్డి తరచి పలికిన పలుకులు నిత్య స్మరణీయములు

ఈనాడు ప్రజాయుత పరిపాలనలో ఉన్నారము The organised life of a nation is politics రాజకీయములన్న జాతియొక్క క్రమబద్ధజీవితము అన్న మాటకు అర్థ మిదే సంఘ వ్యవస్థ బాగుపడనిదే రాజ్యాంగ వ్యవస్థ బాగుపడదు A nation gets the governments what it deserves ప్రజా పరిపాలనలో ప్రజల స్థాయినిబట్టి పరిపాలనముండును ప్రజలలో చైతన్యమున్నచో ప్రజస్వామ్యముండును లేనిచో మూకరాజ్య మగును ప్రజాస్వామ్యమనగా ఒక విధమైన జీవిత విధానమని గ్రహించవలెను ప్రజలకు హక్కులు బాధ్యతలుఉన్నవి బాధ్యతలను విస్మరించి హక్కులకై పోరాడట అనుచితము

పారమార్థిక చింతగల సేవావ్రతులు ఒయలుదేరినగాని సంఘము బాగుపడదని రెడ్డి వక్కాణించినాడు పారమార్థికమనగా ఏదో మతములో చేరుట కాదు 'మానవసేవయే మాధవసేవ అనెడి ఆదర్శముతో వర్తించెడి వారు అవసరమని 'ఆత్మమోక్షార్థం జగద్ధితయా తన శ్రేయమును లోకశ్రేయమునకు సమన్వయ పరచు అనుష్ఠానమున్న వేదాంతమునే వివేకానందుడు చూపెను ఆ మార్గముననే రాజకీయములలో వర్తించుట అవసరమని రామ లింగారెడ్డి మనకు చెప్పపోయినమాట పదవీకాంక్షతో కాక సేవా బుద్ధితో రాజకీయములలో ప్రవేశించవలసిన దని ఆయన ప్రవచనము

# నవయామిని

బ్రిటిషు ప్రభుత్వము అసహాయోద్యమమును అణచివేయుటకు దారుణ చర్యలను ప్రారంభింపగా ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవిని వదలిపెట్టిన రామలింగారెడ్డి ఒక చెంప రాజకీయాలలో పాల్గొనుచునే వేఱొకవైపున సాహిత్యసేవలో గూడ పాలుగొన్నాడు నవయామిని అను కావ్యమును ఆయన ఆ కాలములోనే రచించినాడు

చాలమందికి రామలింగారెడ్డి గొప్ప సాహిత్య విమర్శకుడనియే తెలియునుగాని చక్కని కవి అని తెలియదు ఇందుకు కారణము ఆయన రచించిన కావ్యములు ఒకటి రెంటికంటె ఎక్కువ లేకపోవుటయే కాని కవికి గౌరవ మీయవలసినది అతడు రచించిన కావ్యముల సంఖ్యనుబట్టి కాని, వాని పరిణామమునుబట్టి కాని కాదు రెడ్డి కావ్యములు సంఖ్యలో తక్కువైనను గుణములో ఎక్కువవే రాశి కొంచెమైనను రసము మిక్కుటమే ఆయన పద్యవాఙ్మయములో ఉత్తమకావ్యము కూడ కలదు అదే ఈ నవయామిని

మహావిమర్శకుడైన రెడ్డి నిశిత పరీక్షకు ప్రబంధ కవులలో నూరన తప్ప ఆగినవారు లేరు అనౌచిత కళంకితములయిన కొన్ని ప్రబంధములు ఆయన ఏవగింపునకు కూడ పాత్రములయినవి అట్టి వానిలో 'బిల్హణీయము ఒకటి దానిలోని అనౌచిత్యమును ప్రతిఘటించుటకే రామలింగారెడ్డి ఈ నవయామినిని సృష్టించినాడు రెడ్డి భావాంబరవీథిని విహరించు యామినీబిల్హణుల ప్రకృతులు ఇవి

బిల్హణుడు పండితుడు, వయస్సుమళ్ళినవాడు కాకున్నను కొంతవరకు ముదిరినవాడు ధర్మబుద్ధి నిగ్రహశక్తి ఏమాత్రము లేని విషయలోలుడు గాడు నిజశీలము చలితమయ్యెనేని పునరాలోచనకై సమర్థించుకొన జాలిన నిగ్రహవంతుడు

యామిని వయస్సునను వర్తనమునను ఆర్య పరిశుభ్రమనోగతి గలది సచ్ఛీల గయ్యాళి కాదు మృదుత్వము స్థిరత్వము కలసిన హృదయము గుండె భావములు వెన్న పల్కులు తేనెలు, ధర్మసంకల్పము వజ్రము వంటిది ఈ ఖండకృతిలో మొత్తము ముప్పది పద్యములే కలవు కాని కండగల రచన

చిఱునవ్వు తేరలుఁ జెన్నారు మొగము దా
మర సౌరభము మది కరఁగ నాని
కలికితనము మీఱఁ దెలివి మెఱుంగులఁ
జెఁగించు కనులకాంతులకుఁ దలచె,
పద్యముల్ హృద్యముల్ నర్మగర్భితము లౌ
తనకుఁ బల్కులతీపిఁ దవిలి చిక్కి
మనసు మైకముఁ జెందమచ్చు మాయలఁ జల్లు
తెలియని ముగ్ధచేష్టలకుఁ జొక్కి
బుద్ధి వెనుకకుఁ జిత్తము ముందునకును
బోవు భిన్నత శాంతిఁ గోల్పోయి తగును
దగద యను నిలుకడ లేమిఁ దాల్మి వాలియఁ
గోర రా దని తెలిసియుఁ గోరినాఁడఁ
జేర రా దని తెలిసియుఁ జేరినాఁడ

మెత్తని తియ్యని చల్లని
విత్తముఁ జిఱునవ్వు రుచులు, సిగ్గు మొగముఁ గ
న్నెత్తని రూపము హృదయో
న్మత్తతఁ గలిగింప నిట్టిమాటలు పుట్టెన్

ఈ రచన, దీనికి సవిమర్శమైన 'సంభవప్రకార' మనెడి పీఠిక విద్వాంసుల మన్ననలను గాంచుట తా మెఱుగుదుమని శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు పేర్కొన్నారు

'తేజము, దీర్ఘాయువు విభ్రాజితలోక ప్రసిద్ధి వఱలుత నీకున్' అని విప్రుఁడు శిష్యురాలి కిచ్చిన దీవనయే ఈ కావ్యము నేడను సఫలము కాగలదు

# ఆంధ్ర విశ్వవిద్యాలయము - రామలింగారెడ్డి

ఆంధ్ర విశ్వవిద్యాలయము నందలి ఉపాధ్యక్ష పదవికి రామలింగారెడ్డి 1930 వ సంవత్సరములో రాజీనామా ఇచ్చిన యనంతరము కాంగ్రెసు ఉద్యమములోను రాజకీయాలలోను పని చేసి యుండుట పాఠకులకు విదితమే 1930 వ సంవత్సరమునుండి 1936వ సంవత్సరమువరకు రాధాకృష్ణన్‌గారు తమ శక్తియుక్తులను వినియోగించి ఆంధ్ర విశ్వవిద్యాలయాభివృద్ధికి తోడ్పడిరి అటుపిమ్మట వారు ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునకు ఆచార్యులుగా వెళ్ళుచు ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవికి రాజీనామా నిచ్చిరి కాంగ్రెసువారు శాసనసభలలో ప్రవేశించుటకు ప్రయత్నములు చేయుచుండిరి అట్టి సమయములో రామలింగారెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవిని చేపట్టుట దేశహితైక కార్యమని కొందరు సెనేటు సభ్యులు భావించి, తమ అభ్యర్థనను మన్నింపవలసినదని ఆయనను కోరిరి ఆయన వారి కోరికను మన్నించినాడు

ఆంధ్ర విశ్వవిద్యాలయ మనగానే ఇద్దరి పేరులు స్మరణకు వచ్చును ఆ యిద్దరును రామలింగారెడ్డి జయపుర సంస్థానాధీశులైన విక్రమదేవవర్మగారు ఆ మహారాజుగారు విశ్వవిద్యాలయ సాంకేతిక విద్యాభవనమునకు ఆరులక్షల రూపాయ లిచ్చుటే కాక ప్రతి సంవత్సరమునకు లక్ష రూపాయల చొప్పున తాము కీర్తిశేషులగువరకు విరాళము ఇచ్చుచునే యుండిరి (1951)

రామలింగారెడ్డి కార్యదీక్ష వర్మగారి వదాన్యత ఆంధ్ర విశ్వవిద్యాలయాభివృద్ధికి కారణములు ఆ వదాన్య శేఖరుని పేరిటనే జయపూరు విక్రమదేవవర్మ సైన్సు అండ్ టెక్నాలజీ కాలేజి నిర్మింపబడి నిర్వహింపబడుచు దినదినాభివృద్ధి నొందుచున్నది

ప్రకృతి శాస్త్రశోధనకు (Natural Science) కళాశాల అవసరమని చాలకాలమునుండి భావింపబడుచుండుటచేత మద్రాసు గవర్నరు ఎరస్కిన్ (Eriskine) ప్రభువు 'గ్రాంటు' ఇచ్చుటచేత ఆయనపేరనే ఎరస్కిన్ ప్రకృతిశాస్త్రశోధనాకళాశాల (Eriskine College of natural Science) వెలసినది

కోపల్లె హనుమంతరావు ఆంధ్రజాతీయ కళాశాలకై అక్షయ పాత్ర పట్టినట్లు హిందూ విశ్వవిద్యాలయమునకై పండిత మదన మోహన మాలవ్యా కొంగుపరచినట్లు ఆశుతోష ముఖర్జి కలకత్తా విశ్వవిద్యాలయమునకై చేయిచాచిన విధమున, కార్వే పండితుడు స్త్రీ కళాశాలకై విచ్చుమెత్తిన చందమున, ఆంధ్ర విశ్వ కళాపరిషత్తునకై రామలింగారెడ్డి జోలి బుజాన గట్టుకొని తిరిగి నాడు

ఇట్లు ప్రభుత్వమును, ప్రజలను ప్రజాసంస్థలను అర్థించు టలో ఆయన విరామమెరుగని మహాకృషి గావించినాడు అచిర కాలములోనే ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు లక్షలకొలది ధనము లభించినది నైజాము ప్రభువు లక్ష తిరువాన్కూరు ప్రభువు లక్ష, టి యస్ హరినారాయణగారు ఏబదివేలు, ఇంకను కొందరు దాతలేగాక, కృష్ణా గుంటూరు గోదావరి మొదలగు జిల్లాబోర్డులు పురపాలక సంఘములు కనకవర్షమును కురియించినవి

ఈవిషయమై విశాఖపట్టణపు కలెక్టరు సి హెచ్ మాస్టరు మన్‌గారు, రెడ్డి షష్టిపూర్తి సన్మానములో చెప్పిన పలుకులు గమనించదగినవి "డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిని గురించి గారడీ వాడని చెప్పగా విని యున్నాను కాని ఎవరును ఆయనను

ముష్టివానిగా పేర్కొనలేదు నాకు తెలిసిన భిక్షుకులలో ఆయన అగ్రేసరుడు ఆయన తనకొరకు గాక, ఒక ఉదారాశయము కొరకు చేయిచాచుచున్నాడు అది గమనించదగినది ఆయన అనేక విషయములలో ప్రశంసనీయముగా పనిచేసినట్లు ఈభిక్షాటనలోకూడ ప్రశంసనీయముగానే కృషిచేసెను ”

రెడ్డి తమది సదాశివ (ఆదిభిక్షువు) గోత్ర మని సగర్వముగా చెప్పుకొనెడివాడు సదాశివ గోత్రమును సార్థకము చేసి సర్వజనస్తుతి గాంచినా డాయన

ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవికి 1936 వ సంవత్సరము నుండి 1949వ సంవత్సరమువరకు తానే ఎన్నిక అగుచు ఏకచ్ఛత్రాధిపత్యము ఏలుబడి సాగించినాడు రామలింగారెడ్డి 1930 వ సంవత్సరమునుండి ద్విగుణీకృతోత్సాహముతో చాకచక్యముతో పనిచేయుచు తన జీతములో సగము, వేయి రూప్యములు మాత్రమే తీసికొనుచు త్యాగనిరతిని వెల్లడించినాడు ఇదంతయు చూడగా ఆంధ్ర విశ్వ విద్యాలయమును ఉచ్చస్థితిలోనికి తీసికొని వచ్చుటయే ఆయన ప్రధానాశయమని విదితము కాగలదు బహుముఖ ప్రతిభావంతుడైన ఆయన పరిపాలనాకాలము ఆంధ్ర విశ్వకళా పరిషచ్చరిత్రలో ఒక మహోజ్జ్వల యుగముగా సువర్ణాక్షరాలతో వ్రాయదగినది దాని అభివృద్ధికి ఆయన అన్ని విధాల పాటు పడినాడు ముఖ్యముగా ఎవిధ విజ్ఞానశాఖలలో నిపుణులైనవారిని పరిశోధనావశ్యకతను గుర్తించి, ఇతర దేశాలనుండి కూడ ఆ యా శాఖలలో ఆరితేరిన పండితులను రావించి, విశ్వకళా పరిషత్పరిశోధన శాఖకు చాల ప్రోత్సాహ మిచ్చినాడు

సర్ సి వి రామన్‌గారు ఇక్కడ ఫిజిక్సు కాలేజీలో గౌరవముగా విచ్చేసి పనిచేసినందున ఆంధ్ర విశ్వవిద్యాలయము ‘ఫిజిక్సు’లో విశ్వ విఖ్యాతి గాంచినది ‘Waltair has gained a prominent place in the scientific map of India అని రామన్‌గారు ప్రశంసించినారు

ఆంధ్ర వాఙ్మయ విషయములో కూడ ఆయన చేసిన కృషి గణనీయమైనది, గర్వింపదగినది 1927 వ సంవత్సరములోనే పండితులను పంపి ఆరువందల తాళపత్ర గ్రంధాలను సేకరింపజేసినాడు తంజావూరు సరస్వతీ మహాలులో అముద్రితాలుగా ఉన్న ఆంధ్ర గ్రంధాలకు ప్రతులను తయారుచేయించి ఆంధ్ర విశ్వకళాపరిషద్గ్రంథాలయములో భద్రపరచి వాని శోక వివరణపు పట్టిక కూడ ప్రకటిత మగునట్లు ఏర్పాటు చేయించినాడు ద్విపద భారతమును, రంగనాధ రామాయణమును పరిష్కరింపజేసి ప్రకటింపజేసినాడు సంస్కృత సారస్వత చరిత్ర ఆంధ్ర భాషాచరిత్ర వ్రాయించి ప్రచురించినాడు మీమాంసా న్యాయముక్తావళి విశ్వరూపము, జంతుశరీర శాస్త్రము, క్షేత్రగణితము తెనుగున వ్రాయించినాడు

ఆంధ్ర విద్వాంసుల నెందరికో కళా ప్రపూర్ణ బిరుదములిచ్చి గౌరవించినాడు తాను వేరు, ఆంధ్ర విశ్వవిద్యాలయము వేరుగా ఎన్నడును భావించలేదు తన రచనలను అన్నిటని ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అర్పించినాడు ఈనాడు ఆంధ్ర విశ్వవిద్యాలయము బహుముఖముగా అభివృద్ధి చెందిన దనగా అదంతయు ఆయన చలువయే ఆంధ్ర విశ్వవిద్యాలయము పరీక్షల బోర్డు మాత్రమే కాకుండ Teaching and Research Corporation చేసినది ఆయనే

ఉపాధ్యాయుడు కేవలము ఉపాధ్యాయుడే కాక సిండికేటు అధ్యక్షుడు కూడను సభా సందర్భములలో ఆయన నెలకొల్పిన సంప్రదాయములు చాల ఉత్తమమైనవి తన శక్తి నంతటిని వినియోగించి విశ్వవిద్యాలయమును ఉత్తమ సంస్థగా రూపొందించినాడాయన తన అభిప్రాయమే మంచిదని విశ్వాసము కలిగినపుడు వ్యతిరేక భావమును ఆయన ఏమాత్రము లక్ష్యము చేయలేదు

సెనేటులో సమయము చిక్కినచో హాస్యముగా మందలించి పని చక్కజేసెడివాడు లక్కరాజు సుబ్బారావుగారు చాల కాలము నుండి సెనేటు సిండికేటు సభ్యుడుగా విశ్వవిద్యాలయముతో సంబంధ మున్నవారు విశ్వవిద్యాలయమునకు ప్రతిఫల మాసింపని సలహాదారులుగూడను ఈ యిద్దరును ఏకీభవించినచో ఎను రెవ్వ రన్నట్లుండెడివా రోజులు ఎవరైన ఎదురు నిలిచినను, వారి వలన నయ్యెడి దేమియు నుండెడిది కాదు

# సర్ కట్టమంచి రామలింగారెడ్డి నేషనల్ ప్రైజు

రామలింగారెడ్డి చేసిన మహత్తర కార్యములలో ఇది ఒకటి స్వీడన్ దేశస్థుడైన నోబెల్ అను మహనీయుడు ప్రపంచములో ప్రఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులకు గాని కవులకు గాని తన పేర ఏటేట బహుమతి ప్రదానము జరుగుటకు విశేష ధనమును ఆ ఎకాడమీకి సమర్పించినాడు ఆ మొత్తముపై సంవత్సరమునకు వడ్డీని ఈ బహుమతి ప్రదానమునకు ఎకాడెమీవారు వినియోగింతురు అదేవిధముగా 'సర్ కట్టమంచి రామలింగారెడ్డి జాతీయ బహుమతి" అను పెర ప్రతి సంవత్సరము శాస్త్రజ్ఞులకు గాని కవులకు గాని బహుమతిగా 1 116 రూపాయలు ఇచ్చునట్లు సెనేటు ద్వారమున అంగీకరింప జేసినాడు

1944 వ సంవత్సరమునుండి 1943 వ సంవత్సరమువరకు మన హిందూదేశములో ఖ్యాతిగాంచిన వారికి ఈ బహుమతి ప్రదానము చేయబడినవి బహుమతులు ఈ క్రిందివారికి క్రమానుబద్ధముగా ఇవ్వబడినవి

1 సర్ సి వి రామన్ ప్రకృతిశాస్త్రము

2 ప్రొఫెసర్ యస్ చంద్రశేఖర్ గణితశాస్త్రము

| | | |
|---|---|---|
| 3 | సర్ సాహెబ్ సింగ్ సోఖై | వైద్యశాస్త్రము |
| 4 | సర్ శాంతిస్వరూప్ భట్నగర్ | రసాయనశాస్త్రము |
| 5 | ప్రొఫెసర్ బీర్బల్ సహానీ | వృక్షశాస్త్రము |
| 6 | శ్రీ అరవిందులు | యోగవిద్య |

శ్రీ అరవిందయోగికి బహుమతి ప్రదానము జరుగు సందర్భములో డాక్టరు రామలింగారెడ్డి ఇట్లు వచించినాడు "మన సమకాలికులైన భారతీయ మహామనీషులకు ఆంధ్ర విశ్వవిద్యాలయముతో సంబంధము కల్గించుటయే ఈ బహుమతి ప్రధానోద్దేశము ఈ మహనీయులు మనలను అంధకారమునుండి జ్యోతిర్మార్గమునకు తీసకొని పోవువారు శ్రీ అరవిందులు దీనిని అంగీకరించుట మన అదృష్టముగా భావింపవలెను వారికి మనము బహుమతి ప్రదానము చేయుటలేదు వారికి మనము కానుకగా సమర్పించుకొనుచున్నాము ఈ పూజాపుష్పమును వారు దయతో అంగీకరించుట మన భాగ్యముగా భావించుకొనుచున్నారము దీనిని వారు దయతో అంగీకరించుట ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఆశీర్వాదముగా భావించుచున్నారము వారు అధ్యయనము చేసిన కేంబ్రిడ్జిలోనే నేను వారి వెనుక పఠించుట బరోడాలో వారు వైస్ ప్రిన్సిపాల్ పదవిని విరమించిన వెనుకనే నేను దానిని స్వీకరించుట మహా భాగ్యముగా భావించుచున్నాను వారిని నేను పూర్వాశ్రమములో ఎరుగుదును మా కిద్దరకును మిత్రులైనవారు కలరు"

ఈ మహాత్ముల కానుకగురకు ఇట్లు బహుమతి ప్రదానము చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయము కృతార్థమైనది పిదప ఆ ధనము ఇతర విధముగా సద్వినియోగ మగుటకు మార్పబడినది

# ఉపాధ్యాయులకు వేతనాభివృద్ధి

ఉపాధ్యాయులకు జీతము బత్తెములు తృప్తికరముగా నున్నచే కాని విద్యారంగము అభివృద్ధికాదు పారిశ్రామికులను దోచి లాభములు కూటగట్టుకొను యజమానులవలె ఉపాధ్యాయులను దోచి మేడలు గట్టుకొను పెద్దమనుష్యులను లేకపోలేదు రామలింగారెడ్డి విద్యాక్షేత్రములందు సాగుచున్న ఈ దోపిడిని గమనించినాడు 1947 వ సంవత్సరములో ఆయన విశ్వవిద్యాలయానుబంధములగు కళాశాలలందలి ఉపాధ్యాయుల జీతాలు చాల తక్కువగా నుండుట గుర్తించినాడు తత్క్షణమే ఉపాధ్యాయులకు వేతనాభివృద్ధి జరిగితీరవలె ననుకొన్నాడు సిండికేటువారి సలహా కూడ తోడుగా ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సంబంధించిన కళాశాలల నన్నింటిని సందర్శించి ఆయా కళాశాలల ఆర్థికపరిస్థితిని తెలుపవలసినదని ఒక 'కమిటీ'ని నియమించినాడు ఆ కమిటీ సభ్యులు అందరును కలిసి పర్యటన ముగించుకొనివచ్చి నివేదికను అందింపగానే అందలి సలహాలను బట్టి విశ్వవిద్యాలయమునకు అనుబంధములుగానున్న అన్ని కళాశాలలందును ఉపాధ్యాయుల వేతనములు హెచ్చింపవలసినదని ఆయా కళాశాలల అధ్యక్షులకు సిండికేటు ఆమోదముతో తెలియజేయుట జరిగినది నిజమునకు ఈ వేతనాలు ఎంతో హెచ్చుగా లేవు రెండు కళాశాలలు తప్ప మిగిలినవి అన్నియును ఈ వేతనములను ఆమోదించి అమలు జరిపినవి

ఒక కళాశాలయొక్క అధికారులు తమ ఆర్థికపరిస్థితి సరిగా లేనందున ఈ సూచనలను ఆచరణలో పెట్టజాలమన్నారు రెండవ కళాశాలవారు వీనిని అమలుపెట్టు అవకాశమే తమకు లేదన్నారు

వెంటనే రామలింగారెడ్డి ఒక సిండికేటు సభ్యుని ఒక 'ఆడిటరు'ను ఆ రెండు కళాశాలలను తనిఖీచేసి వాని ఆర్థికపరిస్థితులను తెలుప వలసినదని ఆదేశించినాడు వీరి రాకవిషయమై వర్తమానము అందినవెంటనే ఒక కళాశాలవారు (ఆర్థిక పరిస్థితి బాగుగా లేదన్నారు) క్రొత్తషరతులను తాము ఆమోదించి అమలులో పెట్టుచున్నట్లుగా విశ్వవిద్యాలయమునకు 'టెలిగ్రాము' పంపినారు అంతమాత్రాన కళాశాల తనిఖీ మానరాదని చెప్పి రెడ్డి కమిటీని ఆ కళాశాలకు పంపినాడు కమిటీవారు పరిశీలింపగా ఆ కళాశాలకు బ్యాంకులో లక్షరూపాయలు నిలువయున్నట్లు తెలిసినది

ఇక రెండవ కళాశాలవారిని లెక్కలు చూపవలసినదని అడుగగా, వారు మొట్టమొదట తప్పించుకోజూచినారు కాని అందు వారు కృతార్థులు కాలేకపోవుటచే లెక్కలు చూపక తప్పలేదు వారు కళాశాలలో వచ్చు ఆదాయమును తప్పుల తడకలుగా చూపి నారు హైస్కూలు శాఖలో నష్టము వచ్చుచున్నట్లును చూపి నారు

ఇందువలన మనము గ్రహింపవలసిన దేమనగా రామలింగా రెడ్డి ఉపాధ్యాయుల యొక్కయు విద్యాసంస్థల నిర్వాహకుల యొక్కయు ఆర్థిక పరిస్థితులను గమనించుచు ఉభయుల అభివృద్ధికిని తోడ్పడు వాడనియే ఆయన గొప్ప అర్థశాస్త్రవేత్త గనుక సర్వము ఆర్థికదృష్టితో చూచెడివాడు

ఆంధ్ర విశ్వవిద్యాలయముయొక్క ఆర్థికశక్తి విషయమున గూడ ఆయన ఈ దృష్టితోనే మెలగుచుండెడివాడు ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయములోని కొన్ని శాఖలను అభివృద్ధిచేయుటకు సూచనలను పంపగా నాటి విద్యామంత్రి నిరాకరించుట తటస్థించినది రెడ్డి అంతటితో ఆగక ఒక రాయబారపు వర్గమును ఏర్పాటు చేసి తానే దానికి నాయకుడై అప్పటి మద్రాసు ముఖ్యమంత్రియగు ఓ పి రామస్వామిరెడ్డియారు గారిని సందర్శించినాడు

కొందరు ఈ విషయమును గూర్చి జోక్యము కలిగించుకోవలదని ప్రధాన మంత్రిని కోరినారు అయినను రామస్వామిరెడ్డియార్ గారు వారి మాటలను పాటింపలేదు తప్పక ఈ విషయమును పరిశీలింతు మన్నారు అట్లు పరిశీలించి మరల రెడ్డి పూనికకు కొంతవరకు తోడ్పడినారు కూడ పిమ్మట ఆయన విశ్వవిద్యాలయమును సంద ర్శించినప్పుడు ఆ యా శాఖల విషయమై రామలింగారెడ్డి కోరిన అభివృద్ధి అంతయును ఆవశ్యకము అని గమనించి తృప్తిపడెను

ఈ విధముగా రామలింగారెడ్డి శ్రమపడి ఆంధ్ర విశ్వవిద్యా లయాభివృద్ధికి ఎంతైనా తోడ్పడినాడు

భారతదేశములో ఏ ప్రాంతమున నున్నవారైనను ఆంధ్ర విశ్వవిద్యాలయము యొక్క అభ్యున్నతికి ఉపయోగపడగల విద్వాంసులని తోచినయెడల వారిని ఆయన పిలిపించి అందు నిలుపు కొన్నాడు కాబట్టియే అల్పకాలములో ఆంధ్ర విశ్వవిద్యాలయము అనల్పఖ్యాతి గాంచినది

పరిశోధన అన్నచో ఆయనకు పరమానందము ఆంధ్ర విశ్వవిద్యాలయమును పరిశోధన విద్యాలయముగా జేయుటే ఆయన పరమలక్ష్యము ఇట్లు కృషి చేసినచో స్వాతంత్ర్యమువచ్చిన వెనుక అది మరి అంతగా వృద్ధిగాంచగలదని ఆయన ఆశించినాడు ఆంధ్ర విశ్వవిద్యాలయాభివృద్ధియే ఆత్మాభివృద్ధిగా భావించినాడు

నేడు విశ్వవిద్యాలయము వివిధశాఖలలో పరిశోధన చేయు టకు కళలలో కడుఖ్యాతి గాంచుటకు ఆయనే ఆదిగురువు

తాను ప్రథమములో పాదుకొల్పిన మైసూరు విశ్వవిద్యా లయము యొక్క అభివృద్ధికై తిరిగి ఆహ్వానింపబడినప్పుడు రామ లింగారెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగా రిజిస్ట్రా రుగా ఆక్టింగు వైస్ ఛాన్సలరుగా అనుభవము గడించిన విద్యా వేత్తయును, సర్వజన ప్రియుడును తనకు విశ్వాసపాత్రుడును, యోగ్యుడును అగు డాక్టర్ వి యస్ కృష్ణాగారి చేతులలో

తాను పెంచి పోషించిన ఆంధ్ర విశ్వవిద్యాలయ శిశువును ఉంచి సంతోషముతో మైసూరున కేగినాడు అయినను కృష్ణాగారు రెడ్డి సలహా సంప్రతింపులతోనే విశ్వవిద్యాలయ పాలనమును నిర్వహించెడివాడు

ఎంతో అభిమానముతో అభివృద్ధిపరచిన ఆంధ్ర విశ్వవిద్యాలయమును మీరేల విడిచిపెట్టినారు? అని ఒకప్పుడొకరు రామలింగారెడ్డిని ప్రశ్నించినారు రెడ్డి అందులకిట్లు అభిమానముతో జవాబు చెప్పినాడు 'విడచుట జరిగినదిగాని విడనాడలేదు

ఆంధ్ర విశ్వవిద్యాలయములో మాతృభాషా ద్వారమున విద్యాబోధన జరుగలేదని కొందరు అసాలోచితమైన ఆరోపణ చేసెదరు అట్లు తెలుగులో మాత్రమే సర్వశాస్త్రములు నేర్చువారు ఇతర విశ్వవిద్యాలయములలో చేరి చదువుటకు అవకాశమెక్కడిది? పట్టభద్రులకు ఎవరు ఉద్యోగమిత్తురు? వారు ఎట్లు చెలామణి అగుదురు? జాతీయ పాఠశాలలేల మూలపడినవి? రామలింగారెడ్డి తెలుగు భాషయందు ఇతరులందరికంటె ఎక్కువ అభిమానము గలవాడు కాని దేశకాల పరిస్థితులను బట్టి ప్రవర్తించినాడాయన

స్వరాజ్యము వచ్చినది ఆంధ్రప్రదేశము ఏర్పడినది ఇంతవరకు ఆంధ్రభాష ప్రభుత్వభాష కాలేదు రాజగోపాలాచారిగారు నేటికిని ఆంగ్లభాషయే బోధనా భాషగా నుండవలెనని వాదించుచున్నారు ఇంకను మరికొందరు కూడ ఉన్నారీ ధోరణివారు కాని రామలింగారెడ్డికి మాతృభాష ద్వారముననే విద్యాబోధన జరుగవలెనని ఒక గొప్ప ఆశయముండెడిది ఇటీవల విశ్వవిద్యాలయోపాధ్యాయులందరు దీనిని ఆమోదించుట జరిగినది ఇది అమలులోకి వచ్చెనా! మన ఆనందమునకు మేర ఎక్కడిది?

# విశ్వవిద్యాలయోపాధ్యక్షులలో రెడ్డిస్థానం

మన ఆంధ్రులలో విశ్వవిద్యాలయోపాధ్యక్షు లయినవారు అనేకులున్నారు అలాగే భరతఖండము మొత్తమునను పేరెన్నిక గన్న విశ్వవిద్యాలయోపాధ్యక్షులు లేక పోలేదు వారిలో మన రెడ్డి స్థానము ఎటువంటిది ?

మన ఆంధ్రులలో ప్రాతస్స్మరణీయుడైన బ్రహ్మర్షి సర్ రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు మద్రాసు విశ్వవిద్యాలయమునకు 1926 వ సంవత్సరమున ప్రప్రథమముగా ఎన్నికయిన ఉపాధ్యక్షుడు ఉపాధ్యక్షుడుగా ఆయన రాణించక పోలేదు కాని జీవితములో అధికకాలము ఆయన ఆచార్యుడుగానే ప్రసిద్ధుడు ఆచార్యుడనెడు నామము ఆయనకు సార్థకము విద్యాబోధనలో విమలవర్తనములో, విద్యార్థులయెడ వాత్సల్యములో ఆయనకు సమానుడైన ఆచార్యుడు ఆంధ్రావనిలో అరుదు పిఠాపురము రాజాగారి కళాశాల ఆయనకు ప్రాణపదము అందుచేతనే 'నా హృదయము అరంగుళము క్రిందికి కోయుడు అక్కడ తప్పకుండ పిఠాపురము రాజావారి కళాశాల కనబడును'' అన్నాడాయన

సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు హిందూ విశ్వవిద్యాలయమునకు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షులుగా నుండి ఉత్తమ సేవయే చేసినారు వారే కార్యక్రమము చేసినను తత్త్వశాస్త్రము వారికి ప్రాణపదము వారు తత్త్వవేత్తలుగా ప్రపంచ ప్రఖ్యాతులు

సర్ కె వి రెడ్డి నాయుడుగారు అన్నామలై విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షత వహించినారు కాని, ఆయన కేవలము రాజకీయవేత్త ఆ జస్టిసుపార్టీ నేత యొక్క ఆత్మ రాజకీయాది పదవులకే పరిమితించినది

పరప్రాంతాలలో ఉన్న ఆంధ్రుడు మాచిరాజు భవానీ శంకర్ యోగి నాగపుర విశ్వవిద్యాలయోపాధ్యక్షుడుగను హైకోర్టుజడ్జిగా పబ్లిక్ సర్వీస్ కమీషన్ అధ్యక్షుడుగా ఆయన ఎక్కువ కీర్తి గడించినాడు

డాక్టరు వి యస్ కృష్ణ ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు తగిన ఉపాధ్యక్షుడని రామలింగారెడ్డి ఆయనను ఏరికోరి నియమించినది వాస్తవమే ఆయన ఆ పదవికి తగినట్లుగా ప్రవర్తించినది కూడ యథార్థమే

అయినను ఆంధ్రులలో విశ్వవిద్యాలయోపాధ్యక్షుల మాట వచ్చుసరికి డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి పేరే నాలుకపై నుండును ఆయన ఆంధ్రవిశ్వవిద్యాలయ జనకుడు

భారతభూమిలో పండిత మదనమోహన మాలవ్యా సర్ ఆశుతోషముఖర్జీ బ్రజేంద్రనాథసీల్ అను ఈ ముగ్గురు ఆధునిక విద్యావిషయములో నిత్యస్మరణీయ మహాపురుషులు ఆశుతోష మాళవ్యాలు గొప్ప నిర్మాణ నిపుణులు Organisers బ్రజేంద్రనాథసీల్ ఉజ్జ్వల భావాంబర విధి విహారి (The man of radient ideas) అని విశ్వ విఖ్యాత విద్యావేత్త మన రామలింగా రెడ్డి ప్రవచించినాడు

అది వాస్తవమే వారు ముగ్గురు స్మరణీయులే ప్రాతస్స్మరణీయులు పండిత మాళవ్యాగారు ఆయనపేరు చెప్పగనే యుగయుగాలనుండి మన సంస్కృతికి కేంద్రమైన కాశీక్షేత్రమునందు ఆయన స్థాపించిన విశ్వవిద్యాలయము స్మరణకు వచ్చును

సర్ ఆశుతోషముఖర్జి కలకత్తా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షుడై భారతభూమిలో ఉత్తమ విశ్వవిద్యాలయ విద్య ప్రారంభించి ప్రఖ్యాతిగాంచినాడు 'పోస్టుగ్రాడ్యుయేటు కోర్సును స్థాపించినది ఆయనే

సర్ ఆశుతోషుముఖర్జీ శేముషీధురంధరుడు, నిర్మాత, స్వతంత్రుడు దేశాభిమాన కార్యదక్షుడు, ప్రభుత్వపు నీడ క్రింద మెలగుచున్న కలకత్తా విశ్వవిద్యాలయమును ఎంతవరకు దేశీయముగా చేయ వీలుకలదో అంతవరకు చేసి, దానిక నూతన రూపురేఖలను దిద్దిన శిల్పి సర్వ విద్యలలోను అన్ని శాస్త్రముల లోను దేశీయులనే ప్రధానాచార్యులుగా నియమించి పాశ్చాత్యు లెవరైన నున్నచో వారిని దేశీయుల క్రింద తాబేదారులుగా నియమించి నాడాయన ఇతర విశ్వవిద్యాలయములు పేరునకుమాత్రమే విశ్వవిద్యాలయములు క్రియలో అవి పరీక్షా యంత్రములు మాత్రమే కలకత్తా విశ్వవిద్యాలయము బోధనాలయము పరిశోధనాలయము దానిక ఆర్థికపుష్టి చైతన్యము చేకూర్చి విశ్వవిఖ్యాతిగడించిన ధీరపురుషుడు ఆశుతోషుబాబు వంగదేశీయుడగు బ్రజేంద్రనాథసీల్ గొప్ప తత్త్వవేత్త మైసూరు విశ్వవిద్యాలయమునకు చిరకాలము ఉపాధ్యక్షుడుగ నుండి దాని ఉన్నతికై కృషి చేసిన ఉదారచరితుడు

ఇక మన డాక్టర్ రామలింగారెడ్డి ఆంధ్రవిశ్వవిద్యాలయ స్రష్ట పోషకుడు సర్వమును ఆంధ్రవిశ్వవిద్యాలయమును ప్రాణప్రదముగ భావించి దానిని అల్పకాలములో అనల్పముగ తీర్చిదిద్దిన నిర్మాణనిపుణుడు

భారతీయ విశ్వవిద్యాలయముల చరిత్రలో పండిత మదనమోహన మాలవ్య ఆశుతోషుల కెటువంటి స్థానమున్నదో డాక్టర్ రామలింగారెడ్డికి అటువంటి స్థానమున్నది

# ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన విద్యావేత్తల ప్రశంసలు

అంతర్విశ్వ విద్యాలయ సమితి వాల్తేరులో సమావేశమై నప్పుడు ఆచార్య యన్. కె. సిద్ధాంత ఆంధ్ర విశ్వకళాపరిషత్తును దాని ఉపాధ్యక్షుడైన డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిని ఎంతో కొనియాడెను. ఆ ప్రశంస సర్వవిధముల తగినది.

"సకలాంగ సుందరమైన విద్యాపీఠమున కాలవాలమగు నందన వాటిక విషయమై కలలు గాంచితిమి. నిత్యవసంతమునకై యెదురు చూచుచుంటిమి. ఆ వసంతము, ఆ నందనవనమును గూర్చి వినుటయే గాని కనుటకు నోచుకొననైతిమి. ఇదిగో ఇచ్చోట వాల్తేరు ఆ నందనవనము శోభిల్లుచున్నది. ఇచ్చటి ప్రకృతిమాత మానవునకు అన్ని విధముల తోడ్పడ సిద్ధముగా నున్నది. దాని చేయూతతో వాని శ్రమలన్నియు ఫలించు అవకాశ మిచ్చట నున్నది. మానవుని మేధాశక్తి సక్రమముగ ప్రవర్ధమానమై విద్యావిజ్ఞాన ప్రసారము జరుగుచున్నది.

'డాక్టర్ రామలింగారెడ్డివంటివాడు ఉపాధ్యక్షుగా నుండుట ఈ విశ్వవిద్యాలయముయొక్క అదృష్టము. విద్యాపీఠ దినదినాభివృద్ధికి యుత్సాహపూరితమైన అతని కృషిని గమనింపనివాడు మాలో నొక్కడును లేడు. తన కృషి ఫలించుచుండెడి భాగ్యమునకై అతడు పొందుచున్న ఆనందము సామాన్యమైనది కాదు. ఇట్టి ఫలితమునకు ప్రధాన కారణము రెడ్డి ఉత్సాహపూరితమైన కార్య దీక్ష. అది విద్యాపీఠములోని అధ్యాపక బృందమును ప్రభావితులను చేయుటయేగాక, వారి సంపూర్ణ సాహాయ్యము పొందుట కనుగుచున్నది. వారికందరికి రెడ్డియందు పరిపూర్ణ విశ్వాసము గలదు. ఆదర్శప్రాయమైన సమష్టికుటుంబములోని సామరస్యమునకు

మూలమంత్ర మిది ఇతర విశ్వవిద్యాలయములు అవిరోధముగా కూడి పనిచేయుటకు ప్రయత్నించవలసి యున్నది"

డాక్టర్ ఆర్థర్ అపహాన్ పోప్, ఆసియా ఇన్స్టిట్యూట్ చాన్సలర్ న్యూయార్కు-1948 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తును దర్శించి మార్గమధ్యమున లండనులో పలికిన ప్రశంశావాక్యములు

"ఈ నడుమనే క్రొత్తగా స్థాపింపబడిన విశ్వవిద్యాలయములలో నొకటైన ఆంధ్రవిశ్వవిద్యాలయమునందు డాక్టరు రామలింగారెడ్డివంటి విద్యావేత్త నేతృత్వములో ప్రత్యేకమైన శిక్షణా పద్ధతులు-అమోఘములు, ఆశ్చర్యకరములునగు ఫలితము లొసగునని తేలినది"

# సర్ సి వి. రామన్

'శ్రీ శే సర్ ఆశుతోషు ముఖర్జీ యశః కిరీటము డాక్టరు రెడ్డిని వరించినది"

ఆంధ్ర విశ్వవిద్యాలయము పుట్టుక దాని అభివృద్ధి విషయములలో జరిగిన కృషిలో డాక్టరు రెడ్డిగారున్నంత భాగము మరొక వ్యక్తికి లేదు ఈమాట విద్యాబోధనశాఖయెడ ఎంత సత్యమైనదో, విద్యాపీఠ పరిపాలనా విభాగముయెడను కూడ అంత సత్యమైనది 1949 లో డాక్టరు రెడ్డి మైసూరు విశ్వవిద్యాలయమున సహాయాధ్యక్షుడై వెడలిపోయినపుడుకూడ ఆంధ్ర విశ్వవిద్యాలయములో నాతనికిగల సన్నిహిత సంబంధము తెగిపోలేదు ఆంధ్ర విద్యాపీఠముసెడ గల ఆయన ప్రేమాదరణములు తగ్గలేదు ఆయన సహాకారము సలహా ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు లభించినవి డాక్టరు రెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఎతియగుట వాస్తవము"

ఆంధ్ర విశ్వవిదాగలయు రజతోత్సవ సంచిక-నుండి పుట 45 26

# గృహజీవనము

రామలింగారెడ్డి విద్యార్థిదశలోనే తల్లిదండ్రులు స్వర్గస్థులయినారు అటుపిమ్మట రెడ్డి పరప్రాంతములకు వెళ్ళివచ్చి ఉద్యోగములో ప్రవేశించినాడు వివాహము భారతీయునకు జీవితధర్మాలలో ఒకటి ఆంగ్లదేశములో ప్రతివ్యక్తి వివాహము చేసికొని తీరవలెనను నియమములేదు అది వ్యక్తి యిష్టాయిష్టములపై ఆధారపడి యుండును ఆంగ్లదేశములో ఉండివచ్చినవాడు కాబట్టి రెడ్డి ఆదేశాచారమును మెచ్చియో మరి ఏ కారణముచేతనో వివాహము చేసికొనలేదు అర్థశాస్త్రములో అంకితమిచ్చిన పద్యాలనుబట్టి ఆతనికొక ప్రేయసి ఉన్నట్లు ఆమె గతించినట్లును మనము గమనించగలము ఆ వివరాలు తెలిసినవారు కనబడరు దానిలో అందరిది ఊహాగానమే 'మీరెందుకు పెండ్లి చేసుకొనలేదు?'' అని కొందరడుగగా 'అదంతయు వ్యక్తిగతమైన సంగతి'' అనువాడట రెడ్డి అనగా ఆ విషయము అడుగకూడదని భావము. వివాహము స్వాతంత్ర్యమును హరించునని, వివాహమాడవద్దని తనకు చెప్పెనని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వ్రాసినారు (ఆంధ్రప్రభ 1956 నవంబరు 1) 'నీవు కూడ పెండ్లి చేసికొని భార్యాబంధములో చిక్కుకొని సర్వనాశనం కావద్దయ్యా' అన్నాడట! 'విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నము లన్నట్లు నా పెళ్ళికి వేయి విఘ్నములు వచ్చిన వనేవాడట! పెండ్లి చేసికొనకపోయినను ఏకాకిగా జీవించుట పడలేదు

1910 లో అన్న నరసింహారెడ్డి చనిపోయినపుడు పిల్లలను చూచుచుండవలసినదని తమ్మునకు చెప్పిపోయినాడట అందువల్ల ఆయన భార్య అక్కలమ్మ కుమారులు సుబ్బారెడ్డి రామస్వామి ప్రభాకరులు, కొమార్తె సంజంతమ్మ వీరి పోషణ క్రిందనే యుండిరి

ఇంటిలో ఆయనది సుగ్రీవాజ్ఞ. చిన్న పెద్ద లందరకు ఆయనయన్న ఎంత ప్రేమయో అంత భయముకూడ ఉండెడిది అన్నబిడ్డల మీద ఆయన చూపిన మమత్వము ఎంతో ముగ్ధమధురమైనది 'వివాహము మానిసిని మ్రింగివేయు' నని బెట్రండ్ రస్సెల్ రోమన్ రోలా, ఆస్కార్ వైల్డు అన్నారు కాని వా రందరును వివాహము జేసినవారే! కట్టమంచివారిలో పెండ్లి చేసికొననివారు ఇంకను ఉన్నారు కట్టమంచివారి వంశము విద్వద్వంశము కుటుంబ మటువంటిది ఒక నరసింహారెడ్డితప్ప అందరును విద్యావంతులే తిరిగి ఏ బిడ్డలందరు విద్యావంతులే పట్టణము నకు వీరి గ్రామము దగ్గరుండుటచేత అధికముగా అట్టి అవకాశము వారికి లభించియుండును

రామలింగారెడ్డి తమ్ములలో భాస్కరరెడ్డి 'సార్!' అని సంబోధించుచు అన్న యెడల అధిక భయభక్తులతో మెలగెడివాడు ఆయన సబ్ జడ్జిగా కృష్ణాజిల్లాలో కొంతకాలము పనిచేసి జిల్లా జడ్జిగా రిటైర్ అయినాడు ఒకసారి రామలింగారెడ్డి భాస్కర రెడ్డితో ఇష్టాగోష్టి జరుపుచు 'ఒరే భాస్కరా! నీ సంబళ మెంత? ఏమన్నా పైగా సంపాదిస్తున్నావా? మన తండ్రిగారు చాలా ప్రతిష్ఠగా బ్రతికినారు ఆయనకు మనము అప్రతిష్ఠ తేగూడదు' అన్నాడట! ఆయన పేరైన న్యాయాధిపతిగానే ఖ్యాతి గాంచి తండ్రికి తగిన తనయు డనిపించుకొన్నాడు

భాస్కరరెడ్డితనయులలో దైవకటాక్ష రెడ్డి న్యాయవాదిగా ఉండి తాత తండ్రుల మార్గాన అభివృద్ధి నొందనున్నాడు

సంజంతమ్మ తన చేతితో ఉదయాననే కాఫీ కాచి పిన తండ్రి కిచ్చెడిది ఆ కాఫీ త్రాగి ఆనందించెడివా డాయన కాఫీ బాగుగా నున్నచో ఆ దినమంతయు హాయిగా ఉండెడి దాయనకు ఆయనకు భోజనము ప్రత్యేకముగా ఆమెయే సిద్ధపరచెడిది

ఆయన భోజనమంతయు ఐరోపావారి పద్ధతియే చేతితో భుజించువాడు కాదు, 'ఫోర్కు, స్పూను లతోనే

ఆతిథ్యములో కట్టమంచివారు కడు ఖ్యాతి గాంచినవారు రామలింగారెడ్డికూడ అతిథుల అభిరుచులను కనుగొని వారి కభి మగు రీతిగా శాకపాకములు కావించుచువాడు

అన్న సంతానములో సంజంతమ్మను పెంచుకొన్నాడు ఆమె ఇంగ్లాండు 'రిటర్న్డు ఇంజనీరు అగు కడలూరి నివాసి రామ లింగారెడ్డి కిచ్చి 1919 వ సంవత్సరము నందు జూన్య మాసములో వివాహము చేసినాడు వదినెగారి పోరు పడలేక పూలపట్టు (శ్రీ)రాములురెడ్డిగారి ఆచార్యత్వము క్రింద జరిపినాడు వివాహము అది అయిదు నిమిషాలలోనే అది అసలు రిజిష్టరు వివాహము కూర్మి పెంచిన తనయ నిదే ధారవోసి ధన్యుడనైతిన్' అన్నాడు అంపకాలలో రామలింగారెడ్డి ఆ అల్లుడు రామలింగా రెడ్డి ఇంగ్లాండునకు వెళ్ళి వచ్చినను పటాటోప మెరుగనివాడు నిరాడంబరజీవితము ఉన్నతాలోచనలు వీరి ఆశయములు విరు ధవళేశ్వరపు ఆనకట్టవద్ద గూడ కొంత కాలము ఇంజనీరుగా నుండిరి

వీరికి ఆరుగురు కొమార్తెలు ఒక కుమారుడు కలిగినారు తాతగారగు రామలింగారెడ్డి వారి కందరికి విద్యాబుద్ధులను కర పించి విఖ్యాతి నొంద వీలు కలుగజేసినాడు వరుసగా వారి పేర్లు

1 సత్యభామారెడ్డి డాక్టరు గుంటూరు వైద్యకళాశాలలో ప్రొఫెసర్

2 శరణ్య అమెరికాలో Nutrition (ఆహార పరిశోధన శాస్త్రము)లో P H D పొందినది జెనీవాలో ప్రపంచారోగ్య సమితిలో పనిచేయుచున్నది ఈమె రెడ్డిగారి అభిమానమును చూర గొన్నది

3 వరలక్ష్మి బి ఏ బియల్ మద్రాసు

4 విజయవల్లిరెడ్డి డాక్టరు హైదరాబాదు

5 పద్మ జెనీవాలో శరణ్యతో ఉన్నది

6 ప్రభాసరాయరెడ్డి M S ఊసరక్షేత్రములను సుక్షేత్రములుగా చేయుచున్నారు కమ్మవారి కన్యను వివాహమాడి తాత తండ్రులకు సంస్కరణలో తగు ఖ్యాతి తెచ్చినాడు

7 శరద్వతి ఎం బి బి ఎస్ నాల్గవ సంవత్సరము

అందరికి సంగీతము కూడ నేర్పించినాడు ఒకరికి వీణ మరొకరికి పియానో ఒకరికి ఫిడేలు ఇట్లందరిని సంగీతములో ప్రవీణులుగ జేసినాడు మనుమరాండ్రందరు కలసి హాయిగా పాడుచుండగా రామలింగారెడ్డి ఆనందించుచుండెడివాడు సూర్యోదయమునకు మున్నే మనుమరాండ్రను మేల్కొలిపి, ఉషోదయముచూపి ఆనందింపజేసెడివాడు ఆడపిల్లలు పెందలకడనే లేవవలెనని మధ్యాహ్నము పరుండరాదని హెచ్చరించుచుండెడివాడు సాయంతనము నిత్యము వారిని కూర్చుండబెట్టుకొని కథలు చెప్పుచుండెడివాడు సెలవులలో మాత్రము తండ్రిగారి దగ్గరకు పంపుచుండెడివాడు

రామలింగా రెడ్డి విద్యాభిమాని మన సంఘ పతనమునకు కారణముస్త్రీవిద్యలేకపోవుటయే యనిభావించెడివాడు అందుచేతనే ఆంధ్రవిశ్వవిద్యాలయములో స్త్రీలకొరకుప్రత్యేకవిద్యావిధానము-గృహవిద్య ఏర్పాటులు చేయించవలెనని అనుకొనెడివాడు

'దీపావళిఅమావాస్యరోజున జన్మించుటచేత సత్యభామ కా పేరు పెట్టినాడురెడ్డి కాని ఆమె సత్యభామవంటిదికాదు రుక్మిణి వంటిది సాధు వర్తనము కలది సత్యభామకు, శరణ్యకు చిన్నవయసులో తెలుగుచెప్పిన (శ్రీ)పువ్వాడ శేషగిరిరావుగారుకూడ 'సత్యభామలో సరళస్వభావము వినయవిధేయతలు శరణ్యలో చాల గడుసరితనము తొందరపాటులును గల వనియు నుడివినారు

సత్యభామను చిత్తూరు ప్రాంతమువాడగు రాజుపేట రాజగోపాల రెడ్డిగారికిచ్చి 1947 లో రామలింగారెడ్డియే పరిణయము చేసినాడు వారును వైద్యులే ఇంతకు పూర్వము సేనలో ఉండెడివారు నేడు గుంటూరులో జిల్లావైద్యశాఖాధికారి (డి యం ఒ)

రామలింగారెడ్డి వయసు మీరిన తరువాత పూజాపురస్కారములు చేసెడివాడు దేవాలయమునకేగినపుడు అచట పూజాక్షలిడిన కుంకుమను భద్రపరచుకొని స్నానానంతరము నిత్యము ముఖమునందిడుకొను చుండెడివాడు ప్రతి శుక్రవారము ఇంటిలో దైవపూజ గావించుకొనెడివాడు శక్తి నారాధించెడివాడు కాని శాక్తేయుడు మాత్రముగాడు ఆడంబరములజోలికి పోక ఇంటిలో గూడ కట్టికొనుండెడివాడు లోకమాతనిని రసికుని గానే గుర్తించినది కాని యాతని తాత్త్విక విాతనను సన్నిహితులకు మాత్రమే పరిమితము

# షష్టిపూర్త్యుత్సవము

రామలింగారెడ్డి దేశమునకు చేసినసేవను విశేషముగా విద్యారంగములో అందులోను ఆంధ్రవిశ్వవిద్యాలయము అభివృద్ధికి చేసిన కృషికి తగినట్లుగా ఆయనను సన్మానించవలెనని విశేషముగా మన దక్షిణదేశమందలి ప్రముఖులతో ఒక కమిటీ ఏర్పడి కొంత ధనమును సంపాదించి వారి సేవను స్మరించి రెండు గ్రంథాలను (Scince Humanities) వివిధ ప్రముఖులచేత వ్రాయించి ప్రచురించుటకు రెడ్డి కంచువిగ్రహము దేవిప్రసాద రాయ చౌదరిగారిచేత తయారు చేయించుటకును, షష్టిపూర్తి ఉత్సవము ఆంధ్రవిశ్వవిద్యాలయావరణలో చేయుటకును తీర్మానింపబడెను

తదనుగుణముగా 1940 డిసెంబరు 10 వ తారీకున ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఉదయము 9 గంటలకు ఒకసభ జరిగెను. ప్రప్రథమమున రామలింగారెడ్డిని వేదోక్తముగా పండితులు ఆశీర్వదించిరి

అనంతరము సన్మానసంఘపు సెక్రటరీ బి ముత్తుస్వామి గారు రిపోర్టు చదివిరి



షష్టిపూర్తుల సందర్భంలో రామలింగారెడ్డి

అప్పటి మద్రాసు గవర్నరు — ఆర్థర్ హోప్

తర్వాత ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు అనేకముగా ఆర్థిక సాహాయ్యముచేసి చిరస్మరణీయులైన ప్రోఛాన్సలరు జయపూర్ మహారాజా విక్రమదేవవర్మగారు ఇట్లుపన్యసించిరి

“డాక్టరు రామలింగారెడ్డిగారు చాల సుప్రసిద్ధపురుషులు వారి అద్భుత మేధాశక్తికి తోడుగా, ఉత్తమ విజ్ఞాన సంస్కారము వారిలో మిళితమైయున్నది కనుక వారినెంత కొనియాడినను అధిక ప్రసంగమే కాజాలదు వారి జీవితము మాతృదేశారాధనకై అంకితమైనది భారతదేశ విజ్ఞాన వికాసమునకు ముఖ్యముగా ఆంధ్ర దేశ విజ్ఞానోత్తేజమునకు వారి జీవితము వినియోగింపబడుచున్నది వారి తదేక తత్పరత్వమువల్ల రమ్యమైన సరస్వతీ పీఠము నిర్మాణము చేయుచున్నారు వారి ప్రతిభా సామర్థ్యమున కది ప్రబలమైన తార్కాణము ఆంధ్రులెట్టి ప్రతిభావంతులు కావలెనో అను విషయములయందు వారికెన్నో కోరికలు గలవు వారి మనోరథము లీడేరుటకై వారికి దీర్ఘాయువు కలుగుగాక!”

అంతట గవర్నరు సర్ ఆర్థర్ హోప్‌గారు ఇట్లుపన్యసించిరి

‘ఈ శుభసమయమున ఇక్కడ ఉండుట నాకు చాల ఆనందకరముగా ఉన్నది రామలింగారెడ్డిగారు విశ్వవిఖ్యాతుడు ప్రపంచములోని విద్యావేత్తలందరు ఆయనకు మిత్రులే రెడ్డిగారు కేంబ్రిడ్జిలో విద్యార్థిదశలోనే గొప్పతనమును ప్రకటించి ఖ్యాతి గాంచిరి ఈ ఆంధ్ర విశ్వవిద్యాలయములో కృషిచేయుటకు వివిధ విశ్వవిద్యాలయములనుండి ప్రముఖులను రప్పించుట ఆయన హృదయవైశాల్యమును ఉత్తమాశయమును తెలుపుచున్నది

నేను భారతదేశమునకు వచ్చిన పిమ్మట రెడ్డిగారితో పలుమార్లు కలియుట సంభవించినది ఆయన విజ్ఞాన రాజకీయ నైపుణ్యమేగాక బాల్యదశలోనున్న ఈ విశ్వవిద్యాలయాభివృద్ధికై ఆయన అనవరతము చేయుచున్న కృషి అభినందనీయము ఇది

చాల కష్టమైన కార్యము దీని ఆర్థికస్థితి సరిగాలేదని నాకు తెలుప బడినది వడిదుడుకు సమయాలలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొని తన దూరదృష్టితో ఈ విశ్వవిద్యాలయమును ఐరోపా ఖండములోని గొప్ప విశ్వవిద్యాలయము మాదిరి చేయవలెనని ఆయన చేయు చున్న అఖండకృషి అందరును ఎరిగినదే జరిగిన రెండు దశాబ్దాల నుండి ఆయన చేయుచున్న కృషి ఫలించగలదని నే నాశించు చున్నాను రామలింగారెడ్డిగారికి ప్రతిబింబముగా అతి నిపుణతతో చేయబడిన ఈ విగ్రహమును ఆనందముతో ఆవిష్కరించు చున్నాను ”

సుప్రసిద్ధ ప్రకృతి శాస్త్రజ్ఞులగు సర్ సి వి రామన్‌గారు ఇట్లు ప్రసంగించిరి

“రామలింగారెడ్డిగారు నాకు చిరకాల మిత్రులు ఆయన గొప్ప ఆదర్శవాది ఈ వాల్తేరంతటి రమణీయ ప్రదేశము నా కెక్కడను గోచరించలేదు ఈ విశ్వవిద్యాలయము నిక్కడ నెల కొల్పుట ఎంతో దూరదృష్టితో చేసినపని ఇటువంటి సుందర ప్రదేశముననే విద్య గరపబడవలెను పరిశోధనకు ఈ ప్రదేశము అనుకూలమైనదని రెడ్డిగారు గ్రహించుటలోనే ఆయన విజ్ఞత లోకజ్ఞత గలవు రామలింగారెడ్డిగారి కృషిఫలితముగా ఈ విశ్వ విద్యాలయము విశ్వవిఖ్యాతి గాంచగలదని ఈ శుభసమయాన నే నాశించుచున్నాను దీని పురోభివృద్ధికి గవర్నరుగారు, జయపుర మహారాజాగారు చేసిన సహాయము స్తవనీయము ఈ తరమువారే గాక భావితరాలవారుకూడ వీరి దానధర్మాలచే తరింపగలరు రామ లింగారెడ్డిగారు కేంబ్రిడ్జికి చెందినవారు అది విశ్వవిఖ్యాతమైన విజ్ఞాన కేంద్రము ఆ కేంబ్రిడ్జినే ఈ వాల్తేరులో నిలుపుట రెడ్డిగారి అభి మతము విద్యావేత్తలలోను, విశ్వవిద్యాలయోపాధ్యక్షులలోను అశుతోషుముఖర్జీకి చాలినవారు రామలింగారెడ్డికి మించి మరొకరు లేరు రెడ్డిగారు తమజీవిత శేషముకూడ దీని అభివృద్ధికై కృషి

చేయుదురుగాక! సర్ ఆర్థర్ హోప్ గారు చేసిన ఆర్థిక సాహాయ్యమునకేగాక హార్దిక సాహాయ్యమునకుగూడ అంజలి ఘటించుచున్నాను వారు ఇచటకు విచ్చేయుట రెడ్డిగారిని గౌరవించుటకేకాదు మమ్ములనందరిని గౌరవించుటగా భావించుచున్నాము"

సాయంతనము మూడింటికి మరల సన్మానసభ జరిగినది కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి తెలుగు ఋతువులు, మరికొన్ని గ్రంథములు రెడ్డిగారికి అంకితము ఇవ్వబడినవి ఆ సభకు సర్ సి వి రామన్‌గారు అధ్యక్షత వహించి మహోపన్యాసము గావించినారు 'నే నీసభకు అధ్యక్షత వహించుట మహాగౌరవముగా భావించుచున్నాను రెడ్డిగారు అఖండ ప్రజ్ఞావంతులు విజ్ఞానవేత్తలు కేంబ్రిడ్జికి చెందినవారు ఆయన గొప్ప ఆదర్శవాది సమయోచితముగా సద్దుగొనిపోయెడి లోకజ్ఞత గూడ నాకును ఈ విశ్వవిద్యాలయమునకును ఏ విధమైన సంబంధము లేదు అయినప్పటికిని నన్ను సెనేట్ మెంబరుగా చేసి ఈ విశ్వవిద్యాలయమున నా చేతనైన సాహాయ్యము చేయుటకు అవకాశము కల్గించినందులకు ఆయన నభినందించుచున్నాను ఈ కార్యము ఆయన ప్రకృతిని తెలుపుచున్నది ఈ ప్రాక్తన భూమిని ఉజ్జ్వలముగా చేయవలెనని ఆయన ఆశయము ఆయన ఆదర్శవాది అని అన్నాను ఆయన ఆదర్శము ఎటువంటిది? ప్రాతక్రొత్తల మేలుకలయిక ఈ పురాతన భూమిని వినూత్నాశయాలతో నూతన విజ్ఞానములో దేదీప్యమానము చేయుట ఇటువంటి మహాశయులతో సంబంధము కలుట భాగ్యముగా భావించుచున్నాను అటువంటివారు సర్ అశుతోషు ముఖర్జీ పండిత మదనమోహన మాలవ్య వారిరువురువలె కృషి చేసిన మహనీయుడు మన రెడ్డిగారు ఈ త్రిమూర్తులు ఆధునిక విజ్ఞానక్షేత్రమున నిత్యస్మరణీయులు అటు బెంగాలులో, ఇటు బెనారసులో వెలిగిన జ్యోతి ఆంధ్రావని కరుదెంచినది ఈ అఖండ జ్యోతి కాది పురుషుడు రామలింగారెడ్డిగారు అనంతరము రాధాకృష్ణన్ ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా వీరికృషి వినుతింప

తరిపది ఈ ఆంధ్రమహాపురుషుల నామములు నిత్య స్మరణీయములు వీరితోపాటు విక్రమదేవర్మగారు వినుతింపదగినవారు ప్రతి సంవత్సరము ఈ విశ్వకళాశాలకు వీరు లక్షరూపాయలు బహూకరించుట బహుప్రశంసనీయమైన కార్యముగదా !''

కాకినాడ వకీలుగ కడు ఖ్యాతి గాంచిన లక్కరాజు సుబ్బారావుగారు కమనీయముగ ఉపన్యసించిరి

'రెడ్డిగారిని క్రైస్తవ కళాశాలలో చదువుకొన్నప్పటినుండి ఎరుగుదును నేను సిండికేట్‌లో పదేండ్లున్నాను విశ్వవిద్యాలయము ప్రారంభమైన నాటినుండి నేటివరకు నేను సెనేట్ సభ్యుడను బాల్యమునుండి ఆయన అప్రసన్నదానిని గాదని చెప్పగలవారు నాకు కాన్పించలేదు

"ఆంధ్ర విశ్వవిద్యాలయముతో ఆయన సంబంధము కమిటీ సభ్యత్వముగా ఆరంభింపబడి శాసనసభతో సంబంధము కలిగి ఉపాధ్యక్షతతో పెనవేసికొని పోయినది

"ఆంధ్ర విశ్వవిద్యాలయము ఎట్లు ఆరంభమైనదో మీ అందరకు విశదమైనదేగదా ! అదంతయు జస్టిస్ పార్టీ వారు అందరిని మెప్పించవలెనని చేసిన అవకతవక పని దీనికి డబ్బు దస్కం లేదు పేరుకు యూనివర్సిటీ విశ్వవిద్యాలయ శాసనము సవరణ చేయించి వాల్తేరునకు రప్పించినది, ప్రభుత్వమునుండి లక్షలకొలది గ్రాంటులు తెప్పించినదియు రెడ్డిగారే ! నేచురల్ సైన్సు కాలేజీ స్థాపనకు ఆయనేకదా ఆదిపురుషుడు !

ఆయన వ్యక్తిత్వ ప్రభావము అనితరసాధ్యము ఆయన నిరంకుశుడు గాడు దేశాభివృద్ధికి ఉచితమని తోచు కార్యకలాపాలను చేయుటకు ఆయనకు సాహసమును సామర్థ్యమును కలవు దేశములో స్వాతంత్ర్యసమరము సాగుచున్న సమయములో విశ్వవిద్యాలయోపాధ్యక్షతను తృణప్రాయముగా భావించి విసర్జించినాడు కాంగ్రెసునకు అండగా నిలిచినాడు ఆయనే ద్వితీయ

ప్రపంచ సంగ్రామములో బ్రిటనునకు బాసటగా నిలిచి కాంగ్రెసునకు భిన్నముగా ఖద్దరుధారియై నిలిచినాడు ఖండనకు మండనకు ఆయనే తగును విధ్వంసమునకు వినూతన నిర్మాణమునకు ఆయనకు ఆయనయే సాటి మొదటిదానికి శాసనసభలో రాజాజీతో కత్తి దూయుట రెండవదానికి ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సంబంధించిన సర్వకార్యములు సాక్ష్యములు

'1936 వ సంవత్సరములో ఉపాధ్యక్షుడుగా ఎన్నికైనపుడు తన నెలసరి వేతనము రెండు వేలలో తగ్గించుకొమ్మని సెనేట్ కోరినపుడు ససేమిరా యని అనంతరము కొన్ని నెలలకు ఆయనంతట ఆయనయే వేయిరూపాయలు తీసికొనుచు మిగిలిన మొత్తము విరాళముగా నిత్తునని వాగ్దానము చేసినాడు అది నేటికి ముప్పదిఆరువేలు అయినది

"ఈ విధముగా తాను త్యాగము చేయుటయేకాదు పైసయివ్వకుండ పనిచేయించుటలో కూడ ఆయన ప్రతిభావంతుడే ఆమాదిరిగా నాచేత కూడ చాకిరీ చేయించుకొన్నాడు ఇందులోను ఈయన పీను మిగిలినవాడే

ఆయన అదృష్టవంతుడు కాడనువారు అనాలోచితులు అదృష్టమన నశ్వరమైన అధికార పదవులని వారి భావనకాబోలు ఆయన అటువంటి వానికై అర్రులు చాచెడివాడు కాడని గ్రహించుట అవసరము

ఆయనది పరప్రత్యయనేయమైన బుద్ధికాదు ఇతరుల అడుగుజాడలలో నడచు జడుడు కాడు ఆయన ఆలోచనాపద్ధతి కార్యసరణి ఆయనదే

తన కభిమతమైన విద్యాక్షేత్రములో ఎల్లప్పుడు ఆయన ఉన్నత పీఠముననే ఉన్నాడు అంతర్విశ్వవిద్యాలయపు బోర్డునకు అధ్యక్షుడయినాడు భారతప్రభుత్వ విద్యాశాఖ సలహా సంఘము

...కు అంతర్విశ్వవిద్యాలయపు బోర్డు ప్రతినిధిగా ఎన్నుకొనబడినవాడు

ఎస్ రామన్ అను విద్యార్థి ఇట్లు వచించినాడు 'తరుణ హిందూదేశమునకు రూపురేఖలు దిద్దిన మహాశిల్పికి నా కానుక అర్పించుట కవకాశము కలిగించినందుకు ఆనందించుచున్నాను ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయపువారు విశ్వమంతయు తమ దేశని భావింతురు సరియైన కేంబ్రిడ్జివారివలె రెడ్డిగారు ఈ విశాల విశ్వమెవరిదని భావింపనే భావింపరు ఆయన వ్యక్తి స్వాతంత్ర్యమునకు ప్రాధాన్యము ఇచ్చువాడు అయినప్పటికి క్రమశిక్షణ ఆవశ్యకతను గుర్తించువాడు కాని ఆయనది సైనిక క్రమశిక్షణ కాదు ఉన్నత పథమున కరిగెడి క్రమశిక్షణ నవనవోన్మేషమైన ఆయన ప్రతిభ అధికమైన వ్యుత్పత్తి ఆయనను స్వయంభువుగా చేసినవి అందుచేత ఆయన సర్వ స్వతంత్రుడు అయినాడు ఈ స్వయంజ్యోతి మా యువజన లోకమునకు వెలుగుబాట నిచ్చి మాకు తరణోపాయము కలిగించును గాక !''

కొత్తా రామమోహనశాస్త్రిగారు ఇట్లు పలికినారు

రామలింగారెడ్డిగారి ప్రతిమలు (స్కెచ్‌స్) మూడు చిత్రించితిని ఈ ప్రతిభావంతు నాసీనుం గావించి చిత్రించుట ఎంత కష్టమో అనుభవమైనది

రాయ్ చౌదరిగారిచే నిర్మితమైన ఈ కంచు విగ్రహము రామలింగారెడ్డిగారు గొప్ప మేధావంతులు అను ఊహ కలిగించి ఆయన నిజతత్వమును నిరూపించును ''

జి వి యల్ యన్ మూర్తిగారిట్లు ప్రశంసించినారు 'ఒక గొప్ప సైంటిస్టు అధ్యక్షుతన ఒక గొప్ప విద్యావేత్త సన్మానింపబడుట ఆంధ్రవిశ్వవిద్యాలయ చరిత్రలో అపూర్వఘట్టము ఈ శుభసమయాన ఆంధ్రయువజనలోకము తరపున ప్రసిద్ధపురుషులైన మన విశ్వవిద్యాలయోపాధ్యక్షుని యెడ మా గౌరవాభిమాన

ములు వెల్లడించెడి అవకాశము కలిగించినందుకు ఆనందించుచున్నాను సుగుణరాశి అంతయుచేరి రామలింగారెడ్డిగారిని గొప్ప సన్మానము చేసెను తాను చదివిన కేంబ్రిడ్జియందుగల గౌరవాభిమానాలే ఆంధ్రవిశ్వవిద్యాలయ సృష్టి స్థితి పోషణలకు మూలకారణములైనవి రామలింగారెడ్డిగారు కేంబ్రిడ్జిలో పొందిన విజయాలు మనము వాల్తేరులో పొందకపోయినను ఆయనకు కేంబ్రిడ్జి ఎటువంటిదో, మనకు వాల్తేరు అటువంటిది ఏ విశ్వవిద్యాలయమైనను ఘనముగా ఉన్నదన్న అది దాని ఉపాధ్యాయుని శక్తి సంపదవల్ల విజ్ఞాన వితరణవల్ల ఈనాటి మన ఆంధ్రవిశ్వవిద్యాలయమువలె ఈ రెండు సమకూరినవి అరుదు ఈనాడు మన విశ్వవిద్యాలయపు పరిశోధనకు మూలము మన ఉపాధ్యాయులే ఇదంతయు ఆయన క్రాంతిదర్శనమువల్ల ఇదివరకు యువజనలోకము పరదాస్యముకై పెరపెరలాడెడిది కాని పరిశోధన చేయుటకు అవకాశమే లేదు ఈనాడంతయు తారుమారైనది ఎందరో పరిశోధన కొరకు విద్యార్థి వేతనాలివ్వబడుచున్నవి ఈ పరిశోధన కొరకు ప్రత్యేకమైన శ్రద్ధతో అధ్యాపకవర్గమును నియమించుచున్నారు ఎన్నో రంగాలలో పరిశోధనలు కావింపబడుచున్నవి ఈమహత్తర కృషి అంతయు ఆ మహనీయుని చలువ వలననే జరుగుచున్నది ఆంధ్రవిశ్వవిద్యాలయముపేరు ఎత్తకుండ రామలింగారెడ్డిగారి శక్తియుక్తులను గురించి ఎన్నైన చెప్పవచ్చునుగాని, ఆంధ్రవిశ్వవిద్యాలయము సంగతి వచ్చువరకు ఆయనను మనము స్మరింపకుండుట అసాధ్యము ఆయన ఇతర కార్యకలాపాలు అందరకు విదితమే వానిని పేర్కొనుట అప్రస్తుతము ఆయన రాజీనామాలేఖ ఎప్పుడును జేబులోనే ఉండునని నేము భయపడువారము నేడు ఆయనకు ఆ ఆలోచనలేదని విని అపరిమితానందము పొందుచున్నాను ఆంధ్ర యువజనవర్గము ఆయనను చూచుకొని గర్వించుచున్నది మా అభివృద్ధికి కన్నిటికి ఆయన అవకాశాలను కల్పించు

చున్నారు ఆయన సలహాలు సదుపదేశాలు మాకు వెలుగు బాటలు కాగలవు ”

ఇట్లనేకు లాయనను ప్రశంసించుచు ప్రసంగించినారు ప్రపంచమందలి విద్యావేత్తలు ప్రముఖులు మిత్రులు ఆయనకు శుభాకాంక్షలు తెలుపుచు సందేశాలు పంపించినారు

## డాక్టర్ సి ఆర్ రెడ్డిగారి సమాధానం

“అధ్యక్ష మహాశయా! సోదరీ సోదరులారా!

ఈ సందర్భములో నేను మాట్లాడుట సాధ్యముగాదు సముచితమునుకాదు విభిన్న పదవులందుండి భిన్నభిన్నమైన జీవిత మార్గములలోనుండి నామిత్రులు నా యందుచూపిన ఆదరములో తలమునకలైనాను ఈరోజు మనము సర్వప్రపంచ సంస్కృతికె దార్శనికులైన పండితులను కళకు సాహిత్యమునకు సంస్కృతికి అంకితమైపోయిన మహనీయులను కలిసికొనినాము అపారమైన వారి యందరి దయతోపాటు నా తమ్ముడు సబ్ జడ్జి బాస్కరరెడ్డి కూడ పాల్గొనుచున్నాడు నా హృదయము ఇందరి శుభాకాంక్షల భారముతో అవనతమైనది వారి కందరకు సర్వవిధశాంతిసౌఖ్యాభివృద్ధిని కాంక్షించు ధన్యవాదాలనెడి ఒక్క మాటమాత్రమే అనగలుగుచున్నాను ఈ సౌమనస్యమును ఇచ్చి పుచ్చుకొనుటకు నన్నుకూడ అంగీకరించకోరుదును కొన్ని కొన్ని రంగాలలో నా కృషి స్తుతిపాత్రమగుట నాకు ఆనందమును చేకూర్చినది రాజకీయాలలో భేదాభిప్రాయాలుండుటసహజము కనుక జయాపజయాలను అందులో నిర్ణయించుట కష్టము పదవి పొందినందువల్ల ఒకరు ఆధిక్యము వహింపవచ్చును మరియొకరు ప్రభావ ప్రసన్నతాద్వారమున క్రొత్త దృష్టికోణమును చూపగలరు వారు కాంట్ మహాశయుడు చేసినట్లుగా వేదాంత శాస్త్రాలకు రాజకీయాలు జోడించి న్యాయసూత్రమును న్యాయమును నెలకొల్పి

నూతనవిమర్శనను రేకెత్తించగలరు ఒక ప్రియసోదరుడు సహజ ముగా ఉండునట్లు నాతమ్ముడు నాయందు గాఢానురక్తుడగుటవల్ల నాపై ఒక విధమైన ఆత్మరక్షణశక్తితో మాటాడెను పార్టీలు నాకు స్వాగత మీయవనెడి అతని ఆలోచన సరియైనదికాదు వారు ఆపదలో ఉన్నపుడును, ఎదుటపక్షము ఎదుర్కొనినపుడును నాకై దిక్కులుచూతురు (హర్షము) కాంగ్రెస్ ఎన్నికలలో పోటీ చేసినపుడు బెంగుళూరులో నా వద్దకు నాలుగయిదు రాయబార ములు వచ్చినట్లు గుర్తు

దేశక్షేమము కొరకు ఆలోచనలు చేసెడి నాయకులు అంత తేలికగా తొందరగా అభిప్రాయ నాయకులుగా మారిపోరు అభిప్రాయాలు మంచి ఆలోచనలపై ఆధారపడవలెను కాని అభిప్రాయాలనగా కార్యాచరణ, పార్టీ సభ్యత్వము, ప్రచారము ప్రజలతో సన్నిహితత్వము ప్రతివానికి ఇష్టుడుగా రూపొందుట, రాత్రింబవళ్ళు ప్రజలను స్వీకరించుటకు అభ్యంతరము లేకపోవుట యిన్నమాట భావనాయకులు కొనసాగించు ఇట్టి స్వేచ్ఛాజీవనము మనలో కొందరు భరింపలేక పోవచ్చును పదవ్రులరాయుడు ఎప్పుడును పైచేయిగ ఉండెడి పక్షములో ఉండునని చెప్పవచ్చును నేను బలహీనులను వదలి బలవంతులను బుజగింతునని చెప్పుట సరికాదు బలహీనుల పక్షము వహించి బలవంతులతో పోరాడి నా శక్తిసామర్థ్యములను పరీక్షించుకొనుట నా కెంతో యిష్టము కష్టాల నెదుర్కొనుటలో కూడ ఆనందము కలదని నా ఉద్దేశము ఒకరిద్దరితో సత్యమార్గములో నిలువ సాహసించనివారు బానిసలు' అన్న క్రైస్తవ కళాశాల ఆశయముతో ఏకీభవించి కార్యసన్నద్ధుడ నగుటకు నాకు సహజసిద్ధమైన ఉత్సాహము కలుగును ఏమైనను ఇది ఒక సమరరంగము ఈ సమయంలో మీ దయకు, మీ కందరకు ధన్యవాదాలర్పించుచున్నాను

ఇతరమైన మరుభూములలో కంటె ఇక్కడ నిర్మాణాత్మకమైన కృషి జరుగుచున్నది ఈ కృషి, కాలము కూడ నిర్మూలించవేనట్టిది ఇది అనశ్వరమైనది దైవత్వ మొందినట్టిది ఒక ఉపాధ్యాయుడుగా, పరిశీలకుడుగా సంస్థ మూల కారకుడుగా స్థాపకుడుగా ఉన్నత గౌరవములు పొందక పోయినను కనీసము ఒక పరిపాలకుడుగా ఉండుటయే మహా నందము గర్వించతగ్గ విషయము నేను గొప్ప అదృష్టవంతుడ నని భావించుచున్నాను ఈ విశ్వవిద్యాలయమునకు నా సేవలు అంగీక రించబడు నన్నాళ్ళు నా జీవిత శేషము కూడ ఈ సేవకే అంకితము చేయవలె ననుకొనుచున్నాను నా మిత్రు లొకరు అన్నట్లు ఈ అరువదియ పడిలో ఈ ఉత్సవయు జరుపుట—మానవుడు తా నింత వరకు జీవితము నే విధముగా గడిపినాడో ఒక పర్యాయము సింహావలోకనము చేసికొని మిగిలిన కొద్ది క్షణాలను స్వార్థము కొరకు గాక దేశ సౌభాగ్యముకొరకు ఇంక ఎంత మంచిగ ఉపయోగించవచ్చునో తెలిసికొనుటకు మీ అందరి శుభాశీస్సు లతో, ఆకాంక్షలతో, సహకారముతో నేను ఈశ్వరాశీర్వచనా లతో ఇంకను కొంత చేయగలనని విశ్వసించుచున్నాను మరల మీ అందరి దయకు ఒక్కసారి ధన్యవాదము లర్పించుచున్నాను ఈ కాలము అతిశయోక్తులకు హెచ్చైన మెచ్చుకోళ్ళకు పెట్టిన పేరని నాకు తెలియును అయినప్పటికి వస్తుసంబంధమైన పలురకాలవలెనే ఈ మాదిరి విందులు వినోదాలకు తావున్నది కదా! నేను సన్య సించి దూషణచేసెడి సాధువునుగాను మానవమాత్రుడను కనుక, మానవత్వము నిండియున్నది కనుక, జీవితములోని మాధు ర్యము అనుభవించుటకు నేను వెనుకాడను

ముఖ్యముగా ఆంధ్ర విశ్వవిద్యాలయ సాన్నిహిత్యముతో నేను ఆనందించుచున్నాను దానితో సంబంధమునకు కారణ మే మైన కానిండు నే నొక విద్యావేత్తను ఆంధ్ర విశ్వవిద్యాలయ

ములో మొత్తము మీద గొప్ప అనువైన వాతావరణ మున్నట్లు తోచును అన్వేషణశీలురైన ఉపాధ్యాయు లున్నారు

సర్ సి వి రామన్‌గారు ఈ ఉత్సవములో పాల్గొనుటకై ఇంతదూరము వచ్చి వారి వ్యక్తిత్వము క్రాంతిని సభకు సమకూర్చి నందుకు ముఖ్యముగా వారికి ఋణపడియున్నాను

# సర్ సి వి రామన్‌గారి అంత్యోపన్యాసము

"నా అంత్యోపన్యాసము మిక్కిలి ముక్తసరిగా నుండవలె నని మీ కోరికయైనట్లు నే నూహించుచున్నాను రామలింగారెడ్డి తమ ప్రవృత్తిని గురించి సానునయముగా చెప్పినదానిని పేర్కొనకపోయిన నా కర్తవ్యము నేను నెరవేర్చనివాడ నగుదును చాల అద్భుతముగ అది నన్ను ఆకట్టినది దక్షిణదేశములో ప్రసిద్ధుడైన ఈ ప్రముఖుని జీవితపద్ధతిని ఈ శుభసమయమున ఆయన నోటినుండి వినుటకంటె అభిలషించదగిన విషయము మరి యొకటే మున్నది? ఆయన జీవితముతో ఆంధ్ర విశ్వవిద్యాలయము పెనవేసికొన్నది ఇంతకు పూర్వము రామలింగారెడ్డి చెప్పినట్లు ఆయన కార్యకలాపాలు విద్యారంగమున కంకితమైనవి రామలింగారెడ్డిని రాజకీయ పార్టీలవారు కోరలేదను దానికి సమాధానము లన్నియు విన్నాము ఏది అయినప్పటికి దక్షిణాన అన్ని రాజకీయ పార్టీలు ఆయనను రాజకీయరంగములోనికి రాకుండునట్లు చేసినందులకు మనము వారి కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించవలయును అందువల్లనే ఆయన తన సహజ ప్రకృతికి అనుగుణ్యముగ విద్యారంగములో కృషిచేసి యువజన లోకమునకు సహాయపడ్డాడు ఎన్ని విధాల యెంచి చూచినను విద్యకు సాటియైనది ఇలలో లేదు అంధకారమునుండి మనలను వెలుతురులోనికి తెచ్చినదెవరు?

విద్యాదీపము వెలిగించిన మహనీయులేగదా! రాజు లెందరు రాలేదు? వారి పేర్లు నిలిచినవా? జ్ఞానులే స్మరణీయులై నిలుతురు

రామలింగారెడ్డిగారు ఇప్పుడు మైననుకాకపోయినను ఆయన జీవితమును విద్యారంగమునకే అర్పణ చేసియున్నాడు కనుక ఆయన ఇకముందుకూడ అలాగే ప్రవర్తించవలసినదని కోరుదుము

ఇంతవరకు మీరు ప్రేమతోను ఓపికతోను విన్నందులకు నేను వందనము లర్పించుచున్నాను మీరు రామలింగారెడ్డిని ఆంధ్రుల కవితాత్మకు అనుగుణ్యముగా మీ సంప్రదాయాను కూలముగ ఆదర పురస్సరముగ సన్మానించినారు ఆంధ్రు లందరు కవులు తెలుగు సంగీతమునకై పుట్టిన భాష సంస్కృత ఛాయ లకు మీరు పోయినచో తెనుగు మాధుర్యము మటుమాయమై పోవును ప్రపంచములో రెండే మధురమయిన భాషలు ఇటాలి యన్ తెలుగు నాదసుధారసమూర్తి త్యాగయ్య గొంతుక తెలుగేగదా! ఈనాడు తెనుగుభాష ఆధిక్యమును గూర్చి అందరు ముచ్చటించారు దానికి సముచితమైన స్థానమును రెడ్డిగారివ్వగల రని ఆశించుచున్నాను ఆయనకు ఆంధ్ర భాషయందు అపరమి తాభిమానము గలదని అందరకు తెలిసిన విషయమే గదా! ప్రొఫెసరు విన్నా అప్పారావుగారు ఎం ఎ ఎల్ టి వందన సమర్పణ చేయుచు ఇట్లన్నారు

'నోబెల్ ప్రైజు పొందిన సర్ సి వి రామన్ అధ్యక్షు లకు వందలసమర్పణ చేసెడి సౌభాగ్యము కలిగినందుకు ఆనందించు చున్నాను ఆయనకు ఆంధ్రవిశ్వవిద్యాలయమందుగల అభిమానమే సుదూరమైన బెంగుళూరు నుండి ఈవాల్తేరునకు రప్పించినది ఆ మహనీయుడు మనయందరి మధ్యమున ఉండుట మనకందరకు మహద్భాగ్యముగదా! ఆంధ్ర విశ్వవిద్యాలయముతో ఆయన సంబంధము నిన్న మొన్నటిది కాదు దాని పుట్టుక నాటినుండి విక్రమదేవవర్మ నాచురల్ కాలేజి అవతరణకు అందులో 'ఫిజిక్సు లో

గౌరవాచార్యుడుండుట సెనేట్‌లోను, సిండికేటులోను సభ్యులై సముచితమగు సలహాలిచ్చుట ఇదంతయు ఆంధ్రవిశ్వవిద్యాలయము నకు ఎనలేని గౌరవము శైశవదశలో ఉన్న విశ్వవిద్యాలయము ప్రకృతిశాస్త్ర పరిశోధనలో ప్రసిద్ధి గాంచినదనగా వారేగదా కారకులు! ఇటువంటి మహాభాగునకు వందనములు పలుకుట మహాభాగ్యముగా భావించుచున్నాను

## నేషనల్ వార్ ఫ్రంట్ లీడర్‌గా

పూర్వ కాలమునాటి యుద్ధములు ఒక దేశమునకు మరొక దేశమునకు సంబంధము కలవియై యుండెడివి 1914 లో ప్రపంచ సంగ్రామము ప్రారంభమైనది జర్మనీదేశము యొక్క చక్రవర్తి విలియం కైజరు ప్రపంచమంతటిని జయింపవలె ననెడి తలంపుతో యుద్ధము ప్రారంభించినాడు ఆ యుద్ధము 1918 లో వర్సలీసు సంధివలన ముగిసిపోయినది

వర్సలిసు సంధిలో తన మాతృదేశమునకు ద్రోహము జరిగినదనెడి నెపముతో జర్మనీదేశపు నియంత హిట్లరు ప్రపంచము నంతటిని కైవశము చేసికొనవలెనని ద్వితీయ ప్రపంచ సంగ్రామము 1939 వ సంవత్సరమున ప్రారంభించినాడు చంఘీజ్‌ఖాన్ పైమూకలను మించిన ఘాతుక కృత్యములను సలిపినాడు అతనికి కుడి భుజముగా ఇటలీ నియంత ముస్సోలినీ నిలిచినాడు జపాన్ దేశము వీరి పక్షమున పోరాడినది

ఇంగ్లండు ఫ్రాన్స్, రష్యా ఈనాడు ఈ శక్తులను అణచి, ప్రపంచ శాంతికై మిత్రమండలిగా నిలిచినవి

జపాను, కాకినాడ విశాఖపట్టణములపైన 1942 లో బాంబులు వేసినది ప్రపంచ మంతయును సమర జ్వాలలో చిక్కొని యున్నది,

మన దేశములో కాంగ్రెస్ ముస్లింలీగు యుద్ధములో సాయ పడుటకు బ్రిటిష్ గవర్నమెంటుతో బేరములాడి విఫలత పొందినవి కాంగ్రెస్‌నకు అధినేత గాంధీమహాత్ముడు ముస్లింలీగునకు నకు జిన్నా నాయకుడు

ముస్లింలీగు మాట మన్నించక ముస్లిములు యుద్ధములోకి చొరబడిరి సిక్కు నాయకుడకు తారాసింగు సిక్కులను యుద్ధములో జేరుటకు ప్రోత్సహించినాడు వారును చేరినారు సిక్కుల యొక్క జాతియే ఒక వీరజాతి తారాసింగ్‌ను కాంగ్రెస్‌లోనుండి తొలగించినారు గొప్ప మేధావిగా పేరుపొంది ప్రపంచ ఖ్యాతి గాంచిన ఎమ్ ఎన్ రాయ్ 'యుద్ధములో పాల్గొనవలెను' అన్నందులకు ఆయనను కాంగ్రెసుసంస్థ బహిష్కరించినది

కమ్యూనిస్టులు రష్యా ఛత్రచామరముల క్రింద నుండుట జగత్ప్రసిద్ధము వారు రష్యా యుద్ధములో చేరగానే ఇది ప్రజాయుద్ధమని ప్రకటించి యుద్ధమున సహాయము చేయబూనినారు అరవింద ఘోషు నాజీలకు వ్యతిరేకముగ నిలిచినాడు

రామలింగారెడ్డి కూడ యుద్ధమునకు సహాయము చేయు నిమిత్తమై ఖద్దరుటోపిని ఖద్దరు దుస్తులను వేసికొని ప్రచారము సాగించినాడు

ఆయన 'నేను జీవనయాత్ర చేయుటకు రెండు కారణములు" అని చెప్పి వివరించినాడు 'మొదటిది ఆంధ్రవిశ్వవిద్యాలయము నందుండెడి ప్రేమ నాజీశక్తులను నాశనము చేయుటలో సహాయము చేయుట రెండవది " అని ఆయన జీవితాశయాలను వ్రాక్కుచ్చినాడు

నాజీశక్తుల నాశనమునకై వాడవాడల తిరిగి ఉపన్యాసాలిచ్చినాడు కరపత్రాలు ప్రకటించినాడు పత్రికలకు వ్యాసాలు వ్రాసినాడు యుద్ధసంబంధమైన సభలకు అధ్యక్షత వహించినాడు

1941 వ సంవత్సరము అక్టోబరు 17 వ తేదీన జరిగిన తిరునెల్వేలి యుద్ధ ప్రయత్న సభకు అధ్యక్షతవహించి 'నాజీశక్తులు-హిందూదేశ కర్తవ్యము అను అంశముపై ఉద్బోధకరముగా ఉపన్యసించినాడు

నాజీశక్తుల విజృంభణము ప్రపంచనాశనమునకు కారణము గనుక నాజీతత్వమును నాశనముచేయుట ప్రపంచ కర్తవ్యమని, హిందూదేశ కర్తవ్యముకూడ అదే అని సహేతుకముగా ఉద్ఘాటించినాడు

ఆయన ఈసందర్భమున గావించిన రచనలన్నిటను 'యుద్ధము కాంగ్రెసు అన్నది గొప్పది నాజీశక్తులను నాశనముచేయుటకై జరుగు యుద్ధములో హిందూ దేశము పాల్గొనకపోవుట గొప్ప పొరపాటని యుక్తి యుక్తముగా నిరూపించుటలో ఆయన తార్కికశక్తి ప్రస్ఫుటమైనది

'కాంగ్రెసువారు తామే దేశభక్తులమని ఇతరులు దేశద్రోహులని తలంపరాదు వారు ఇతరులను తమవంటివారుగనే భావించుట అవసరము సత్యాగ్రహముచేసి 'జైలు'నకు వెళ్ళుమని ఆదేశించుట నిజమైన సత్యాగ్రహమా ? ఐరోపాఖండము అగ్నికుండములో ఉండగా, సత్యాగ్రహము చేయుచున్నామని 'నోటీసు' ఇచ్చి, విందులు ఆరగించి పెండ్లికొడుకులవలె ఊరేగింపుతో సత్యాగ్రహము చేయుట సముచితమా ? ప్రపంచమునకు 'లిబరలిజమ్' ప్రసాదింపనున్న ఇంగ్లాండులోని అబలలు, బాలురు యుద్ధజ్వాలలో ఉండి ప్రాణము గుప్పిట పెట్టుకొని, 'ఏ నిమిషమునకు ఏ దారుణ ఘటన జరుగునో ! అని భీతావహులై ఉండగా సత్యాగ్రహము చేయుటా ? సత్యాగ్రహులు పడెడివి బాధలా ? ఈ బాధలు గమనింపుడు ! ఫ్రాన్సు, ఇంగ్లాండు పోయినచో మానవతా వాదము, ఉదారతా వాదము(Humanism, liberalism)

అన్నవి రెండును పోయినట్లే అవి రెండును అంతరించినచో బ్రతుకే భారము Both democracy and liberalism will go under, to me liberalism is more important than democracy and both of them, will go under, if Germany triumphs

ఉపసంహారము చాల అద్భుతముగా ఉన్నది 'సరే! ఒక వైపున ప్రపంచ ప్రసిద్ధుడైన మహాత్ముడు సహాయ నిరాకరణోద్యమమునకు అధినేతగా ఉన్నాడు సహకారోద్యమము వైపున ఉన్న నాయకుడు కూడ నా దృష్టిలో మహాత్మునకు ఈడు జోడైనవాడే ఆయనకు కూడ ప్రపంచ ప్రఖ్యాతి ఉన్నది ఆయన గొప్ప ఆధ్యాత్మిక పురుషుడుగా కూడ ఆరాధింపబడు చున్నాడు ఆయన ఎవరందురా! అరవిందయోగి! అరవిందుడు గౌరవభాజనుడు ఆత్మగౌరవము మంచిచెడలు నిర్ణయించగల శక్తి సంపూర్ణుడు కాడందురా! కనుక త్వరపడి ఉద్రేకముతో మాటలాడుట మంచిదికాదు కాంగ్రెసువారి వాదము భ్రమజనిత మని అనను నేను చెప్పునది అంతయు ఇతరుల అభిప్రాయాలు కూడ కాంగ్రెసు వారి అభిప్రాయాలవలెనే వివేకవంతాలని మర్యాద యిచ్చి మర్యాద పుచ్చుకొమ్మని మాత్రమే నేను కోరినది

'ప్రెసిడెంటు రూజువెల్టు రేపు ఈ కాంగ్రెసువారిని 'ఈ సత్యాగ్రహము మీ దేశ స్వాతంత్ర్యముకొరకా? లేక ప్రపంచ స్వాతంత్ర్యముకొరకా? అన్నచో ఏమి సమాధానము చెప్పుదురో! గొప్పవారికేగాదు, ఈశ్వరుడు అందరికిని బుద్ధి ఇచ్చినాడు దానిని తుప్పు పట్టించుకొనకుండ వాడుకొమ్మని మాత్రమే నేను కోరుట గొర్రెదాటుగా పోయెడివారు గోతిలోనే పడుదురు

"ఒక తరుణములో తమకెంత వ్యతిరిక్తత తటస్థించినను పౌరులు సహేతుక సంబంధములతో నిలుచుటకు తగిన నైతిక ధైర్యము లేనివారైనచో ఎట్టి ప్రభుత్వమును సక్రమముగా నడవజాలదు"

ఈ యుద్ధానంతరము మనకు స్వాతంత్ర్యము తప్పదు ఈ యుద్ధములో ఆంగ్లేయులు అంతరించినచో స్వరాజ్యము లేదు పురమే లేనప్పుడు అంతఃపుర మెక్కడ ?

ఎం ఎన్ రాయ్ స్పష్టముగా చెప్పినాడు "యుద్ధానంతరము ఆంగ్లేయులకు ఈ సామ్రాజ్యము తడిసి తల బరువగును తప్పక వారు సామ్రాజ్యము వదలుకొని తమ దేశమువరకే మూచు కొందురు" అని ఆయన అన్నమాట వాస్తవమైనది

రామలింగారెడ్డి ఎటువైపు వాదించినను ఆయన వాదములు మంచి తార్కిక బుద్ధి వుండితేను ఆయన మాటను అంగీకరింప వచ్చును, అంగీకరింపకపోవచ్చును కాని అవి మనలను ఆలోచనలో పెట్టక మానవు

ప్రపంచ వినాశనమునకు ఉద్యమించిన హిట్లరు ముస్సోలినీలు నశించిపోయినారు నాజీశక్తులు నశించి ప్రజాస్వామ్యము నేడు సోషలిజమువైపునకు పురోగమించుట గమనించదగినది

# వ్యాసమంజరి

సంస్కృతములో చంపూకావ్యములు కలవు చంపువు అనగా గద్య పద్యాత్మకము మన పూర్వ కవులు తమ రచనలను ఇట్లే గద్య పద్యాత్మకములు కావించినారు వానిలో గద్యము కూడ పద్యము ఛాయనే నడచినది

మధుర, తంజావూరు, మైసూరు మొదలగు సంస్థానముల ఏలికలు 17 18 శతాబ్దాలలో అనేక వచన గ్రంథాలను వ్రాయించుటే కాక స్వయముగా కొన్ని రచనలు చేసినారు అవి అయి

నను స్వతంత్ర రచనలు కావు గను* వానికి చారిత్రక ప్రాధాన్య మున్నంతిగా సాహత్య ప్రతిష్ఠ లేదు

పద్య కవిత్వమునకు పిమ్మటనే గద్యము ఆవిర్భవించుట జరుగున ఆంగ్ల సాహిత్యమునందును ఇట్లే జరిగినది

ఆంగ్ల సాహిత్య సంపర్కమువలన ఆ భాషలోని విరామ చిహ్నములను ఉపయోగించుచు చిన్నయసూరి నీతి చంద్రికను రచించినాడు కనుక ఈ నూతన గద్య గంగావతరణమునకు సూరి భగీరథుడే

చిన్నయసూరి వచనరచనకూడ నన్నయ గద్య రచన ననుస రించి జరిగినది ఆంగ్ల సాహిత్యములోని గద్యమువంటి సరళమైన వచగమునకు కారణభూతుడు వీరేశలింగము పంతులు ఆయన 'సాహిత్యము ఎందుకు ? ఎవరి కొరకు ? అని ప్రశ్నించుచాని ప్రజా ప్రబోధమునకై ఆంగ్ల సాహిత్య మర్యాద ననుసరించి ఎన్నో వచన ప్రక్రియలను మన భాషలో ప్రవేశపెట్టి గద్యతిక్కన అని ఖ్యాతి గాంచినాడు ఆయన గద్యయుగ నిర్మాత కేవల గద్య యుగ నిర్మాతయే కాదు, ఆధునిక సాహిత్య యుగ పురుషుడు

రెడ్డి వ్యాసమంజరి అయిదు భాగములుగా విభజింపబడినది పూర్వఖండము అభిజనఖండము భాషాఖండము, ఆధునిక కవితా ఖండము సాంఘిక ఖండము అనునవి అవి ఇన్నిటను ఒక్కొక్క క్రొత్తతెన్ను కనబడును ఆయన రచన, సంభాషణ ఏకరీతిగా నుండును ఆయన ఎంత ఆధునికుడైనను చిన్నయసూరి శిష్యుడు

కాబట్టి రామలింగారెడ్డి రచన సర్వము గ్రాంథికమే అయిన నేమి ? ఆయన గద్యము ఇంపు సొంపులు గలది మొగ మోటమి లేక విషయానుగుణ్యముగా వ్రాయుట ఆయన ప్రత్యేకత రెడ్డి హాస్యకుశలుడు అని లోక మెరుగును ఆయన మాటలలో వలె వ్రాతలోను సున్నితమైన ధ్వని, మర్యాద హాస్యరేఖలు

ఉండును గద్య రచనలో ఆయన మరియు గడుసరి వ్యాకరణము కంఠతః పట్టినవాడు కను సర్వము సలక్షణము

ఆయన వ్యాసమంజరికి ఉపోద్ఘాతము వ్రాయుచు శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు పేర్కొన్న కొన్ని విశేషములు ఇవి

'విమర్శనలలో వీరి కెంత ప్రాధాన్య మున్నదో వ్యాస రచయితలలోను నంత ప్రాధాన్య మున్నది సాహిత్యాంగముగా బరిగణింపఁదగిన వ్యాసరచన ఆంగ్ల భాషలోవలె మన భాషలో ఇంకను బరిణతావస్థకు రాకున్నను జరిగినంతవరకు దాని పెంపు నకుఁ గారణభూతులైన విద్వాంసులలో వీ రొకరు గ్రంధములకు బీఠికలు వ్రాసినను, పత్రికలకు వ్యాసములు వ్రాసినను తాత్త్విక ముగా విషయచాలన మొనర్చి పటుత్వము గల భాషలో సోప పత్తికమైన సిద్ధాంతము చేయు నేర్పు వీరి వాక్కునకు సహజ గుణము వీరి వ్యాసములకు ఇదియే ప్రథమాలంకారము రెండవది వీరి శైలి వీరి వ్యాసములలో అర్థ మెంత గంభీరముగానుండునో శైలియు అంత సురుచిరముగా నుండును ఆ శైలియు విషయ భేదమును బట్టి ఒక్కొకచో తార్కికముగా మారుచుండును ఏ రూపము తాల్చినను దాని పటుత్వము, సొగసుదనము పోవు నన్నయ సూరనలను ప్రశంసించుచో శైలి యెంత అలంకార ముగా నున్నదో తాతతంత్రముల ముచ్చటలు చెప్పుచో అంత ప్రాస్తావికముగా నున్నది ఇన్ని అవాంతర భేదములు చెందు చున్నను, దానికి ఆత్మీయమైన మూల ధర్మము విడవాడదు వీరి శైలికి ఆత్మీయాంశము బుద్ధిగమ్యత "

వీరి వ్యాసమేలలో కొన్నియైనను గ్రంథరూపము దాల్చు టకు సంతోషము దీనివల్ల భాషకేకాక పాఠకులకును పరమ ప్రయోజనము.

# భారత భాగవత రామాయణ పరామర్శ

భారత భూమిలో ఆంధ్రులు వంగీయులు ఏకగుణ సంపన్నులు ఈ రెండుజాతులు ఉద్రేకముగలవి ఉద్రేకము కవితకు ప్రాణము బుద్ధిబలముకంటె హృదయబలము అధికము వీరిలో హృదయబలము స్త్రీ సంబంధమైనది స్త్రీ కుటుంబ సంబంధము లోనిది గాంభీర్యము వైపునకు గాక లాలిత్యము వైపునకే వారికి మక్కువ ఎక్కువ

ఆంధ్రులలో ప్రధానముగా ఉన్నది హృదయబలమే అనగా స్త్రీ సహజమైన లలితగుణాలే మనది స్త్రీ ప్రకృతి మనకే కాదు కళాకారులందరికి ఈ స్త్రీ ప్రకృతియే ఎక్కువ కళలు హృదయ సంబంధమైనవి కళకు ప్రాణమైన భావలోలత స్త్రీల సొత్తు స్త్రీ జీవిత మంతయు కళామయమే అందుచేతనే స్త్రీ ప్రకృతి గల వంగీయులును, మనమును లలితకళారాధనలో ఖ్యాతి గాంచినాము

మనము అచ్చముగా కవులము అందుచేతనే మన దృష్టి వాస్తవమునకు భిన్నముగా నుండును కనకనే రాజకయముల లోను పరిశ్రమలలోను మనము సఫలత గాంచలేము

భారతదేశము భక్తి ప్రధానమైనదేశము కాబట్టియే రామాయణము భారతభూమిలో ఖ్యాతిగాంచినది ఉత్తర భారతమున బహుళవ్యాప్తిగాంచినది తులసీదాసు రామాయణము పండిత పామర భేదము లేకుండ అక్కడ పాడుకొనునవి తులసీదాసు గేయాలే వంగీయులు కృత్తివాసరామాయణమును పారాయణము చేయుదురు అరవలు కంబరామాయణమును ఆదరింతురు ఆంధ్రులకు ఇష్టదైవము రాముడైనను, వారి అభిమాన గ్రంథాలు భారత భాగవతాలే రససిద్ధులైన కవులు వానిని రచించినారు అన్యులను

ఈ రెండింటను మించినాము మనము అందుచేతనే అనేక రామా యణములు ఆంధ్రములో అవతరించినవి వానిలో శ్రేష్ఠమైనవి భాస్కరరామాయణము రంగనాథ రామాయణము మొల్ల రామాయణమును

మన ఆదికవి అని ప్రశస్తి గాంచిన నన్నయ వాల్మీకి వంటి వాడు ఆయనది ప్రసన్న కథాకలితార్థ యుక్తియేకాదు అక్షర రమ్యతయేకాదు ఆయనతో సంబంధించినది అంతయు ప్రసన్న మైనదే ఆయన ఆదికవి వాల్మీకివలె ఋషి ఆయనను విప్రుడు శబ్ద శాసనుడన్నారు భద్రకుంజరమన్నారు ఆంధ్రకవితా విశారదు డన్నారు అమృతవాక్కుల నన్నయ్య ఆయన శయ్యా ఒయ్యా రములో ఆయనను మించినవా రరుదు

నన్నయ వాల్మీకి అంతటివాడు కాగా తిక్కన వ్యాసుని అంతవాడు తిక్కనను ఉభయకవిమిత్రుడు కవి బ్రహ్మ అని అన్నచో ఆయనను మనము అర్థము చేసుకోలేము ఆయన నవీన పరాశర సూనుడని ఆయనకు ఆంతరంగిక శిష్యుడును పరమ భక్తు డను అగు మారన అన్నమాట మన్నించదగినది తిక్కనకు అన్వ యించు ఆ విశేషణము వ్యాసుడే మరొక అవతారము దాల్చి ఆంధ్రభారతమును పూరించెనని సూచించును

తిక్కన గొప్పతనము గాంచవలెనన్న శాంత్యానుశాసనిక పర్వాలను చూడవలెను ఉద్యోగ పర్వములో ఆయన లోకజ్ఞ తను కావ్యకళానిపుణతను గాంచగలము భారతము కావ్యమే అనిపించు ఘట్టమది ఈ శాంత్యాను శాసనిక పర్వాలలో గూడాతి గూఢ మైన తత్త్వ విషయములు పొందుపడ్డవి కాబట్టి, అవి అచ్చముగా వ్యాసఘట్టములు తిక్కన అపరవ్యాసుడనుటకు ప్రబల నిదర్శనము అంత తేటతెల్లముగా తత్త్వము వివరించుట ఆయనకే చెల్లును

అలతి అలతి తెలుగు పలుకులను కులికించి ఆ బాసకు ఒక పెద్దఠీము కూర్చి పెట్టినాడు తిక్కన సొగసైన తెనుగు నుడికారము ఆయన సొమ్ము ఒక్క మాటలో చెప్పవలెనన్న తిక్కన తెనుగుమీరినాడు తెలుగు మెరుగు లెరిగినవారే ఆయనను ఎరుగుదురు సంస్కృత పండితులకు కొరకరాని కొయ్య తిక్కన

భారత భాగవతాలలో కిష్ట ఘట్టాలు వ్యాస ఘట్టాలని వేరు తిక్కన భారతములో అటువంటి ఘట్టాలనేకాలు ఆ గ్రంథ గ్రంథులను గ్రహించవలసినవారు తెనుగుమర్మము తెలిసినవారే

తిక్కన కళానైపుణ్యమును అందరును అర్థము చేసికొనలేరు 'కళాగోపనమే కళ' అన్నది అక్షరాల ఆయనయెడ చెల్లును

నన్నయ ధార్మికుడైన లోకజ్ఞుడు తిక్కన లోకజ్ఞుడైన ధార్మికుడు ఆదికవిది అక్షర రమ్యత సోమయాజిది అర్థగౌరవము శబ్దశాసనుడు గద్యమును పద్యపద్ధతితో నడపగా ఉభయకవిమిత్రుడు పద్యమును గద్యముగా నడపినాడు తిక్కన రచన అంతటను విరుపులే అందుచేతనే 'భారతము చదువుటకు కష్టము భాగవతము అర్థముచేసికొనుట కష్టము' అను నానుడి పుట్టినది నన్నయ తిక్కన లిద్దరును యుగధర్మమును పాటించినవారే నన్నయకు భారతమునం దభిమాన మధికము తిక్కనకు వ్యాసుని యందు భక్తిమెండు

నన్నయ తిక్కనల సాహిత్యస్రవంతులకు సేతువు శంభుదాసుడు ఆయన ఉభయకవి మిత్రుడు

నన్నయది ప్రసన్నకథా కలితార్థయుక్తి తిక్కనది నాటకీయధోరణి ఎఱ్ఱనది ప్రబంధ మార్గము ఈ ముగ్గురు మూడు మార్గాలకు మూలపురుషులై కవిత్రయముగా ప్రసిద్ధి గాంచినారు

భారత భాగవత రామాయణాలలో భారత భాగవతాలను పండ్రెండేండ్ల వయస్సునందే బాగుగా చదువునట్లు రామలింగారెడ్డికి ఆయన తండ్రి శిక్షణ ఒసగెను

రామాయణమునందు రక్తి వారి తండ్రికే తక్కువ "తెనుగుదేశములో భక్తుంకెత్తి వచ్చిన గ్రంథము భాగవతము విషయము వారి కింపైనది శైలియన్న దాసరిపాట మంటానాదము వలె రింగురింగని యుండెనేమొ!" అని హేళన చేసినాడు

"చవి, సారము లేని ప్రాంతములకు దారి చూపునది రామాయణము భరతుఁడు మొదలగువారు నిర్వికల్పులు భారత వీరులు సవికల్పులు మనుష్యులు, దాయయంత్రములు గారు"

'భారతము పునఃపునః పారాయణము చేయించి, వారు నాయందు సాహిత్య రసజ్ఞతను పుట్టించిరి" అని చెప్పుకొన్నాడు తన తండ్రినిగురించి

రెడ్డికేకాక ఆంధ్రులకందరకు భారతము అభిమానగ్రంథమే వస్తుగుణము, కావ్య గౌరవము అధిక మగుట చేతనే 'వింటే భారతం వినాలి అని నామెత పుట్టినది కవిత్రయమును మించిన వారిని కానము

'విషయము, శైలి గ్రంథరచనకు ప్రాముఖ్యము వహించునవి రామాయణముకంటె భారతము ప్రజామోదము పొందుటకు కారణము శైలి మానవస్వభావ మీ గ్రంథరాజమున నెంత చక్కగా నెంత గంభీరముగా నెత్తి చూపఁబడినదో యది తలంపునకు రావచ్చునేమో కాని నాల్కకు వచ్చుట దుర్లభము విషయము కన్న రీతి శిల్పముఁ బ్రధానము కవిత్వమునకు ప్రధానమైనది భావనాశక్తి భావనాశక్తి నాటక కౌశలముతో నను సంధించి యుండును అనగా పాత్ర చిత్రణ మన కన్నుల యెదుట కన్పింపఁ జేయుట"

భారతము రెడ్డికి ప్రాణప్రదమైన గ్రంథము ఏ కొంచెము అవకాశము చిక్కినను భారతము చదివెడివాడు భారతము ఎన్ని భాషలలోనికి అనువదింపబడినదో అన్ని భాషాగ్రంథములను తెప్పించి

ఉంచికొన్నాడాయన భాష తెలియకపోయినను భారతమం దభిమానము వల్లనే

భారత ప్రాశస్త్యమును ఈయన బహు భంగుల చెప్పినాడు కవిత్వ తత్త్వవిచారములోను రాజారాజ నరేంద్రుని వర్ధంతి మహోత్సవ సందర్భమున అధ్యక్షత వహించినపుడును కవిత్రయములో వారిక నచ్చిన కవి తిక్కన ఆయనను కారణ జన్ముడని ఉగ్గడించినాడు తిక్కన గొప్పతనమును గురించి చెప్పుచు కొందరి వలె నన్నయ ఎఱ్ఱాప్రగడల నాయన ఈసడించలేదు

"నన్నయ్య యొక్క శైలి మిక్కిలి మనోహరమైనది అనన్యతుల్యము దానివంటిది తెలుగులో లేదు సంస్కృత పద భూయిష్ఠమై యున్నను నర్థకారిన్య మేమాత్రము లేనిది అతడు ప్రయోగించిన తత్సమములు ఇతరు లనేకులు వాడు తెలుగు పదములకన్న శబ్దమునందును, అర్థమునందును సరళములు సాధారణముగా సంస్కృతపదములను సమాసములను ప్రయోగించువారు ఆడంబరములను ప్రకటింతురు నన్నయ్య యొక్క జాలనేమనగా తత్సమ పదభూయిష్ఠమైన శైలిని మృదుత్వము మాధుర్యము మొదలగు కోమలములైన గుణములతోను సంయోగము స్థాపించుట ఆ మాహాత్మ్య మితనియందట్లు ఎఱ్ఱనలో కలదు నన్నయలో సంస్కృతి కావ్యములు తరచుగా గలవు అవియు పద్యమును గంభీరముగ శబ్దించునట్లు చేయునుగాని, విషయ వైశద్యమునకు అర్థస్పష్ట్యమునకు నే మాత్రము భంగకరములు కావు

'భావములు పొంగి పొరలునట్లుగా నన్నయ తప్పఁ దక్కనకవులు వ్రాయుదురు కష్టములెన్నియున్నను గాంభీర్యమును వదలినట్లు నన్నయ పాత్రములఁ బ్రదర్శింపడు భావప్రకటనము అమితముగాఁ జేయడు మఱి వాని ప్రవాహమున కడ్డుగ 'గమన తనమును బలింతపుఁగట్ట" గట్టియుంచును దీనిచేత వాని భాగము లోని స్త్రీ పురుషులు గంభీర స్వభావులుగఁ గనబడుదురు "గంగ

పాఱుచుండుఁ గదలని గతితోడ ముఱికికాల్వ పాఱు స్రోతతోడ" నన్నయయొక్క నాయికా నాయకులు గంగవంటివారు అగాధమైన భావమును దమముచే నిగ్రహింపఁ బడిన భావప్రకటనము గలవారు ఈ లక్షణము నన్నయ పాత్రలయందున్నంత సాంద్రముగ నితరకవుల పాత్రలయందు లేదని నా నమ్మకము అట్లనుటచే నా యితరులకు లఘుత్వారోపణము సేతగాదు పాత్రముల ప్రవృత్తి ననుసరించి భావప్రకటనము మితముగాఁ జేయవలయునో, యట్లుగాక హద్దుపద్దులేని అనర్గళ ధారగాఁ జేయవలయునో నిర్ణయింపవలయును జనమేజయుని గూర్చిన ఒకానొక సంభాషణములో 'మితహితసత్యవాక్య" మని నన్నయ వ్రాసియున్నాడు మితవాక్యుఁడుగా నుండుట గొప్పతనము గలవాని లక్షణమని తన యభిప్రాయమని నిరూపించుటకు నితర సాక్ష్యములును ఉన్నవి తన వాలికి వచ్చిన స్త్రీ పాత్రములు సయితము గంభీరవర్తనులు శకుంతల దమయంతి మొదలగు మహాత్ముల గరువ తనమునకు నన్నయయొక్క మితభావ ప్రకటనములకు ఎంత చక్కఁగ నన్వయము కుదిరెనో రసికు లాదరింతురుగాక

'నన్నయ్య తిక్కన్నల రీతులు పరామర్శించుట కనుకూలములైన ఘట్టములు రెండు ఒకటి ఆదిపర్వములోని కణికుని రాజనీతియు ఉద్యోగపర్వములోని విదురనీతియు నాకుంజూడఁ దిక్కన యీ సందర్భమున నన్నయను ఆదర్శముగా నిడుకొని వ్రాసియుండునని తోఁచును ఈ రెండుఘట్టముల యసామాన్యలక్షణము లేమనగాఁ గందపద్యము లెక్కువ నీతికఁగందము అనుపానము గాబోలు సొగసైన సామాన్యోపమానములు మెండు

'భావప్రకటనలో ఎట్టనకు, నన్నయకు నుండు తారతమ్యమే తిక్కనకు నన్నయకు నుండు నట్లున్నది తిక్కనయొక్క ద్రౌపది డగ్గుత్తికతో వెక్కివెక్కి ఏడ్చుచు మనకు దుస్సహసంతాపము గలిగించు చున్నది నన్నయయొక్క ద్రౌపది తన్ను తా నుపశమించు కొనుచు, తనకును ఆఁపరాక వెలికివచ్చిన శోకము

మాత్రముఁ జూపుచు ఆమెయొక్క గురువతనముచే మనమెప్పు నాకర్షించెడిది మఱియుఁ దన చింతతోఁ బ్రారంభించినను భీమ సేనునికిఁ, దక్కిన భర్తలకునుఁ గలిగిన కష్టములను మఱవరేమ పాశి పల్లవంబుల నయన సమ్మార్జనంబు చేయుచు 'నను వర్ణనము ద్రౌపదిదేవియొక్క పరివేదనా తత్త్వమూర్తిని మన కన్నుల యెదుట సాక్షాత్కరింపఁ చేసెడునుగదా! ఎట్లును శృంగారము శోకము మున్నగు రసముల వర్ణించుటలో మహాకవులయిన కవి త్రయమువారు మొత్తముమీఁద మితము ననుసరించి చిత్రిం తురు విపరీతపు మాటలకుఁ జేష్టలకు నెడమీయరు కీచకుని కామము వర్ణించుటలో దిక్కనపచ్చిగా వ్రాసియున్నాఁడు కాని యది వాని నీచతను విశదపరచుట కని తానే తెలిపియున్నాడు కవిత్రయము వారి పాత్రము లాత్మనిగ్రహములేని మృగప్రాయ ములు కావు

'నన్నయ కవిత్వము యొక్క జీవకళ లెయ్యవి? అనఁగా నే గుణము తక్కిన అవయవముల కన్నిటికిఁ జైతన్యమును దేజ స్సును నిచ్చి ప్రధాన తత్త్వమై శోభిల్లుచున్నది? నాకున్ జూడ గాంభీర్యము గాంభీర్యమను నది యితని శైలి యొక్క ప్రాణము అట్లనుటచే శైలి ఏకగతిని వహించిన దనుట గాదు సందర్భానుసారముగ నన్నయ యొక్క శైలి మనోహరముగ మాఱుచుండును అయినను గాంభీర్యము వదలదు

"నన్నయ 'గురు పద్య విద్యకు నాద్యుం డగుట కాదు, గద్య విద్యకు నా తండు ఆద్యుండు ఆంధ్రమున వచన మితండు వ్రాసినంత మనోహరముగ వ్రాసినవా రొరులు లేరు చిన్నయ యితని జూచియె తన రమణీయమైన మిత్రలాభము రచించి యుండునని తోఁచెడిని" (అధ్యక్షుని వచనము నుండి)

భారతముపై విపుల వ్యాఖ్యానము వ్రాయవలె నని అన్నాడు రెడ్డి

క. దానికి నా నేర్చిన వి
ద్యా నిపుణత కొలదిఁ జేయ నాంధ్రంబున వ్యా
ఖ్యానము యథార్థ సం వి
ద్దాన విధానముల నవ్య కళ లేర్పడఁగన్

అని అన్నారేగాని ఆ అదృష్టము ఆంధ్రులకు కలుగలేదు

భారత భాగవతములను సవిమర్శనముగా చదివి వానిలోని పరస్పర విరుద్ధాలయిన ఘట్టములను ప్రాచీనములు వికృతులు అను పేరున ప్రకటించినాడు రెడ్డి భారతము అనంతరము బహుకాలము నకు భాగవతము వ్రాయబడినదని అందులో నిరూపించినాడు భాగవతము వ్యాసప్రోక్తము కాక బోపదేవుని రచన యని దయా నందస్వామి అభిప్రాయము

రామలింగారెడ్డి భారత రామాణములలోని ప్రధాన పాత్రలైన ద్రౌపది, సీతలను గురించి విమర్శనాత్మకమైన ఒక వ్యాసమును ప్రకటించినాడు "సీతయు ద్రౌపదివలె లోక హృదయ హారిణి అయినను ఇంటి దీపము జగజ్జ్యోతి కాదు సభలకు బోదు అట్టి వానిలో ప్రసంగించుటకు శక్తి, రక్తి రెండును లేని గృహిణి వాద ప్రతివాదములకు సంఘర్షణ ప్రతిఘటనములకు అనుకూలమైన వచనశైలికి ఆమె పనికిరాదు శుద్ధ వేలపిండి! బెల్లపుముద్ద అల్లములేదు ఆమె నిర్మాణములో మిర్యము లంతకు మున్నె లేవు ద్రౌపది అన్ననో యీనాటి అమెరికా దేశపు నాయకురాండ్రను దాసిత్వ భాసిత నీచత్వస్థితిగతులని శోఁచింప జేయునంత స్వతంత్రురాలు

ఈ స్వతంత్ర్యమున కాధారము ఆమెయొక్క ధర్మాధర్మజ్ఞత వివేకము రాజనీతి నైపుణ్యము జ్ఞానసంపద ధీరత్వము, మహోన్నత శీలము, సర్వజన హృదయా

కర్షక ప్రభావమును ఆమె తన భర్తలను మందలించినను క్రమాతీతమని వారు నెంచరు ఎవరును నెంచరు ఆమె అనన్యోపమూర్తి నిష్కళంక అట్టివారిని దమయంతవారేగాక ఎల్లరును ప్రేమింతురు గారవింతురు పూజింతురు లోకారాధ్యమూర్తులు వారియందు లోకమంతయు సాయుజ్యనుంద గోరును తన జీవితము తన సుఖముకొరకై తానెన్నడు వినియోగింపలేదనియు, ధర్మోద్ధారణమే తన పరమాదర్శమనియు స్పష్టమగుచున్నది కావుననే ఈ పెంకుటింటిలోననేకాదు, లోకమునందును వ్యాపించినది పూజనీయత పండితహృదయమున కంటెం బామర హృదయములందు సత్యనిర్ణయశక్తి ఎక్కువ దీనిక దార్కాణ వేఱొకొలఁది గ్రామములలో ద్రౌపది దేవతగాఁ బూజింపబడుటయు నేటికి నుత్సవములతో నర్చింపఁ బడుటయును"

రాయలసీమలో అధికముగా ద్రౌపదిగుళ్ళు గలవు వారి స్వగ్రామము కట్టమంచిలో గలదు ఆ ప్రభావము ఆయనమీద లేకపోలేదు భారతమును రసదృష్టితో వీక్షించినవాడు రామలింగారెడ్డి ఆ రసదృష్టిని పెక్కురకు కలిగించినాడు కూడ

రామాయణము భారతము, భాగవతము మొదలగువానిలో నదివరకు ప్రమాణములను శంకించి నూతన ప్రమాణములను కల్పించి యితరులను ఆలోచించునట్లు చేసినాడు రామలింగారెడ్డి

తాను ప్రతిదానిని స్వతంత్రముగ ఆలోచించి, యితరులను కూడ ఆలోచించునట్లు చేయుటయే ఆయన ప్రత్యేకత పుట్టుకతోనే కొందరు కవులుగా పుట్టినట్లు ఆయన విమర్శకుడుగా పుట్టినాడు

"పౌరుషము కలవారు విమర్శకు కారణశక్తి నిర్భయ హేతువాదము వీనింజూచి జడియురు దైన్యమున గుడుచు శుష్కసత్త్వులకు నన్యశాసితములగు నాచారాదులు (ప్రధానములు) స్వాతంత్ర్యములేని వారగుటచే స్వేచ్ఛాప్రయోజన ప్రాగల్భ్యము వారికి నలభ్యము ఇక విమర్శనము కారణానుసార ప్రచారము,

ఇవి ఎచ్చటివి ?" అని విమర్శనలేని శక్తిని గురించి ప్రశ్నించు చున్నారు

అన్నిటను ఆయనది క్రొత్తచూపు ఆయన వాదముతో అంగీకరించినను, అంగీకరించకపోయినను ఆయన రచనలు వాద ప్రతివాదములకులోనై అధిక జనులను ఆలోచించునట్లు చేసినవి

## గద్యములో గణనీయుడు

పద్య విద్యకేగాక గద్య విద్యకు నన్నయ ఆదిపురుషుడు ఆంధ్రమున ఆయన వ్రాసినంత మనోహరముగ గద్యమును వ్రాసినవారు లేరనుట అతిశయోక్తి కాదు

చిన్నయసూరి ఆధునిక గద్యకవితకు ఆద్యుడు

ఆంగ్ల వచనము ననుసరించి సరళ వచనము సృష్టించినది గద్యతిక్కన వీరేశలింగము

ఆయన సహచరుడు చిలకమర్తి లక్ష్మీనరసింహము ఆ సారళ్యమునకు సౌకుమార్యము చేకూర్చెను

మృదు మధురమగు గద్యమును వ్రాయుటలో శ్రీ వేలూరి శివరామశాస్త్రి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగార్లు ప్రఖ్యాతులు

రామలింగారెడ్డి ఆంధ్ర భాషాభిమాని 'మా వంశమున కేది వచ్చిన రానిండు తెనుగుభాష యొక్కటి యక్షయముగ నిలిచియుండిన జాలును " అన్నవాడు ఆంధ్ర భాషాభిమానము ఆంధ్ర విద్యార్థులకు కలిగించిన మహనీయమూర్తి

మన విద్యాధికులలో కొందరు ఆంగ్ల భాషలో ఉద్దండ పండితులు మాతృభాషలో నోరు విప్పలేరు రెడ్డి ఉభయభాషా ప్రవీణుడు

తేనియ లొలుకు పలుకులను పలుకుటలో ఆయన అఖండుడు

భావగరిమకు సరిపడు భాషను ప్రయోగించుటలో రెడ్డి గొప్పవాడు తెలుగు సొగసులు జాతీయములను వాడుటలోనే కాదు, క్రొత్త జాతీయములను నిర్మించినాడు

కొండంత భావమును కొద్ది మాటలలో చెప్పుటలో రెడ్డి గొప్పవాడు తృప్తి సుప్తి యుక్తి శక్తి ఇత్యాదులు

ఇట్లు సూత్రప్రాయముగా చెప్పుటలో చిన్నయసూరి గడు సరి ఆయనకు అభిమానపాత్రుడగు తిక్కన కూడ గొప్ప భావమును కొద్ది మాటలలో చెప్పినవాడేగద! అల్పపు మాటలలో అనల్పమగు భావము చెప్పుటేగద కవి వివేకము! ఆ వివేకము రెడ్డిలో సమధికము

ఆయన గద్యరచనలో వాక్యాంతము లద్భుతములు ప్రతి వాక్యములోను ఆయన వ్యక్తిత్వము అచ్చుగ్రుద్దినట్లు కనబడును

లేఖలకు ఆయన సాహిత్య గౌరవము చేకూర్చినాడు బంధు మిత్రులకు వ్రాసిన ఉత్తరాలలో కవితారసపు జల్లు అధికము తెన్నేటి విశ్వనాథముగారికి వ్రాసిన లేఖలను ఆయన విస్మయము చెంది ప్రచురించుటకు అంగీకరించవలసినదిగా కోరెను

కొందరు కవిత్వము వ్రాసి కవులనిపించుకొనిరి 'కవియై పుట్టినవాడు వేంకన అన్న చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి జీవితమే కావ్యము స్వీయజీవితము ఒక మధుర కావ్యముగా మలుచుకొన్న మహా రసికుడు మన రెడ్డి జీవితమును మించిన కావ్యము, సత్యమును మించిన శిల్పము లేదన్నారు రామలింగారెడ్డి పలుకులన్నియు పసందైనవే

# ఆంగ్ల సాహిత్యములో ఆయన స్థానము

మన భారతభూమిలో కవులు సంస్కృత ప్రాకృతములు చదివివాని నాధారముగా చేసికొని దేశభాషలలో రచనలు చేసిరి

భరతఖండమున విశ్వవిద్యాలయము లేర్పడిన పిమ్మట ఆంగ్ల భాష వ్యాప్తిగాంచినది దీనివల్ల భారతాత్మ నశించిన దనువారు లేకపోలేదు వారు ప్రాతదంతయు మంచిదను పౌరాణిక యుగము నకు చెందినవారు భారతదేశములో జాగృతి ఆంగ్ల భాషా ద్వార మున కలిగినమాట వాస్తవము ఆంగ్ల భాషా సంస్కారమువలన దేశభాషలలో చైతన్యము విస్తరించినది

మన ఆంధ్రదేశములో ఆంగ్లసాహిత్య ప్రభావప్రేరితుడై వీరేశలింగము సాహిత్యములోను, సంఘములోను నూతనమార్గ ముల త్రొక్కిరి ఆయన మన ఆధునికాంధ్రదేశపిత

ఆంగ్లములో మన భారతీయులు అనేకులు కవిత చెప్ప ఖ్యాతిగాంచిరి తోరూదత్తు అరవిందయోగి, విశ్వకవి రవీంద్రుడు దిలీప్‌కుమార్ రాయ్, సరోజనీదేవి హరీంద్రనాథ చటోపాధ్యాయ మొదలగు వంగదేశీయులు, దివాన్ బహదూర్ కె యస్ రామ స్వామి శాస్త్రి పి శేషాద్రి మొదలగు తమిళులు జిడ్డు కృష్ణ మూర్తి వేంపటి నాగభూషణము, సోమనాథ వెల్లటూరు ప్రభృతు లగు ఆంధ్రులు విఖ్యాతి గాంచిరి

మన రామలింగారెడ్డి ఛందోబద్ధముగా కవిత చెప్పక పోయినను గద్యరచనమున అద్భుతకౌశలము చూపిన కొద్దిమంది ప్రపంచ రచయితలలో ఒకరు భర్కుపద్యములు వ్రాయలేదు కాని ఆయన రచనలు కవితామయములు కార్లైలు, ఈ శ్రేణికి చెందిన వాడే సరోజని నోటినుండి వచ్చిన దంతయు కవిత్వమేయైనది ఆమె

ఛందోబద్ధముగా చెప్పినదే కవిత్వముకాదు ఆమె పల్కిన పలుకులన్నియు కవిత్వమే కవిత్వము గణములో లేదు గుణములోనున్నది రెడ్డిరచనలు ఈ శ్రేణికి చెందును ఆంధ్రములోవలె ఆంగ్లములో ఆయన కవిత్వము ఛందస్సులో లేదు వాక్యనిర్మాణములోనే యున్నది వాక్య నిర్మాణములో రెడ్డి దిట్ట ప్రేజు నిర్మాణములో చర్చిల్‌తో సమానుడు "His phrases' his epigrams and jokes, all of the Reddi ventage made him matchless in the time శబ్దచాతుర్యములో ఆయన ప్రతిభ అనన్యసాధ్యమైనది ఆయన ఉపన్యాసములు ఉత్తరములు వ్యాసములు పరికించిన కానవగును

'His speeches were remarkable as much for a coherent body of thought as for splendour of diction while some of his phrases enrich the English tongue Mr Ramaswami Modaliar no mean judge of polititions spoke to me of Reddi as the greatest phrase maker in politics since Disrail, not exluding Churchil who in England came next to Disrail (My portrait Gallery— Pages 80, 81)

పండిత జవహర్‌లాల్ నెహ్రూ గద్యకవులలో కడుఖ్యాతి గాంచెను ప్రధానికాక పూర్వము ఆయన గొప్ప కవిగా భావించబడెను ఆయన భారతదర్శనము, ఆత్మకథ ప్రపంచమంతటను ప్రఖ్యాతి గాంచినవి

రెడ్డి ఉద్గ్రంథా లేవియు రచించలేదుగాని ఆయన రచన లంతట కవితారసము కలదు ఆయన స్నాతకోపన్యాసములు వ్యాసములు ఉత్తరములు ప్రకటించబడినపుడు ఆయన గొప్పతనము గోచరము కాగలదు ఆంగ్లసాహిత్య ప్రపంచములో రెడ్డి స్థానము అసాధారణమైనది గద్యకవులలో ఆయన గణనీయుడు

# గుణగణాలు

"ఏదేని యొక్క ధర్మమును మాత్రము పట్టి మనుష్యుల చరిత్ర గణింపఁ బూనుట పరమ మూర్ఖ్యము" అన్నాడు రామ లింగారెడ్డి. ఇది పరమ సత్యము.

"ఏ ఒక్క దోషము లేని మహాపురుషుడు లే" డన్నాడు అబ్రహాం లింకన్.

సంపూర్ణత్వ మొక్క ఈశ్వరునిలోనే తప్ప తదితరులలో గాంచగనుగుట అశక్యము. మంచిచెడ్డలు అందరిలో ఉండును. అధిక గుణమున్న వారినే మంచివారందురు.

మానవులను కేవలము దేవతలనుగాను, కేవలము రాక్షసులనుగాను చూచెడి దృష్టి సంకుచిత దృష్టి. వారిలో వెలుగు చీకట్ల వింతకలయికను చూచి విస్మయము చెందెడి శక్తి అసాధారణమైన విశాల దృక్పథము వల్లనే లభించును.

మద్రాసులోని గోఖలే హాలులో ఒక సభలో ఒకరు రామలింగారెడ్డిని పరిచితుని గావించుచు 'రెడ్డిగారు బ్రహ్మచారి, సద్గుణ సంపన్నులు' అన్నారు.

రెడ్డి తన ఉపన్యాస ప్రారంభములోనే అందులకు ఇట్లు సమాధానము చెప్పినాడు: 'నా మిత్రుడు నన్నుఁ గూర్చి పరిచయము చేయుచు నేను బ్రహ్మచారినని, సద్గుణ సంపన్నుఁడ నని పరిచయము మొనర్చియుండెను. అది మిక్కిలి అతిశయోక్తులతో కూడికొనియున్నది. నా కట్టెదుట నన్ను ప్రశంసించినప్పుడు నేను మిన్నకుండిన అసత్యదోషము నా కంటును. నన్ను బ్రహ్మచారి యని చెప్పుటకంటె, అవివాహితుడని చెప్పియుండిన, మిక్కిలి ఒప్పి యుండెడిది. నేను సద్గుణరాశి నని మిత్రుడు చెప్పియుండె

నాలో సద్గుణములతోపాటు దుర్గుణములను కలవు నా నుదుటిపై గల నల్లనిమచ్చ దుర్గుణములకు చిహ్నము స్వచ్ఛతకు మిగిలిన నుదురు"

ఈ మాటలు ఆయన వాక్చమత్కృతికి, జనాకర్షణకు, సత్య సంధతకు నిదర్శనములు

రామలింగారెడ్డి అతి స్వతంత్ర స్వభావముగలవాడు ఒక్క రామలింగారెడ్డిలోనే కాదు కట్టమంచివారి వంశములోనే ఈ గుణము అధికముగా నుండుట గాంచగలము

కట్టమంచి కోళందరెడ్డిగారు ప్లీడరుగా ప్రజాసేవకుడుగా కృష్ణాజిల్లాలో పేర్నొక గన్నారు వీరు రామలింగారెడ్డికి సమ వయస్కులు అతి స్వతంత్రులు ఆత్మగౌరవము గలవారు ఈయన క్రిస్టియన్ కళాశాలలో బి ఏ పరీక్షలో నుత్తీర్ణత నంది పోలీసు డిపార్టుమెంటులో ఇన్స్పెక్టరుగా పనిచేయువాడు ఆనాడు సబిన్స్పెక్టర్లు లేరు సర్కిలిన్స్పెక్టర్లు లేరు ఇన్స్పెక్టరే సబిన్స్పెక్టర్, సర్కిలిన్స్పెక్టరు కూడ

ఒకనాడు ఆయన ఒక పట్టణమునకు తనిఖీ నిమిత్తము వచ్చి రహదారి బంగళాలో బసచేసి కోటు, హాటు ఒక వంకికి తగిలించి, షికారునకు వెళ్ళిరి అంతలో ఒక యురోపియన్ సబ్ కలెక్టరు వచ్చి ఆ బంగళాలోనే ప్రవేశించి వంకి నున్న రెడ్డిగారి దుస్తులను టేబుల్ మీద వేయించి, తన దుస్తులను ఆ వంకకి తగిలించినాడు తరువాత కోళందరెడ్డిగారు వచ్చి చూచినారు రోష ముతో మహోద్రిక్తులై ఒక పోలీసు బంట్రోతును పిలిచి ఆ వంకి నున్న సబ్ కలెక్టరు దుస్తులను రోడ్డు మీద పారవేయవలసినదని ఆజ్ఞాపించినారు అతడు ఆలాగే చేసినాడు ఆ శ్వేతముఖుడు అరుణ ముఖుడై రెడ్డిగారితో కలియబడినాడు ముష్టా ముష్టిగా సాగినది పోరు గెలువలేని తెల్లమొకము జిల్లా కలెక్టరునకు రిపోర్టు చేసి నాడు రెడ్డిగారు జిల్లా పోలీసు సూపరింటెండువకు జరిగినది తెలిపి

నారు వెంటనే జిల్లా అధికారు లిద్దరును వచ్చి సబ్ కలెక్టరుదే తప్పన్నారు 'అంత మాత్రము చాలదు, ఆయనచేత లిఖిత పూర్వకముగా క్షమాభ్యర్థనపత్రము వ్రాయించి ఇవ్వవలసినదే!' అన్నారు. కొళందరెడ్డిగారు తెల్లదొర నల్లమొగముతో అట్లు క్షమ వేడుకొనుచు రెడ్డిగారికి కాగితము వ్రాసి యివ్వక తప్ప లేదు

జాతీయ పత్రిక యగు కృష్ణాపత్రిక ఈ సందర్భము పురస్కరించుకొని 'ఆత్మగౌరవము గల అధికారి' యని వ్యాసము ప్రకటించినది కొళందరెడ్డిగారు ఈ రెంటిని ఫ్రేము కట్టించి ఉంచుకొన్నాడు

స్వాతంత్రేచ్ఛ ఆత్మగౌరవము, ఉదారబుద్ధి మొదలగు ఉన్నత గుణములు వీరి యింటి సొత్తు ఒకప్పుడు రామలింగారెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చినది జాతి ఆత్మగౌరవముకోసమె కదా! ఆ రాజీనామా పత్రము దేశ భక్తిభరితమైన లేఖలలో విఖ్యాతి గాంచినది

రామలింగారెడ్డికి రజోగుణముమీద అభిమాన గౌరవా లెక్కువ ఆయనది దీటులేని రాజసము ఆయనకు పరమ ప్రియమైన మహాభారతములో ఎక్కువ హృదయంగమమైనది దుర్యోధన పాత్ర రాయబారపు సందర్భమున శ్రీకృష్ణునితో దుర్యోధనుడు చెప్పిన—

"ఉక్కటి సురపతికైనను
మ్రొక్కము నృపధర్మమూది మొనతలం బడినన్
మిక్కిలి పేరును నిట దివి
నక్క జముగఁ జెప్పఁ బడయనగుట నుపేంద్రా!"

అను మాట లాయన కెంతో ఆత్మతృప్తిని కలిగించెడివి ద్రౌపదియందు గూడ అంతే అభిమానమా యనకు

రజోగుణావశ్యకతను గురించి రెడ్డి అధికముగా బోధించి నాడు నిజముగా అది ఈనాడు మనకు అవసరము

ఒక్క రెడ్డిమే కాదు సర్వ సంగ పరిత్యాగియగు వివేకానందస్వామియు దీనినే బోధించినాడు 'శక్తియే జీవము అశక్తియే మృత్యువు ఈనాడు మనకు కావలసినది రాజస శక్తి సత్త్వగుణ ప్రధానులుగా నేము చేయబడుచున్న వారిలో అత్యధిక సంఖ్యాకులు తామసగుణ ప్రధానులు అలసతచేత అశక్తతచేత క్షమ చూపుటకుంటె సమరము మేలు ప్రపంచము యుద్ధరంగము వీరుడవై ప్రతికూలులను జయింపుము! ఆత్మవిశ్వాసము కోల్పోయి అచలమై నిద్రాణమై యున్న భారతదేశమును మేల్కొల్పుటయే నా ఏకైక వాంఛ గీతలో భగవానుడు తెల్పిన విధముగా అకుంఠితమై ధైర్య సాహసములతో తీవ్రమైన కర్మయోగమును అవలంబించుటయే మన కర్తవ్యము

"నా మతము బలము - శారీరక మానసికాధ్యాత్మిక బలము బలమే జీవనము దౌర్బల్యమే మరణము

అప్రతిహతమగు సంకల్ప శక్తి ఇనుప కండలు ఉక్కునరములు ఇవె దేశమున కిప్పుడు కావలసినవి" (ఇప్పుడు మన దేశమునకు కావలసిన వని మనము కోరుచున్నవి ఇవే కదా!)

'ఈనాడు మనకు కావలసినది గీత కాదు కందుక ఖేలనము' అన్నాడు వివేకానందుడు

'అది చిలుతపలుకో చిలుకపలుకో మేలయినచో వినవలసినదే' అని ఒకసూక్తి ఉన్నది రామలింగారెడ్డి ఈ సూక్తిని అక్షరాల పాలించిన సహృదయుడు

ఒక పర్యాయము ఆంధ్ర విశ్వవిద్యాలయపు తెలుగు లిటరరీ యూనియను సెక్రెటరీ ఏ వి కృష్ణమూర్తి చరిత్ర అర్థశాస్త్రము రాజకీయసంఘములకు ప్రెసిడెంటు, డి ముకుందరావు అనువారు కలసి ఆంధ్రోత్సవాలు చేయుటకు తలపెట్టినారు అయిన నేమి? 'శంకునపోస్తే తీర్థము, పెంకున పోస్తే నీరు' అనునట్లు రామలింగా

రెడ్డి అంగీకరించినచో రాశింపు వారు జడియుము జడియుచు ఆయ నను చేరి తమ ఆశయమును వెల్లడించినారు ఆయన వారి మాట లను సాంగోపాంగముగ విని వారిని ప్రోత్సహించినాడు 1937 వ సంవత్సరము డిసెంబరు 6 వ తేదీన ప్రథమాంధ్ర వారోత్సవము రామలింగారెడ్డి ప్రారంభించినాడు

I congratulate the students of their idea to celebrate such a week but by stress upon the fact that we work for is not a separate province, but a distinctive province which would preserve our individuality and culture Separate tendencies are not to be encouraged But each race can develop its own distinctive culture in the common service to tue mother land

Andhras must also aim at increasing the cal tural and social affinity between themselves and the people of Telangana

“ఇట్టి వారోత్సవము చేయదలపెట్టినందులకు నేను విద్యార్థులను అభినందించుచున్నాను కాని మనకృషి ప్రత్యేకరాష్ట్రము కొరకు కాదని మన వ్యక్తిత్వమును సంస్కృతిని నిలబెట్టునట్టి విశిష్టరాష్ట్రము కొరకే అని ఉద్ఘాటించుచున్నాను నలుగురినుండి విడిపోవునట్టి తత్త్వము ప్రోత్సహింపరానిది కాని మాతృభూమికి కోటిజాతులతోపాటు కలిసి సేవచేయుచునే ప్రతిజాతియు తన విశిష్ట సంస్కృతిని విస్తరింపజేసికొనగలదు ఆంధ్రులు తెలంగాణా వారికి తమకు నడుమ సాంస్కృతికమైనట్టియు సాంఘికమైనట్టియు సాన్నిహిత్యమును పెంపొందించుకొనుటకు కూడ ఉద్దేశింప వలెను ”

ఆంధ్రులనగా కేవలము రాయలసీమ, సర్కారుప్రాంతాల వారేకాక తెలంగాణావారుకూడ అని గ్రహించి, వారి సంస్కృతికై కూడ ప్రయత్నించుచు, అందరు కలసిమెలసి అభివృద్ధి గాంచవలె

నని విశాలాంధ్రమునకు పునాదివేసి పుణ్యముగట్టుకొన్నది రామలింగారెడ్డియే అని గ్రహించుట అవసరము

అప్పటినుండి ప్రతిసంవత్సరము ఆంధ్రోత్సవాలు జరుగుచుండుట నాటి రెడ్డి ఆశీర్వాదము వలననే

ఒకసారి ఆంధ్రోత్సవాలలో ప్రాచీనాంధ్రరాజులను స్మరించుచు కాకతీయ ద్వారము చాళుక్య ద్వారము మొదలైన ద్వారములు ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రాంగణములో అమర్పగా 'రెడ్లుకూడ పాలించినారు గదా! రెడ్డిద్వారము లేదేమిటి ?' అని ప్రశ్నించినాడు రామలింగారెడ్డి వెంటనే ఒక విద్యార్థి 'అవన్నియు అంతరించిపోయిన రాజ్యాల ద్వారములు రెడ్డి రాజ్యము ఇంకను అంతరింపలేదు అందుచేత వానిలో రెడ్డిద్వారము చేర్పలేదు అన్నాడట! రెడ్డి అతని సమయస్ఫూర్తికి నలుగురితోపాటు ఆనందించినాడు రామలింగారెడ్డి ఉపాధ్యక్షతలో ఆంధ్ర విశ్వవిద్యాలయమున అప్పుడు రెడ్డిరాజ్యము వర్ధిల్లుచున్నదని ఇంకు గమనింపదగును

ఈ విధముగా గుణమున్నచో చిన్నవారినైన మెచ్చుకొనువాడు రెడ్డి అనుటకు ఎన్నో నిదర్శనము లున్నవి ఒకసారి ఆడ ఎల్లల ప్రసక్తి వచ్చినది అప్పుడు ఆయన ఇట్లు అన్నాడు 'ఎండ కన్నెఱుగని రుక్మిణీ లక్ష్మీపతివంటి పౌరుషమూర్తు లున్నారా? ఆడ మగ భేదాలేల ? ఆమె సత్యాగ్రహ సమరములో ధైర్య సాహసాలతో విజృంభించి పోరాడిన వీరనారి

రామలింగారెడ్డి ఆంధ్రవిశ్వవిద్యాలయములో నుండగా అచ్చట తెలుగురీడరుగా నున్న శ్రీ ఎంగళి లక్ష్మీకాంతముగారితో సాహిత్య గోష్ఠి జరుపుచుండెడివాడు లక్ష్మీకాంతముగారి తొలకరికి చక్కని పీఠిక వ్రాసి దాని ప్రాశస్త్యమును వెల్లడించినాడాయన రెడ్డి వ్యాససంగ్రహమునకు ముసలమ్మ మరణము ఇత్యాదులకు పీఠికలు వ్రాసి రెడ్డిగారి రచనా వైశిష్ట్యమును వివరించినారు లక్ష్మీకాంతముగారు 'నవయామినిలో (Moral tone)

నైతిక భావమున్నది అన్నారు లక్ష్మీకాంతముగారు 'మీసౌందర నందములో గూడ ఆ భావమున్నది అన్నాడు రామలింగారెడ్డి ఇట్లు వారు ఎంతో అన్యోన్యముగా నుండి ఒకరి రచనలోని గుణములను ఒకరు గుర్తించి సరిపోల్చుకొనుచు గుణవత్తర రచనలు చేయుటకు ఆ మైత్రిని వినియోగించుకొన్నారు కవులలోగాని పండితులలోగాని సాధారణ రచయితలలో గాని మాత్సర్యము ఈ విధముగా మారుట స్తుతిపాత్రముగదా!

ఒకే రోజున కళాప్రపూర్ణ బిరుదము నలుగురకు ఇచ్చు సందర్భమున లక్ష్మీకాంతముగారు ఆ నలుగురను గురించి చేయు పరిచయము ఎంతో సరసముగా ఉండుట చూచి సిండికేటు మెంబరైన ఒక యూరోపియను సభ్యుడు లక్ష్మీకాంతముగారి చాతుర్యమును సిండికేటులో మెచ్చుకొన్నాడు రెడ్డి ఆ మాటలు విని 'వట్టిమాటలతో ఏమున్నది? సిండికేటు ఈ విషయమై ఒక అభినందనపు తీర్మానము చేసినచో బాగుగా నుండును అన్నాడు ఆ విధముగానే సిండికేటు 1948 వ సంవత్సరము అక్టోబరు 28 వ తేదీన లక్ష్మీకాంతముగారు విశ్వవిద్యాలయమునకు చేసిన సేవను ప్రశంసించుచు ఒక తీర్మానము లక్ష్మీకాంతముగారికి పంపినది

ఇది రెడ్డికి లక్ష్మీకాంతముగారియందు గల ప్రత్యేకాభిమానమునే చాటునదిగా తోచును కాని అది సరి కాదు తన క్రింది ఉద్యోగస్థులు ప్రతిభావంతులయినచో వారి గుణ విశేషములను మెచ్చుకొని ప్రోత్సహించువాడాయన గుణమునకు తగ్గ గౌరవము ఇచ్చెడివాడు ఈ సంఘటనము దానినే నిరూపించును

'ఎవరి గుణగణాలయినను తెలిసికోవలె నన్నచో వారి క్రింద పనిచేసినవారి వల్లనే తెలిసికొనుటకు అధికావకాశముండు' నని లార్డు మార్లే తన స్మృతులలో చెప్పినాడు కీర్తిశేషులు వల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు చేసిన సేవను ప్రశంసించుచు రామలింగారెడ్డి ఆయనకు ఒక

యోగ్యతాపత్రము నిచ్చినాడు ఇది శర్మగారు కోరి పుచ్చుకొన్నది కాదు రెడ్డి కోరి ఇచ్చినది శర్మగారు ఈ విషయమును నాతో చెప్పి రెడ్డియందు తనకు గల కృతజ్ఞతను ఎంతో ప్రశంసనీయముగా ప్రకటించినారు రెడ్డి గుణగ్రహణ పారీణతకు ఇది పేర్కొనదగినది కదా!

రామలింగారెడ్డికి బుద్ధ భగవానుని యందు అభిమాన మధికము ఆంధ్రవిశ్వవిద్యాలయములోని వసతి గృహములకు (Hostels) అశోకవర్ధన విజయవిహార్ వివేకవిన్యాస్ సద్ధర్మ సాధన హర్షవర్ధన సిద్ధార్థ ఇత్యాది బౌద్ధ సంప్రదాయ రీతిని నామకరణము చేసెను

రిజిస్ట్రారు ఆఫీసు బిల్డింగు (కార్యాలయ భవనము) నకు 'కట్టమంచి రామలింగారెడ్డి విహార్' అని పేరు కలుగుట ఆంధ్ర విశ్వవిద్యాలయము రెడ్డి పంథాను అనుసరించె ననుట సూచన

ఒకమారు బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారును రామలింగారెడ్డిగారును చిత్తూరునుండి కారులో కట్టమంచికి పోవుచుండిరి ఒకచోట కారు తలక్రిందయినది కాని ఎవ్వరికిని ఎట్టి ప్రమాదమును సంభవించలేదు అంతట బలరామ కృష్ణయ్యగారిని చూచి రెడ్డి యిట్లన్నాడు 'ఇదియంతయు బుద్ధ భగవానుని కృప నీవు ఉన్నందువల్ల ఎట్టి అపాయమును సంభవింపలేదు బుద్ధునియెడల ఆయనకు గల విశ్వాసము అంత గొప్పది

"'వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి' అని భవభూతి చెప్పినది రామలింగారెడ్డి హృదయమునకును వర్తించును జీవితానుభవములో ఎట్లో సాహిత్యానుభవములో గూడ అట్లే ఆయనవలె నవ్వగలవారు ఎందరో ఉండరు కన్యాశుల్కములో కొన్ని భాగాలు ఆయన నెమ్మదిగా చదువలేడు చదువుకోను లేడు ఇంకెవరైనా చదివితే ఇల్లెగిరి పోయేటట్లు తన దేహంలో

సంధి సంధులూ శిథిలమయ్యేటట్లు విరగబడినవ్వినది ఎన్నో మార్లు నా కనుభవము ఆనందబాష్పాలైనా అనుకంపాశ్రువులైనా ఆయనకు కండ్లనిండా పొంగిపొరలేవి ఒకనాడు జయదేవుని గీత గోవిందాన్ని గూర్చి ప్రస్తావించితిని "ఔనండీ! చాల గొప్పగా చెప్పుకుంటారు కాని నే నెప్పుడూ వినలేదు మీ కేమైనా తెలిసి వుంటే పాడండి!" అన్నాడాయన నేను 'లలిత లవంగలతా పరిశీలన కోమలమలయ సమీరే' అన్న చరణార్థం పాడి చూపేం తలో కూర్చున్నటువంటి కుర్చీలోనుండి ఒక్క దూకులో లేచి, చేతి షర్టును మీది కీడ్చి చూచి, 'నా పులకోద్గమం చూడవయ్యా! అద్భుతరచన!" అన్నారు నిజముగ నారుపోసినట్లు ఉన్న ఆ రోమాంచాలు నాకు ఆశ్చర్యమును కలిగించినవి మరునాడే మద్రాసుకు వ్రాసి తెలుగు టీకతోడి పుస్తకమును తెప్పించు కొని సంపూర్తిగా చదివిన తరువాత 'అర్థభావాలలో ఏమీ విశేషము లేదు అంతా సాంప్రదాయికమైన శృంగారమేకాని పదాల ఇంద్రజాలం - అంటారే ఆంగ్లేయులు దానికి అంత మంచి లక్ష్యం ఎక్కడా లేదు" అన్నారాయన ఆంధ్ర సాహిత్యములో అంతా మహాభారతము మీద ఆయనకు ఉన్న గౌరవాభిమాన ములు సాటిలేనివి కారణము స్పష్టమే ఉద్రిక్తమైన భావాలు, వాటి శబలతా అంత వివిధంగా, విరివిగా ఇంకే ప్రాచీనాధునిక గ్రంధాలలోనూ లేవు రామాయణంలో నడక ప్రశాంత మాధురం భాగవతములోని భక్తి దాస్యదైన్య ప్రధానమైనది కనుక ఈ రెంటిమీనూ ఆయనకు అభిమానము తక్కువ ఆ హృదయాన్ని ఊచే సగసు అందులో చాలదు భారతమంతా ఇంచుమించు, ఆయనకు కంఠస్థమే అనవచ్చును కవిత్రయంమీద సమాన ప్రపత్తి ఉన్నా తిక్కనగారి మీద విశిష్ట పక్షపాతం కలిగినవా డాయన మితసాత సత్త్వాల మితిని కావ్య కళతో వెలిగించి రచిం చిన కవిత నాటికీ, నేటికీ తిక్కనదే "సభాపర్వము తిక్కన చేతికి లంభించి ఉంటే తెలుగు జాతి హృదయాల సత్తునను పరీక్షించి

ఉండేవా"డని ఒకమారు రెడ్డి నాతో అన్నారు - కొంత నిర్వేద ముతో

'భారత రచన మీద ఎంత గౌరవభావమో అంత అసహ్యం తరువాతి ప్రబంధ రచనలో ఆయనకు ఆ భావం 'కవిత్వ తత్త్వవిచారం లో నిరర్గళంగా వెలువడింది దానిని విమర్శిస్తూ ఒక్కరు అక్కిరాజు ఉమాకాంతంగారు అనుకొంటాను- 'పొగడడంగాని, తెగడడంగాని ఈ గ్రంథకర్త ఇంకా నేర్చుకో వలసిన విద్య ' (అర్థమిది - మాటలు నావి) అని నిష్కర్షగా వ్రాసిరి అది చదివి 'చాల మంచి విమర్శనం వచ్చిందయ్యా! నీవూ చదువు" అన్నారు నాతో రెడ్డి! 'సత్యమో అసత్యమో, తోచిన మాట నిస్సంకోచముగా చెప్పగల ధీరుడు తెలుగు వారిలో ఒకడున్నాడుగదా!' అనే ఆయన వీర తృప్తి! (శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ)

ఆయన యొక్క ఉదార గుణమునకు మరొక ఉదాహరణ మును చూపించవచ్చును బర్నెట్ ఉస్మానియా కాలేజీ ప్రిన్సి పాల్‌గా నున్నపుడు కురుగంటి సీతారామయ్యగారు ఆ కళాశా లలో తెలుగు శాఖాధికారిగ తన్ను నియమించవలసినదిగా కోరి నప్పుడు ఒక యోగ్యతాపత్రము తెచ్చుకొనినచో నా కేమియు అభ్యంతరము లేదన్నారు అంతట కురుగంటివారు రామలింగా రెడ్డిని కోరినారు సీతారామయ్యగారు గొప్ప పండితులని ఆయనను ప్రశంసించుచు ఒక యోగ్యతా పత్రము నిచ్చినాడు రెడ్డి తద్వార మున సీతారామయ్యగారికి ఉద్యోగము లభించినది ఉద్యోగమే గాక బర్నెట్ దృష్టిలో ఆయన యెంతో పెరిగినాడు ఈ సీతా రామయ్యగారు 'కవిత్వ తత్త్వ విచారమును విమర్శించుచు అలంకార తత్త్వ విచారమను గ్రంథమును వ్రాసినారు

అయినను రెడ్డి దానిని పాటించలేదు అదీ ఆయన ఉదార గుణము

రెడ్డి సంభాషణలలో సరసుడు, చమత్కారి ఆయన ప్రసంగించెడి ప్రదేశము ఒక చిన్న సమావేశమయ్యెడిది మన హిందూదేశములోని విశ్వవిద్యాలయోపాధ్యాయు లందరు 1948లో నాగపూరుచేరినారు రమ్యమైన ప్రదేశములో సాయంసమయమున వారికి అల్పాహారపు విందు ఒకచోట ఏర్పరచినారు ఆ విద్వాంసు లందరు అచ్చటచ్చట చేరి అల్పాహారము గైకొనుచుండిరి రామ లింగారెడ్డి ఏదో సంభాషణ మొదలిడినాడు అక్కడ ఆయన పలి కెడి పరిహాసములకు అందరును ఆనందించుచుండిరి అట్లు ఆయన హాస్యము చేయుచుండగ అందరును ఆయన చుట్టు మూగినారు ఆయన ఆనాడు సంభాషించిన సంగతి ఒక సందర్భమున పురస్క రించుకొనినది కాదు ఆనాటి నాగపుర వాతావరణముతో ప్రారం భించి రాజకీయాలు అవి యివి చర్చించి అందరిని ముగ్ధులను చేసి నారు ఇట్లు విశ్వవిద్యాలయోపాధ్యాయులే గుమిగూడగా, ఇక విద్యా ర్థులు, ఇతరులు ముగ్ధులగుటలో ఆశ్చర్యమేమున్నది ?

దీని కంతటికీ కారణమేమనగ ఆయనయొక్క వ్యక్తిత్వము ఆయనను ఎందరిలో ఉన్నను గమనించక తప్పదు ఆయన ఆజాను బాహువు ఆకర్ణాంతలోచనుడు కాకపోయినను ఆకర్షణీయుడు అంత పొట్టి పొడుగరి గాక సమపాళముగా చక్కగా ఉండెడి వాడు తనకు తగిన చక్కని దుస్తులను ధరించి ముచ్చటగ నుండెడి వాడు ముదిమి ఆయనను ముట్టడించినను యువజన హృదయము కలవాడు ఆయన ముఖము ఒక వింతశోభ నిచ్చెడిది ఆయన ముఖము మీది మచ్చ మరింత శోభను చేకూర్చెడిది ఆయన ఎక్కడ ఉన్న అక్కడ వసంతోదయము

ఆయన హాస్యప్రియుడు ఆయన ఇతరులను హాస్యము చేసెడివాడు ఇతరులు తన్ను పరిహాసము చేసినను సంతోషించెడి

వాడు తన్ను వారు ఇంత మాట యందురా? అని భావించెడి వాడు కాదు

భాస్కరరెడ్డిగారి కుమార్తె ప్రభావతి కాలేజీలో చదువు చుండగా రామలింగారెడ్డి ఆమె చేతివంక చూచి 'నీకింకను గడి యారము లేదే'' అనగా ఆమె "మా నాన్న నాకు ఇచ్చినారు కాదు'' అని ప్రత్యుత్తర మిచ్చినది

'నీవు కాలేజీలో చదువుచుండగా మీనాన్న గడియారము కొనియివ్వక పోవుటేమి?'' అని రామలింగారెడ్డి వెంటనే ఆమెకు గడియారము కొనితెచ్చి యిచ్చినాడు

He was too sensitive తలచిన పని తత్క్షణము కావలసి నదే

రెడ్డిలోని మరొక గుణము అతిథి ప్రీతి ఒక్క ఆయనే కాదు కట్టకుంచివా రందరు అతిథిసత్కార పరాయణులే

'తనక్రింది ఉద్యోగులను రామలింగా రెడ్డిగారు ఎప్పుడును దయతో చూచెడివారు అని ఆయన పర్సనల్ అసిస్టెంటు (ప్రత్యేక సహాయోద్యోగి) అగు పార్థసారథిగారు నాతో చెప్పినారు తన వెంటవచ్చు గుమాస్తాలు, బంట్రోతులు మొదలగువారందరు రైలు బండిలో ఎక్కిరో లేదో, వారికి వేళకు అన్నపానములు అమరు చున్నవో లేదో అని విచారించెడివా డాయన నడుమ నడుమ అల్పాహారము నిమిత్తము వారికి తన సొంతసొమ్ము కర్చుపెట్టెడి వాడు వారి కష్టసుఖాలను గుర్తించెడివాడు కాని ఒక్కటె ఎవని యందు ఎంత అభిమానము ఉన్నను నియమవిరుద్ధముగా సాయము చేసెడివాడు కాడు కులమతభేదము లేకుండ గుణమునుబట్టియే వ్యక్తులను ఆదరించుచు, ఉద్యోగము లిచ్చుటయందు సమదృష్టి ప్రదర్శించెడివాడు ఎంత తీవ్రశాసకుడో అంత ఉదారుడగు ఉప కర్తగూడ కాళిదాస మహాకవి దిలీపనరపాలుని గురించి అన్న

'అధృష్యుడు, అభిగమ్యుడు' అను విశేషణములు రామలింగారెడ్డికి వర్తించును

ఆయన ఎవరేది చెప్పినను వినెడువాడు 'మీరు ఇట్లు ఏల చెప్పుచున్నారు ? అని ఆలోచించెడివాడు అంతేగాని చెప్పుడు మాటలు నమ్మెడివాడుకాడు ఆయన మనస్సు ఎంత పాశ్చాత్య భావప్రియమైనను హృదయము అచ్చముగా భారతీయము నిత్యము స్నానాంతరము దేవీపూజ చేసెడువాడు

'I want Europeon comforts The soul is swadeshi, but the stomach is videshi అన్నాడు రామలింగారెడ్డి రవీంద్రునివలె జీవితమాధుర్యము గ్రోలిన రసిక శేఖరుడాయన

పందతనమునకు మించిన పాపము లేదని ఆయన మతము తన అభిప్రాయాలను తీవ్రముగా విమర్శించెడివారిపట్ల ఆయన చూపినంత ఔదార్యము చూపెడివారరుదు అనగా తప్పును ఒప్పుకున్నట్లు గాదు స్వాతంత్ర్యమును ధైర్యమును, మెచ్చుకొనుట

సమయపాలనలో ఆయన సమర్థుడు ఆహారవిహారాలన్నిట కాలపద్ధతు ఇది ఆంగ్లేయుల శిష్టాచారము

రెడ్డిగారో అసాధారణమైన తర్క కౌశలముతో బాటుగంభీరమైన రసభావానుభవశక్తి కూడ ఉండెడిది ఆయన హృదయమునకు బుద్ధికి పొత్తు కుదరలేదు అందుచేత ఒకమారు అది, ఇంకొకమారు ఇది గెల్చుచుండెడిది

రామలింగారెడ్డి చలోక్తులు అనేకము కలవు వానిలో ఆయన జీవితమునకు సంబంధించిన ఈ క్రిందివానిని ఉదహరించుట ఉచితమని తలంతును

'ఆంధ్రదేశములో మూగురు ప్రతిభావంతులున్నారు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ప్రథమశ్రేణి ప్రతిభావంతుడు కాని ఆయన జీవితమునందు తృతీయశ్రేణిలో విజయము పొందినాడు

నేను ద్వితీయశ్రేణి ప్రతిభావంతుడను అందువల్ల నా జీవితము సగము జయము సగము అపజయము

రాధాకృష్ణన్‌గారు తృతీయశ్రేణి ప్రతిభావంతుడు అందువల్లనే ఆయన జీవితమున ప్రథమశ్రేణిలో విజయము గాంచినాడు'

## మహమ్మదీయుల మిత్రుడు

భారతదేశములో హిందువులు మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగువారున్నారు హిందూమహమ్మదీయులు అన్నదమ్ములవలె సంచరించెడివారు అప్పుడు హిందూమహమ్మదీయ మైత్రికి బహువిధములుగ పాటుపడినాడు

మన ఆంధ్రదేశములో హిందూ మహమ్మదీయ విభేదములు కానవచ్చెను తెలంగాణములో ప్రభువు మహమ్మదీయుడైనను మంత్రి హిందువే చాలవరకు ఉద్యోగులు జాగీర్దారులు హిందూ మతస్థులే ఉండెడివారు

భారతదేశములో హిందూమహమ్మదీయ మైత్రికి మహాత్ముడు సరోజనిదేవి అధికముగ పాటుపడినారు

మన దక్షిణదేశములో హిందూమహమ్మదీయుల స్నేహమునకు రామలింగారెడ్డి చాలవరకు తోడ్పడినాడు ఆయన తనవిద్యార్థిదశనుండి తాను 'అబ్బాజ్జి – 'ఆదివాసి నని చెప్పెడివాడు

ఆయన 1938 లో ఉస్మానియా యూనివర్సిటీలో ఇచ్చిన స్నాతకోత్సవ ఉపన్యాసము పరికించిన "ఒకప్పుడు ఆంధ్రభూమిలో హిందూ మహమ్మదీయులు కలసి జీవించిరని తెలియును"

ఈ ప్రాక్తన భూమిలో కాశింరజ్వీ చర్యలు ఆయనను చాల కలతపెట్టినవి

అబ్బాస్ తయాబ్జీ అక్బర హైదర, సర్ మీర్జ ఇస్మాయేల్ యూకుబ్ హుస్సేను అబ్దుల్ హామీద్‌ఖాన్ భాయి సాహెబ్ అని పిలచిన మీర్జా హుస్సేన్ మొదలగువారు ఆయన యొక్క మహమ్మదీయ మిత్రులు భారతదేశము ఐకమత్యము లేనిదే స్వాతంత్ర్యము రాదని వచ్చిన నిలువదని భావించి దేశము లోని అన్ని కుల మతములు సామరస్యము పొంది కలసి మెలసి అభివృద్ధి పొందుటకై అధిక కృషి చేసియున్నాడు

'అభిప్రాయభేదములను సవరించుకొనుట, ఒకరితో ఒకరు పొసగియుండుట ఐకమత్యము సుస్థిరముగా నుండుట అను వాని కోసమే నా శ్రమ అంతయు ఇట్టి కృషి నేను చేయుట నేడేకాదు - ఏల అన ఈ మనస్పర్థలు తొలగించుకొనుట మొదలయినవి జరుగనిచో స్వాతంత్ర్య మనునది మనకు రాదు వచ్చినను నిలువదు

దక్షిణ దేశ మహమ్మదీయులలో సదా ఆయనను వారి మిత్రుడుగా తత్త్వవేత్తగా గురువుగా భావించుచున్నట్లు అక్బరు హామీద్ ఖాన్ అన్నారు

'Muslims in South India have always regarded Dr C R Reddi as their friend Philosopher and guide

ఆయన కొన్ని ఉపన్యాసములను Congress in Office అను పేరుతో మద్రాసు ముస్లింలీగువారు 194?వ సంవత్సరములో ప్రచురించినారు

# యువజనులపై ప్రేమ - ప్రభావము

విశేషమైన అభివృద్ధి గాంచవలెనన్న విద్యార్థులు, యువజనులు అభివృద్ధి పొందవలెను దేశ భవిష్యత్తంతయు వారిపై ఆధారపడి యున్నది

ఈ సంగతి అధికముగా గ్రహించినవారు సరోజనీదేవి రామలింగారెడ్డి సరోజనీదేవి యువకులను ఉత్తేజపరచి స్వాతంత్ర్య సమరంగములో దూకునట్లు చేసినది ఆమెకు వారియందమిత ప్రేమ

రామలింగారెడ్డి విద్యావేత్త విద్యాప్రియుడు అందుచేత విద్యార్థి హితైషి, యువజనానురాగి, ప్రతిభావంతులైన విద్యార్థులనిన ఆనయకు మక్కువ ఎక్కువ తండ్రి తనయులను ప్రేమించునట్లు ఆయన అనయొక్క అనురాగమును చూపెడివాడు విద్యార్థులలో లోప మున్నచో వానిని విస్మరించి, వారిని ప్రేమించి వారి ప్రజ్ఞకు ఎంతో ముచ్చట పడెడివాడు 'వృద్ధుడనైన అధ్యాపకుడను యువకులు ఈ చర్చలలో పాల్గొన జూచి ఆనందింపగోరు మన్నాను" అని శాసనసభలో ఒకసారి వివరించెను 'నా జీవిత సాయంసమయమున యువకులబ ప్రజ్ఞలుచూచి సంతోషించెద నని ఆంధ్ర విశ్వవిద్యాలయమున వ్రక్కుచ్చెను ఈ మాటలనే ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవమునను మరొకవిధముగా ఇట్లు అనెను

"ఈనాడు నేను మీా సమ్ముఖమున ఉండుటలో ఉన్న ఉద్దేశము నా శక్తి సామర్థ్యములకన్న భారతయువజనుల అనురాగమే ముఖ్యకారణమనిమీారు విశ్వసింపుడు" అనిపాట్నా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవములో పలికెను

సర్ రఘుపతి వేంకటరత్నమునాయునికి ఆయన శిష్యబృందము నందెంత యనురాగముండెడిదో రామలింగారెడ్డికి యువజనులపై గల ప్రేమకూడ అంతే వారి అభివృద్ధి కోరి ఎన్నో సభలకు అధ్యక్షత వహించినాడు ఎన్నో స్నాతకోత్సవములలో తన అనుభవమునంత యును వారికి అందించినాడు పాట్నా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ ప్రసంగము పరాకాష్టనందుకొన్నది

విశ్వవిద్యాలయాధ్యక్షులలో ఒకప్రక్కన అశుతోషు ఒక ప్రక్కన రామలింగారెడ్డి చిరునవ్వుతో విద్యార్థులను ఆదరించి వారి అభివృద్ధికి వేయి విధముల కృషిచేసి చరితార్థులైరి

రామలింగారెడ్డి ప్రభావమువలన ఆంధ్రభాషాభిమానము ఆంధ్ర యువజనులలో వ్యాప్తిచెంది ఆంధ్రశారదకు అపరూపమైన శోభ చేకూర్చినది

# ఆయన చేసిన గొప్ప కార్యము

సిరిసంపదలు విద్యాసంస్కారాలు చిన్నవయసులో ఆయన గడించిన అనుభవము ఇవన్నియు ఏకరూపముదాల్చి ఆయనలో క్రొత్తమార్పులను భావములను చిగురింపజేసెను

వ్యక్తికి స్వాతంత్ర్యమత్యావశ్యకమని ఆయన విశ్వాసము ఆయన సహజ విమర్శకుడు ఉన్న పరిస్థితులకు, ఆచారాలకు తల వంచ వెరుచు అవి బాగుగా లేకపోయినచో ఎదిరించి మార్చ వలెనను గాఢ విశ్వాసము కలవాడు

తన సమకాలికులతో రెడ్డిని విలక్షణముగా నిలిపినది ఆయన స్వాతంత్రత, స్వేచ్ఛా తత్త్వమును

రామలింగారెడ్డి సహజముగా స్వాతంత్ర్య ప్రియుడు రజో గుణ సంపన్నుడు ఆయన స్వాతంత్ర్యేచ్ఛ విదేశగమనమువల్ల

మరింత వృద్ధి అయినది ఇంగ్లండునకై విద్యాభ్యాసమునకు వెళ్ళిన సమయమున అభివృద్ధి పొందుటకుగల ఆంగ్లేయుల స్థితిగతులన్నియు పరిశీలించినాడు అచ్చట వారిచరిత్ర సాహిత్యము తత్త్వశాస్త్రము సాంఘిక జీవనము పరామర్శ చేసినాడు వారి అభివృద్ధికి స్వాతంత్రేచ్ఛ, సమానత్వము కారణములని గ్రహించినాడు

ఆ స్వాతంత్ర్య వాయువును పీల్చుకొని వచ్చినవాడుకావున ఈ దేశమునకువచ్చి వారి మాదిరిగనే జీవించవలెనని అభిలషించినాడు

అంతట ఆయన మన సంప్రదాయము సంస్కృతి అను పేరుతో ఉన్న సాంఘికదోషాలమీద, అన్యాయాలమీద ఒక గొప్పసమరము సాగించినాడు

మా రెడి కాలమును చూచి, రోసి కాళ్ళు చల్లబడి 'గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్' అనుకొనుచు వర్తమానమును దూషించుచు గతించినది స్వర్గీయమని వెంగపెట్టుకొని వాపోవువారిని ఆయన నిశితముగా ఖండించినాడు

కాలదోషము పట్టిన ఆచార విచారములను అవహేళన చేసినవారిలో అద్వితీయుడు

స్వాతంత్ర్య మాయనకు ప్రాణప్రదమైనది పవిత్రమైన హేతువాదము చేపట్టవలసినదని ఆయన ప్రబోధము

'నీవు స్వతంత్రముగా ఆలోచించు మని ఆయన చెప్పినాడు ఆయన ఒక వాదమును సృష్టించలేదు వాదమెప్పుడు కాలబద్ధమై యుండును స్వతంత్రాలోచన కాలబద్ధముగాదు కనుక ఇది అన్నిటికంటె గొప్పది

అన్నిటకంటె ఆయనచేసిన ఘనకార్యము 'తాను సర్వ స్వతంత్రముగా ఆలోచించి ఆ భావాలను వెలుగు చిమ్మునట్లు వ్యక్తపరచుచు బుద్ధిమంతులైనవారిని ఆలోచించునట్లు చేయుట



1918 లో ఇంగ్లండులో
ఋనుమరాలు శరణ్య మహాం ఆంగ్ల ఎనిల

నాగపురపు విశ్వవిద్యాలయస్నాతకోత్సవములో పలికిన పలుకులు పరికింపుడు (1938)

"నా అభిప్రాయాలను మీతో ఒప్పించవలెనని నేను కోరుట లేదు కనీసము వాని నిచ్చట పేర్కొనుట అవసరమని కూడ నేను భావించుటలేదు మీలో స్వతంత్రయాలోచనము స్వతంత్రముగా కార్యనిశ్చయము గలుగదగినట్లు ఏదైన చెప్పెదనే కాని, ప్రచారోద్దేశముతో గాదు"

వీరేశలింగముగారు సంస్కర్త రామలింగారెడ్డి స్వతంత్రాలోచనా పరుడు (Free thinker)

## మరల మైసూరు

రామలింగారెడ్డి విద్యావినోది విద్యానియుడే గాక గొప్ప విద్యావేత్త కవికోకిల ఎందు ప్రవేశించినను కవిత్వమే చెప్పినట్లు రామలింగారెడ్డి రాజకీయాలలో కానీ తదితర విషయాలలో కానీ విద్యావేత్తగానే వ్యవహరించినాడు (I am always an educationist in my life time)

విద్యావసరమును గురించి ఆయన ఈవిధముగా అన్నాడు

'దేశములోని యధిక సంఖ్యాలయిన గ్రామస్థులయు సామాన్య ప్రజలయు అభ్యుదయము భద్రమగు టెట్లు ?

"మొట్టమొదటిది విద్య ఆధునికవిద్య! మనకు శాస్త్రదృష్టి అవసరము అనగా జ్యోతిశ్శాస్త్రదృష్టిగాదు, మఱి ప్రకృతి శాస్త్రము

"మన కుండు కన్నులు రెండు ఒకట్టి భూతకాలమును వ్యక్తపఱచును అనగా మనము పురాణములను, ప్రాచీనములను

ఎక్కువగా దృష్టించుచున్నారనుట ఇదియే చక్కఁగా తెలియఁబడిన కన్ను ఈ కన్ను పోయినను అంతగా నష్టము లేదు ఇంకొక్కటి వర్తమానముచు మూతపడినట్లు చూచురు అనఁగా నాధునికముఎయందు మనకు దృష్టి తక్కువ అయినట్లు భావిని ఉత్తరోత్తరములను విమర్శించు నేత్రము మనకు లేదు ఇదియే ఫాల నేత్రము శివునకుండు మూడవకన్ను ఐరోపావారి కిది యున్నది ఇది యున్నచో మన చాదస్తము లన్నియు ఒక్క నిమిషమున భస్మీభూతములై పోవును ”

‘విద్య యనగా అక్షరాస్యతకాదు వివేకము విజ్ఞానము కలిగి వర్తించుట ఆధునికాంగ్ల విద్య కేవలము పరాధీన మయిన బ్రతుకునకే మూలమని, సాంకేతిక పరిశోధన విద్యలు అవసర” మని ఎలుగెత్తి చాటినాడు రామలింగారెడ్డి ఆయన 1910 వ సంవత్సరమునుండి విశ్వవిద్యాలయ సంస్కరణముకై కృషి ప్రారంభించి కొంతవరకు కృతకృత్యుడైనాడు దక్షిణ దేశములో మైసూరు ఆంధ్రవిశ్వవిద్యాలయముయు ఆయన సృష్టి మద్రాసు, ఉస్మానియా, అన్నామలై విశ్వవిద్యాలయములు కూడ ఆయన సలహా సంప్రతింపులమీద వర్ధిల్లినవి విద్యావేత్తగా గణనీయుడాయన విద్యా క్షేత్రములో ఆధునికత అలవడుడకు ఆయన ఎంతైన కృషి చేసినాడు

అది 1948 వ సంవత్సరము డిసెంబరు నెల 1951 వ సంవత్సరములో ఆంధ్రవిశ్వవిద్యాలయ రజతోత్సవములు జరుగవలసియున్నవి అదియేమో! ఆ ఉత్సవము ముందుగానే జరిపించినాడు రామలింగారెడ్డి 1949 వ సంవత్సరము వచ్చినదో లేదో అంతలోనె మైసూరు మహారాజావారి ప్రభుత్వము ఆయనను వెంటనే రావలసినదని ఆహ్వానించినది ఆ ఆహ్వానమును అందుకొని ఆయన మైసూరు ప్రభుత్వపు కోరికప్రకారము అక్కడ విద్యా

విధానముపై ఒక రిపోరు ఇచ్చుటకు వెళ్ళినాడు 'ఇందులోని వింత ఏమి? అని మనకు తోచవచ్చును

మైసూరులో ఆయన చిరకాలముండి అక్కడ ప్రజల అజ్ఞానాంధకారమును రూపుమాపినాడు గదా' అక్కడనే ప్రథమముగా హిందూదేశమందు విశ్వవిద్యాలయపు విద్యలో మార్పు రావలెనని ప్రసంగించి ప్రస్తుతి గాంచినాడు గదా! తర్వాత అక్కడ శాసనసభ్యులుగా మంత్రులుగా వ్యవహరించువారిలో ఆయన శిష్యులుకూడ ఉన్నారు అది ఆయన యౌవనములోని సుక్షేత్రము అక్కడ ఎన్నో పంటలు పండించిన పండిత కర్షకుడాయన ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు రాకపూర్వము మైసూరే తన క్షేత్రముగా ఎంచి సర్వశక్తులను వినియోగించి, తదభివృద్ధికై ఆయన చేసినకృషి పాఠకులకు విదితమే

అటు పిమ్మట మాతృభూమిలో విద్యాజ్యోతి వెలిగించుట ఆయనకు విధివిహితమైనది కనుక మైసూరు వియోగము ఎంత అప్రియమైనను భరించవలసి వచ్చినదాయనకు మైసూరును విడువనున్న వేళ మిత్రులగు యువరాజావారు మన రెడ్డిని ఒక చిన్న కోరిక కోరిరి 'అవసరమని నేను కోరినపుడు మీరు తప్పక ఇక్కడికి రావలసియుండును అన్నదే ఆ చిన్నకోరిక తర్వాత ఆ యువరాజావారు అస్తమించిరి

1949 వ సంవత్సరము జనవరిలో రెడ్డిని మైసూరునకు ఆహ్వానించినది ఆ యువరాజావారి కుమారులే! ముప్పది సంవత్సరాలనాడు మిత్రునికి ఇచ్చిన వాగ్దానమును అప్పుడు చెల్లించుకొనవలసి వచ్చినది రెడ్డి తత్క్షణము తన మాట నిలుపుకొనుటకు అచ్చటికి వెళ్ళినాడు

మైసూరులో ఆయన కొంతకాలము ఉండి అచ్చటి విద్యాపద్ధతుల నన్నిటిని సమగ్రముగా పరిశీలించి, ఆధునిక పరిస్థితులకు అనుగుణముగా ఉండు విద్యావిధానపు ఆవశ్యకతను సూచిం

చుచు ఒక రిపోర్టును మైసూరు ముఖ్యమంత్రికి అందజేసినాడు ఆ రిపోర్టు ఈవిధముగా ప్రారంభమైనది

'బ్రిటిషు యుగమునుండి ఒకమార్పు ఏర్పడినది సహజముగా స్వాతంత్ర్యమన్నది మన భద్రతకు తగిన బాధ్యతలనుకూడ కొనితెచ్చును రక్షణ చర్యలు, పరిశ్రమలు వార్తాదికము విద్య అను వానినిబట్టిన దృక్పథమున ఆధునిక పద్ధతికి తగినట్లు జాగరూకతతో సన్నద్ధులై యుండుటకూడ ఈ స్వాతంత్రము మనకు అప్పగించిన భారమే'

ఇందులో రాజీపద్ధతులు రాద్ధాంత సిద్ధాంతాలు లేక దేశావసరమైన ప్రజాస్వామ్యము పెంపొందించెడి పద్ధతి సమకూర్పబడినది అయినను రెడ్డి పద్ధతులు విమర్శకు గురి కావేదనకోరాదు వాని మీద చాల తర్జన భర్జనలు జరిగినవి కాని అందులో అక్షరమైనను మార్పులేకుండ అవి అలో పెట్టబడినవి సర్ రాధాకృష్ణన్ గారి విశ్వవిద్యాలయ సంఘ నివేదిక రెడ్డి నివేదికకు పిమ్మట ప్రచురితమయినది విద్యారంగమున కలుగు మార్పులకు ఈ రెండు నివేదికలు మూలకంగా లగడగును రెడ్డి నివేదిక ఒక మైసూరు విశ్వవిద్యాలయమునకేకాక వివిధ విశ్వవిద్యాలయములకును అనుసరణీయమైన దనుటలో అతిశయోక్తి ఆవంతయు లేదు

అట్లు నివేదిక సమర్పించిన పిమ్మట మైసూరు ప్రభువును వీడ్కొని స్వదేశమునకు తిరిగి వచ్చినాడు రెడ్డి తిన్నగా తన కోసము నియమితమైన మందిరము ప్రవేశించినాడు ఎక్కడెక్కడనో తిరిగి తల్లి ఒడిలోనికి చేరిన చిన్న పాపవలె ఆనందపరవశుడైనాడు పిదప ఆ మందిరములో చిన్న చిన్న మార్పులు చేయించినాడు ఆవరణములో సుందరమైన చిన్ని ఉద్యానవనమును సృష్టించుకొన్నాడు తోట అనగా ఆయనకు గల ప్రేమకు అంతు

లేదు దానిని చూచి ఆనందించుచు ఒకనాడు ఆయన మిత్రులతో ఇట్లు అన్నాడు 'నాకు ప్రియతమమైన ఈ విశ్వవిద్యాలయ ప్రాంగణములోనే ప్రాణము వదలెదను ఆయన ఇట్లు కమనీయమైన కలలు కనుచుండగా 1949 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో ఇందుకు భిన్నముగా జరుగవలసివచ్చినది అవి యెట్లు జరిగిన దన్న దానికి సంతృప్తికరమైన సమాధానము చెప్పుట సుకరము గాదు రెడ్డిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమును విడిచిరని కొందరందురు 'ఆంధ్ర విశ్వవిద్యాలయమే రెడ్డిగారిని విడిచిపెట్టిన దని మరికొందరందురు ఇవి రెండును అర్ధ సత్యములే ఇందులో ఏదో దైవ నిర్ణయ మున్న దనుకోవచ్చును శ్రీ రాధాకృష్ణ పండితుడు తన జీవిత చరిత్రములో ఒకచోట 'ఏదో ఒక అదృశ్యహస్తము నన్ను నడుపుచున్న దని వ్రాసినాడు ఆ అదృశ్యహస్తమే రామలింగారెడ్డిని గూడ నడపెడి దని మనము అనుకొనవలెను

మైసూరు ప్రభుత్వము మన రెడ్డి సూచనలే ప్రాతిపదికగా విశ్వవిద్యాలయపు సవరణలు చట్టము చేసి విశ్వవిద్యాలయపు హక్కులు, అధికారాలు బాధ్యతలు పెంచి వానిని అమలులో ఉంచి విశ్వవిద్యాలయ పునర్నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుటకై ఆయననే ఆ విశ్వవిద్యాలయ సహాయాధ్యక్షులు విద్యావిషయపు సలహాదారులు (Prochanceller and Educational adviser) గా నియమించుచు 1949 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో ఆయనకు ఆ విషయము తెలియజేసినది ఆంధ్రులును కర్ణాటకులును చిరకాలమునుండి సోదరులుగా మెలగినారు ఆంధ్రులకు అన్నివిధముల సన్నిహితులైనవారు కర్ణాటకులు రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన రన్నపొన్న మొదలగువారు మనఆంధ్రకవులే వారు కన్నడములో కవిత్వము చెప్పినారు కన్నడరాయడగు కృష్ణరాయలు ఆంధ్రభోజుడుగా విఖ్యాతిగాంచినాడు నన్నయ

భట్టునకు సహాధ్యాయ యగు నారాయణభట్టు భారత రచనలో నారాయణుడు కురుక్షేత్ర సంగ్రామములో అర్జునునకు తోడుపడినట్లు తోడుపడినాడని నన్నయభట్టే చెప్పకొనుట జగద్విదితము కర్ణాట భారతచ్ఛాయలు ఆంధ్రభారతమున గమనించగలము ఈ పురాతన సంబంధము రెడ్డిగారి ద్వారమున మరల మనకు చేకూరుట అదృష్టము గదా!

రెడ్డి వెంటనే మైసూరుచేరి తన సూచనలను అమలుపెట్టుటలో నిమగ్నుడైనాడు ఇట్లు కొంతకాలము గడచినది కాని దైవికముగా 1950 వ సంవత్సరము జనవరిలో ఆరోగ్యము దెబ్బతినుటచేత మైసూరు విశ్వవిద్యాలయములోని తన ఉద్యోగమునకు రాజినామా నిచ్చి ఆయన మద్రాసునకు చికిత్స నిమిత్తము వెళ్ళవలసి వచ్చినది

## రామలింగా రెడ్డిది దోషమా ?

రెడ్డికి ఈశ్వరుడు అఖండమైన ప్రతిభ ఇచ్చినాడు ఆయన తన ప్రతిభకు తగిన పని చేసినాడా? చేయలేదని చాలమంది నిష్ఠురమాడుదురు ఆయనకు నిలకడకూడ లేదని మరికొందరు మహామహులుకూడ అందురు విద్యారంగమునుండి రాజకీయరంగమునకు రాజకీయరంగమునుండి విద్యారంగమునకు గంతులు వేసినాడని లోకమనును

విద్యామంత్రిగానుండి దేశసేవ చేయుదమన్న జస్టిస్‌పార్టీవారు ఆయన రాకతో తమ ఉనికకే భంగము వచ్చునేమో యని అంచులోనికి రానివ్వలేదు

జస్టిస్ పార్టీవారు స్వార్థపరులు ! కాంగ్రెసువారు లోకము నంతటని ఉద్ధరించుటకు వచ్చినవారు గదా ! ఇక వారు ఏమి జేసినారో గమనింతము ప్రభుత్వమువారి అక్రమములను ఖండించుచు కాంగ్రెసునందు భక్తితో తనకు ప్రియమైన ఆంధ్ర విశ్వవిద్యాలయమును నెలకు రెండు వేల జీతమును వదలిపెట్టినాడు మరి కాంగ్రెసువారు ఆయనను ఏలాగున నుపయోగించుకొన్నారు ?

1930 లో ఆయనను ఆంధ్రరాష్ట్రపు కాంగ్రెసు వర్కింగు కమిటీ మెంబరుగా చేసి తరువాత అఖిలభారత కాంగ్రెసు కార్య నిర్వాహక సభ్యునిగా చేసి ఆయనను కారాగృహమునకు పంపుద మని కొందరు కాంగ్రెసు యువకులు అనుకున్నచో బయట మంచములమీద ఉన్న వృద్ధులు క్రుద్ధులయినారు

అటు తరువాత ఆయనకు కాంగ్రెసు మతమిచ్చి 1935 లో జిల్లాబోర్డు అభ్యర్థిగా మునిస్వామినాయుడు స్థానములో ఏర్పడిన ఖాళీలో ఉపవరణములలో నిలిపి 1937 ఎన్నికలలో తిరిగి ఆయనను బహిష్కరించినారు 1937 లో సత్యమూర్తిగారున్నచో ప్రధానమంత్రిపదవి అరవలకు రాదని ఆయనను కేంద్రశాసన సభకు నిలబెట్ట మెడలువిరచి రాజాజీని తెచ్చుకొన్నారు అరవ సోదరులు ఆంధ్ర సోదరులు ఆయన ఇక్కడ ఉన్నచో తమకు అడ్డ మని భావించిన కనీసము కేంద్ర శాసనసభకైన వెళ్ళెడి ఏర్పాటు ఏమైన చేసినారా అన్న, అదియును లేదు

పైగా 1939 లో ఆయనను విశ్వవిద్యాలయోపాధ్యాక్ష పీఠమునుండి దింపవలెనని ఆంధ్రకాంగ్రెసు అన్ని ప్రయత్నములు చేసినది త్రిపురీ కాంగ్రెసునకు వచ్చిన ఆంధ్ర కాంగ్రెసు పెద్ద లొకరు కెన్నేటి విశ్వనాథముగారిని ఉపాధ్యక్షతకు కాంగ్రెసు అభ్యర్థిగా పెట్టిన బాగుగా నుండునని అన్నారు ఆయనను నియమించినచో బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదము సర్కారు దత్త మండలముల భేదము వచ్చునని కడప కోటిరెడ్డిగారిని నియమించిన

బాగుగా నుండును! ఆయనను పెట్టినప్పుడు కాంగ్రెసు కుల స్థల భేదములకు అతీతముగా నున్నదని భావించుటకు అవకాశముండునని మరియొక మహాశయుడు సలహా ఇచ్చినాడు కోటిరెడ్డిగారికి ఇది సుతరాము ఇష్టములేదు కాని కాంగ్రెసు నెడల వినయ విధేయతలు చూపక పోయినచో ఆయనకు కుల తత్త్వము ఆపాదింతురు మతభ్రష్టుని చేయుదురు అందువల్ల ఆయన తలవంచక తప్పనదికాదు అప్పటిలో కాంగ్రెసు శాసన సభ్యులగు లక్కరాజు సుబ్బారావు మొదలగువారిని కాంగ్రెసు అభ్యర్థికి వోటు ఇవ్వవలసినదిగా వత్తిడి చేసినారు నేనిదివరకే రామలింగారెడ్డికి మాట ఇచ్చినాము మీరు ప్రథమములో చెప్ప లేదు మాట తప్పుట మర్యాద కాదని వారు సమాధానము చెప్పినారు కోటిరెడ్డిగారుకూడ అలాగే రామలింగారెడ్డిగారికి మాట ఇచ్చినారు ఆ పెద్దమనిషి ఆయనకు వ్యతిరేకముగా నిల బడుట లేదా? మీరు మేము చెప్పినట్లు వినకపోయినచో మీ మీద చర్య తీసికొందుమని తాఖీదు ఇచ్చినారు 'మాకు మాట ప్రధానముకాని రాజకీయములు ప్రధానములు కావని సుబ్బా రావుగారు తదితరులు సమాధాన మిచ్చినారు మహర్షి సాంబ మూర్తిగారు ఈ భారము నంతటిని తమ భుజస్కంధములమీద వేసికొని కోటిరెడ్డిగారిని వెంటబెట్టుకొని వాల్తేరు రైల్వేస్టేషనుకు వచ్చిన సెనేట్ మెంబర్లను అర్థించుటకు వచ్చినారు కాని ఏమియు ప్రయోజనము లేకపోయినది నిశ్చింతముగా కూర్చున్న రామ లింగారెడ్డియే విజయము గాంచినాడు ఇంత ఆలస్యముగా హడా విడిగా కాంగ్రెసు అభ్యర్థిని ఎందుకు నిలువవలెనో కాంగ్రెసు ప్రతిష్ఠను ఎందుకు నమ్ము చేయవలెనో మన అల్పబుద్ధికి అందదు

ఇక అఖిలభారత కాంగ్రెసువారు, లేక మన ప్రధాన మంత్రిగారు రాజ్యాంగ పరిషత్తున కైనను పిలిచి పీట వేసిరా? బ్రిటిష్‌వారి బంటులను ఎంతమందిని కాంగ్రెసు స్వీకరించలేదు? రాజ్యాంగ [illegible]నకు తీ[illegible]సందుకు ఆయన ఏమియు అసం

తృప్తి చెందలేదు ఆ సందర్భములో కూడ ఆయన చాల ఉదారముగానేఉన్నాడు 'రాజ్యాంగ పరిషత్తు ద్వారమున సేవజేసెడి అవకాశము లభించనందుకు నాకు ఆశాభంగము కలిగించినమాట వాస్తవమే కాని అది నాకు విషాదము కలిగించలేదు కాంగ్రెసు వారు నాకు అగౌరవము కలిగించనందులకు వారిని నేను నిందించను ”

ఇక వారిమాట అలాగుంచి హైకోర్టు న్యాయమూర్తి చేసి వృద్ధులయి పింఛను తీసికొన్న రామేశంగారు 1936 లో ఏమని పోటి చేసినట్లు? ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఏ ఏ అక్రమాలు చేసినాడని న్యాయము కలుగ చేయవలెనని ఆయన వచ్చినట్లు? ఆయన ఎంతమంది ప్లీడర్లను కూడగట్టుకొన్నను ప్రయోజనము పొందలేదు!

1945 లో బొబ్బిలి పిఠాపురము రాజాగార్లు బులుసు సాంబమూర్తిగారిని పోటీపెట్టి కొత్తగ సెనేటు సభ్యులను తమ సంచులను విప్పి కప్పు పెట్టి చేర్పించవలెనని సర్వప్రయత్నములు చేసినారు కాని అవియును సఫలత పొందలేదు మూడేసి వేలిచ్చిన సెనేటు సభ్యుడు కావచ్చు ఈ విధముగా విశ్వవిద్యాలయమునకు ధనము చేకూరునని రెడ్డి భావించి ఇట్లు ఏర్పాటుచేసినాడు దానిని సాకుగా పెట్టుకొని తమ కష్టమైన 15 మంది వ్యక్తులచేత సెనేటు అభ్యర్థిత్వమును అభ్యర్థింపజేసినారు ఎన్నికలలో రామలింగారెడ్డిని ఓడించుటకు పన్నిన పన్నాగమని దీనిని సెనేటువారు నిరాకరించినారు

ఈ విధముగా ఆయనను అనేకవిధాల కష్టపెట్టినారు ఏదో విధముగా ఆయన శక్తికొలది శారదార్చన చేయుచున్నాడని గ్రహించక తమతమ స్వప్రయోజనాలను మనస్సులో పెట్టుకొని ఆయనను దింపవలెనని ప్రయత్నము చేసినారు ఆయనచేయు సేవ సెనేటు సభ్యులకు విదితమే అయినప్పటికి మాటమాటకు ఆయన ఈ ఎన్నికల రభస పడలేక తన శిష్యులు, అభిమానులు

తాను ప్రథమములో పాదుకొల్పిన మైసూరు విశ్వవిద్యాలయము నకు ప్రోచాన్సెలరుగ రావలసినదిగా కోరినందున తన శేషజీవిత మును మైసూరున కర్పించుటకై వెడలిపోయినాడు

రెడ్డిని గురించి ఆ మాట ఈ మాట అనెడివారు ఆలో చించదగిన విషయాలను గురించి విన్నవించుచున్నాను కాని అన్యము కాదు

ఆయనకు నిష్ఠ లేదందురు. కాని ఆయన 1936 నుండి 48 వరకు 12 ఏండ్లు ఏకదీక్షగ దక్షతతో ఆంధ్ర విశ్వవిద్యాలయోపా ధ్యక్ష పదవి అధిష్ఠించి ఆంధ్ర విశ్వవిద్యాలయపు పెంపు సొంపు లకు తోడ్పడి విజ్ఞుల మన్ననలను పొందినాడు

అయన ప్రతిభకు తగిన పని చేయలేదని నిందించెడివా రున్నారు కొల్లలుగా కాని ఆయనకు ఏమి అవకాశము ఇచ్చినది ఆంధ్రలోకము ? భరతఖండము ఏమైనా ఆయనకు ప్రత్యేక సన్మానమిచ్చినదా? ఆయనను ఎలా మన ముపయోగించుకొన గలిగినాము? మనలో యోగ్యతను గమనించి ప్రోత్సాహమిచ్చు గుణమున్నదా ? లేదా ? అను సంగతి ఆలోచించుకోవలసిన విషయము

బెంగాలి వారందరు చేరి 'చివరకు ప్రఫుల్ల చంద్రరాయ్, రవీంద్రనాథ టాగూరుతో సహా సుభాస్ చంద్రబోసును కాంగ్రెసు గద్దె ఎక్కించుటకు గాంధీమహాత్ముని నిర్ధించి సఫలు లయినారు మనమో, రామలింగారెడ్డిగారిని దింప ప్రయత్నించినాము

ఇంతకు రామలింగారెడ్డి ఎందుకు పుట్టినాడో, ఆయనకు ఏది విధివిహితమో ఎవరు ఆలోచించినారు ? ఆయనను జస్టిస్ పార్టీ చేర్చుకొన్నను కాంగ్రెసువారు కేంద్ర శాసనసభకు పంపి నను, ఆంధ్ర విశ్వవిద్యాలయము అభ్యుదయము గాంచెడిదేనా ? ఆయనను ఉపాధ్యక్ష పదవినుండి ఊడబెరకవలెనని చేసిన ప్రయ త్నము లన్నియు ఎందుకు విఫలమైనవి ?

'మనము ఎన్ని విధాల ప్రయత్నించినను ఏమియు ప్రయోజనము లేదు. ఏదో అదృశ్యహస్తము మనలను నడుపుచుండును' అన్నాడు రెడ్డి

ఇదంతయు చూడగా తిలక్‌గారి సంగతి స్మృతిపథమునకు వచ్చును తిలక్‌గారికి 6 ఏండ్లు శిక్ష విధింపగా ఆయన రామలింగారెడ్డి అన్నట్లే ఈ విధముగా అన్నారు

"ఈ లోకమంతయు అద్భుతమైన శక్తిచేత నిర్వహింపబడు చున్నది నేను బయట నుండుట కంటె కారాగృహములో కష్టపడుటవలన దేశమునకు అధిక సేవ చేయగలుగుట ఈశ్వరేచ్ఛ అయి యుండవచ్చు" అన్నాడు తిలక్ మహాశయుడు

ఆయనకు కలిగిన నిర్బంధము దేశప్రజలలో అధిక చైతన్యము చేకూర్చినది ఆయన మాండలే కారాగృహమునుండి గీతారహస్యమను ఉద్గ్రంథమును మన కిచ్చి అమరుడయినాడు ఆలాగే రామలింగారెడ్డిని అష్ట దిగ్బంధము చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అంటగట్టినారు ఆయనకు లభించినది ఉపాధ్యక్షపదవియే రామలింగారెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయమును అభివృద్ధి పొందించినాడు ఇది ఈశ్వర నిర్ణయము ఇందులో ఎవరిని నిందించవలసిన పనిలేదు స్తుతించవలసినదియు లేదు 'కర్తా భోక్తా జనార్దనః !

## పద్మ ప్రభాస

రామలింగారెడ్డిది నలుగురిలో తిరిగెడి స్వభావము గాదు 'ఇచ్ఛాపాటి మాటలాడుట ఆయన స్వభావము గాదు ప్రశాంతత ఇష్టము ఆయన అధికముగా అధ్యయనము చేసెడివాడు అట్టి వ్యక్తికి గ్రామములోగాని పట్టణములోగాని జన సమ్మర్దత భరింపరానిది అందుచేత ఆయన చిత్తూరునకు వచ్చినప్పుడు ఆ పట్టణపు ప్రక్కనున్న మేరీ బంగళాలో ఉండెడివాడు కొంత కాలము

నకు సొంతభవన మేర్పాటు చేసికొనుట మంచి దని భావించినాడు చిత్తూరు పట్టణపు చివర కలెక్టరు పోలీసు సూపరింటెంటు వగైరా 'బిల్డింగు'ల ప్రాంతాల చక్కని రెండవరోడ్డునకు ఆవల అడవి నానుకొని పది యెకరాల భూమిని సంపాదించినాడు అందులో దివ్యమైన ఒక ప్రాసాదమును 1929 వ సంవత్సరములో నిర్మించి నాడు దాని ప్లాను వేసినది ఆయనే అల్లుడు రామలింగారెడ్డి గారు దగ్గర ఉండి కట్టించినారు

దీని ప్లాను చాల ముచ్చటగ నున్నది ముందు భాగమున విశాలమైన గదులు, వెనుకవైపు చిన్నగదులు అలాగె రెండవ అంతస్తును ముందు భాగము విశాలముగా ఉండుటవల్ల చిన్న చిన్న సభలకు సమావేశాలకు కూడ అవకాశము ఉండును ఆయన జిల్లా బోర్డు ప్రెసిడెంటుగా నున్నపుడు సభలు తరచు అందులోనే జరిగెడివట ఇరుకు అన్నది ఆయనకు గిట్టదు వెనుక భాగము వంట మొదలగువానికి అనుకూలముగా చిన్న చిన్న గదులుగా ఏర్పాటు చేయబడినది ముందున 'పోర్టికో' చాల ముచ్చటగా నుండును దాని చుట్టును సన్న జాజుల సువాసన చుట్టుకొనగా ఆ రసహృదయుడు అందు ఆసీనుడై అధ్యయనము చేసెడివాడు ఆ విశాల భవనములో ఆయన విద్వత్తకు తగినట్లు గొప్ప పుస్తకభాండాగార ముండెడిది ఆ గ్రంథాలయములోని ప్రతి గ్రంథము చదువుచు 'మార్జిను'లో తనకు తోచినది సన్నని పెన్సిలుతో వ్రాసెడివాడు ఆయన అభిమానపాత్రమైనది ఆంధ్ర భారతము వివిధ ప్రచురణ కర్తలు ప్రకటించిన వన్నీ వుండెడివి వ్యక్తిగతముగా అంత ఉత్తమశ్రేణిక చెందిన గ్రంథాలయము ఏర్పరచుకొనుట ఆంధ్రులలో అరుదు పూర్వము బందరులో పురాణం సూరి శాస్త్రిగారికి గ్రంథాలయము ఒకటి ఉండెడిది అట్టిదే గుంటూరు జిల్లాలో టంగుటూరి కరణము పోతుల వెంకయ్యానాయుడుగారి కున్నది నార్ల వెంకటేశ్వరరావుగారు గొప్పపత్రికాసంపాదకుడు ఆయనమంచి

గ్రంథము కనబడినచో అప్పుచేసియైనను కొనక మానలేడు ఆయన నివసించెడి ఇంటికంటె గ్రంథాలయ ప్రదేశ మధికము

రామలింగారెడ్డి గ్రంథాలయపు గదిలో 'ఎరవు అడుగకండి!' అని పెద్ద అక్షరాలతో వ్రాయబడి యుండెడిది అసలు ఆయనను అడుగగల 'తాహత్తు' మాత్రము ఎవరికి కలదు? చదువుకొనుటకు తీసికొన్న పుస్తకము తిరిగివచ్చునని నమ్ముట కష్టము సంసారము గల ప్రతివారు ఏ కర్చుల నైన తగ్గించుకొని అవసరమైన గ్రంథాలను కొని యుంచుకొనుట మంచిది

ప్రతివారు తమ తమ అనుభవాలను అభిరుచులను అనుసరించి ఇండ్లకు నామకరణము చేసికొనుట సహజము మోతీలాల్ నెహ్రూగారు తమ భవనమునకు 'ఆనందభవనము' అని పేరు పెట్టుకొన్నారు ఆచార్య రంగాగారు తమ భవనమును 'గోభూమి' అన్నారు ఆలాగే రామలింగారెడ్డి తన భవనమునకు తన చిత్తవృత్తి ననుసరించి 'పద్మప్రభాస' అని నామకరణము చేసినాడు ఆయన భారతములోని ప్రభాసతీర్థమును పురస్కరించుకొని ఈ పేరు పెట్టుట జరిగినదని కొందరందురు కాని అది సరి కాదు

పద్మము మన సంప్రదాయమునుబట్టి జ్ఞానమునకుచిహ్నము ప్రభాసమనగా గొప్పప్రకాశము కనుక పద్మప్రభాస శబ్దార్థము 'జ్ఞానప్రకాశము' అన్నమాట ఈ రెండును ఆయన కిష్టమైన పదములు కనుకనే మనుమరాలికి 'పద్మ' అని, మనుమనికి 'ప్రభాస' అని నామకరణము చేసినాడు 'పద్మప్రభాస' అను చిరునామాతో వచ్చు ఉత్తరాలను చూచి ఆనందించెడివాడు

ఈ సుందర ప్రాసాదపు సింహద్వారము పై భాగమున అద్దాలపైన రంగులతో గజలక్ష్మి సరస్వతి విగ్రహములు గలవు కమలముపైన లక్ష్మి రెండు వైపుల ఏనుగులు నెమలి వాహనము పైన సరస్వతి వీణాపాణియై విరాజిల్లుచున్నది

ఈ పద్మప్రభాస ఆవరణ పదియెకరాలలోను ప్రపంచములోని వివిధ దేశములనుండి ఆయా దేశములలోని సుప్రసిద్ధములైన తరులతాదులను తెచ్చి అందులో మనోహరముగా నాటించినాడు ధనవ్యయముచేసి తీసికొనివచ్చి నాటించుటయేకాదు దాని పోషణకు నూతులు త్రవ్వించి మోటార్లు పెట్టించినాడు ప్రత్యూదయమును చెట్టు చెట్టునకు తిరిగి వానిని ప్రేమతో పలుకరించి ముచ్చటలాడెడివాడు పిల్లలమాదిరిగానే చెట్లను ప్రేమతో చూచిన అవి అధికముగా పెరుగునని నేడు విజ్ఞాన శాస్త్రజ్ఞులు వచించుచున్నారు ఈ విధముగా తరులతాదుల యెడల ప్రేమ బంధము జాతీయ కళాశాలకు తమ జీవిత మంకితముచేసిన స్వర్గీయ కోపల్లె హనుమంతరావుగారి కుండెడిది ఆయన వృక్షశాస్త్రజ్ఞుడు, కోమల హృదయుడు కళాశాలలో పిల్లలు చెట్లపై కెక్కినను కొమ్మలు విరచినను ఆయన సహించెడివాడు కాడు

క్రొత్తవారెవరైన వచ్చినచో రామలింగారెడ్డి వారిని ఆ విశాలమైన వనములోనికి తీసుకొనివెళ్ళి 'ఇది అశోకము శోకములేనిది సీతాదేవి ఈ చెట్టునీడనే విశ్రమించినది ఇది పారిజాతము దీనికొరకె సత్యభామ పంతము పట్టినది అని పారిజాతాపహరణములోని పద్యాలు చదివెడివాడు ఈలాగే విదేశాల చెట్లనుగురించి 'ఇది బ్రెడ్ ఫ్రూట్ ట్రీ (Bread fruit tree) దీనిపండు రొట్టెవలెనుండును ఇది కాశ్మీరమునుండి, తెచ్చినాము ఇది జపాన్‌నుండి ఇది ఫిలప్పైన్సునుండి ఇది కెనడానుండి అని చెప్పుచు, వృక్షశాస్త్రజ్ఞునివలె ఆ యా చెట్ల సంగతులను చెవిలో ఇల్లుగట్టుకొని చెప్పుచుండెడివాడు ఈ సంగతులన్నియు బౌద్ధవాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు చెప్పుచుండగా ఎంతో రమ్యముగా ఉండును రెడ్డి ఆయనను ఎంతో ప్రేమించుచు పుత్రతుల్యునిగా ఆదరించెడివాడు

'ఏమండీ ఈ చెట్టు చేమ ఎచ్చి మీరు ? అని అడిగినచో 'మనము రైతులము చెట్టుచేమల సంగతి తెలిసికొనకపోయినచో

చేసెడిదేమిటి? అనెడివా డాయన తండ్రియగు సుబ్రహ్మణ్య రెడ్డికి మామిడిచెట్లయందుగల మమత తనయునిలో పాదుకొని మహావృక్షమై విస్తరిల్లినది ఈ వృక్షాభిమానములో ఈయన తండ్రిని మించిన తనయుడైనాడు ఈ తోటలో మామిడిచెట్లు ఎక్కువ * అయిదు మర్రిచెట్లుకూడ ఉన్నవి పంచవటి ఆయన మనస్సులో పనిచేసి యుండును ఆయన ఎంత పాశ్చాత్యభావ ప్రియుడైనను అట్టడుగున భారతీయ సాంప్రదాయికత లేకపోలేదు

రామలింగారెడ్డి తన వీలునామాలో తన గ్రంథాలయము లోని రెండవ ప్రతులన్నియు చిత్తూరు హైస్కూలునకును మిగిలిన గ్రంథాలయ మంతయు తాను ప్రేమతో పెంచి పోషించిన ఆంధ్ర విశ్వవిద్యాలయమునకును ఇవ్వవలసినదిగా వ్రాసినాడు ఆయన రచనలన్నిటిని ఆంధ్ర విశ్వవిద్యాలయమునకే అర్పించినాడు

ఆయన మనుమడు విశ్వవిద్యాలయమునకు తెలియజేయగా అబ్బూరి రామకృష్ణారావుగారును మరొకరును వచ్చి పరిశీలించి, శ్రీయుత పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారిని తప్సీలుగ లిస్టు వ్రాయించవలసినదని చెప్పిరి శ్రీరాములురెడ్డిగారు సుప్రసిద్ధకవులు రామలింగారెడ్డికి దగ్గరి బంధువులు చిత్తూరు హైస్కూలులో తెలుగుపండితులు వారు సరిచూచి రెండవ ప్రతులను హైస్కూలు నకు చేర్పించినారు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు మిగిలిన గ్రంథ ములను తీసుకొని వెళ్ళుట ఆలస్యమయినది ఆ ఉత్తమ గ్రంథా లయము అటుపోయి, ఇటుపోయి చివరకు అంతరించినది

మన రామలింగారెడ్డి మనుమడు తాతగారిపేర ఒకవిద్యార్థి వేతనమును చిత్తూరు హైస్కూలులో ఏర్పాటు చేసినాడు

---

* I am by birth and love of occupation a member of the agriculture community

Hindu Dec 6 1934 C R Reddy's article

పద్మప్రభాసలో ముందరిభాగాన రామలింగారెడ్డికి అన్న కూతురును, ఆయనకు పెంపుడుకూతురును అగు సంజంతమ్మ (1899-1949) అన్నగారి కుమారుడు ప్రభాకరరెడ్డి (1910-56) రామలింగారెడ్డి (1880_19-1) గారల సమాధులు గలవు

ఆ పద్మప్రభాసను గోయెంకాగారికి 1 25 000 రూపాయలకు అమ్మట జరిగినది నేడు అందుండి 'ఆంధ్రప్రభ, Indian Express లు వెలువడుచున్నవి

రామలింగారెడ్డిగారి మనుమడు పద్మప్రభాస భవనమును అమ్మివేసినందకు మనము ఆగ్రహపడనక్కరలేదు వీరేశలింగము గారి భవనమునే హితకారిణీ సమాజమువారు అద్దెకు ఇచ్చినారు ఇది మన మన స్వత్వము మహాపురుషులు నివసించిన గృహాలను వారుపయోగించిన వస్తువులను గౌరవముతో గాంచవలెనని భద్ర పరచవలెనని ప్రజలకులేదు ప్రభుత్వమునకును లేదు ఇది మన సంస్కార విహీనత

సత్సంప్రదాయములో ఆంగ్లేయుల వరకు పోనక్కరలేదు మనకు సమీపమున నున్న తమిళ సోదరులనుండి యైన నేర్చుకోవచ్చును వారి జాతీయ కవియైన భారతి ఉత్సవము ఏటేటను ఆయన స్వగ్రామములో చేయుట, ఆయన గృహమును భద్ర పరచుట చూచుచునే యున్నాము వారు కంబకవి ఉత్సవమేటేట చేయుదురు త్యాగరాజు జన్మస్థలమైన గురువయ్యూరులో త్యాగరాజు ఆరాధన ప్రతి సంవత్సరమెంతో భక్తి శ్రద్ధలతో చేయుదురు ఆ వాగ్గేయకారుని ఆరాధించి గాయకులందరు ధన్యులగుదురు

మన దేశభక్తునకు గాని, దేశోద్ధారకునకు గాని చివరకు మన కనులు తెరిపించిన కందుకూరి వీరేశలింగము గారికగాని వర్ధంతులు చేయుచున్నామా? ఆత్మవిమర్శ అవసరము మహాపురుషులను విస్మరించి మనము అభ్యుదయము గాంచలేము

# సింహావలోకనము

'కొందరు, గొప్పగా జన్మింతురు మరి కొందరు గొప్పతనము సాధింతురు ఇంక కొందరిపైన గొప్పతనము మోపబడును' అన్నాడు ఆంగ్ల కవిసార్వభౌముడు షేక్స్పియరు మన రామలింగారెడ్డి ప్రథమశ్రేణికి చెందినవాడు ఆయన ఒక విలక్షణమైన వ్యక్తి మహాత్తర శక్తివంతుడు

కొందరు కొన్నిటిలో ప్రతిభావంతులు వారి ప్రతిభ పరిమితమైనది రామలింగారెడ్డి బహుముఖ ప్రతిభావంతుడు ఆయన కవి విమర్శకుడు, మహావక్త వాదచతురుడు సంభాషణలో అసమానుడు, హాస్యకుశలుడు, పార్లమెంటేరియన్ విద్యావేత్త, అన్నిటను అసమానుడు అన్ని రంగములలోను క్రొత్త పోకడలు పోయిన ఆధునికుడు ప్రతి రంగములోను అగ్రస్థానము వహించిన అఖండ ప్రతిభావంతుడు

బాల్య యౌవనములలో కూడ ఆయన ప్రతిభావంతుడుగానే ప్రకాశించెను మద్రాసు క్రైస్తవ కళాశాలలో పట్టభద్రుడై ఆర్థిక చరిత్రలోను, తత్వ శాస్త్రములోను పతకములు పొంది ప్రభుత్వ విద్యార్థి వేతనముతో కేంబ్రిడ్జి కళాశాలలో ప్రవేశించి ఇదివరకు ఏ భారతీయ విద్యార్థి పొందని బహుమతులను పదవులను గాంచి భారతీయులకు గౌరవప్రతిష్ఠలు కలిగించి ఆ దేశపు మహా విద్వాంసులకు కూడ ఆశ్చర్యము కలుగునట్లు మాటల నేర్పుతోనే వారిని ఓడించుచు సుప్రసిద్ధ దేశభక్తుడగు గోపాల కృష్ణగోఖలేగారి ప్రశంసలకు పాత్రుడైనాడు

బరోడా ప్రభువు ఆయన ప్రతిభను గుర్తించి ఇంకను ఉన్నతవిద్య నభ్యసించుటకు ఆయనను అమెరికాకు పంపి ఆనంత

రను తన కళాశాలలో వైస్ ప్రిన్సిపాల్‌గా నియమించెను రెడ్డి విద్యాసంస్కారశోపన్యాసములు విని విస్మితుడై ఆ నాటి మైసూరు దివాను మైసూరు మహారాజా వారి కళాశాలలో ప్రొఫెసరుగా నియమించెను రెడ్డి ప్రొఫెసరుగా ప్రవేశించి ప్రిన్సిపాలై విద్యాశాఖాధికారి కూడనై వినుతి గాంచెను ప్రొఫెసరుగ ఉన్నప్పుడు విద్యార్థులు ఆయన వాగమృతమును గ్రోలిరి ప్రిన్సిపాలుగా నున్నప్పుడు ఆ కళాశాల ఖ్యాతి దశదిశల వ్యాపించినది విద్యాశాఖాధికారిగ నున్న సమయములో విద్యావిధానము క్రొత్త తెన్నులు త్రొక్కినది

ఆయన మైసూరు మహారాజావారి కోరిక మీద ప్రాక్పశ్చిమ దేశములు పర్యటించి విద్యావిధానములను పరిశీలించి మైసూరు విశ్వవిద్యాలయ నిర్మాణమునకు ప్రాతిపదికగా ఒక రిపోర్టు వ్రాసి వినుతిగాంచెను

హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయము ఆయన సలహా సంప్రదింపులతోనే ఆయన మిత్రుడు అక్బరు హైదరీ నెల కొల్పెను

మైసూరును వీడి 1922 లో మద్రాసులో మకాము పెట్టి నాడు శాసనసభలో ప్రవేశించి జస్టిస్ పార్టీపై దండయాత్ర సాగించెను ఆయన విమర్శనలు హేళనలు ఖండనలు ఆ పార్టీని మూలమట్టుగ గడగడలాడించినవి భారతదేశములో మంత్రులపై విశ్వాసరాహిత్య తీర్మానము ప్రథమముగా ప్రవేశపెట్టిన ఖ్యాతి ఆయనకే దక్కినది ఆ తీర్మానము ఒక ఓటుతో ఓడిపోయి నప్పటికి నైతిక విజయము ఆయనదే ఆయన గొప్ప పార్లమెంటే రియన్‌గా ఖ్యాతి గాంచినాడు ప్రతిపక్షులను ప్రతిమలనుగ చేయగల వాదచతురుడు ఆయన సమయస్ఫూర్తి సందర్భశుద్ధి, ప్రతిభా ప్రయోగ కౌశలము, హాస్యవిలాసము ఛలోక్తి నిరుప మానములు ప్రతివాది నెన్నడు గెల్వ పోనీయలేదాయన రెడ్డి

వాక్యరచనయందు ప్రసంగమునందు ఆయన సహజ స్వతంత్రత స్వాధీనత విలక్షణతా ముద్రితము

రాజకీయములలో కూడ ఆయన స్థానము విద్యావేత్తగానే పరిగణింపదగినది ఆయన సలహా సంప్రదింపులు సముచితములు

సాహిత్యరంగములో ఆయన యువజను లెందరికో చేయూత నిచ్చి ఆదరించి ఆంధ్రశారదకు నవ్యాభరణములను చేకూర్చినాడు ఆయన ఆత్మప్రియముగ గ్రంథరచన చేసినాడు—ని కొందరి వలె అర్థమునకు ఆశపడి కాదు ఆయన ఎన్నడును ఎందులోను పామరాభిమానమునకు ప్రాకులాడలేదు

రామలింగారెడ్డి వచోనైపుణ్యము వర్ణింపదరముకానిది ఆయన మృదుమధుర వాగమృతమును గ్రోలినవారిదే భాగ్యము శ్రీకృష్ణుని మురళీరవమువలె ఆయన వచోనైపుణ్యము శ్రోతలను పారవశ్యము పొందించెడిది

రామలింగారెడ్డి బహుముఖ ప్రజ్ఞావంతుడయిన విద్యావేత్త భారతదేశములో ప్రథమముగా విశ్వవిద్యాలయ సంస్కరణలకై కృషిచేసి ఆధునిక విద్యకు రూపురేఖలు దిద్దిన మహాధీశాలి ఆయన విద్యారంగములో ఆయన పొందని గౌరవములేదు అఖిల భారత అంతర్విశ్వ విద్యాలయమునకు అధ్యక్షత వహించి అఖండయశస్సు గాంచెను 1948 లో మైసూరు విశ్వవిద్యాలయములో మార్పులను సూచించుచు దేశకాల పరిస్థితుల కనుగుణ్యముగ ఆయన వ్రాసిన రిపోర్టు విద్యాక్షేత్రములో ఆయనకు గల అనుభవమునకు ప్రతిభకు గీటురాయి ఆయన కార్యకలాపములలో చిరస్మరణీయమైనది ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి ఆయన కభిమానమైన విద్యాక్షేత్రములో ఆయన అసమానుడు విద్యావేత్తగ, ఉపాధ్యక్షునిగ ఆయన విశ్వవిఖ్యాతి గాంచినాడు

మద్రాసులో మంత్రి పదవి చేకూరినను, కాంగ్రెసువారు ఆయన మహత్తును గుర్తించి ఆయనను 1935 లో కేంద్ర శాసన

సభకు నిలువమని కోరినను 1937 లో మద్రాసు కౌన్సిలు అభ్యర్థిగా నిలువుమని అభ్యర్థించినను ఆయన చరిత్ర వేరుగ నుండెడిది

ఎవరి జీవితములో ఏ సంఘటన కీలకమో ఎవరికే విధముగ సాఫల్యము సిద్ధించునో ఎవరు చెప్పగలరు? సంఘటనలనుబట్టి ఏమియు నిర్ణయించ లేరు దానిలోని విలువ ఆయా వ్యక్తుల భావినిబట్టి యుండును

ఆయన సమకాలికులలో సర్వస్వతంత్రుడుగా ప్రవర్తించిన వాడు రెడ్డి నిర్భయముగా తనకుతోచిన విధమున సాంఘిక, రాజకీయ, సాహిత్య విద్యా క్షేత్రములలో ఆయన యిచ్చిన సలహాలు చేసిన రచనలు సర్వజనామోదము పొందకపోయినను సమాలోచనీయము కాగలిగినవి

జీవితముపట్ల ఆయన దృక్పథము ఇన్నింటికి మాతృక ఆయన ఉన్నచోట ఉత్సాహము వెల్లివిరిసినది సకలేంద్రియములను నిత్యజాగృత మొనర్చి రసభోగియైన మహనీయుడాయన

తాను చేసిన మహత్తర కార్యము తాను సర్వస్వతంత్రముగా ఆలోచించి ఆ భావములను వెలుగు చిమ్మునట్లు వ్యక్తపఱచుచు బుద్ధిమంతులయినవారిని ఆలోచించునట్లు చేయుట

ఎవరి ప్రశంసలను, విమర్శలను లక్ష్యపెట్టని మేరునగధీరుడు ఆయన ఆయన హృదయము 'వజ్రాదపి కఠినం కుసుమాదపి కోమలం' ఆయన విద్యాపతి, నవచైతన్యుడు

రామలింగారెడ్డి బహుముఖ ప్రతిభావంతుడు ఆధునికులలో ఆధునికుడు రసజ్ఞులలో రసికశేఖరుడు అట్టివాడాంధ్రావనిలో 'న భూతో న భవిష్యతి' ఆయన జీవితము ఒక మహాకావ్యము

# ఐక్యము

షష్టిపూర్తి వరకు ఆరోగ్యముగానే ఉన్నాడు మనరెడ్డి 1942 వ సంవత్సరములో కొంచెము సుస్తీ చేసినది ప్రపంచ యుద్ధము విజృంభించుట, జపానువారు వాల్తేరుపై బాంబులు వేయుట వాల్తేరునుండి విశ్వవిద్యాలయమును తరలించుట, దీనిని మిలిటరీ ఆక్రమించుకొనుట గుంటూరులోని విశ్వవిద్యాలయ గ్రంధాలయమును ఒక అర్ధరాత్రియందు తగులబెట్టుటకు ప్రయత్నము జరుగుట ఇవి అన్నియు ఆయనను చికాకుపరచినవి ఇవన్నియు ఇట్లుండగా ఆయన ఎంతో ప్రేమతో పెంచినకొమార్తె 1949 వ సంవత్సరములో మరణించినది కడుపుచగన్న ప్రేమ కంటె కన్నులగన్న ప్రేమ అధికము గద! తనముందే తమ సంతానము గతించుట ఎవ్వరికైనను మానని గాయమగును ఆ కడుపుతీపు కానరానిది అది మనుష్యులను మ్రింగివేయును పెంపుడుకూతురు సంజంతమ్మ మరణము రామలింగారెడ్డి గుండెకు సమ్మెట పెట్టయినది దానితో ఆయన ఆరోగ్యము మిక్కిలిగా దెబ్బతిన్నది

మైసూరులో నుండగానే ఆయనకు జబ్బుచేసినది ఇంగ్లాండు నకు వెళ్ళుదమనుకొన్నాడు కాని వీలుపడలేదు మూత్రనిరోధ మేర్పడినది 7-2-1951 వ తేదీన చెన్నపురికి వచ్చి 'నర్సింగు హోము లో చేరినాడు సుప్రసిద్ధ శస్త్రవైద్యుడు డాక్టర్ మీనన్ శస్త్రచికిత్స చేసినాడు మనుమరాలు డాక్టరు సత్యభామారెడ్డి రేయింబవలు తాతగారిని కనిపెట్టుకొని యుండుచునే యున్నది మొదట కొంత సులువుగానే ఉన్నదాయనకు కాని క్రమముగా ఆయన నీరసింపసాగినాడు డాక్టరు సి కె ప్రసాదరావుగా రాయ

నకు మిత్రులు ఆయన మిత్రుని శరీరస్థితి గమనించి ఆందోళన పడ జొచ్చినాడు మిత్రుని ఆందోళనమునకు మందహాసము చేయుచు ఇట్లన్నాడు మన రెడ్డి 'నేను జీవితమాధుర్యమును అనుభవించి నాను ఇంకేమియు ఆశలేదు మీ కెవ్వరికి ఆతురత కలిగింపకుండ ప్రశాంతముగా వెళ్ళిపోవుటయే నాకు కావలసినది" ఈ సందర్భ మును గురించి నాతో ముచ్చటించుచు ప్రసాదరావుగారు ఇట్ల న్నారు 'ఇంతవర కాయనను రసికునిగానే భావించినాముగాని, ఆమాట విన్నతర్వాత ఆయన ఎంత తాత్త్వికుడో నాకు అర్థ మైనది"

రామలింగారెడ్డి మొుఖీకుడై మృత్యువును నిరీక్షించినాడు చివరిక్షణము వరకును గభీరతను వదలలేదు స్పృహతప్పక కలుగు నంతవరకు స్పృహలోనే ఉన్నాడు ఆ చల్లనిచేయి తనను తాక నున్నంతలోనే ఒక కాగితము తీసికొని దానిమీద ఇక ఆశలేదు ధైర్యముగా ఉండుడు[1] (No hope Be brave) అని వ్రాసి 24వ తేదీ ఉదయాన ప్రశాంతముగా కన్నుమూసినాడు

అదే రామలింగారెడ్డి వ్యక్తిత్వమనగా మృత్యువునకే వెర వనివాడాయన ధైర్యముగా బ్రతికినాడు ధైర్యముగా వెళ్ళిపోయి నాడు ఇహమే స్వర్గమని, పరము నరకమని తలచినవాడు కాడు 'ఏ లోకమునైనను స్వర్గముగానే చేసికొనగల నని ఆయన నమ్మి నాడేమో! అన్నాడుగదా మన కవిసార్వభౌముడు 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడు డమర పురికి" అని అది తెలుగువానిక పుట్టుకతో అబ్బిన ఆత్మవిశ్వా సము కావలయును వాడెక్కడ నున్నను వెలుగవలసినవాడే వెలుగే కరచరణాద్యవయవములుగల మేనుకాగా తెలుగై వెలుగొందును ఈ స్వల్పభేదమే వెలుగు-తెలుగు అను జంటలోని ఏకాత్మిక భేద ముగా రూపొందియుండును

ఇంకొక సంవత్సరమునకు శరీరయాత్ర ముగియు ననగా ఒక మిత్రునితో ఇట్లన్నాడట మన రెడ్డి "I am not sorry I am

not dismayed" (నాకేమియు విచారములేదు చీకును చింతయు లేదు) వట్టిమాటలలోనే కాదు క్రియలలోను ఆ నిర్విచారత ప్రగటించినాడాయన అదిగదా బ్రదుకు! అట్టివానికిమృతియెక్కడిది?

ఈ వార్త తెలియగానే మద్రాసు ముఖ్యమంత్రి కుమారస్వామి రాజా మద్రాసు యూనివర్సిటీ వైస్‌ఛాన్సెలరు డాక్టరు లక్ష్మణస్వామి మొదలియారు, హోమ్‌డిపార్టుమెంటు సెక్రటరీ పుల్లారెడ్డి మున్నగు పెద్దలు రామలింగారెడ్డి అల్లుని ఇంటికి (మద్రాసులో కీల్పాక్‌లో నున్న ఇంటికి) వచ్చి తమ సానుభూతి సంతాపమును తెలియజేసినారు

మద్రాసు గవర్నరు భావనగరు మహారాజా మహారాణి గారల పక్షమున గవర్నరు ఎ డి సి కెప్టెన్ కిరుణా రమీానన్ వచ్చి రెడ్డి పాదములవద్ద పుష్పము లుంచినాడు మృతకళేబరమును కారుమీాద ఆ మధ్యాహ్నము చిత్తూరులోని పద్మప్రభాసకు తీసికొనివచ్చినారు

పద్మప్రభాసకు చేరుకొనగానే పౌరులు అసంఖ్యాకులై ఆయన తుది దర్శనము చేసికొని పుష్పహారములు సమర్పించి అంజలి బద్ధులయినారు మైసూరు ప్రభుత్వమును పూదండ పంపినది

సాయంకాలము 7 గం 37 నిమిషములకు ఆయనకు దగ్గరి జ్ఞాతియును మద్రాసు గవర్నరుగారి సైనిక కార్యదర్శియును అగు మేజర్ సి యన్ రెడ్డి మొదలగువారు పద్మప్రభాసకు సమీాపముననే ఉన్న కొంగారెడ్డిపల్లి శ్మశానవాటికకు ఆయన కళేబరమును కొనిపోయినారు స్థానిక శాసనసభ్యులు పౌరముఖ్యులు అంత్యక్రియలకు హాజరయినారు

అందరు చూచుచున్నంతలోనే ఆ మహాపురుషుని భౌతిక కాయము పావకునిలో లీనమైనది పాంచభౌతికమైనది పంచభూతా

లలో విభక్తమై పోయినది చైతన్యము చైతన్యముతో ఐక్య మొందినది

ఇట్లు కట్టమంచి కట్టకడపడిదాక తానెంతో ప్రేమించిన ఈ లోకమును, ఆంధ్ర విశ్వవిద్యాలయమును గూడ వదలిపోయి నాడు ఆ దృఢ గాత్రుడు ఆ నియమ పరిపాలకుడు ఆ సర్వ తంత్ర స్వతంత్రుడు అదృశ్యుడైపోయినాడు అందరును పోవుదురు మర్త్యులకును మరణము తప్పనిసరి కాని ఆయనవలె జీవించిన వారెందరు? ఎందరు యువజనులతో వీపు తట్టి ప్రోత్సాహపరచిన మహామహులు డాయన తల్లిదండ్రుల ఋణమును గురు ఋణమును దీర్చినవాడు ఆంధ్ర విశ్వకళాపరిషత్తును సమర్పించుటచేత దేశ మాత ఋణమును దీర్చిన ధన్యజీవనుడు ఒకటి చెప్పి ఇంకొకటి చేయకుండ మనసావాచాకర్మణా ఆచరించిన సత్యవర్తనుడు ఆయన ఎవరి తృప్తికొరకును, ఎవరి భయముకొరకును బ్రతుకలేదు

సాంఘిక దౌష్ట్యమును అరమర లేక ఖండించి, సర్వసమత్వ మును, సౌభ్రాతృత్వమును ప్రకటించిన రామలింగారెడ్డి వాణి మన కిక వినబడదు ఆధునిక దృష్టితో అనేక రచనలు చేసిన ఆ రచ యిత అమరుడయినాడు మధురకంఠముతో వేలకొలది ఉపన్యాసా లిచ్చిన ఆ వక్త దేశము సుసంపన్నము కావలెనని కలలు కన్న ఆ సుందర స్వాప్నికుడు ప్రపంచప్రజ లందరును అన్నదమ్ములవలె భావించిన ఆ భావుకుడు, ఎంతమంది యువ రచయితలకో ప్రోత్సాహమిచ్చిన ఆ మహారచయిత అందము ఆనందము అనుభ వింప నెరిగిన పరమ రసజ్ఞుడు ఈ లోకము విడిచినాడు

అందరను ఆప్యాయముగా పిలిచెడి ఆ రామలింగారెడ్డి అస్తమించినాడు ఇక ఆయన కనిపింపడు యువజన లోకమును వెన్నుతట్టెడి ఆ మృదు హస్తమిక లేదు ఆ మధుర మంజుల కంఠ ధ్వని వినిపించదు ఎక్కడికి వెళ్ళినాడాయన? పాంచభౌతిక దేహము పంచభూతాలలోను, చైతన్యము చైతన్యములోను కలియగా

ఆయన ఇక్కడ ఉన్నవాడే అయినాడు ఉత్సాహము, ప్రోత్సాహము, స్వాతంత్ర్యము సమత్వము ఆత్మవిశ్వాసము, ధీరత్వము, ఆత్మగౌరవము సహృదయత్వము ఆంధ్ర భాషాభిమానము నవ్యత ఆధునిక దృక్పథము మొదలగు గుణములు ఎక్కడ నుండునో అక్కడ ఆయన ఉండును ఆయన ఒక చైతన్యస్రవంతి చైతన్య మున్నంతవరకు ఆయన ఉన్నట్లే

## శ్రద్ధాంజలి

మైసూరు విశ్వవిద్యాలయోపాధ్యాయుడు ప్రొఫెసర్ వి యల్ డి సోంఝూ రేడియో ప్రసంగము — 1951 వ సంవత్సరము ఫిబ్రవరి 24 వ తేదీ

"నేడు మైసూరు నగరములోని ప్రతి గృహము చింతలో మునిగియున్నది కాదు, మైసూరు రాష్ట్రములో వేలాది యిండ్లు కూడ భారతావని యావత్తు అదే పరిస్థితి విద్యావేత్తగాను, రాజకీయవేత్తగాను ఆయనకున్న పేరు ప్రతిష్ఠలు అటువంటివి అందుకే ఇంగ్లాండు అమెరికాలు కూడ నేడు శోకములో మునిగియున్నవి ఇంతకు నేను ఆ వ్యక్తిని పొగడుటకై రాలేదు అతనిని తోడి మానవులకన్న ఘనుడని నిరూపించుటకు రాలేదు అతనిని ఆదర్శ పురుషునిగ ఋజువుచేసెడి ఉద్దేశ్యము నాకు బొత్తిగలేదు ఆలిండియా రేడియో స్టేషన్ డైరెక్టరు గారి పిలుపునందుకొని మనలను వీడిపోయిన మహనీయుని క్రాంతదర్శిని ఋషిని [illegible] వేత్తను, విద్యావేత్తను గూర్చి నాలుగు పూర్ణవాక్యాలు, నాలుగు గౌరవవచనాలు పలుకుదామని నేను వచ్చినాను

డా॥ రెడ్డి మనలను వీడిపోయినాడు వ్యా[illegible]ండి, బె[illegible] పడి పీనాసికాలమునుండి బ్రతుకుగడువు మరికొంత [illegible]నాడని



అనుకొనుచుండగా ఈ ప్రళయము జరిగినది బహువ్యాప్తమై చాల పెద్దదైన అతని మేధావుల కుటుంబమునకు చెందిన మావంటి వారు అతని వందలకొలది శిష్యులు వేలకొలది స్నేహితులు నేడు నిండు దుఃఖములో నున్నారు అతడు పరిపూర్ణమైన తాత్త్విక తృప్తితో తీరుతెన్నులేర్పడని సాగరయాత్రా సాహస ప్రవృత్తికి సహజమైన ఉత్సాహోల్లాసములతో మహాప్రస్థానము చేసెనను టలో సందేహములేదు అదియే అతని ప్రత్యేకత అతడు లేని కొరతకు జనము దుఃఖితులము వ్యక్తిగతమైన స్నేహజీవనము నందైననేమి రాష్ట్రజీవనము నందైననేమి అంతకు మించినచో ఈ యావద్భారత జాతీయజీవనము నందైననేమి ఆ కొరత, ఆ లోటు ఏవిధముగానైనను పూడనిదియు తీరనిదియును బుద్ధివికాసములో మేధాసంపన్నతలో ఆకసము వరకెదిగిన మహాకాయుడు కాని, హార్దికముగ పసిబాలుడు పనులు చేయుటలో మహాశక్తినుడు కాని మానవులకు ప్రకృతి సిద్ధమైన లోపములు, బలహీనతలు ఎరిగినవాడు వారియెడ సానుభూతిగలవాడు ఆదర్శములకు చెందిన ఆకాశహర్మ్యములలో తల దూర్చిన భావోన్నతిగలవాడు కాని అతని కాళ్ళు ఎన్నడు భూమిపట్టు వీడలేదు భావోన్నతమైన మేధాసంబంధమయిన జీవితపు విలువలను అవలంబించుకొన్నవాడు కాని, నిత్యజీవితమునకు చెందిన ఉత్తమ విషయములను ఆనందముగా అనుభవించెడివాడు అతడు కవి, తత్త్వవేత్త అయినను కార్యాచరణములో ఘటికుడు సంకల్ప నిశ్చితములలో ఎన్నడు తడబడనివాడు ఇది ఆ వ్యక్తిలోని అద్భుతమైన వైవిధ్యము భిన్నగుణముల అపరూపపు సమ్మేళనము అందుచేతనే అతడు ఆబాల గోపాలమునకు అభిమానపాత్రుడు

అతడు విశ్వవిద్యాలయమునకు (మైసూరు) గాని మైసూరు రాష్ట్రమునకు గాని అపరచితుడు కాడు అయినను అతడు ప్రస్తుతము సహాయాధ్యక్షుడు ( Pro chanceller ) గా నుండుట విశ్వ

విద్యాలయమునకు ప్రత్యేకమైన అదృష్టము అపూర్వమైన విశేషములతో కూడకొనియున్న అతని అధ్యాపక వ్యాసంగము మైసూరుమహారాజావారి కళాశాలలో ప్రారంభమైనది

రాజనీతి శాస్త్రము మరియు దానికి అనుబంధమైన ఇతర విషయముల ఆచార్యుడుగ అతనిఖ్యాతి నేటికిని అందరి స్మృతిపథములో నిత్యనూతనముగ వెలయుచునే ఉన్నది వయోవృద్ధులై పోవుచున్న అతని శిష్యులు నేటికిని తమ ఆచార్యుని గుణగానము చేయుటకు ఉత్సాహితులే అతనినుండి పొందిన ఉత్సాహము విద్యార్జన అభిరుచి జిజ్ఞాసతో ఈనాడును ప్రేరితులుగాను ఉత్సాహితులుగాను అగుపడుదురు తనలోని వైశిష్ట్యమునంతయును ఆచార్యుడుగా కళాశాల ప్రిన్సిపాలుగా విద్యార్థులపై వారియందు ప్రకృతిక సిద్ధముగా పడియున్న విద్యావిషయకమైన జ్ఞానసంబంధమయిన పిపాసను సంపూర్ణముగ వికసింపచేసినవాడు రెడ్డి మహారాజావావారి కళాశాల వదిలి చేపట్టినది మైసూరు విద్యాశాఖ అదియు ఆ శాఖకు డైరెక్టరుగాను అతని పర్యవేక్షణలో మార్గదర్శనములో విద్యాశాఖ గడించిన ప్రగతి పేర్కొనదగినది ఆధుని విద్యావిధానమున కనుగుణ్యముగ మైసూరు విద్యాశాఖ రూపొందుటకై రెడ్డి సుప్రసిద్ధమగు పునాదులు వేసినాడు దానికై ఆవశ్యకమగు రీతిని విద్యాశాఖ అంగాంగములను కూడ అతడు విస్తరింపజేసినాడు మైసూరు విద్యారంగములోని అన్నిశాఖలు రెడ్డి వైదుష్యము నేతృత్వము అఖండమైన మేధాసంపత్తి ముద్రపడినవే

ప్రత్యేకించి మా విశ్వవిద్యాలయము దాదాపు రెడ్డి సృష్టియే విశ్వవిద్యాలయము పుట్టుక అభివృద్ధి రెండు దశలలోను రెడ్డికి దానితో చాల దగ్గర సంబంధము గలిగియుండినదే పూర్వదశలో రాష్ట్రము యావత్తు పర్యటించి విద్యావిషయము మగు విచారణ జరిపి సిద్ధపరచి సమర్పించిన అతని నివేదిక విశ్వవిద్యా

లయ స్థాపనకు తగిన ప్రశాళికయైనది దానిపై ఆధారపడి విశ్వ విద్యాలయ స్థాపన జరిగినది రెండవదశలో అతని కృషి ఫలిత ముగా విశ్వవిద్యాలయము ఆధునిక విద్యా విధానమునకు అనుగుణ ముగ ఇతర విశ్వవిద్యాలయముల స్థాయిలో రూపొందినది ఈ రెండు దశలలోను రెడ్డి అనుభవము వైదుష్యము, వ్యక్తిత్వము విశాల హృదయము ఆధునిక దృక్పథము యొక్క ప్రభావము అడుగడుగున కనబడును మైసూరు రాష్ట్రమునకు మైసూరు విద్యాబోధనమునకు, మైసూరు విశ్వవిద్యాలయమునకు రెడ్డి లోప రహితమైన ఉత్కృష్టమైన అనుభవముతో కూడిన పరిణత చేకూర్చి నారు అఖండ ఖ్యాతిని గాంచ జేసినారు బుద్ధిబలము సమకూర్చి నారు వారి ఆధీనములో పనిచేసిన విద్యా సంస్థలకు దినదినాభి వృద్ధి గాంచవలెనను దృఢ సంకల్పము చలించని విశ్వాసము నిశ్చ యము కలుగజేసినారు

భారతావనిలో సక్రమమగు రాజకీయ చైతన్యము కలిగించు టలో రెడ్డిపాత్ర విషయమై నే నిప్పుడు విశేషముగా చెప్పదలచ లేదు రెడ్డి అధ్యక్షోపన్యాసములు ఇతర రాజకీయ ప్రసంగములు, ఉత్తర భారతములోనను దక్షిణ భారతములోనను గల నాయకు లకు దేశములోని రాజకీయ శక్తులను ధోరణులను సక్రమముగా తెలిసికొనుటకు గుర్తించుటకు విశేషముగా తోడ్పడినవి వీని నాధారముగ జేసికొనియే ఆ నాయకులు తమ రాజకయోద్యమ ముల నడుపుటలోను, రాజకీయ సమస్యలలో సక్రమమైన నిర్ణ యము రెడ్డి అభిప్రాయములు వ్యాఖ్యానములే రాజకీయ నాయకులకు దారి చూపినవి ప్రతిక్లిష్ట పరిస్థితిలోను ప్రతి చిక్కు సమస్యను విడదీయుటలోను అతని దివ్యమగు సలహా తప్పక తీసి కొనబడినది రెడ్డి జీవిత వ్యాసంగములోని పరోక్షరంగమునకు చెందని దీ రాజకీయ కృషి ప్రత్యక్ష జీవిత కార్యక్షేత్రము దక్షి ణాదిలోని విశ్వవిద్యాలయములది విశేషించి మైసూరు విశ్వ విద్యాలయము, ఆంధ్ర విశ్వవిద్యాలయములకు సంబంధించినవి ఈ

సరస్వతీ నిలయములు అతని సృష్టి సాక్షాత్తు బ్రహ్మయై ఆయన వానికి ప్రాణము పోసినాడు అతని చేతి చలువతో ఆ విశ్వవిద్యాలయమునకు కోటి విశ్వవిద్యాలయములలో ఒక విశిష్టస్థానము ఏర్పడినది వేరుగా తన నేతృత్వముతో వర్థిల్లుచున్న విద్యాసంస్థల రూపురేఖలు దిద్దుటతోనే సంతృప్తిపడక దేశములోని అన్ని విద్యా విషయకోద్యమములలోను అతడు ప్రత్యక్షముగ నున్నాడు భారత దేశము యావత్తు రెడ్డిని విద్యావిషయపు సలహాదారునిగ, నాయకునిగ గుర్తించినది మహోన్నతమైన పదవిని తన అద్భుతమైన వైదుష్యముతో అఖండమైన మేధాసంపదతో ఉత్కృష్టమైన అనుభవముతో, దూరదృష్టితో, విశాలహృదయముతో అపారమగు ఔదార్యముతో మెదడునకు పదునుపెట్టెడి తీవ్రబుద్ధితో వాక్చాతుర్యముతో రచనాపటిమతో, శోభాయమానముగా, జాజ్వల్యమానముగ నిర్వర్తించినాడు ”

రామలింగారెడ్డి ఇహలోకయాత్ర చాలించినాడని వినగానే ఆకాశవాణి విలపించినది పత్రికా ప్రపంచము సంతాపము ప్రకటించినది ఆంధ్రలోక మాయనకు అశ్రుతర్పణము సమర్పించినది

ఈ సందర్భములో ప్రముఖు లనేకులు తమ సంతాపములను ప్రకటించుచు సానుభూతిని వెల్లడించినారు గ్రంథవిస్తరభీతిచే అందులో కొన్నిటిని మాత్రమే సంగ్రహముగ పేర్కొనుచున్నాను

‘శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి ప్రతిభావంతుడు వ్యుత్పన్నుడు మేధావి, బహుముఖ ప్రజ్ఞా విశేషములు కలవాడు ఆంధ్రాంగ్ల భాషల రెంటను పండితుడు వాగ్మి ప్రపంచవక్తల శ్రేణికి జెందినవాడు చతుర సంభాషణా నైపుణిలో రాయలనాటి రామలింగని తలపింపగలవాడు మానవసంఘమున అనాదినుండి సాగుచు వచ్చిన వ్యష్టి సమష్టి తత్త్వసంఘర్షణములలో వ్యష్టి తత్త్వమునకె త్రికరణశుద్ధిగ మొగ్గెడి స్వభావము గలవాడు

విద్యావేత్తగ స్వదేశ విదేశములలో స్థానము గడించుకొన్నాడు సాంప్రదాయకమైన సంస్కృతి నవగాహన చేసికొనుటకును ఆచార్యుడుగ తెలుగు భాషలో తెన్నులు తీర్చుటకు ప్రయత్నించినాడు ఆంధ్ర విశ్వవిద్యాలయమును ప్రత్యక్షముగా సాధించిన ప్రప్రథమాధ్యక్షుడు దాదాపు జీవితాంతము వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయాధ్యక్షుడుగ విశ్వవిద్యాలయాభివృద్ధిలో తన శక్తి సామర్థ్యముల నన్నిటిని వినియోగించినాడు సాంప్రదాయక స్థైర్యముతో నవీన శాస్త్రీయ విజ్ఞానమును మేళవించి విశ్వవిద్యాలయ వికాసమునకు దోహద మొసగినాడు

పండితుడు, ప్రియభాషి చతురవచనుడు, భాషాసేవకుడు అపారశేముషీ సంపన్నుడు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డి గారి మరణమునకు విచారించుచున్నాము తెలుగుదేశ మంతయు విచారించుచున్నది ఆయన ఆత్మీయులకు సానుభూతి ఆయన ఆత్మకు శాంతి కలుగుగాత

—ఆంధ్రపత్రిక

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి నిర్యాణంవల్ల ఆంధ్రదేశమే కాదు, యావద్భారతభూమి బహుముఖ ప్రజ్ఞావంతుడైన ఒక వ్యక్తిని కోల్పోయినది

శ్రీ రామలింగారెడ్డిగారి వంటి కుశాగ్రబుద్ధి రసజ్ఞ శేఖరుడు, బహుభాషా విశారదుడు నూటికి కోటికి ఒక్కడుమాత్రమే జన్మిస్తాడు

మైసూరు విద్యాశాఖాధికారిగ రామలింగారెడ్డి విద్యాశాఖలో అనేక నవీన సంస్కరణలను ప్రవేశపెట్టినాడు

రామలింగారెడ్డి పాండిత్య ప్రకర్షకు, అతని వక్తృత్వ ప్రతిభకు రసభరితమైన ఛలోక్తులకు, వివిధ విషయ పరిశీలనకు, శాసనసభా రంగము సంపూర్ణ అవకాశము కల్పించినది

ఒక్క మాటలో - ఆ రోజులలో రామలింగారెడ్డి లేని రోజున చెన్నపురి శాసనసభ చిన్నపోయేది

ఆంధ్రవిశ్వవిద్యాలయ సృష్టిస్థితులకు రామలింగారెడ్డి చేసినంత కృషి ఒక్కరుగ మరెవ్వరు చేయలేదనటం నిర్వివాదమైన విషయం

నాటకము, సాంకేతిక సర్వకళాశాలంగ ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు రూపురేఖలు దిద్దినవాడు కట్టమంచి రామలింగారెడ్డి మనీషి అనుట నిస్సందేహము ధనాభావమే లేనట్లయినచో రెడ్డి చేతులలో ఆంధ్రవిశ్వవిద్యాలయము ఈనాటికి ఇంకా ఎంతటి ఉన్నతస్థితికి వచ్చిఉండెడిదో చెప్పలేము

ఆనాటి నుంచి దీక్షకు ప్రతిభ తోడైనచో అఖిలభారత రంగంలో డాక్టర్ రామలింగారెడ్డి అందుకోలేని పదవి అంటూ ఉండేది కాదు

శ్రీ కట్టమంచి వారి జీవితం ఆంధ్రలోకానికి అనేకవిధముల ఆదర్శప్రాయం

—ఆంధ్రప్రభ

మద్రాసు విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షులయిన శ్రీ లక్ష్మణస్వామి మొదలియార్ గారు

'డాక్టర్ రెడ్డిగారి నిర్యాణంతో భారతదేశము పండిత లోకములో ఒక మహా మేధావిని కోల్పోయినది అసాధారణ ప్రతిభాసంపన్నుడు బహుశః ఇప్పటి తరములో అట్టివారు కనబడరనే అనవచ్చును ఆయన ప్రపంచ ప్రసిద్ధుడు ఆయన చేసినసేవ అంతయు విశ్వవిద్యాలయాభివృద్ధికే ఆంధ్రవిశ్వవిద్యాలయము ఈనాడింత అభివృద్ధి చెందుటకు కారణము ఆయన ప్రతిభాసంపదే

ఆయన ఏ విషయము గురించి ఎప్పుడు మాట్లాడిననూ జనాన్ని ముగ్ధులనొనర్చేవారు రాజకీయవిషయములను గురించి ఇటీవల ఆయన ఎక్కువగ ప్రసంగించక పోయినా దేశాభ్యుదయ

మును చిత్తశుద్ధితో కాంక్షించే వారందరు ఆయన సలహాలను అపేక్షించేవారు

ఆయన మద్రాసు యూనివర్సిటీ ఆధ్వర్యము క్రింద జరిగిన సభలో ఇచ్చినదే తుది ఉపన్యాసము అది (Right honourable) శ్రీనివాసశాస్త్రి స్మారకార్థం ఏర్పాటుచేయబడ్డ ఉపన్యాసం

మద్రాసు యూనివర్సిటీలో పట్టభద్రుడయిన శ్రీ రెడ్డిగారు దానికి అన్ని విధముల ఖ్యాతి నార్జించి పెట్టినాడు "

మద్రాసు ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారు —

"దక్షిణ భారతములో 'వెలుగుదివ్వె' అనదగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి నిర్యాణ వార్తను నేను విని చాల విచారించినాను సంస్కృతికి వివేకమునకు అనేక రంగములలో ఆయనచేసిన సేవను చెన్నరాష్ట్రం ఎన్నటికి విస్మరించజాలదు

వెనుకటి రాజకీయ వ్యవస్థలోని మద్రాసు శాసనసభలో ఆయన నిర్వహించిన పాత్ర ప్రముఖమైనది ఆయనచేసే ప్రసంగములు, చర్చలు చాల రసవంతముగ నుండెడివి ఆయన నెలకొల్పిన సాంప్రదాయములు నేటికి అత్యంత అనుసరణీయములు

విద్యారంగములో ఆయన ప్రముఖ వ్యక్తి చెన్నరాష్ట్రములో ఉన్నత విద్యాభివృద్ధికి, ఆంధ్రయూనివర్శిటీ వికాసమునకు ఆయన జనకుడు ఆయన ప్రతిభాసంపదకు, ప్రజ్ఞకు, దూరదృష్టికి అది గొప్ప నిదర్శనము భౌతిక రూపము కనబడకపోయినా ఆయన అమరుడు "

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి వి రాజమన్నారుగారు— "ముఖ్యంగా దక్షిణభారతము ఒక అద్వితీయ ప్రతిభాశాలిని కోల్పోయినది ఆయన అత్యుత్తమ విద్యావేత్తయే గాక, ప్రాక్పశ్చిమ సాంస్కృతిక వాదాన్ని జీర్ణించుకొన్న విజ్ఞాని

మైసూరు ఆంధ్ర విశ్వవిద్యాలయములకు ఆయన చేసినసేవ అపారము విశేషించి ఆయన ధీవైశారద్యమే ఆంధ్ర విశ్వవిద్యాలయముగా సాక్షాత్కరించినది రాజకీయరంగములో ఏ ఒక్క పక్షమునకు ఆయనను ఇముడ్చుకోగల శక్తి లేకపోయినది ఆయన అంతటి నిశిత వ్యక్తిత్వ సంపన్నుడు అయినా మద్రాసు శాసన సభలో ఆయన ఉన్నప్పుడు ఆ సభలు ఇతోధిక చైతన్యవంత మయ్యేవి ఆయన చమత్కార సంభాషణలు నిశితమైన సరసోక్తులు విసరడంలో దిట్ట ఆయన అస్తమయంవల్ల ఏర్పడ్డ లోటు తీర్చరానిది ”

అన్నామలై యూనివర్సిటీ ప్రోఛాన్సలరగు చెట్టినాడు రాజాగారు

“అన్నామలై యూనివర్సిటీకి రెడ్డిగారు ఇచ్చిన సలహాలకు, సహాయమునకు ఎంతో కృతజ్ఞులము ఆయన గొప్ప రాజకీయ నేత్త విద్యాధురంధరుడు గతించిన 40 ఏండ్లలో విద్యారంగము నకు ఆయన చేసిన సేవ అపారము ఆంధ్రవిశ్వవిద్యాలయమన్న ఆయన ప్రాణసదృశము విద్యార్థి ప్రపంచము ఆంధ్ర లోకము ఆయన విశ్వవిద్యాలయమునకై చేసిన సేవలను కృతజ్ఞతతో స్మరించు చుండునని తలచెదను ”

# అనుబంధము

## రాజీనామా లేఖ

గాంధీమహాత్ముడు వైస్రాయిని సందర్శించి డొమినియన్ స్టేటస్ వాగ్దానము చేయవలెనని పట్టుపట్టినాడు కాని రాజప్రతినిధి ఏమియు చేయజాలనని పలికెను దానిమీదట ఆ సంప్రతింపులు వృథాయయ్యెను ఇంతలో 1929 డిసెంబరులో జవహర్ లాల్ అధ్యక్షతక్రింద లాహోరులో కాంగ్రెస్ మహాసభ జరిగినది పూర్ణస్వరాజ్యముకొరకు సత్యాగ్రహము చేయవలెనని తీర్మానించి నారు

1930వ సంవత్సరములో ఉప్పు సత్యాగ్రహము-మహాత్ముని దండియాత్ర జరిగినది దేశమందంతటా లాటిచార్జీలు శిక్షలు పెనాల్టి కాల్పులు 144వ సెక్షను ప్రయోగములు ఆర్డినెన్సులు వేల తరబడి పురుషులు స్త్రీలు పిల్లలు జైళ్ళకు పోవుట కుమారుని తప్పునకు తండ్రిని శిక్షించుట మొదలగు కఠినచర్యలు తీసుకొనుట జరిగినది

ఈ అక్రమమైన లాటీచార్జీలు రామలింగారెడ్డిని కలత పెట్టెను అప్పుడు ఒకలేఖ మద్రాసు గవర్నరుకు వ్రాసెను దానిలోని ముఖ్యాంశములు

పద్మప్రభాసము చిత్తూరు (ఎన్ ఎ)
1930 జూన్ 23

మిక్కిలి ఘనతవహించిన మహాభాగ !

నేనీ యుత్తరమును హృదయవేదనతోను బాధతోను వ్రాయుచున్నాను తమకు నా యెడలను, ఆంధ్రవిశ్వవిద్యాలయము పట్లను నిర్వికారముగ చూపుచున్న దాక్షిణ్యాభావమే నన్నిట్లు విచారగ్రస్తుని గావించుటకు హేతుభూతమగుచున్నది

లాహోర్ కాంగ్రెసులో ఆమోదించబడిన స్వాతంత్ర్యపు తీర్మానమునకు కట్టుబడునట్టి కాంగ్రెసువాదిని కాకపోయినప్పటికి నా దేశపు ప్రజానీకము స్త్రీ పురుషాదులందరు భారతదేశము స్వాభిమానముగల రాజ్యాంగముకొరకు బ్రిటిష్ కామన్వెల్తు ప్రజాస్వామిక రాజ్యములతోపాటు రూపొంది బ్రిటిష్ సామ్రాజ్యములోని యితరాధినివేశములతోపాటు సమానమైన హోదాను, ప్రతిపత్తిని పొందుటకై సాగించుచున్న పోరాటమును నేను ఆతురతతో గమనించుచున్నాను

ప్రజల శాసనోల్లంఘనోద్యమమును అణచుటకు ప్రభుత్వమనుసరించుచున్న చర్యలు రాక్షసకృత్యములకు సాటియగును అవి ఏవిధముగను సమర్థనీయములు గావు సంతోషపూర్వకముగా బందీకృతులగుటకు సిద్ధముగనుండి ఏమాత్రము నిరోధించనట్టి సత్యాగ్రహులపై పోలీసువారు దాడులు జరుపవలసిన యవసరమేమున్నది? చాల ప్రదేశములలో తుపాకి కాల్పులు మహామారివలె వ్యాపించుచున్నవి పార్లమెంటు సభలో మాంటేగు ప్రభువు జలియన్వాలాబాగ్ సంఘటననుగూర్చి మాటాడుచు తుపాకి కాల్పు-చర్య గైకొనబడిన సందర్భములలో నిష్పాక్షికమైన విచారణ జరుపబడునని ప్రకటించియుండెను అధికారులు అనధికారులతో కూడిన 'హంటర్ కమిటి' పంజాబు సంఘటనలనుగురించి విచారణ జరుపుటకుగాను పదిసంవత్సరములకు పూర్వము నియమించబడినది అటువంటి విచారణా సంఘము లీనాడు ఏర్పాటు చేయబడుటలేదు ప్రత్యక్షసాక్షులైన దేవధర్ త్యాబ్జీ ప్రభృతుల ప్రకటనలు అలక్ష్యము గావించబడినవి ప్రభుత్వేతర పక్షములలో న్యాయబుద్ధిగలవారు లేనట్లు పోలీసుచర్యలను ప్రభుత్వమువారు సర్వేసర్వత్రా స్తోత్రము చేయుచున్నారు

ప్రజలయొక్క ఆర్థిక హీనస్థితి, దౌర్భాగ్యపరిస్థితులు, అధినివేశ ప్రతిపత్తి సిద్ధాంతము మూలమున మాత్రమే తొలగగలవని

అసందిగ్ధమైన భారతప్రజాభిప్రాయమును ప్రభుత్వమువారు ఏ మాత్రమును గణుతింపుటలేదు ఈ ఉద్యమములో మేధావులతో పాటు సుసంఘటితులైన వ్యాపారులు కార్మికులు కర్షకులు జాగృతిని పొంది సమాన భాగస్వామ్యమును పొందుచున్నారు భారతదేశమునకు బ్రిటిష్ ప్రభుత్వమువారుచేసిన వాగ్దానమును నిలబెట్టుకొనుట కింతకంటె ఎట్టి ఉత్కృష్ట భావప్రకటన చేయవలసియుండును ?

ఉన్నత వంశీయులైన భారత నారీమణులు స్వాతంత్ర్యపు పోరాటములో ముందుకువచ్చి పాల్గొనుటవలన భారతదేశచరిత్రలో నూతనశకము ప్రారంభమైనది జాతికి ఉత్తేజము కలిగించుశక్తి, ధీరోదాత్తత దేశభక్తికి మేళవింపబడినది

మా రాష్ట్రములోనే చాలమంది ధనికకుటుంబములకు చెందిన పల్లీయులైన కమ్మవారు క్షత్రియులు, బలిజలు, రెడ్లు మొక్కవోనిధైర్యముతో అపూర్వమైన త్యాగనిరతి ప్రదర్శించుచు మిక్కిలి కష్టనష్టములకు గురియగుచున్నారు

మీ ప్రభుత్వము శాసనబద్ధమైన స్థానికసంస్థలను ప్రభుత్వ యంత్రాంగమునకు లోబరచుకొని కడచిన కొన్ని సంవత్సరములుగ మేమనుభవించుచున్న కొద్దిపాటి స్వేచ్ఛాస్వాతంత్ర్యములను కూడ హరించుచున్నది

సహాయనిరాకరణోద్యమ సమయమునకూడ ఇట్టి నిరంకుశ చర్యలు అవలంబించబడలేదు

ప్రభుత్వము స్థానికసంస్థల వోటర్లను ఒక పక్షమునకు చెందిన అభ్యర్థులకు మాత్రమే వోట్లిమ్మని నిర్దేశించుచు, మరొకపక్షము వారికి ఇవ్వవద్దని బెదరించుచు అసాధరణమైనట్టియు న్యాయవిరుద్ధమైనట్టియు చర్యకు పూనుకొనుచున్నది ఎన్నికలయొక్క స్వాతం

త్త్వమును సంరక్షించు విధాన మిదియేనా ? అటువంటి వర్తన ఏ సమయమందైనను అక్రమమే శాసనసభకు శాసనమండలికి ఎన్నికలు జరుగు సందర్భములో ఎన్నికల విధానము ప్రకటించ బడిన తర్వాత ప్రభుత్వము పరోక్షముగ వోటర్ల విధ్యుక్తధర్మము నకు వారి సుఖసంతోషములకు విరుద్ధముగ ప్రకటించినపుడు ఎన్ని కల దౌర్జన్యకాండమునకు ఇది నాందియా ? అని ఎల్లవారును ఆశ్చర్యపడకమానరు. న్యాయశాస్త్రము కల్పించునట్టి వాక్కులు సౌకర్యములకు లోబడి, ప్రజాభిప్రాయమును స్వేచ్ఛగ వ్యక్త పరచునట్టి విధముగ స్థానిక సంస్థలు నిర్వహించబడనప్పుడు వానిని అవినీతికి గురిచేయుటకంటె రద్దుపరచుట యుక్తము కదా !

ఈ విధముగ దమననీతి దినదిన ప్రవర్ధమాన మగు చున్నది హింసాకాండము ప్రజానీకమందలి శక్త్యుత్సాహములను నశింపజేసి భయాందోళనలతో కూడిన భీరుత్వస్థితికి కొనిపోవుటకై లక్షించుచున్నది ఈ విషాదాంత చరిత్రకు అతిరిక్తముగ మాలో నిల్వకొనుటకు యత్నించిన లవలేశమైన శీలమును గూడ సాధ్య మైనచో హరింపజేయుటకు అది ప్రయత్నించును ఈ హింసా కాండము నెదుర్కొనుటకు రాజకీయపక్షముల విభిన్నతను విస్మ రించి, భారతీయు లందరు సమైక్యమగుట వారి విధ్యుక్త ధర్మమని నేను భావించుచున్నాను కాంగ్రెసు సిద్ధాంతములను ఆమోదిం చనివారు సయితము ఆ సంస్థ భారతదేశములో నెలకొల్పబడిన అత్యున్నత జాతీయ శీలసంపదకు చెందిన పరిశోధనాగార మని అంగీకరించవలసి యుండును అది భారతీయులకు సుసంఘటితులగు విధానమును క్రమశిక్షణను బాగా నేర్పినది రాజకీయాందోళనలో ప్రేమను, అహింసా సిద్ధాంతమును చొప్పించుటవలన ఆధ్యాత్మిక భావన వ్యక్తపరచినది

స్వజాతీయులు ఆవాల గోప్యముగ గావించుచున్న
త్యాగములు వారికి కలుగు బాధలు నన్ను ప్రస్తుతోద్యోగములో
నుండనిచ్చుట లేదు ఈ మానసిక బాధల మధ్యమున ఉపాధ్యక్ష
పదవి నాకే మాత్రమయినను సంతోషగౌరవము నాపాదించుట
లేదని గ్రహించుచున్నాను

ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు నిస్సంశయముగ పమనా
రణాల అనధికారి అతడు రాజకీయములలో పాల్గొనవచ్చును
కాని ప్రస్తుతసమయము ఈ అవకాశము తీసుకొనుటకు చాల
శ్రమతో కూడినది విచారగ్రస్తమైనదికూడ

తమపరి కార్యనిర్వాహక సభాసమావేశము జులై 5 వ
తేదీన జరుగును నేను అధికారికమయిన బహిరంగప్రకటన చేయ
బోవుముందు నా రాజీనామా గూర్చి విశ్వవిద్యాలయ నిర్వాహక
సభవారితో చర్చించవలసి యుండును

నా ఉద్దేశమును సిండికేటులో వెల్లడిచేయుటకు ముందు
అధ్యక్షులైన మీకు ముందుగ తెలియపరచుట నా విద్యుక్త
ధర్మము అది చాల బాధాకరమైన ధర్మమని తమకు మనవి
చేయుచున్నాను ఆలోచింతమనుచు వాయిదాలు వేయుచు,
చాల కాలమునుండి ఉత్తరము వ్రాయవలెనని భావించుచున్నాను
కాని జూలై 5వ తేదీ దగ్గరకు వచ్చుచున్నది అందుచేత ఇంక
ఆలస్యము చేయుట భావ్యము కాదు అందువల్లనే ఈ నివేదన

తమరు నా పట్ల విశ్వవిద్యాలయము పట్ల వ్యక్తపరచిన
ఆదరాభిమానములకు నేను కృతజ్ఞత వెల్లడించకుండ ఈ ఉత్తర
మును ముగించలేను నా పట్ల మీకు గల దయార్ద్ర భావము నా
ప్రస్తుతపు పూనికకు ఆమోదజనకము కాదు కాని విధి నిర్వహణ
బలీయమైనది.

తమ మహత్తరమైన పలుకుబడిని మహాత్మ గాంధీని అర్థము చేసికొనుటలోను అతనితో రాజీపడుటలోను వినియోగించవలెసినదిగా ప్రార్థన మహాత్ముడు లాక్షణికమైన సంస్థలను గ్రుడ్డిగా బలపరచువాడు కాడు అతడందువలననే స్వాతంత్ర్యముయొక్క తేజస్సును గూర్చి నుడివెను అతడు కోరునదంతయు జాతి గౌరవము, ప్రజానీకముయొక్క ఆర్థికాభివృద్ధి మాత్రమే దీనిలో ఏ ఒక్కటికూడ తప్పనిసరిగ బ్రిటిష్ ప్రభుత్వముతో శాశ్వత సాహచర్యమును నెరపుటకుపకరింపజాలనిది కాదు

తమ యొక్క ప్రేమ పాత్రమైన

కట్టమంచి రామలింగా రెడ్డి

Padma Prabhasa
Chittoor (N A)
23rd June 30

Your Excellency

I am writing this letter in pain and travail of heart, rendered all the more distressing by your uniform kindness to me and the consideration shown to the Andhra University

Though I am not a Congressman, disapproving, as I do, the creed of Independence adopted at Lahore I feel keenly the struggle that my people, men and women are waging in order to secure a position of equal status with the other Dominions in the Empire, so that India might become a self respecting unit in the British Commonwealth of Nations

Judged by authoritative declarations of policy and the hopes created, the struggle seems to be unnecessary a tragedy in the true sense of the term Mr Ramsay Macdonald declared as leader of the Opposition, that India would be a Dominion in a few months Lord Irwin went on an embassy to England for the sake of India—a noble act and on November first last year issued his momentous statement of policy reiterating and emphasising Dominion Status I happened to be in Delhi at the time and took part in a conversation at which Mr V J Patel then president, Pandit Malaviya the younger Patel and Mr Birla were the chief persons present and I know the unanimity and enthusiasm with

which the Viceroy s historic pronouncement was acclaimed

Subsequent events threw a doubt on the reality and nearness of the prospects thus held out The speeches of British Statesmen and of Earl Russell in particular showed that the formula had no reassuring significance His Excellency Lord Irwin has in the speehes made since then avoided with obvious deliberation the phrase Dominion Status and has been employing such terms as a Real advance, Substantial advance and so forth One naturally asks where then was the need for his journey and the November declaration holding out Dominion Status if it was to be a very distant goal and indefinite journey s end or ideal far beyond present practical politics ? That ideal had always been posited by British statesmen and they had always professed a Self Governing India as our Ultimate destiny, and there was hardly any need to repeat that stale and vague sentiment, if it was not to be given genuine body and substance

All parties in India are agreed that the principle of Dominion status should be embodied in the forthcoming reforms As they are not unmindful of the complexity of the problem they have not been averse to safeguards during the transitory period

In fact His Excellen y Lord Irwin himself sometime before his departure to England spoke of the possibility of adopting a scheme which would automatically advance India to Dominion Status

It is therefore not clear why His Excellency has studiously refrained from announcing a policy in conformity with his own previous statements If that was done it is not likely that Mahatma Gandhi or the Congress would reject the offer and the present difficult situation would be completely eased

The measures taken by the Government to crush the Civil Disobedience Movement are akin to Terrorism for which there can be no justification What is the need for police assaults on peaceful Satyagrahis who not only do not resist arrest but offer themselves cheerfully to be arrested? There has also been an epidemic of firing in different places In connection with the Jallianwallah Bagh incident Mr Montagu declared in Parliament that whenever firing was resorted to an impartial enquiry should be held A commission of officials and non officials the Hunter Commission, was appointed to inquire into the Punjab incidents ten years ago Enquiries of a similar character are not held now the statements of respectable eye witnesses like Mr Devadhar and Mr Tyabji are ignored, and police action is uniformly eulogised by government as though there are no truthful men outside the official ranks

Nor have Government shown the consideration due to the unmistakable manifestation of opinion in India in favour of the principle of Dominion status by which alone the economic exploitation and the terrible degradation of the people could be arrested Organised Business Organised Labour the Peasants in so far as they are awakened and

organised are all as much in this movement as the Intelligentsia What more solid expression of opinion do Government desire before they honour their plighted word to India ?

The part that women have come forward to play in this struggle marks a new era in Indian History Women of the highest type and rank, chivalry is added to patriotism as a motive force of the Nation

In our own presidency the rural classes Kammas Kshatriyas, Vellalas and Reddies many of them substantial land lords are facing risks and dangers with the unfliching courage and undergoing tremendous sacrifices

Your Government is reducing statutory Local Bodies to a condition of departmental subservience and taking away from us the few real liberties we have been enjoying for some years past Even during the Non-co operation movement such modes of repression were not employed

Government have taken the very extraordinary and unconstitutional step of asking the Electors to Local Bodies not to vote for certain types of candidates and by implication whipping' them to vote for certain other types Is this the way to safeguard freedom of Elections ? Such conduct would be improper at any time, but when the Ukase is issued on the eve of general election to the Assembly and Council and Government decree though indirectly the nature of electoral duty or prudence under pain of their effective displeasure, one whether this is the beginning of electoral

terrorism If Local Bodies and elections are not to function as free agents and expressions of public opinion within the rights and scope conferred by law won t it be better to suspend than to demoralize them ?

And thus repression grows day by day Terrorism aims at reducing people to a state of fear and cowardice and killing their spirit It would if it could destroy what little character we have managed still to retain in spite of our tragic history It is I think the clear duty of all Indians, irrespective of their political affiliation to rally round and foil this attack Even those who differ from Congress have to recognise that it is the greatest laboratory of national character installed in India and that it has taught Indians the art of organisation and discipline and spirtualised political agitation by inculcating the spirit of Love and Non-Violence

The sacrifices and sufferings of my countrymen and country women make it impossible for me to continue in my present position I find the Vice-Chancellorship neither a pleasure nor honour in the midst of these agonies

The Andhra Vice Chancellor is no doubt a pucca Non-official and he could take part in politics But the times are too strenuous for me to take advantage of this freedom and too distressing

The next meeting of the Syndicate will be held on July 5th and I must discuss with them my resignation before a public or official statement can be made

It is my duty to inform you, our Chancellor of this intention of mine even before I broach the subject in the Syndicate and it is, let me assure you a most painful duty I have been thinking of writing to you for sometime past—thinking and postponing But July 5th approaches fast and it would not be right to delay longer Hence this submission

I cannot conclude without saying how grateful I am to you for all your kindness to me and the generous consideration you have shown to the University Your goodness to me makes my present task very unpleasant, but duty is paramount

I pray that you will exercise your powerful influence in favour of conciliation and an understanding with Mahatma Gandhi The Mahatma is no stickler to forms and technical constitutions That is why he spoke of the substance of independence National honour and economic betterment of the masses are all he cares for and neither is necessarily incompatible with the eternal colleagueship of Great Britain

yours very sincerely,

C R REDDY

# కట్టమంచి భావలహరి

మన భాషలో చాల సామెతలు ప్రముఖ్యము గాంచినవి ఒక విధమైన లయ ప్రాస రీతి ఏదో ఒక విధమైన ఛందస్సు వినిలో ఉండును ఆ సామెత సూత్ర ప్రాయముగా నుండి మన హృదయాలలో సూటిగా నాటుకొనును అందులో ఎంతో లోకానుభవ ముండును నీతి యుండును రచనలో సముచితముగా వాడబడిన ఆ సామెత ఎంతైన ఇంపు గలిగించును అట్టి సామెత లను లేక సూక్తులను ఎన్నింటికో పూరించినాడు రెడ్డి వాని నన్నింటిని ఇందు పొందుపరచుట పొసగదు కాని ఈ దిగువ నుదహరించినవి కొన్నియే అయినను ఆయన బుద్ధిమత్తను చాటు టకు చాలును

అసాధారణత మన్ననకు జన్మహేతువు

ఇహపరములు పరస్పర సంబంధములు సంపూర్ణాహంకృతి నిరహంకృతులు గర్వ్యాములు

పౌరుషము గౌరవము గలది

విశ్రాంతి యనగా కార్యాంతర గమనము

పశ్చిమ ఖండవాసులకు వ్యాపారవాణిజ్యాదులే జీవనదులు కృషియుపనదితో సమానము

వర్తమానంబు భూతంబునకు ఫలంబును భవిష్యత్తునకు బీజంబునై యుండు

అచలత్వము జడధర్మంబు చైతన్య ధర్మంబు చలనంబు తృప్తి సుప్తి

దేశాభివృద్ధికి యంత్రకళా ప్రబల్యము ఏడుగడ

యంత్రములను యంత్రములతోనే ఎదిరింపవలె

శ్రమ వేనిది ఇంద్రభోగము కొనసాగు కోరిక కాదు

వ్యక్తి దృష్టి నుండి సాంఘికదృష్టి అలవడవలెను

ధర్మమునకు నాశ్రయము సంఘము, దేశీయ శోభనకు పరమ పుణ్యంబు, సంఘ ధర్మము ఇతర ధర్మముల కెల్ల శ్రేష్ఠతమము

కడఁక లేక కార్యము లడరవు

పౌరుష ప్రకటనమే ముమ్మాటికి సర్వ సమ్మానావహంబు

పుట్టుటకన్నను తలవ్రాఁతకన్నను శిక్ష తరిబీతు అధిక శక్తిమంతము

సంఘము శరీరము ప్రజ లందులోని యవయవములు వచ్చుటకు బోవుటకు సులభముగానున్న చో వాణిజ్యము వజిలును

ఆర్థిక స్థితిగతు లాచారములకు మూలములు

వేదాంత ప్రశంసలకన్న ఆర్థిక పరిస్థితులు నడవడి తీర్పుటలో గరియంబులు

స్వాతంత్రతయు స్పర్థయు నేకవద్యాతములు ఇవి లేనిచో గొఱ్ఱెలకువలెఁ దలవంచుకొని గ్రుడ్డి మార్గములఁ జనుట విధిలేని శీలము

నిర్వైరత నిర్వీర్యత

ఏకవ్యక్తినుండు రాజ్యమును, ఏకపుత్త్రుడు గలిగిన కుటుంబమును సమానములు

భూతగ్రస్తులై యుండుట బుద్ధిహీనిమతము

కామముతో వాత్సల్యమును గలిసియుండును

నీడలేని వస్తువులు లేనట్లు లోపములు లేని పరిపూర్ణత లెట్టి పట్టుపట్ల వెదకినను దొరకవు

నేఁడు తరహా యనిపించుకొనునది రేపు వరహాకైనఁ బోవని దగును

విమర్శనము లేనిది వివేకోదయ ముండదు

ఎటు చూచినను అర్థార్జనం బవశ్య కర్తవ్యంబు

ధర్మాధర్మంబులు పరస్పర హేతువులు

ఇంద్రియోన్మూలముకన్న నింద్రియోన్మేషమే మంచిది

నవ్యత అభివృద్ధి దాయకము

అర్థార్జనంబునకు శ్రమ ఆధారభూతంబు

కామాతురునకుఁ గష్టంబులు, గనఁబడవు

అందరాని పండ్లకు ఱ్ఱులు చాచుట నరునకు నైజగుణంబు గాదు

దీనతయే దివ్య ధర్మంబనువారిఁ దీర్ప నెవరి తరము ?

కోటిమంది బృహన్నలలో ఒక భీమసేనుఁ డుండి మాత్రము ఏమి ప్రయోజనము ?

అందఱు అంధు లయిన రంభలు కాని రమణు లుందురే !

గొప్పవారికి వ్రతమే సుఖము తుచ్ఛులకు సుఖమే వ్రతము

నాగరికత ఎక్కువ యగు కొలఁది బ్రదుకు పాటుల స్థితిగతు లింకను జిక్కులను దాల్చును

రక్షించుటకు శక్తిలేనిచో సృష్టించుట మహా పాతకము

మనః కృషియు, హస్తకృషియుం గలియక యున్న నేర్పడు నది 'కళ గాదు కళంకము

# ఉత్తమాశయములు

రెడ్డి ఉత్తమాశయములపై దృష్టి ఉంచిన మహావిద్వాంసుడు ఇందులకు బహుదృష్టాంతములు గలవు ఆయన స్నాతకోపన్యాసములలో వానిని గాంచగలము

'మనము ఉన్నత లక్ష్యములతో ఉత్తేజితులము కావలెను స్వార్థపరుడో భీరువో సాధించు ప్రాపంచిక విజయముచే క్రుంగిపోవు నంతటి అల్పులము కారాదు (26-11-1936 వ తేదీనాడు పాట్నా విశ్వవిద్యాలయములో డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి స్నాతకోపన్యాసములో 17 వ పుట)

సత్యము, ఉద్దిష్టార్థమున చిత్తశుద్ధి, ఆదర్శమునకు కార్యనిర్వహణమునకు ధీరతతో అంకితమగుట అన్నవి సుస్థిరమును, సువిస్తరమును అగు మహావిజయమునకు ఏకైక ప్రాతిపదికము

జీవితమనగా భావముకాదు అది భావోద్దీపితమైన కర్తవ్యము, నడవడి అను వానితో కూడినది పూర్వకాలములో మన వేదాంతము కేవల సత్యసిద్ధాంతములతో ముడిపడక పరమ సత్యమును, ప్రకృతియందు అన్వేషించునది యైన యోగము, లేక సాధనవంటి జీవితము జ్ఞాని లేక అంతర్దృష్టిగల వ్యక్తి పామరుని కంటె అత్యున్నతమైన ఆత్మశక్తి కొరకు జీవితము నడపువాడు శబ్దార్థములు వలె అతనిక జీవితమును ఆలోచనమును ఒకటే మన వేదాంతశాస్త్రములు సంఘపు నూలుతో నేయబడిన వస్త్రములు కనుక అది ప్రామాణికమైనది ఈనాడు గాంధితత్త్వము సోమరి వేదాంతముకాదు అది యథార్థమైన, లేక నిశ్చయముగా ఊహింపబడిన క్రమశిక్షణ ఆ వేదాంతమును అంగీకరించువారైనను, అందరును అంగీకరింపనక్కరలేదనుకొందు-ఆక్రమశిక్షణను

పాటించుట అంతసులభమైన పనికాదు అని గ్రహించుటలేదు ప్రాచీన వేదాంతము మాటలలో గాదు ఆచరణపూర్వకముగా నుండెడిది అందు సిద్ధాంతము వ్యక్తి యోగ్యత విడివడలేదు అట్టి పరిపూర్ణమైనట్టి జీవితమును వ్యక్తిత్వమును మనము పునరార్జించుకొనవలసి యున్నది

"It is my sincere prayer that Europe may yet learn the lesson of selfcontrol and learn of the East the saving grace of moderation and the urgent need to limit and regulate worldly passions and effect a proper balance and harmony between all the four purushertas or objectives of life namely, wealth and its production by just means and its proper distribution love and social enjoyment devotion to righteousness, and freedom from bondage to worldliness, as having found worldliness unsatisfactory when weighed in the eternal scales of spiritual values There can be no greater senselessness than umbridled sense life and the Buddhas and Janakas may not be extinguished without plunging the world in darkness (Ibid page 20)

The week are there to be served not to be oppressed and exploited and their service is the Lord s service God is not the shadow of man projected on the screen of eternity human fancy s fantastic off shoot, but a veritable power that inspite of our own perversities and seeming frustrations makes for righteousness, the power to whom we must yield ourselves unreservedly Therefore it is that the change of heart is the reality to be sought for and not change of mechanical institutions though these are of value in the measure in which they

a e expressions of that change of heart The contiol and iegulenion of desiies has been a funda mental tenet of Indian thought in all its branches and foims, and loving regard foi life as such, whether human or sub human, and this ancient spiing submeiged undei the debiis of ages has been ieopened by the genius of Mahatma Gandhi And all this is not an airy fairy aspiration a thing to be dismissed as unattainable cloud and mystic moon shine but a doctrine practical real charged with the potentiality of national redemption and world salvation (Ibid page 22)

The felt presence of the Eternal is the most sustaining power for iighteous conduct It is not neess aiy to ha e iecouise to supernatural arguments to piove that such a felt piesence is a positive fact of life (vide page 17 Dr Reddy s convocation address delivered at the Osmania University in Fasli 13 [illegible])

'The cultivation of this sense of God and immortality is the highest inspiiation that human nature is capable of and the firmest support in all its trials and triaulations May this sense be an abiding and giowing regulation of your lives and may you all conduct your selves and act as immo ratals in the hands of the Almighty (I bid page 19)

'Women s progress and women s needs have not ieceived the attention due Their education, geneial as well as special such as Domestic Scien ces and Aits the exetensive organization of separate hospitals foi women and children and a wide spread system of women s Technical schools for teaching, child welfare and hygiene first aid,

values of foods, scientific cooking, dress making, laundry music and painting, and in the higher collegiate grades of education, sciences and application of sciences required to make the home efficient All these must be organised and I would even recommend the organization of a special department for these purposes (Vide page 11 Osmania University convocation Address delivered by Dr Reddy)

## ఛలోక్తులు

రామలింగారెడ్డిగారు బహుముఖ ప్రతిభావంతుడు ఆయన ప్రతిభలలో ఒకటి చతురోక్తి మరొకటి సమయస్ఫూర్తిగా మాటలాడి ప్రతిపక్షులను ప్రతిమలనుగా చేయుట రెడ్డిగారి ఛలోక్తులు, రిపార్టీలు కొన్నిటిని గమనించుదముగాక !

దేవాదయ ధర్మాదాయపు బిల్లుకొరకు ఒక కమిటీని వేసినాము ఆ కమిటీ కూర్చున్నది కాని గ్రుడ్డుమాత్రము పెట్టలేదు (సభలో గొల్లున నవ్వు)

పానుగల్లు మంత్రివర్గముపై విశ్వాసరాహిత్య తీర్మానమును ప్రతిపాదించుచుండగా పానుగల్లు రాజాగారు తమ యిద్దరి మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలలో రెడ్డి వ్రాసినవి రెడ్డికి చూపెను అంతట రెడ్డి నవ్వుతూ, వెంటనే యిట్లన్నాడు 'ఇంగ్లాండులో ప్రేయసీ ప్రియులు వ్రాసుకొన్న ప్రేమలేఖలు విడిపోవునాడు బయటపెట్టుకోరు" ఆ సమయస్ఫూర్తికి చకితుడై ఉత్తరాలను జేబులో పెట్టుకొన్నారు రాజాగారు

ద్వంద్వ ప్రభుత్వము మద్రాసులో చేయుచున్న అవకతవకలను అలహాబాదులోని పయొనీరు పత్రిక ఏకరువు పెట్టగా, ఒక

ప్రభుత్వసభ్యుడు 'ఇక్కడి విషయములు అక్కడి పత్రిక ఏలాగు వ్రాయగలిగినదో' అన్నాడు దానికి మన రెడ్డి ఇట్లు సమాధాన మిచ్చినాడు 'మన ద్వంద్వ ప్రభుత్వమను వ్యాధి మద్రాసు నకే పరిమితముకాదు (నవ్వు) అది హిందూదేశమునంతటను ప్రబలియున్నదే

సి పి రామస్వామి అయ్యరుగారు ప్రతిభావంతుడైన లాయరు పానుగల్లు ప్రభుత్వములో లా మెంబరు ఆయన రెడ్డిని పీటీచేయదలచి ఇటుల అనెను 'గౌరవనీయులైన విశ్వవిద్యా లయ సభ్యుడు (సత్యమూర్తిగారు) చూపిన విషయము సరియైన దైనచో చిత్తూరు సభ్యుడు (రెడ్డి) మాటాడు అవకాశములేదు ”

రెడ్డి 'కాని, గౌరవనీయుడైన అధ్యక్షుడు నన్ను ప్రసంగించవలసినదని అన్నాడు (సభలో గొల్లున నవ్వు, 1929) తడవుకొనక, ఎదుటివారికి జవాబుచెప్పుచు, నవ్వించగల నేర్పు అధిక ప్రతిభావంతులకే ఉండును అట్టిశక్తి కట్టమంచికి వెన్నతో పెట్టిన విద్య

1937 లో కాంగ్రెసు మంత్రిత్వములో రాజగోపాలాచారి ప్రధానమంత్రిగా వున్నప్పుడు రామలింగారెడ్డిగారు కౌన్సిలులో ప్రభుత్వ నియమితసభ్యుగా వుండెను ఆ మేధావులిద్దరు వాగ్యు ద్ధము చేసిరి

మిశ్రమ మంత్రివర్గము ఏర్పరచిన బాగుండునని రామలింగా రెడ్డిఒక సూచన చేయు సరికి 'మంత్రివర్గమేర్పడి నాలుగు నెల లైనది అప్పుడే మార్పా?' అన్నారు రాజాజీ

అందులకు రెడ్డిగారి సమాధానము 'Well I am not talking Arithmetic I am talking politics' నేను గణి తమును గురించి మాట్లాడుటలేదు రాజకీయములను గురించి

మిశ్రమ మంత్రివర్గ పద్ధతి మంచిదో కాదో చెప్పవలెను కాని, అప్పుడే మార్పా అనరాదు అవసరమని తోచినప్పుడు

మార్పు చేయవచ్చును రాజకీయములలో ఎప్పటికేది అవసరమని తోచిన అది చేయుట అవసరము

భాషాప్రయుక్తరాష్ట్ర విభజన తీర్మానము రాజాజీ కాలములో వచ్చినపుడు రామలింగారెడ్డిగారు ఇట్లు ప్రసంగించ ప్రారంభించెను 'ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రము కావలెనని కోరుచున్నాను' అని ఆయన అనుసరికి ప్రధానమంత్రి రాజాజీ ఇట్లు ప్రశ్నించినాడు May I know from whom and on whose behalf he speaks? what constitution?

'ఎవరికి ప్రతినిధులుగా, ఎవరికొరకు తమరు మాట్లాడుచున్నారో సెలవిత్తురా?'' అనుసరికి రెడ్డి "యావదాంధ్ర దేశము తరఫున" అని సమాధాన మిచ్చుసరికి సభయంతయు ఒక్కసారి నవ్వినది 'దత్తమండలములతో కూడానా? అని మరలరాజాజీ ప్రశ్న 'ఆంధ్రరాష్ట్రమనగా దత్తమండలములతో సహా అనియే అర్థమని ఆచార్యులవారికి అవగతముకాదా? ఆంగ్లేయులు విర్లంఘను చేసినట్లు చేయవలెనని తమ ఆలోచనయా? అట్లు విభజించి దత్త మండలములను మద్రాసుతో కలుపుకోవలెనని తమ ఆరాటమా?'

దీనికి సమాధానముగ రాజాజీ 'సమష్టి కుటుంబమును చీల్చుకొని కొడుకులు పంచుకొనిపోవుచున్నచో తండ్రికి యిష్టము లేనట్లు నాకును ఇష్టములేదనుచున్నాను' అనిరి

అందుకు రెడ్డి ప్రత్యుత్తరము 'ఈ మద్రాసురాష్ట్రము సమష్టికుటుంబ మెట్లగునో నాకు బోధపడకున్నది తండ్రిమాట, తల్లిమాట, ఎల్లలమాట వేరువేరు ఇదేమి సమష్టికుటుంబము బ్రిటిషువారు తమ పరిపాలనకొరకు ఏర్పరచుకొన్న రాష్ట్రమిది

Dr C R Reddy in the Legislature An able debater, or unequalled in repartee An interruption by him was more meaningful than a speech

He complained on one occasion that the Govt had neglected Andhra C Rajagopalachari the Govt, pointed out that Madras was so long under an Andhra Ministry

Dr Reddy "Yes, Andhra Ministry, dominated by a Tamil Bureaucracy (laughter)

The Ministry had not placed before the Legislature a certain report which apparently contained unfavourable remarks Rajagopalachari said he was unable to give the whole report but would give extracts from it

Dr Reddy We are not invalids to be fed on extracts (laughter)

Dr Reddy cleverly wined words Once he spoke of the Rightists, the Leftists and the Right aboutists (attending to right about turn)

Addressing a meeting of Shorthand writers in Madras there are Madras stenogrophers all over India Dr Reddy said, Madras is well known for their shorthand and long tongue

The Hindu s correspondent at waltair misreported Dr Reddy on some occasions and later wro e in the Hindu, that Dr Reddy himself proposed o make a statement on the subject in question

Dr Reddy in a letter to the Editor, said Sir' you correspondent has slung so much mud at me tha he now expects me to take a bath in public

At one moment he referred to wasteful expenditure by the Justice Ministry and the party s

proposed intention to effect economy and said, Such is their creed A voice That is not our creed Dr Reddy Then it may be your greed

Col Reid (Commander of the Madras Volunteers Guards) was speaking at a meeting Dr Reddy, who was presiding said 'Reid and he were together at Cambridge and even then Reid showed ability and judgement He approved a certain statement made by Reid Mrs Reid was also present at the meeting- and Dr Reddy said Col Reid is right and Mrs Reid will agree at least in public

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఆంధ్రమాత బిడ్డలలో అత్యంత ప్రతిభావంతుడు గిరీశం అన్నట్లు ఆయనవద్ద కూర్చుంటేనే ఒక Education ఆయన నోటినుంచి వచ్చే ప్రతి మాట ఒక మంచిముత్యం ఒక పర్యాయం ఏలూరులో కళాశాల ప్రారంభించుటకు ఏలూరు మునిసిపల్ ఆఫీసు ఆవరణలో ఏర్పాటయిన సభకు ఆయనను వైభవముగా తీసుకొనివెళ్ళు ఉద్దేశముతో ఏలూరు పౌరులు రకరకాలయిన మేళములు, చోపుదార్లు వగయిరా అట్టహాసంలో రాజమర్యాదలతో ఊరేగింపు ఒకటి ఏర్పాటుచేసిరి అప్పుడు ఆయన అన్నమాటలు 'మేళతాళములు పెండ్లికొమరునకును, ప్రేతమునకును అలంకారములు నేను పెండ్లికొమరుడను గాను ప్రేతమునుగాను నాకేల యీ గోల? అని నిరాకరించుటచేత ఆ వూరేగింపు మానివేయవలసి వచ్చినది

ఆ రోజు ఏర్పాటయిన బ్రహ్మాండమయిన సభలో ఏలూరు లోని ఒక ప్రముఖవక్త ఆవేశంతో మాట్లాడుతూ 'మన ఏలూరులో ఏర్పాటు కాబోవు కళాశాల మన రాష్ట్రములోనేగాక, దేశములోను, ప్రపంచములోను కూడ ఎన్నదగినదిగా వుండవలెననియు, 'అందులో చతుర్విధ పురుషార్థములను నేర్పవలెననియు యింకను ఏమేమో అలంకారయుతంగా మాట్లాడిరి ఆధ్వర్యం వహించిన రెడ్డిగారు అందుకు సమాధానం చెప్తూ

"నా మిత్రులు ఒకరు మనము యిచ్చట స్థాపించబోవు కళాశాలలో విద్యతోబాటు చతుర్విధ పురుషార్థములు కూడ చెప్పవలెనని నుడివిరి చతుర్విధ పురుషార్థములవ నెవ్వి? ధర్మ అర్థ కామ మోక్షములు మేముకళాశాలలో ప్రతిదినము ధర్మములు బోధించుచునే యుంటిమిగదా? అర్థమునుగురించి ప్రత్యేకముగా ఒక శాస్త్రమునే పఠనము చేయించుచుంటిమిగదా? పైగా కళాశాల పీడిన ఎమ్మటి ప్రతి విద్యార్థి అర్థమునకేగదా ఎగబ్రాకుట! మూడ వది కామము దీనినిగురించి మేము చెప్పబూనినచో కళాశాలలకు మీ పిల్లలను ఎంతవరకు పంపుదురో దురూహ్యము కట్టకడపట మోక్షమును గురించి చెప్పబూనినచో మాకు కపాల మోక్షములే యగును!" అనుసరికి సభంతా ఒక్కసారి గొల్లుమనెను

మరియొక పర్యాయము ఏలూరు కళాశాల నూతన భవనము నకు బెజవాడ గోపాలరెడ్డిగారిచే శంకుస్థాపనజరుపబడెను ఆ సందర్భ మున ఏర్పాటయిన సభకు డాక్టర్ రామలింగారెడ్డి అధ్యక్షుడు గోపాలరెడ్డి శంకుస్థాపనచేయుచు "మీరంతా విరివిగా విరాళము లిచ్చి భవనమును పూర్తిచేయగలరని విశ్వసిస్తున్నాను నేను శంఖుస్థాపన చేసిన యీ రాయి ఒక రాయిగానేవుంచి గోపాలరెడ్డి హస్తము దగ్ధ హస్తమనే అపవాదు నాకు తేవద్దు" అని హాస్యోక్తిగా అన్నప్పుడు రామలింగారెడ్డి "గోపాలరెడ్డిగారెది దగ్ధహస్తము ఎన్నటికీ కాదు అది ధగధగాయమాన హస్తము" అనుసరికి సభాసదులంతా ఆనందంతో కరతాళధ్వనులు చేసిరి ఏలూరు పౌరులు తమ కళాశాలకు ఆ మహనీయుని పెరు పెట్టి ఆయన పట్లతమ భక్తి గౌరవములు చాటిరి

ఒకసారి మద్రాసు మెడికలు కాలేజీలో ఒక సభలో ఉపన్యసించుచుండగా మధ్యలో విద్యుత్ ప్రసారము ఆగిపోయెను హాలంతయు చీకటయిపోయినది రెడ్డకూడా వెంటనే తమ ఉపన్యాసమును ఆపుచేయుచు ఇటులఅన్నాడు 'చీకటిలో మాట్లా డుట నాకు అలవాటులేదు నేను బ్రహ్మచారినిగద!

1920 లో నెల్లూరులో రెడ్డి మహాజనసభకు అధ్యక్షత వహించుటకు వచ్చినప్పుడు, సభాస్థానమునకు తీసుకొని వెళ్ళుటకు ఒక ఏనుగును, మేళతాళములను తెచ్చిరి ఆ ఆర్భాటములకు ఇచ్ఛగించని రెడ్డిలా వచించిరి 'I am neither a bride groom nor a corpse to be taken in a procession మేళ తాళములతో ఊరెగింపుచేయుటకు నేను పెండ్లికొమరుడను కాను ప్రేతమును కాను "

ద్వితీయ ప్రపంచ సంగ్రామములో ఆంధ్రవిశ్వవిద్యాలయ ఆవరణలో సుఖసంకట వ్యాధులచే బాధపడుచున్న రోగుల వార్డులో డాక్టరు తోలేటికనకరాజుగారుచికిత్సచేయు చప్పుడు డాక్టరు రామలింగారెడ్డిగారు దర్శించుట జరిగినది అంతట వారు ఇటుల అనిరి-'యుద్ధదేవత కౌగిలిలో నలిగిన క్షతగాత్రులైన వారని అనుకొంటిని-కాని ప్రేమదేవత పరిష్వంగ సుఖములో క్షతగాత్రులైన వారివలె ఉన్నారే వీరు !'

'మన పూర్వులు గొప్పవారని వారికి సర్వము తెలుసునని మనము అల్పులమని మనలో అనేకులు అంటూ వుంటారు మన ప్రాచీనులు గొప్పవారైనచో మన మెందుకు అల్పులమైతిమో చెప్పువారు మనకు లభించరు

'వారికి అన్నియు తెలుసుకాని మంచి సంతతిని కనుట మాత్రము తెలియ దన్నమాట!

ఆయన ఇతరులను పరిహాసించుటయేకాదు తనను తాను పరిహాసించుకొనిన సంగతి ఎరిగినవారు ఎందరున్నారు !

'నేను నా బాల్యములో గయోపాఖ్యానము గొప్పదనుకొనెడివాడిని కారణము మాత్రము తెలిసినందునకాదు అది నా కర్థము కానందుననే!

'నా బాల్యములో మా నాన్నగారికి ఇచ్చిన నాటకపు టిక్కెట్టు తీసుకొని సోఫాలో కూర్చుండి నాటకము చూడసాగితిని

వెంటనే నిద్రాదేవత నన్నావేశించినది ఆ విధంగా జరిగినది నా ప్రథమనాటక దర్శనం

తననేగాదు తన వారిని గురించికూడ హాస్యోక్తులు పలకక పోలేదు

మా పినతండ్రికి విద్య తక్కువ స్వాభిమాన మాత్రము అధికము ఒక గ్రామములో నాటకమాడుచుండిరని నేను, ఆయన దానిని చూచుటకు బండి కట్టించుకొని వెళ్ళితిమి బండి ఆ నాటక మాడు ప్రదేశమున ఆపించెను మా పినతండ్రి ఎవరైననువచ్చి, తనను గౌరవించి పిలుచుకొని పోయెదరని ఆశించెను పిలవని పేరంటమునకుపోయి, ఇటుల తలచుటను ఏ మనవలె!

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఆస్థానకవి అయినపుడు రెడ్డిని ఆ ఉత్సవములకు అధ్యక్షునిగా ఆహ్వానించిరి రామలింగా రెడ్డి ఉపన్యసించుచుండగా, మాటమాటకు శాస్త్రిగారు ఏదో చెప్పుచుండెడివారు

ఆ సభ వారిని సత్కరించుటకు ఏర్పడినది వేంకటశాస్త్రి గారిని మాట్లాడవద్దనుట బాగుండదు

అంతట రెడ్డి సమయస్ఫూర్తిగా ఒక ఛలోక్తిని విసిరినాడు

'జంటకవిత్వము మన శాస్త్రిగారికి అలవాటుగద!

"తిరుపతి వేంకటకవులను ఆంధ్రవిశ్వవిద్యాలయ మాదరించెగద !" అన్నాడు

వేంకటశాస్త్రిగారి శిష్యుడైన పింగళి లక్ష్మీకాంతముగారిని, తిరుపతిశాస్త్రిగారి శిష్యుడైన గంటి జోగిసోమయాజిగారిని తెలుగు డిపార్టుమెంటు రీడరుగా తీసుకొనుట జరిగినది

పి కమలమ్మ అనే సెనేటు సభ్యురాలు పెండ్లి అయిన పిమ్మట బి కమలమ్మ అయినది 'పరుషములు సరళములైనవే! అని చమత్కరించినాడు రెడ్డి

కల్లూరి సుబ్బారావుగారన్న రెడ్డికి అభిమానము ఆయన హాస్యప్రియుడు, గ్రంథసాంగుడు వారిని చూచి రెడ్డి 'ఏమండీ సుబ్బారావుగారూ! స్వరాజ్యము వచ్చినను, ఇంటిపేరు మార్చరైరి!'' అన్నాడు

1ı England when they subscribe they pay also

ఒకనాడు యూనివర్సిటి పెద్ద చూడవచ్చిన రెడ్డితో ఇక్కడ చదలు అంతులేకుండా వున్నదని ఒకరు చెప్పసరికి, వారితో వచ్చిన విశ్వవిద్యాలయపు ఉద్యోగిని చూపుతూ ' Here is a big white ant ' ఇదుగో ఇక్కడ ఒక పెద్ద తెల్లచీమ ఉన్నదన్నాడు

నాగపురపు స్త్రీలకళాశాల సందర్శించుటకు రెడ్డి వెళ్ళి నపుడు ఒకరు విద్యార్థినుల వసతి గృహములలో ఎలుకల బాధ విపరీతముగా నున్నదనిరి ' 'ఇక్కడ చాల ఎల్లులున్నవే ఏల మీకీ బాధ? అన్నాడు

వేదము వేంకటరాయ శాస్త్రిగారు చతురోక్తి చక్రవర్తి ఆయన శిష్యుడైన రామలింగారెడ్డి గురువుని మించినవాడే అనవచ్చును

ఒకసారి శాస్త్రిగారు 'నన్ను బి ఏ ను చేయవు?' అనిరి రెడ్డితో

అంతట రెడ్డి తడువుకొనకుండ 'తమరేగద! బి ఏ లను చేయుచున్నది!'

సతీమణి అందురు కొందరు సతులలో మణి అని అయితే 'ఎందరు వీరికి భార్యలు?'అని రెడ్డి ప్రశ్నించెడివాడు

సోదర సోదరీ మణులారా! అని మనం సంబోధించెదము అందుకు రెడ్డి 'అందరూ ఒక గనిలోని వారేగద! వారిని మణు లనుట ఎందుకు?' అనెడివాడు

ఒకసారి రెడ్డి మద్రాసు స్టేషనులో దిగబోవు సమయమున ఒక పత్రికా విలేఖకుడు వచ్చుసరికి 'నాకు రిపోర్టరుతో పనిలేదు, పోర్టరు కావాలి' అన్నాడు.

"I want a porter not a repoter

డాక్టరు తిరుమూర్తిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షతకు పోటీచేయదలచి రెడ్డిని ఓటు ఇవ్వవలసినదిగా కోరిరి.

రెడ్డికూడా పోటీచేసియున్నాడు. అందుచేత వారికి భారతములోని పద్యభాగమును పంపిరి.

ఆ॥ ఎఱఁగి ఎఱఁగి నన్ను నేకార్థసముపేతుం బాడియయ్యె యిట్టి పనికిఁ బనుపఁ

ఇంద్రాదులు నలుని దూతగా దమయంతి స్వయంవరమునకు పంపదలచినపుడు చెప్పిన పద్యభాగమిది.

ఆయన సమయస్ఫూర్తికి భారతము బాగుగ చదివినందులకు మరొక తార్కాణము.

రెడ్డి కేంబ్రిడ్జిక విద్యాభ్యాసమునకు వెళ్ళినపుడు ఆంగ్లేయుల ఆహారనియమాలు వారుభుజించెడి పద్ధతి ఏమీ బోధపడలేదు. ఒకసారి ఫలహారములో ఆపిల్ పండ్లు వడ్డించగా, వాటిని కత్తితో చిన్నచిన్న ముక్కలుగాకోసి ఫోర్కుతో తినడం రెడ్డికి కుదరలేదు. ఏమీ తోచినదికాదు. తర్వాత ఒక ఉపాయం తోచినది. ప్రక్కనున్న వారితో ఇటుల చెప్పసాగినాడు 'మాదేశములో రామాయణగాథలో గణుతికెక్కిన హనుమంతుడు ఎటుల ఆరగించెడివాడో చూపెదను గమనించుడు" అని పళ్ళెరములోని పండును చేతిలోకి తీసుకొని తినివేసెను. అది చూచి రెడ్డిని అనుకరించిరట మిత్రులు.

మనదేశము రెండుగా విభజింపబడినపుడు ఆయన చెప్పిన సంగతి గమనించవలసినది

Let us win in History, what we have lost in Geography

మన స్వాతంత్ర్యాన్ని పారతంత్ర్యాన్ని ఆయన ఇట్లు ప్రకటించెను

we have always enjoyed liberty of thought but never liberty of action

ఆయన చమత్కార సంభాషణ లెన్నియో గలవు వాటి నన్నిటిని కూర్చుట సముద్రమునకు సేతువుకట్టుట వంటిది ఆయన చతురోక్తి చక్రవర్తి

# రామలింగారెడ్డి రచనలు

1 అర్థశాస్త్రము
2 కవిత్వ తత్త్వ విచారము
3 కీర్తిశేషులగు కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారి సంక్షేప చరిత్రము
4 ముసలమ్మ మరణము ఇత్యాదులు
5 వ్యాసమంజరి
6 పంచమి
7 Speeches on University Reform
8 Congress in Office
9 Democracy in Contemporary India
10 Articles on R T C